ద్వితీయ ముద్రణము

# సామెతలు

ఒక భాషలోని సామెతలనన్నింటిని సంకలనముచేసినచో అది ఒక వాఙ్మయము. వాఙ్మయంలో మానవవిజ్ఞానాన్నిగురించి ఎన్నెన్నిశాఖలు ఉంటవో అన్నిశాఖలు సామెతలలో ఉంటవి. సామాన్యంగా భారతదేశం భిన్నభిన్న విజ్ఞానాలను గురించి భిన్నభిన్నశాస్త్రాలు బయల్దేరినవి. ఇతరదేశాల్లో శాస్త్రాలు ఎక్కువభాగం రచనలుగా ఉంటవి. ఈ దేశంలో సూత్రప్రాయంగా అంటే సూత్రీకరింపబడుతవని ఇక్కడ అర్థం తీసికోవాలి. వ్యాకరణం వేదాంతం మొదలైన శాస్త్రాలన్నీ సూత్రాలు ఆధారం చేసికొని ప్రవర్తించినవి. సామెతలుకూడా అటువంటిసూత్రాలు అని చెప్పవచ్చు. ఒక పిండితార్థాన్ని కొద్దిమాటలలో చెబుతుంది సామెత. దానివెనుక ఎంతో అనుభవం ఉంటుంది. కొన్నిసామెతలు అనుభవపారమ్యాన్ని బోధిస్తవి.

సామెతలు సారస్వతం వంటివి. సారస్వతం వృద్ధిపొందుతూ ఉంటుంది. సామెతలుకూడా వృద్ధిపొందుతూనే ఉంటవి. ఒకభాష మాట్లాడుకోబడే దేశంలో ప్రాంతీయవిభాగం ఉన్నా సారస్వతం ఎల్లాగ ఆ ప్రాంతీయ విభాగాలను మన్నించకుండా సర్వదేశాన్నీ పరిగణిస్తుందో, సామెతలూ అల్లాగే పరిగణిస్తవి. ఒక సామెత ఒక ప్రాంతంలో పుడుతుంది. ఇంకో ప్రాంతంలోకి అదివెళ్ళి అక్కడ ప్రచారంలో ఉండడానికి దానికి అభ్యంతరంలేదు. ఒక ప్రాంతంలో పుట్టిన సామెతలో ప్రాంతీయత్వం అధికంగాఉంటే, ఇంకోప్రాంతంలో అటువంటి సామెత ఇంకొకటి పుడుతుంది.

సామెతలు జాతియొక్క ఆయువుపట్టులు. ఒక సామెతయొక్క ప్రాణాన్ని వదిలిపెట్టవు. కావలిసొస్తే ఇంకొకతొడుగు తొడుగుకొంటవి. బందరుప్రాంతంలో 'ఎంత ప్రొద్దుకాదలేచినా చింతగుంటపాలెంకాదనే తెల్లవారుతుంది' అనే సామెత ఉంది. రైళ్లు బస్సులు లేనప్పుడు అవనిగడ్డ, చల్లపల్లి, కళ్ళేపల్లి మొదలైన వూళ్ళు వెళ్ళటానికి బందరులో తెల్లవారుగట్ల బళ్లు కట్టుకొని బయల్దేరేవారు. చింతగుంటపాలెం ఆ దారిలో బందరులో చివర ఉన్న పేట. ఈ సామెత అక్కడ పుట్టింది. కాని ఈ

సామెతే ఇంకో ప్రాంతంలోకూడా ఉంటుంది.* ఆ మారటంలో చింతగుంటపాలెం అన్న పేరుమాత్రమే మార్చుకుంటుంది, దానిస్థానంలో అక్కడ ఉన్న ఇంకో వూరు పేరు వస్తుంది. 'కడుపా, నీది కళ్ళేపల్లి చెరువా' అని ఒకసామెత ఉన్నది. ఈ సామెత తెలుగుదేశంలో కళ్ళేపల్లి చెరువు బదులు ఇంకొకవూరుతో ఆవూరు చెరువుతో కలిసి ఉంటుంది. ఇవి చాలా స్వల్పములైన మార్పులు.

'ఏపట్ల చచ్చినా, బాపట్లపోయి చావరా' అని ఇంకొక సామెత ఉంది. ఈ సామెతలోని బాపట్లమాత్రం మారదు. అక్షరవిన్యాస గాఢత్వంచేత దానికి మారేశక్తి లేదు.

సామెతలు సారస్వతం వంటివి. అంటే సారస్వతం రెండురకాలు - మార్గము, దేశి. సామెతలకు ఈ పట్టింపు లేదు. ఆకారవిశేషంచేత సామెతలు సంపూర్ణంగా దేశి సారస్వతం. కాని మార్గకవులందరూ ఈ సామెతల యధేచ్ఛంగా వాడుకున్నారు. ఈ వాడుకోటంలో వాటికి తమ ఛందోవ్యాకరణముల కనుకూలంగా మార్చుకొని వాడుకున్నారు.

పరభాష వచ్చినతరువాత సామెతలయొక్క ప్రాచుర్యం తగ్గిపోయింది. చదువుకున్నవాళ్ళు అనటంతోటే ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళని అర్థం వచ్చింది. వాళ్ళకి తెలుగు సామెతలయొక్క స్వారస్యం తెలియదు. తెలుగు సామెతలయొక్క ప్రయోజనం తెలియదు. అందులో ఉన్నమాధుర్యం తెలియదు. వాటిని వాడుకొనే అలవాటూ పోయింది. ఇల్లా మన జీవితశాఖలలో దేశీయములైనవి మాతృభాషాసంబంధములైనవి బహూ సంప్రదాయాలు చచ్చిపోయినవి. సగంపైన చచ్చినవి. ఈ సంప్రదాయాలని పూర్తిగా విస్మరింపబడకుండా నిలబెట్టటంకోసమే నేడు సర్వదేశాలలో చేయబడుతూఉన్న ఇటువంటి సంకలనగ్రంథాల ప్రయోజనం! రష్యా ఉన్నదనుకోండి- ప్రాత నాగరకత పోయింది, క్రొత్త నాగరకత వచ్చింది. ఆ పూర్వజీవితంలో ఉన్న మాధుర్యం అంతా బహువిధాలుగా వాఙ్మయంలో ఉంటుంది. ఆ వాఙ్మయం సామెతలుగా, నుడికారాలుగా, సూక్తులుగా, జానపదగీతాలుగా అనేకములైన ఉత్సవసందర్భాలలో పాడేపాటలుగా, పొడుపు కథలుగా, మరెన్నోవిధాలుగా కొన్నివందలయేండ్లుగా, కొన్నివేలయేండ్లుగా బ్రతికినజాతి, తన సత్వాన్ని తన మాతృభాషలో నింపుకొంటుంది;

* ఎంత పొద్దుకాడలేచినా చింతగుంటకాడనే తెల్లవారింది - అని, నెల్లూరుజిల్లాలో పంటలు అల్లూరులో ఉండే చాటవు. చింతగుంట ఆ ఊరికి ఆరుమైళ్ళదూరంలో ఉన్నది. దానిచుట్టు పొలం హెరాళంగా ఉన్నది.

విలబెట్టుకొంటుంది. ఆ నాగరకత పోయేటప్పటికి అవన్నీ అంతర్హితాలైతే ఒక గొప్ప నాగరకత సంపూర్ణంగా నశించిపోయినట్లవుతుంది. ఏ నాగరకత అయినా ఆ నాగరకతలో ఉన్న జనులయొక్క ప్రాణం, వూపిరి, విశ్వాసం, ఆశలు, కోరికలు మొదలైన వానియొక్క స్వరూపమే కదా! అదీ నాగరకతే! అప్పుడూ మనుష్యులే! ఇప్పుడూ మనుష్యులే! ఎప్పటికప్పుడు మనుష్యుడు అహంకారంచేత తనదే నాగరకత అనవచ్చు; అది తాత్కాలికాహంకార లక్షణము. 'తాను వలచినది రంభ, తాను మునిగినది గంగ' అక్కడ శాస్త్ర ఎవ్వడు? నిర్ధారణచేసే శక్తిగల వాడెవ్వడు? అన్నీ అనంతకాలంలో అణువులే: ప్రతి అణువులోనూ ప్రాణం ఉంది. ఇది ఒక్కటే పరమార్థమైన విషయము.

తక్కినవన్నీ అల్లా ఉంచి ప్రస్తుతం సామెతలవిషయం తీసికొందాం. ఈ సృష్టి చమత్కారమైనది. అణువులో అనంతం: అనంతంలో అణువు: కాలంలో భూత భవిష్యద్వర్తమానాలున్నవి-ఏ కాలం తీసికొన్నా. భూగోళాన్ని తీసికొంటే ఈ భూగోళం మీద అనేకములైన దేశాలు తీసికొంటే, ఏ దేశంలోనయినా, ఏ కాలంలో అయినా ఉన్నది మనుష్యులే: ఒకజాతి ఒకభాష మాట్లాడుతుంది. అది ఒక దేశమందాం: ఆ దేశంలో భిన్నప్రాంతాలు, ఒక్కొక్కప్రాంతంలో కొన్ని వూళ్ళు, అన్ని వూళ్ళల్లో మనుష్యులే! ఒక వూళ్లో పదివేలమంది జనాభా ఉన్నారు. అందరూ మనుష్యులే: ప్రతి వాడికీ తాను, తన కోరిక, తన అనిష్టం, తన సుఖం ఈ మొదలైనవేకదా: కనుక ప్రపంచకమంత ఇంతే! భూగోళమంతా ఇంతే! మూడుకాలాలూ ఇంతే! చమత్కారం ఎక్కడున్నదంటే - ఒకనివంటివాఁడే ఇంకొకడు. ఒక ఊరివంటిదే ఇంకొక ఊరు: ఒక దేశంవంటిదే ఇంకొక దేశం, ఒక కాలంవంటిదే ఇంకొకకాలం. కాని, కించిత్కించిద్భేదాలు ఉంటాయి. వీటిల్లో ఒక కాలమో, ఒక దేశమో, ఒక ఊరో, ఒక మనుష్యుడో అధికమైన జ్ఞానానికి పతాకగా ఉంటాడు.

నాగరకములైన సర్వభాషలలో సారస్వతం బహుముఖాలుగా ఉంటుంది. ఏ ముఖానికి ఆ ముఖం దాని లక్షణాలలో అది వృద్ధిపొందినా, అన్నింటినీ కలిపిన ఒక లక్షణం ఏ భాషావాఙ్మయంలోనైనాసరే సామెతలలో ఉంటుంది. అనంతమైన జ్ఞానాన్ని సంపాదించుకొని సార్వముఖీనమైన లక్షణాలతో కూడుకొనిఉన్న, ఇందాక చెప్పిన కాలమో దేశమో ఊరో మనుష్యుడో ఎటువంటివో, ఏ సారస్వతంలోనైనా, ఏ వాఙ్మయంలోనైనా, సామెతలు అట్లాంటివి. సామెతలు ఆ జాతియొక్క అనుభూతి పారమ్యాన్ని ప్రతిబింబిస్తూ మహాశాస్త్రములయొక్క సూత్రములవలె నిగూఢ రమణీయ

వ్యాఖ్యాపేశలత్వాన్ని వాంఛిస్తూఉండే ఒక విలక్షణమైన సాహిత్యప్రక్రియ. ఇదీ సామెత అంటే।

మనుష్యుడు జన్మించినతరువాత క్రియావ్యాపారం లేకపోతే జగత్తులేదు. వాక్కు లేకపోతే క్రియావ్యాపారం లేదు. వాక్కునందలి నేర్పుకొద్దీ క్రియాసౌష్ఠవము. ఆ వాక్కుయొక్క నేర్పు బహువిధాలుగా ఉంటుంది. ఎన్నివిధాలుగా ఉంటుందో సంస్కృతాలంకారికులు నిర్ణయించారు. అది శాస్త్రీయమైన నిర్ణయం. ఆ భాష మాట్లాడుజాతి యొక్క మాటపాటులోని గొప్పదనం రామణీయకం, మాధుర్యం ఆ ఆలంకారికులు చెప్పిన వాటన్నిటింటె మించి ఒకటి ఉన్నదనీ తెలుగుజాతి నిర్ణయించింది - దాని యొక్క పరమార్థం 'సామెత' అని. ఈ పరమార్థాన్నికూడా తెలుగుజాతి ఒక సామెత లోనే చెప్పింది :

'సామెతలేని మాట, ఆమెతలేని ఇల్లు'. ఆమెత విందు. విందులేని ఇల్లు ఎట్లాంటిదో, సామెత లేనిమాట అట్లాంటిది. విందులేని ఇల్లు పేదఇల్లైనా కావలె, లోభివాడి ఇల్లైనా కావలె. పదిమందికి పంచభక్ష్యపరమాన్నాలతో విందుచేసిన గృహస్థు యొక్క ఆనందం, ఆ ఇంటియొక్క సౌభాగ్యం, అతిథులతృప్తి, దేశంయొక్క సౌభాగ్యానికి చిహ్నాలు. జీవునియొక్కతృప్తికి కోటి భూతమైనది. మాటకు సామెత అటు వంటిదట! మాట్లాడినవానికి సంతోషం; విన్నవాడికి తృప్తి; భాషయొక్క సౌభాగ్యం!

భాషలో సామెతయొక్క స్థాన మిదవి సామెతలను నిర్మించిన ఆంధ్రదేశ వృద్ధులయొక్క సమాహారభూతమైన పరిణత ప్రజ్ఞాన్వితమైన బుద్ధిలక్షణముయొక్క నిష్కర్ష. ఇదీ సామెత అంటే!

ఒక్క సామెతలో భాషారహస్యమంతా ఇమిడి ఉంటుంది. భాషాస్వత్వానికి, భాషాసత్వానికి, ఏ సామెతపడితే ఆ సామెత, పుట్టినిల్లుగా ఉంటుంది. సూచకంగా ఉంటుంది. ఇంక ఏ ఇతర విజ్ఞానశాఖకీ ఈశక్తి లేదు. ఏ కావ్యం సొగసు దానిదే! ఏ మాటసొగసు దానిదే! ఏ పద్యంసొగసు దానిదే! ఏ నుడికారపుసొగసు దానిదే! సామెత అట్లాంటిది కాదు. ఆ భాషయొక్క, ఆ జాతియొక్క జీవలక్షణాన్ని, భాషా లక్షణాన్ని అందిస్తూ ఉంటుంది; చెబుతూఉంటుంది. ఈ సామెతనే తీసికొందాం!—
'సామెతలేనిమాట, ఆమెతలేని ఇల్లు'—తెలుగుభాషలో రమణీయత రెండువిధాలుగా సంక్రమిస్తుంది—వాగ్వృత్తిలో నన్నమాట! ఈ సామెతలో ప్రాస ఉన్నది. ఈ ప్రాస ఒక్కొక్కప్పుడు శబ్దాదిని ఉంటుంది. శబ్దాంతమందు ఉంటే అంత్యప్రాస వచ్చిన

అక్షరమే మాటిమాటికీ వస్తూఉంటే దానిని వృత్త్యనుప్రాస అంటారు. అది ఒక శబ్దాలంకారము. ఈ మూడురకములైన ప్రాసలలో ఏదో ఒకటి లేకుండా తెలుగువాక్కు శోభించదు. ఆలంకారికదృష్ట్యా అంత్యప్రాసకు తక్కువవెల ఉన్నా, తక్కిన రెండు ప్రాసములయొక్కయు వెల తగ్గలేదు. తెలుగుభాషలో తగ్గదు. భాషాగతమైన ఈ రహస్యమెఱిగిన మన పూర్వలాక్షణికులు పద్యరచనలో ఈ ప్రాసకు విశ్వత్వం కల్పించారు. ఈ సామెతలో వట్టిప్రాసయేకాదు, యమకముకూడ ఉన్నది. యమకమంటే ఒక అక్షరానికిమించిన అక్షరాలు మళ్ళీ తిరిగిరావటం: 'ఆమెత-సామెత'—'మెత' అన్న రెండక్షరాలు తిరిగి వచ్చినాయి. తెలుగుభాషాప్రయోగములోని ఈ రహస్యానికి సామెతలు పునాదులు. రహస్యవ్యాఖ్యాతలు.

నిజంగా నుడికారాలు కాని, క్రియా స్వరూపాలు కావి, సామెతలు కాని, సంపూర్ణంగా సంకలనం చేయటం సాధ్యంకాదు. దానికి చాలా ప్రయత్నం కావలె. పూర్తిగా చెయ్యటం ఎప్పుడూ సాధ్యంకాదు కావి, పూర్తిగా చేయబడ్డది అన్నట్లుగా చేయటానికైనా ఒక్క తెలుగుదేశం తీసికొంటే, ఒక్కొక్కప్రాంతంలో ఒక్కొక్కడుగా రెండువందలమందైనా తన జీవితమంతా, కాకపోతే కనీసం పాతికయేండ్లు ఈపనిని చేసేవాళ్లుండి, పల్లెలలో మూలమూలలా తిరిగి సంగ్రహించి, వాటన్నిటినీ సంకలనం చేస్తే అట్లా అనుకోవచ్చు. పల్లెలలోని జనులు ముగ్ధులు. వాడొక సామెత వాడికి తెలియకుండా అంటాడు. వానినోటివెంట ఒక నుడికారం వాడికి తెలియకుండా వస్తుంది. మళ్ళీ అనమంటే ఏదో అనుకుంటాడు. భయపడతాడు. తప్పు మాట్లాడానేమో అనుకుంటాడు. సహజసరస్వతి అంత ముద్దరాలు: అంత సిగ్గరి!

ఈ సంకలనం చాలా ప్రయత్నంచేసి చేయబడ్డది. విద్య వేరు, దాని మననం వేరు; విద్య సహజమైనది, మననం పండితులుచేసేది. సామెతలు సహజవిద్య. కావ్యాలు మననజనితవిద్యలు. అందుచేత పండితులైనవాళ్లు, ఈరీతిగా సంకలనం తలపెట్టిన వాళ్లు, నిత్యజాగ్రదవస్థాభూతులైనా ఏండ్లకొలదీ దానికోసమే బ్రతుకుతూ సంకలనం చేసేవాళ్లుండాలి. ఒకటి, వాళ్ళయందా ప్రవృత్తి ఉండాలి. రెండవది, వాళ్ళను పోషించేవాళ్లుండాలి.

ఈ సంకలనం పండితులే చేయవలె. పండితులనగా, ఈ సంకలనం చేయవలెననే సంకల్పం ఉండి దానివిగూర్చి నిత్యంగా ఆలోచించేవాళ్ళని అర్థం:

సామెత లనేకరకాలుగా ఉంటవి. ఈవిధంగా ఉంటవని చెప్పటానికి వీలులేదు. కొన్ని సామెతలవెనుక కథలు ఉంటవి. ఆ కథలు తెలిస్తేగాని, ఆ సామెతయొక్క

సంపూర్ణార్థము ద్యోతకముకాదు గాని, దానిలోఉన్న తాత్పర్యాన్నిపట్టుకొని లోకంలో వాడుకొంటూ ఉంటారు. కాలంమీద కొన్నిసామెతలు ఏ కథలను పురస్కరించుకొని పుట్టినవో ఆ కథలు మాసిపోయినవి. ఇవి వృద్ధులవలన తెలిసికోదగినవి.

ఈ సామెతలు జాతి సమష్టి స్వరూపములు. వీటిల్లో వర్ణభేదాలు పాటించ కూడదు. దేశభేదాలు పాటించకూడదు. గ్రామభేదాలు పాటించకూడదు. ఇది తెలుగు భాషలో సామెత ! భాషను ప్రయోగించేటప్పుడు ఇది ఒక అలంకారము. తావన్మాత్ర మహార్థపర్యవసాయి సామెత ! కాని, ఆ సామెతలో ఒక వర్ణాన్నిగురించో, ఒక గ్రామాన్నిగురించో, ఒక శాఖనుగురించో, ఒక మతాన్నిగురించో ఉంటుంది. ఇది ఈ వర్ణాన్నిగురించి నింద చేస్తున్నది; ఇది ఈ శాఖవాళ్ళని నిందిస్తున్నది; ఇది ఈ మతమునందు వైషమ్యము సమకూరుస్తున్నది; అనికానీ, వీటివీటికి ఆధిక్యాన్ని సమ కూర్చేటందుకు ఈ సామెత ప్రవర్తిస్తున్నదనికానీ, అనుకున్నవాడు తాత్పర్యం గ్రహించలేనివాడు. జీవసాధ్యమైన రససిద్ధికి దూరమైనవాడు. సంగీతాన్ని వదలిపెట్టి ఆపాట ఏభాషలో వ్రాయబడ్డదని విచారించేవాడు, కావ్యముయొక్క సౌందర్యాన్ని పరిత్యజించి, ధ్వన్యలంకారోక్తి వైచిత్ర్యాన్ని వదలిపెట్టి, ఆ కావ్యంలోఉన్న సర్గల సంఖ్య, శ్లోకాలసంఖ్య వెతికేవాడు.

ఈ సామెతల జ్ఞానానికి దేశభేదాలు ఎల్లా లేవో, వర్ణభేదాలు అల్లా లేవు. పాండి త్యాన్నిగురించి సర్వజనులకు తెలిసేసామెతలు ఉన్నాయి. పూర్వకాలంలో విద్య ఇప్పటికిమల్లే ఒక వర్ణపరిమితమై, అల్పసంఖ్యాకులకు పరిమితమై ఉండేదికాదు. అప్పటివిద్య పాఠశాలలకు సంబంధించిందికాదు. వీధినాటకాలు, తోలుబొమ్మలు, హరి కథలు, బుఱ్ఱకథలు మొదలైన విద్యాప్రచారసంస్థల నాశ్రయించి ఉండేది. అప్పటి జ్ఞానం అక్షరజ్ఞానాన్ని ఆశ్రయించి ఉండేదికాదు. ప్రచారాన్ని ఆశ్రయించి ఉండేది. ఎంతెంత పాండిత్యపులోతులలో ఉండే విషయాలు ప్రచారంలో కెక్కి సర్వజన విది తంగా ఉండేవి. ఈ పాండిత్యం అఖండంగా ఉండేది.

ఇంకా జైనులు, తురకలు, వాళ్ళవాళ్ళలక్షణాలు చెప్పే పలుసామెతలు ఉన్నవి.

కొన్నిసామెతలు ఆనాటిజీవితాన్ని ఆహారాలను చెబుతూఉంటాయి. జాతియొక్క చరిత్రకు చాలా సాహాయ్యకంగా ఉంటాయి.

ఈ తెలుగుదేశంలో అనేక నగరాలున్నాయి. అనేక గ్రామాలున్నాయి. ఒక ఊళ్లోజరిగిన న్యాయమో, అన్యాయమో ప్రసిద్ధమైపోయి, సామెతలక్రిందమారి, దేశా న్నంతా ఆవరించి, అది ఒక జ్ఞానంగా వుండేది.

'నిడుదవోలు తీర్పు - రామాయపట్నం మధ్యస్తం' మొదలైనవి.

'కొండవీటి చాంతాడు' కొండవీటిపరగణాలో నూతులు చాలా లోతు.

'కూచిపూడిలో కుక్క మొరిగినా సంగీతమే' కూచిపూడి నాట్యానికి ప్రసిద్ధి.

ఇంక బహువిషయాల పరిజ్ఞానం చిత్రచిత్రంగా సామెతలద్వారా బోధపడుతూ ఉండేవి :

'పొట్టితోకగల కోడె పొడిచినా నడవదు.'

'సకలశాస్త్రాలు, నిలబడి మూత్రాలు.'

'ఔషధం కానిది అవనిలో లేదు.'

'మామిళ్ళకు మంచు చెరుపు; కొబ్బరికి కుడితి చెరుపు.'

'రాజు కిద్దరు మంత్రులు, ఒకనిపేరు అంచాలు, రెండవవానిపేరు మంచాలు.'

'బొమ్మకు మ్రొక్కినా నమ్మకముండవలె' మొదలైనవి.

మఱికొన్ని సామెతలు మరీ ఆధునికాలు :

'చెడిందిరా పిల్ల అంటే చేరిందిరా తెనాలి.'

'మూడోతరగతిలో ఎందుకు ప్రయాణం చేశావంటే, నాల్గోతరగతి లేదు కాబట్టి.'

'విడిచినముండకు వీరేశలింగం; తెగించినవాడికి తెడ్డే లింగం' మొదలైనవి.

ఈరీతిగా సామెతలు జ్ఞానకోశాలు, శాబ్దబోధలు. పాండిత్యనిధానాలు. 'ఆంధ్రదేశం, ఆంధ్రజ్యోతి ఒకటే' అని నిరూపించే ప్రజలసాక్ష్యాలు. సామెతలు మొత్తమంతా కలిపితే ఒక విజ్ఞానకోశం !

అసలు తెలుగుభాషలోఉన్న సొగసేమిటి : గడుసుదనం, ఆక్షేపణ, వెక్కిరించడం, హాస్యరసం, వాక్యాక్షేపము, వీటికి తెలుగుభాష పుట్టినిల్లు. తిక్కన భారతానికి, నాచన సోమన్న ఉత్తర హరివంశానికి, కూర్చిన ఎక్కువ ప్రతిష్ఠ, ఈ లక్షణాలు వారి రచనలలో ఎక్కువగా కనుపించడమే : కాని పురుషోత్తమంగారి 'ఆంధ్రనాయక శతకం' మహాగ్రంథంగా పరిగణింపబడటాని కిదే !

ఈ హాస్యరసము కొన్ని తెలుగు సామెతలలో ఆశ్చర్యంగా ఉంటుంది.

'తమలపాకుతో తానిట్లంటే, తలుపుచెక్కతో నే నిట్లంటిని'-

పూర్వం కూచిపూడి భాగవతులనాటకాలలో వాళ్ళు హాస్యం చెప్పేవాటిలోపలి మాటలు.

ఇంక ఈ సామెతలలో ఎన్ని దేశీయములైన శబ్దాలు, నిఘంటువులకు తెలియనివి ఉంటాయో కవులు తెలిసికోవలె. నిఘంటుకర్తలు వ్రాసికోవలె. అట్టి శబ్దాలన్నింటికి, అనగా చాలావాటికి, ఈ సంకలనంలో ఎక్కడివాటికి అక్కడ అర్థం వ్రాయబడి ఉన్నాయి. ఇంకా తెలియని కొన్నిశబ్దాలు ఉన్నాయి.

కొందఱు పండితు లొక సంఘంగా ఏర్పడి, ఈ ద్వితీయముద్రణంలో ఈ గ్రంథాన్ని చాలా బాగుపరచేందుకు ప్రయత్నం చేశారు. ఇంకా ఎంతో చేయవలె.

వీటన్నింటికి అచ్చుప్రతి తయారుచేసి ప్రూఫులు దిద్దినాయన శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారు. ప్రాత ముద్రణంలో, వచ్చినసామెతలే కొన్ని మరల వచ్చినవి. అవి తీసివేయబడ్డవి. కొన్ని క్రొత్తసామెతలు చేర్పబడ్డవి.

శ్రీ కోదండరామరెడ్డిగారు విశేషంగా సామెతలవాడి మాట్లాడుతుంటారు. అందుచే వారు ఇచ్చిన సామెతలు ఇందు చాల చేర్చబడ్డాయి. ఇదిగాక వారు చాల మాటలకు అర్థాలు చెప్పగలిగినారు. ఇలానే శ్రీమతి యశోదా రెడ్డిగారుకూడ ఎన్నదగిన తోడ్పాటు నిచ్చిరి.

—విశ్వనాథ సత్యనారాయణ.

## మూడవ కూర్పు

# కన్వీనర్ వచనములు

సాటువ, సాటవ, చాటువ, చాటవ-అని, నెల్లూరు-రాయలసీమ ప్రాంతాలలో సామెతకు పేరు. 'ఏదో చా-సాటవ చెప్పినట్లు' అనేది వాలాయపుమాట. సామెతను 'శాస్త్రం' అనడంగూడ కద్దు. 'ఏదో శాస్త్రం చెప్పినట్లు' అనుటగూడ గలదు. సాటి అయినదే సాటవ అని, శ్రీ డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు చేసిన నిర్వచనం దీనికి అతికినట్లు సరిపోతున్నది. సాటిజేసి, అంటే - పోల్చిచెప్పడమే యీ సామెతకు ప్రధానగుణము, జీవము.

సాటవ అని ఉంటే, సామెత ఉత్పత్తికి అంత పాకులాడవలసిన అగత్యం ఉండదు. సామెత అనేపదం కన్నడం కావచ్చు, సంస్కృత వికృతీ కావచ్చు. కాని, సాటవ అనేది అప్పటమైన తెనుగు పలుకు.

సాటువలు, లోకానుభవంకలిగిన వ్యక్తులు, చమత్కారపదరచనా సామర్థ్యం కలిగినవారు, కవితాశిల్పప్రభలు కలిగినవారు సృష్టించినవే: ఇది ఒక కవితారీతి. హ్రస్వీకరణము దీనికి ప్రాణము. బాగా చదువుకొన్నవారు సంస్కృతశయ్యలోను, ఉభయమధ్యస్థులు కలగలుపుగాను, గ్రామీణులు స్వచ్ఛదేశీయంగాను తమతమ అనుభవములనుబట్టి సామెతలు అల్లుచుందురు. ఆ మీదట, వాటి బిగువు చేవలనుబట్టి వెలిచి, వ్యాపించి దేశమందంతటా తేలియాడుచుండును. ప్రజలేగాక, కవులు చాలమంది వీటిని గ్రహించి ఉపయోగించుట గలదు; ఇంతేగాక వారివారి ప్రజ్ఞనుబట్టి కవులు సృష్టించుట గూడ కలదు. కవి వేమన సొంతంగా కల్పించినవి కొన్ని, వ్యాప్తిలో ఉన్నవాటిని కొన్నిటిని తన పద్యాలలో ఇరికించినాడని కొందరి విమర్శకులమతము. తెనుగు ప్రబంధాలలో చాలావాటిలో సామెత లున్నవి. ఇక వేణుగోపాల శతకంలో అన్నీ అవే.

తెనుగుసాటవకు (సామెతకు) ప్రాణం - అందలి పదలాలిత్యము, అనుప్రాస, యతిప్రాసలే అగుటచే పామరుల నోటినుండిగూడ అవి జీవంతో ఉట్టిపడుచుండును. సంగతిని సామెతలతో చెప్పినప్పుడు అది గుద్దినట్లు వినువారి మనసులలో హత్తుకొనిపోయి, ఎప్పటికీ చెరగిపోకుండా నాటుకొనిపోవును. పదివాక్యాల వివరణము ఒక బంతిసామెతలో ఇమిడిపోయి ఉండును.

వివిధభాషలనుండి, వివిధప్రాంతాలనుండి, ఇరుగుపొరుగునుండి, దేశకాల పాత్రానుగుణమైన మార్పులతో ఇవి గైకొనబడి, తెనుగుకు సొంతమైపోయి ఉన్నవి. సాటువలు అనుదినం పరచుకొనిపొయ్యే మహా వాహినివంటివి. వాగులు వంకలు కలిసి పెద్ద ఏరైనట్లు, సామెతలప్రవాహం దినదినం ఎదిగి ఉబ్బిపోతూనే ఉండును. గ్రామీణుల సాటవలు, గ్రంథకర్తల పదబంధాలు ఇందు చేరిపోతున్నవి. ఇకముందు ఒక వాయాడి అనేవి, ఒక కవి వ్రాయనున్నవిగూడ సామెతలై, నానుడులై పోవుచుండగలవు. సామెతలు అనకొన తెలియరాకుండా తీగలుబారి బలిసిపొయ్యే పొదవంటివి; ఈ తీగ పందిలి కొంగ్రొత్త ననలు పువ్వులు చేకూర్చుకొంటూ నిత్యవసంతశోభతో అలరారుచుండగలదు. కాబట్టే యీ సామెతలు ఒక నిత్యజీవప్రవంతివంటిదై పొంగుచు పొరలుచు దరులు ఒరుచుకొంటూ సాగిపోవుచునే ఉండును.

ఇంతవరకు మా చేతికి అందిన, కంటికి తగిలిన సామెతలను, పుస్తకముల నుండి, వాడుకలనుండి ఏరి ఇందు చేర్చినాము. మొదటి రెండు ముద్రణములకంటె, ఈ మూడవకూర్పు మార్పులతో చేర్పులతో పెరిగిఉన్నది. ఇందు 2000 సామెతలు కొత్తవి చేర్చబడియున్నవి.

ఇంతకుముందుండిన వివరణములుగాక, మరికొన్నిటిని చేర్చినాను. పీఠికలందలి వివరణములను ఇప్పుడు ఆయా పొరటలక్రిందనే చేర్చినాను. కొన్నిసామెతలకు ప్రక్క-ప్రక్కననే చేర్చబడినవి.

సామెతలు ప్రాంతప్రాంతానికి ఒక క్రొత్తతీరుతో సొంపారుచుండును. స్థానిక పద్ధతులు, సంప్రదాయములు ఇందు ప్రవేశించియుండును. దీనివల్లనే పాఠాంతరము, భిన్నత్వముగూడ ఆపాదితమైయుండును. ఈ కారణంవల్ల మా ఊరిదే ఒప్పు, మీ ఊరిది తప్పు అనడం పొసగనిమాట. ముఖ్యంగా ఈవిషయం కార్తెలు-ఏరువాక-పైరులవిషయంలో ప్రస్ఫుటంగా కనబడుచున్నది. గోదావరి అదును మేనెల, కృష్ణది జూను, పెన్నది జులై; ఇట్టే మెట్టప్రాంతాలలో బాగా భేదించియుండును. అందువల్లనే సామెతలవిషయము కొన్నిచోట్ల చాల భిన్నముగా నున్నది. అయినప్పటికిని ఇది బలుపేగాని వాపుగాదు. దీనికంతా కారణం స్థానికప్రాబల్యము.

పది బూతులు పది నీతులు - అన్న కవిచౌడప్పమాటలో నిండు నిజమున్నది. బూతులలోఉన్న శివి జీవము సౌందర్యము మిగతవాటిలో లేవు. బూతులు మనసుకు సూటిగా తాకి అర్థం సులభంగాతోచి, చెరిగిపోకుండా నాటుకొనిపోవును. కాని, వాటిని

ఇందు చేర్చవలసిన అగత్యంలేదని సంపాదకవర్గంవారు భావించినారు. సంస్కృత పదము మరుగై నభ్యమై, తెనుగుమాట బయలై బూతగుచున్నది. మన ప్రబంధాల గీర్వాణాశ్లీలాలకు మనసు అలవాటుపడినదిగాని, అదే తెలుగులో అనిన మనసు ఇచ్చగింపనివారు, చాలామంది ఉన్నారు. బూతుసాటవలను ప్రత్యేకంగా పండిత ముద్రణమన్న ముసుగుతో ప్రకటించిన భాషకు, నుడికారమునకు ఎంతో సహాయకారిగా నుండునని అనుకొంటున్నాను. మూర్చి వ్రాయదగినవాటిని చాల ఇందు చేర్చియున్నాను.

నేను సిద్ధముచేసిన సామెతలను, సంపాదకవర్గమువారు - పెద్దలు డాక్టర్ దివాకర్ల వెంకటావధాని ఆచార్యులవారు, డాక్టర్ పి. యశోదారెడ్డిగారు పరిశీలించి, అవసరమనిపించినచోట సవరించి, యీ తృతీయముద్రణమును ఇట్లు రూపొందించుటకు సహాయము చేసినారు. శ్రీమతి యశోదమ్మ పూర్వంవలెనే కొత్తసాటవల నిచ్చినారు. వీరిద్దరికి నా హృదయపూర్వకవందనములు.

నేను అనువదించినవి, సేకరించినవి సామెతలు ఇందు చాలా చేర్చినాను.

ఈ భాషాసేవకు నాకు అవకాశమిచ్చిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారికి, ముఖ్యంగా ఎప్పుడూ చేదోడు వాదోడుగా ఉంటూఉన్న కార్యదర్శి శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావుగారికిని ప్రత్యేకవందనములు.

ఇందు కొన్ని పుస్తకములనుండి ఏరిన సామెతలను, కొన్ని ఉన్నవి ఉన్నట్లు. కొన్ని కొంత సవరించి ఇందు చేర్చిఉన్నాను. వేమన, సుమతి, వేణుగోపాలశతకములు; కళాపూర్ణోదయము, సుదక్షిణాపరిణయము, ఉత్తర హరివంశము, పాండురంగ మాహాత్మ్యము, ఆముక్తమాల్యద, త్యాగరాజుకీర్తనలు, అన్నమాచార్యులకీర్తనలు, చాటుపద్యరత్నాకరము మొదలగునవి.

ఏర్పులు కూర్పులలో నాకు ఎంతగానో తోడ్పడినది ఈ క్రింది మిత్రులు :—

విద్వాన్ జంధ్యాల జానకిరామశర్మగారు, వీరు ఓపికతో చాల సామెతల వ్రాసియిచ్చినారు. శ్రీ నేలనూతల శ్రీ కృష్ణమూర్తి - అధిపక్త వేమనపద్యాలను వెదకి ఏరినారు. శ్రీ ఎం. రామయ్య (ఎం. ఏ.) త్యాగరాజకృతులనుండి సంతనపరచినారు. శ్రీ ఎం. వేణుగోపాలయ్య (ఎం. ఏ.) కొన్ని శతకములనుండి ఇచ్చినారు. శ్రీ జి.పి.వి. రమణరావు (ఎం. ఏ.) పరిగ ఏరినట్లు ఏరుకొనివచ్చి ఇచ్చేవారు. ఇక శ్రీ కొండా వెంకటస్వామిరెడ్డి (ఎం. ఏ.) సాటవల పుట్ట. ఈయన సంతరించిఇచ్చిన చాలసామెతలు పనికివచ్చినవి. శ్రీ వేదం వెంకటరామన్ (ఎం. ఏ.) విమర్శకదృష్టి,

నాకు చాలవరకు తోడ్పడినది. శ్రీ కావుటూరు రామచంద్రరావు (ఎం. ఏ; ఇప్పుడు-డాక్టర్) డాక్టర్ కె. పురుషోత్తం (పిహెచ్. డి.) విద్వాన్ రాఘవన్ బాగా తోడ్పడినారు.

వీరందరికి నిండుమనముతో నా నెనరు తెలుపుచున్నాను.

ఈ ప్రయత్నమంతా, సముద్రంలో ఒక అలవంటిదే అనవచ్చును. ఎదిగి పొయ్యే ఈ సాహిత్యము ఏపేటా పరిశోధింపదగినది - అవిమాత్రమే మనవి చేస్తున్నాను.

'అవర్ణ'
నెల్లూరు
27-1-72.

—మరుపూరు
కోదండరామరెడ్డి.

# తెలుఁగు సామెతలు

## అ

అంకె అయితే గొంగెడు తెమ్మన్నానుగాని, మంచె గుంజలపాలు కమ్మన్నానా?

అంకెకురాని ఆలిని, ఆర్గురు బిడ్డలతల్లి అయినా విడువాలె.

అంకెకురాని ఆలు, కీలెడలిన కాలు.

అంకెలేనికోతి లంకంతా చెఱచిందట.

అంగట్లో అన్నీ ఉన్నవి, అల్లునినోట్లో శనిఉన్నది.

అంగట్లో అరువు; తలమీద బరువు!

అంగట్లో అష్టభాగ్యం, అల్లునినోట్లో శనేశ్వరం. (అష్టదరిద్రం)

అంగట్లో ఎక్కువైతే ముంగిట్లోకి వస్తుంది.

అంగట్లో బెల్లం గుళ్లోలింగానికి నైవేద్యం!

[1]అంగడమును బట్టి గొడ్డు, వంగడమును బట్టి బిడ్డ.

అంగడిఅమ్మి గొంగడి (కప్పు) కొన్నట్లు.

అంగడిబియ్యం, తంగెడి కట్టెలు.

అంగడిమీద చేతులు, అత్తమీద కన్ను.

అంగడిలో [2]చింగుడు దొరకదా?

అంగడివీధిలో అబ్బా! అంటే, ఎవరికి పుట్టినావురా కొడకా! అన్నట్లు.

అంగడివీధిలో ఆలిని పడుకోబెట్టి, వచ్చేవాళ్లు పోయేవాళ్లు దాటి పోయినారు అన్నట్లు.

అంగాన ఆటసాగితే మద్దెలకానికి బయటపెట్టిందట.

---

1 అంగడము = జాతి; ఆణెము. 2 చింగుడు = చిల్లర (Fraction)

అంగిట బెల్లం, ఆత్మలో విషం.
అంగిట విషం, మున్నాలిక తియ్యదనం.
అంచనగాడికి పుట్టి ఆతుతో సమానం.
అంచు డాబేకాని, పంచె డాబు లేదు.
అంటక ముట్టక దేవరకు పెడుతున్నాను, ఆశపడకండి బిడ్డల్లారా! అవతలకి పొండి అన్నదట!
అంటనప్పుడు ఆముదము రాచుకొన్నా అంటదు.
అంటుకోను ఆముదము లేకుంటే, మీసాలకు సంపెంగి నూనె.
అంటుబొడ్డు, ఆవుతల ఎద్దుకూ; జారుబొడ్డు చనుకట్టు ఆవుకు మంచివి(?)
అంటూసొంటు [1]ఆసాదివానిది. రట్టూరవ్వా గంగానమ్మది!
అంటూ సొంటూ లేని కోడలిదాని మేనమామ కొడుకు, చిక్కుడు చెట్టు కిందికిపోయి, పక్కలు ఎగురవేశాడట.
అంటే ఆరడి అవుతుంది, అనకుంటే అలుసవుతుంది.
అండబ్రతుకూ, ముండబ్రతుకూ అదవే!
అండలుంటే కొండలు దాటవచ్చు.
అండలేని ఊళ్ళో ఉండ దోషం, ఆశలేనిపుట్టింట అడుగ దోషం,
అంతంతకోడికి అర్ధసేరు మసాలా.
అంతంతవాణ్ణి చూస్తే ఆవుపెయ్యే కుమ్మవస్తుంది!
అంతఉరిమీ ఇంతేనా కురిసేది?
అంతఃపురము బ్రతుక్కు ఆకాశమే కావాలి.
అంతకు ఇంతయింది, ఇంత కెంతవుతుందో? ఇంత కింతే!
అంతకట్టూ వస్తుందిగాని, అటుంతకట్టు రాదు; తీర్పుకట్టు వస్తుంది గాని, దిబ్బకట్టు రాదు.
అంతకు తగిన గంత, గంతకు తగిన బొంత.

---

1 ఆసాది = మాలవాళ్ళల్లో ఒక జాతి. జాతరలలో దేవతను ఎల్ల నంపునప్పుడు బూతులు తిట్టుట వీరిపని.

అంతనాడు లేదు, ఇంతనాడు లేదు, సంతనాడు పెట్టింది ముంతంత కొప్పు.

అంతనాడు లేదు ఇంతనాడు లేదు, సంతనాడు దిగింది ముంతంత కూద.

అంత పెద్ద కత్తి ఉన్నదే గొరుగ లేవా? అన్నట్లు.

అంత పెద్ద పుస్తకం చంకలో ఉన్నదే పంచాంగం చెప్ప లేవా అన్నట్లు.

అంతమాత్రమూ కొడకా? చెవులుపట్టుక తడవేవు అన్నట్లు. (బోసి చెవులు అనుట)

అంతమాత్రముంటే [1]దొంతులతో కాపురము చేయనా?

అంతము లేని చోటు లేదు, ఆది లేని ఆరంభము లేదు.

అంతర్వేదితీర్థంలో మా వెధవ మేనత్తను చూచావా?

అంతర్వేదికి అవతల అసలే ఊళ్లు లేవు!

అంతా అయినతరువాత, రంతు పెట్టుకొన్నట్లు.

అంతా అయినతర్వాత [2]ముద్దరపిండి కాడనా తగవు?

అంతా అయినవాళ్ళే, మంచినీళ్లు పుట్టవు.

అంతా [3]ఆర్దుము అమ్మితే, అత్తనుకానక కోడలు ముత్తుము అమ్మింది.

అంతా తడిసినతర్వాత చలేమిటి?

అంతా తెలిసినవాడు లేడు, ఏమీ తెలియనివాడూ లేడు.

అంతాబోమె హరిగోవిందా అంటే, [4]కొదమ కుంచాబోమె కలో జోగో.

---

1 దొంతులు = దొంతి (అరివేణి) కుండలవరుస. పూర్వం మధ్యతరగతి సంసారాలు వీటిలోనే వస్తువులు ఉంచుకొనేవారు.

2 ముద్దరపిండి = ధాన్యమును తూర్పారబట్టి, మేలురాసిజేసి, అక్కడక్కడ ముద్ర వేయుటకు ఉపయోగించు పిండి, మట్టి మొదలగునవి.

3 ఆర్దుం = ఆరుతూములు; ముత్తుం = మూడుతూములు.

4 కొదమ = గుదుమ = ధాన్యమును కొట్టే కొయ్య, లేక ఇనుపసాధనము. కొదమ - మిగిలిన అనిగూడ అర్థము.

అంతా బాపలే! అయితే, కోడిపెట్ట ఏమైనట్లు?

అంతా మావాళ్లేగాని, అన్నానికి రమ్మనేవాళ్లు లేరు.

అంతా వట్టిది, పట్టు తెరలే!

అంతులేదేమయ్యా అంటే, నాపేరు అనంతయ్యగదా అన్నాడట.

అంతూ ఇంతూ కుంతికొడుకులకు రాజ్యం లేదు.

అంతే నోచి పుట్టావురా, అవ్వసల గొట్టివాడా!

అంత్తైనంక రంత్తైందట, పెండ్లైనంక [1]బాజంట.

అంత్యనిష్ఠురంకన్న ఆదినిష్ఠురం మేలు.

అందంచందం లేనిమగడు మంచంనిండా ఉన్నట్లు.

అందం చిందినట్లు, నాగరకత నష్టమైనట్లు.

అందగానికి ముందుపెండ్లి, అందరితోనూ మళ్ళీపెళ్లి.

అందతుకుల కాపురము, [2]అరదట్లనీటి సేద్యము.

అందతుకుల మగవానికి (మొగానికి) చీకుల (బిళ్లల) మొలతాడు.

అందని ద్రాక్షపండ్లు పుల్లన అన్నట్లు.

అందనిపూలు దేవుని కర్పణం.

అందముంటె ఆమెనా? అదృష్టము ఉండవద్దా!

అందని మానిపండ్లకు అఱ్ఱులు సాచినట్లు.

అందని మానిపండ్లకు ఆశపడ్డట్లు.

అందములో పుట్టిన గంధపుచెక్క, ఆముదములో పుట్టిన మడ్డి.

అందమున కోతిపిల్ల యీ అరవపిల్లి.

అందరమ్మా అంటే, పొందరమ్మా అన్నట్లు.

అందమైన ఈకలే అందమైన పిట్టలను చేసేది.

అందరు ఘనులైన హారునకు తావేది.

---

1 బాజ = వాద్యధ్వని.

2 అరదట్లు = పిరుచాలివి బెట్టినమయము.

అందరికన్న తాటిచెట్టు పెద్ద.

అందరికాళ్ళకు మొక్కినా, అత్తగారింటికి పోకతప్పదు.

అందరిపుణ్యాన ఆలాయె, కొందరిపుణ్యాన కోడుకాయె.

అందరికి శకునంచెప్పే బల్లి, తానుపోయి కుడితిలో పడ్డట్టు.

అందరికీ అట్లపండుగ, మనకు ముట్లపండుగ.

అందరికీ అన్నంపెట్టేవాడు రైతే!

అందరికీ అన్నిరోగాలు అడ్డెడు తప్పేలాకు ఏరోగమూ లేదు.

అందరికీ అమావాస్యగాని, నాకుకూడానా?

అందరికీ నేలోకువ, నాకు నంబికొండాయ లోకువ.

అందరికీ మంచివాడు అనంతయ్య.

అందరినీ మెప్పించడం అలవిగాని పని.

అందరూ అందలమెక్కితే, మోసేవారెవరు?

అందరూ అహింసాపరులే అయితే, కోడిపెట్ట ఎక్కడకు పోయినట్లు.

అందరూ ఆబ్రలో విత్తనాలే!

అందరూ ఇట్టికొమ్మంటే, తాను బట్టికొమ్మంటాడు.

అందరూ ఒకఎత్తు, అగస్త్యుడు ఒకఎత్తు. (అతని కమండలువు ఒకఎత్తు.)

అందరూ నవ్వినట్లే నేనూ నవ్వితే, నాపై బడెనమ్మా నాలుగు [1]సుస్కానీల దండుగ!

అందరూ మంచాలదగ్గరకు వెళ్ళేవరకు మేము కంచాలదగ్గరకైన వెళ్ళ లేమా?

అందరూ మాటలుచెప్పేవారే కాని, ఆపూటను బత్తె మిచ్చేవారు ఒకరూ లేరు.

అందరూ శ్రీవైష్ణవులే, బుట్టెడు రొయ్యు లెగిరిపోతున్నాయి.

---

1 సుస్కానీ = దమ్మిడీకన్న చిన్ననాణెము.

అందలములో పెట్టినకుక్క ఎంగిలాకులు నాక ఇలకుదూకు.
అందానికి గోవిందగంతులు!
అందానికి పెట్టినసొమ్ము ఆపదకు అడ్డం వస్తుంది.
అందానికి రెండు బందా(ధా)లు, ఆటకు రెండు తప్పెట్లు.
అందానికి రెండు[1]బొందులు, ఆటకు రెండుతాళాలు.
అందాలపురుషుడికి రాగి మీసాలు.
అందితే సిగ, అందకుంటే కాళ్లు.
అందిన(తే) తియ్యన, అందకున్న పుల్లన.
అందినవారికి మిన్ను అరచేతిదే.
అందుకోనే లేకుంటే, తుంచుకో నెక్కడిది?
అందులో పసలేకున్నా, అరలో మంచం వేయుమన్నట్లు.
అందులో పసలేదు, గంజితో వార్చుమన్నట్లు.
అంధుని కాలు పంగునకు ఆధారమైనట్లు.
అంధునికి అద్దం చూపినట్లు.
అంధేఖానుదర్బారులో అదే పోతగాళ్లు, పిలిస్తే పలుకనివాళ్లు.
అంపబోయిన అల్లీసాహెబు, పిలువబోయిన పీరుసాహెబు ఫికరులేదు.
[2]అంబటిపేరు వచ్చింది అత్తగారూ! అంటే, కొలబుర్ర నాచేతిలోనే ఉన్నది కోడలా! అన్నదట.
అంబటికి ఉప్పులబ్బదంటే, పిండివంటమీద పోయిందట మనసు!
అంబటిమీద ఆశ, మీసాలమీద ఆశ.
అంబడిపూడి అప్పయ్యాదీ బట్టతలే, నా మొగుణిదీ బట్టతలే! కాని, అప్పయ్యాది ఐశ్వర్యపు బట్టతల, నా మొగుణిది పేనుకొరికిన బట్టతల.

---

1 బొందులు = తాళిబొట్లు.

2 అంబలి = రాగి (తమిద) పిండితో పాగుగాచేసిన సంకటి.

అంబలా అంటే, ముఖాలే చెబుతాయి అన్నట్లు.

అంబలితాగితే ఆరప్పొ, అన్నంతింటే మూడప్పొ.

అంబలి తాగేవాడికి మీసాలెగబెట్టే వాడొకడా!

అంబలి దినువేళ అమృత మబ్బినట్లు.

అంథంలో కుంభం, ఆదివారంలో సోమవారం.

"అ ఆ"లు రావు, అగ్రతాంబూలంమాత్రం కావాల!

అకటావికటపు రాజుకు అవివేకి ప్రధాని, చాదస్తపు పరివారము.

అకాలపువాన ఆరికకూడు. (ఇతర పైరులుపోయినా ఆరిక బతికి కాస్తుంది అని)

అక్క ఆరాటమే కాని, బావ బతకడు.

అక్కకుంటే [1]అరితికి లేదు, చెల్లెలికుంటే చేతికి లేదు.

అక్కచెల్లెళ్లకు అన్నంపెట్టి లెక్క వ్రాసినట్లు.

అక్కన్న అద్దంకి పోనూ పోయాడు, రానూ వచ్చాడు.

అక్కన్న మాదన్నగార్ల అందలమెక్కితే, సాటికి సరసప్ప చెరువుకట్ట ఎక్కినాడట!

అక్క పగ, బావ మంచి (చుట్టము).

అక్క మనదిఅయితే, బావ మనవాడవుతాడా?

[2]అక్కమ్మ గుమ్మాలు ఎక్కా లేము దిగా లేము.

అక్కమ్మ శ్రాద్ధానికి [3] అధిశ్రవణము.

అక్కఱ ఉన్నంతవఱకు ఆదినారాయణ, అక్కఱ తీరితే కూద నారాయణ.

---

1 అరితికి = మెడకు.

2 అక్కమ్మ = ఒకానొక గ్రామదేవత.

3 అధిశ్రవణము = అన్నికమువేళ. బ్రాహ్మణులు భోజనముచేయునపుడు చదివెడి వేద మంత్రములు.

అక్కఱకు ఒదవని అర్థమెందుకు? అక్కఱకురాని చుట్టమెందుకు?
అక్కఱకు వచ్చినవాడే అయినవాడు.
అక్కఱ గడపుకోని, తక్కెడ పొయిలో బెట్టినట్లు.
అక్కఱ తీరితే, అల్లుడు తొత్తుకొడుకు.
అక్కఱ తీరితే, అక్క మొగుడు కుక్క.
అక్కఱ తీరితే, అల్లు దశుద్ధంతో సమానం.
అక్కలు లేచేవఱకు నక్కలు కూస్తాయి.
అక్కాజిపల్లి అంతాతిరిగినా అరదుడ్డే గోవిందా!
అక్కున లేదు, చెక్కున లేదు, పీతిరికాళ్లకు [1]పిల్లాండ్లు.
అగడు మగడు(డి) పాలు, ఆనందం (అనుభవం) ఊరిపాలు.
అగడ్తలో పడ్డపిల్లికి (మొసలికి) అదే వైకుంఠము.
అగసాలిని వెలయాలిని నమ్మరాదు
అగసాలి పొందు, వెలమల చెలిమి నమ్మరాదు.
అగ్గిచూపితే వెన్న అడక్కుండా కరుగుతుంది.
అగ్గికి చల్లదనం వచ్చినట్లు.
అగ్గికి పోయినమ్మ, ఆరునెలలు గర్భమై వచ్చినట్లు.
అగ్గిమీద గుగ్గిలం చల్లినట్లు. (గుప్పున మండును)
[2]అగ్గువ అయితే అంగడికి వస్తుంది.
అగువ అయితే అందఱూ కొంటారు.
అగ్గువ కొననీయదు; తీవరం తిననీయదు.
అగ్గువ కొననీదు, ప్రియం అమ్మనీదు.
అగ్గువ బేరం నుగ్గునుగ్గు.
అగ్నికి వాయువు తోడైనట్లు.
అగ్ని దేవుడు చలికాలంలో చంటివాడు, ఎండకాలంలో ఎదిగినవాడు.
అగ్నిలో ఆజ్యం పోసినట్లు.
అగ్నిలో ఒకకాలు, గంధంలో ఇంకొక కాలు ఉంచి, తగవుతీర్చినట్లు.

---

1 పిల్లాండ్లు = కాలివేళ్ళకు స్త్రీలు పెట్టుకొనే నగ; మెట్టె. 2 అగ్గువ = చవుక.

అగ్నిలో మిడత పడ్డట్లు.

అగ్ని శేషం ఋణ శేషం శత్రు శేషం వ్రణ శేషం ఉంచరాదు.

అగ్రహారం పోతేపోయింది కాని, ఆకట్ట అంతా బాగా తెలిసింది.

అగ్రహారంలో [1]తంబళి(ళ) జోస్యం.

అచ్చ తిరుమణిధారి అయితే, పుల్లపట్టడంలోనే తెలుస్తుంది.

అచ్చపు నేతిముందర పచ్చివెన్న మెచ్చా?

అచ్చమ్మపెళ్ళిలో బుచ్చెమ్మ శోభనం.

అచ్చమైనసంసారి ఉచ్చబోసి ఇల్లలికించటం.

అచ్చిగాడిపెళ్ళిలో బుచ్చిగాడి కోపోచ.

అచ్చిగాడు చావనీ అంటే, బుచ్చిగాడే చచ్చెనట!

అచ్చిపెళ్ళి బుచ్చిచావుకు వచ్చింది.

అచ్చివచ్చినభూమి అడుగడే చాలు.

అచ్చివచ్చేకాలానికి నడచివచ్చే కొడుకు పుడుతాడు.

అచ్చివస్తే హనుమంతుడిమోర, లేకపోతే కోతిమోర!

అచ్చిరానికాలానికి అడుక్కతినబోతే ఉన్నబొచ్చి కాస్త ఊడ్చుకొని పోయిందట.

[2] అచ్చువేసిన ఆబోతువలె. (వ్యభిచారిగా తిరుగుటకు)

అజీర్ణానికి ఆకలి మెండు.

అటుకులు బొక్కేనోరు, ఆడిపోసుకునే నోరు ఊరుకోవు.

అటుకులు దిన్నకడుపు [3]కుట్టుకు ఓర్చుకోవలదా.

---

1 తంబళి = శివాలయార్చకుడు.

2 పెండ్లిపందిలిలోగాని చావుపందిలి (అపరకర్మ) లోగాని మంచికోడెను, ఆవులు కట్టుటకు (దాటుటకు)గా వెంకటేశ్వరునిపేరు, ముద్దిన కాల్చి అచ్చువేసి వదలి వేయుదురు. వదలునప్పుడు మంత్రపురస్కారంగా సంస్కారంచేసి దేవ బ్రాహ్మణమాన్యములలో మేయవద్దని హితముజెప్పి వదలుదురు. (ఋషభో త్సర్గము) చచ్చినతర్వాతగూడ దీనిని బండిమీదబెట్టి ఉత్సవంతో తీసికొని పోయి సమాధి చేయుదురు.

3 కుట్టు = కడుపునొప్పి.

[1]అటునుంచి నరుక్కురమ్మన్నారు.
[2]అయితే కందిపప్పు, ఇయితే పెసరపప్పు.
అయితే వైద్యకట్నం, ఇయితే వైతరణీ గోదానం.
అట్టు ఒకరికీ, ముక్క ఒకరికా?
అట్టు తినంగానే కుట్టు పుట్టుతుందా?
అట్టుపిట్టు ఆసాదివానిది, రెట్టురవ్వ గంగానమ్మది.
అట్టు పెట్టినమ్మకు అట్టున్నర.
అట్టే చూస్తే అయ్యవారు కోతిలా కనపడతాడు.
అట్లు వండినమ్మకు అర్ఘ్య రమర్చనలె.
అట్లు వండే అత్తకు ఆరవైఆరు ఎత్తులు పెట్టినట్లు.
అడకత్తెరలో జిక్కిన వక్కమాదిరి.
అడక్కుండా చెప్పులిచ్చాడు, అడిగితే గుఱ్ఱమిస్తాడని అనుకొన్నట్లు.
అడక్కుంటే జోలె అడుక్కుపోతుంది.
అడగని జోలి వేప్పే [3]అవుసలి రామక్క.
అడగనిదే అమ్మయినా పెట్టదు.
అడవి ఉసిరికాయకు సముద్రపు ఉప్పు కలిసినట్లు.
అడవినక్కలకు కొత్వాలు [4]దురాయా?
అడవిపంది చేను మేసిపోతే, ఊరపంది చెవులుకోసినట్లు.

---

1 ఇది అమరసింహునికి సంబంధించినదని కొందరు అంటారు. అమరుడు బౌద్ధుడు. చంద్రగుప్త విక్రమాదిత్యునికాలంలో వైదికము సంస్కృతము పునర్వికసమును గాంచినప్పుడు బౌద్ధులను హింసించి చంపుచుండినారట. ఒకపరి కొందరిని బారుగానిలిపి శిరచ్ఛేదం చేయబోగా, మొదటనుండిన అమరుడు అటునుండి నరుక్కొని రమ్మనికోరినాడట. అట్లనే నరుకుకొంటూ వచ్చేలోపల అమరకోశం చెప్పివేసినాడు-అని కథ. దీనికి పాఠాంతరాలుండవచ్చు.

2 బ్రాహ్మణులయిండ్లలో శుభానికి కందిపప్పు అశుభానికి పెసలపప్పు వాడుదురు. కొన్నికొన్నిప్రాంతాలలో సంసారులయిండ్లలలో రెంటికీ పెసలబేడల పప్పునే చేయుదురు.

3 అవుసలి = అగసాలి. 4 దురాయి = ఆజ్ఞ.

అడవి పత్రి, వాననీరు. (దేవునికి సమర్పించినట్లు)

అడవికిపోయిన ఆవులకు బంది అడిగినట్లు.

అడవిపులి మాసుల ఆదరించునా?

అడవికిపోయిన ఆవులకు బంది అడిగినట్లు.

అడవిని గాచిన వెన్నెల, ముదిమిని చేసిన పెండ్లి.

అడవిలో తిని, ఆకుతో తుడిచినట్లు.

అడిగింది రొట్టె, ఇచ్చింది రాయి.

అడిగితే చిరాకు, అడుగకపోతే పరాకు.

అడిగినట్టు ఇస్తే, కడిగినట్టు పోతుంది. (బేరంలో)

అడిగి పెట్టించుకోరా బుడిగిదాసరీ అన్నట్లు.

అడిగేవాడికి చెప్పేవాడు లోకువ.

[1]అడిదెకు (అడితికి) రామగోవిందట.

అడియాస, పడిభత్యం.

అడియాస, పొడియాస దుఃఖానికి కారణం.

అడివి చెట్టుకు యానాదివాడు పెట్టినదే పేరు.

అడుక(గు)లు తింటే ఆయెనా? కడుపులో కుట్టెత్తినప్పుడుకదా?

అడుక్కుతినే వాడింటికి [2]తిరసకతినే వాడొచ్చినట్లు.

అడుక్కునితిన్నా [3]బోలె అలాదాగ ఉండాలె.

అడుక్కొని తినేవాడి ఆలు అయ్యేకంటే, భాగ్యవంతుడి బానిస అయ్యేది మేలు.

అడుక్కొని తినేదానికి తిరిసికొని తినేవాడే గతి.

అడుక్కొని తినేవాళ్లకు అరవై ఊళ్లు.

1 అడిదె = ఊరకే; అడితి = కమిషనుకు సరకులమ్మిపెట్టు వ్యాపారము.

2 తిరసక తిను = తిరపమెత్తుకొని తిను.

3 బోలె = వశ్యము, పాత్ర, బొచ్చె.

అడుక్కొని తినేవాడు పెరుగుఅన్నము కోరినట్లు.

అడుక్కోవటానికి ఈగడప కాకపోతే, ఇంకో గడప.

అడుగబోయిన ఆలీసాబ్ అక్కణ్ణే, పిలువబోయిన పీరుసాబూ అక్కణ్ణే.

అడుగ నియ్యలేని యాతడే పెనులోభి.

అడుగ నేరను, ఊడ్చిపెట్టు మన్నట్లు.

అడుగు తప్పితే పిడుగు తప్పుతుంది.

అడుగుతప్పితే అరవై ఆరు గుణాలు.

అడుగుదాటితే అక్కఱ దాటుతుంది.

అడుగున ఎరువుకొద్దీ పైన బంగారం. (పంట)

అడుగు పెట్టగానే పిడుగు పడ్డట్లు.

అడుగులోనే అరక విరిగినట్లు.

అడుసు త్రొక్కనేల ? కాలు కడగనేల ?

అడుసున పాతినకంబం, అటు ఒరుగునో, ఇటు ఒరుగునో !

అడేజావ్ వొచ్చి బడేజావ్ అన్నదంట.

అడ్డంపడితే గడ్డం లోతే, బోర్లపడితే పుక్కిటి లోతే.

అడ్డగోడంత రొట్టె, గడ్డివామంత తొక్కు.

అడ్డజామీనులకు పోతే తెడ్డుదెబ్బలు వస్తాయి.

అడ్డబొట్టువాడు నిలువుబొట్టువాడు తగవులాడి, సత్రం తగులబెట్టి నారట!

అడ్డాలనాడు బిడ్డలుగాని, గడ్డాలనాడు బిడ్డలా ?

అడ్డము దిడ్డము తిరెగెడి తెడ్డెరుగునె పాలతీపి,

అడ్డెడాళ్ళకు ఆత్రపడితే కుంచెడాళ్లు దూడ తినిపోయిందట.

అడ్డెడు తవ్వెడు బియ్యమిచ్చి, అమ్మా! నీప్రసాద మన్నట్లు.

అడ్డెడు తినే నాసవతి ఎలా తింటుందో! గిద్దెడు తినే నాసవతి ఎలా తింటుందో! తవ్వెడు అడ్డెడు తినేవఱకు నాదవడ లేద్చుక పోయినవి.

అడ్డెడు తినేవాడికి ఆలెందుకు? ఇద్దుము మోసేవానికి ఎద్దెందుకు?

అడ్డెడు వండిన బుడ్డెడాయె.

అడ్డెడువడ్లు ఆశకుబోతే, తూమెడువడ్లు దూడ తినిపోయింది.

అడ్డేటుమీద గుడ్డేటు.

అణిగిమణిగి ఆకులలో పిందెవలె ఉండాలంటే, గుమ్మడిపాదులలో కూర్చుండట.

అతంత్రుడికి అలయ్యేదానికంటే బలవంతుడికి బానిసఅయ్యేది మేలు.

అతంత్రునికి ఆశ పెట్టరాదు, బలవంతునికి చోటు ఇవ్వరాదు.

అతడెంత ఘనుడైన అడుగక తీరదు.

అతనికంటె ఘనుడు ఆచంట మల్లన.

అతికించిన కోరమీసం అట్టే నిలుస్తుందా?

అతిచేస్తే గతి చెడుతుంది.

[1]అతిరసాలు లేనిదే అల్లెంకాదు. (మనుగుడుపు)

అతిరహస్యం ఏమిటిరా? అంటే, పొగాకు తిరిపెము అన్నట్లు.

అతిరహస్యం చెవిలో పోటు.

అతిరహస్యం బట్టబయలు.

అతిలోభిరాజుకు అడుగనివాడే పండితుడు.

అతివృష్టి అయినా, అనావృష్టి అయినా ఆకలిబాధ తప్పదు. (కరువు తప్పదు.)

అతి సుకుమారం, కటికి దరిద్రం.

అతుకు కనిపించ దల్లుడా అంటే, కుంపటి కనుపించదు మామా అన్నాడట.

1 అతిరసము=విప్పటి. అరిసె.

అతుకుల కాపురం, చిరుగుల మంటవంటిది.

అతుకుల బొంత, గతుకుల బాట.

అత్త అప్పుతీరె, అల్లుని భ్రమతీరె.

అత్త ఆరో నెలలో పట్టిన దయ్యం (బిడ్డకు మొదటవచ్చేమాట అత్త అనుట)

అత్త [1]ఎత్తుకొని తింటూంటే, అల్లునికి మనుగుడుపా?

అత్త ఏలినకోడలు, చిత్తపట్టిన వరి.

అత్త ఒప్పిన, దుత్త ఒప్పదు.

అత్తకంటె [2]ఆడపాప లేదు, అతగానికంటె జీతగాడు లేదు.

అత్తకాలము కొన్నాళ్లు, కోడలికాలం కొన్నాళ్లు.

అత్తకు అల్లుడాశ, బాపనికి పప్పాశ.

అత్తకు తుత్తర తీరినట్లు అల్లుడు (అబ్బాయి) నేర్చుకొన్నట్లు.

అత్తకు నాకు ఆరంబేరం, అత్త నెత్తుకపో ముత్యాలమ్మా! అత్త నెత్తుకపోతే [3]ఆరుగాళ్ళజీవాన్ని అర్పిస్తాను.

అత్తకు మంచీ లేదు, చింతకు పచ్చీ లేదు.

అత్తకు మొగుడల్లుడు.

అత్తకు లేక అటికెలు నాకుతూఉంటే, అల్లుడువచ్చి దీపావళిపండుగ అన్నాడట.

అత్తకును శాంతంబు, కత్తికిని మెత్తన కలదె.

అత్త కూడువండమన్నదికాని, కుండ పగలగొట్టమన్నదా?

అత్తకొట్టినకుండ అడుగోటికుండ, కోడలు కొట్టినకుండ కొత్తకుండ.

అత్తచచ్చిన ఆరునెలలకు, కోడలు నిట్రాయి పట్టుకొని నిగిడినిగిడి ఏడ్చిందట.

---

1 ఎత్తుకొని-ఎత్తుక = బిచ్చమెత్తుకొని.

2 ఆడపాప = జమీందారుల నగళ్ళలో దాసి. కాసాది.

3 ఆరుగాళ్ళ జీవం = పాలీడు.

అత్త చేసినపనికి ఆరళ్లు లేవు.

అత్త తుత్తరతీరె, అల్లుడి భ్రమతీరె.

అత్తతో చెప్పి అప్పు అనిపించ లేదుగాని, లంకించడానికి బ్రహ్మ కొడుకు (బ్రహ్మకాయ.)

అత్తతో పోట్లాడి, [1]తేరు చూడకుండాపోయినట్లు.

అత్తను అమ్ముకొమ్మంటారు, కోడలిని కొలుచుకొమ్మంటారు.

అత్తను ఉంచుకొన్నవాడు ఆయుష్మంతుడు.

అత్తనుకొట్టి అటకెక్కింది, మొగుణ్ణికొట్టి మొగసా లెక్కింది.

అత్తను కొట్టితే కోడలు ఏడ్చినట్లు.

అత్తపని రిత్తపని–దినమొక [2]కండె, నాపని రాచపని–నెలకొక కండె.

అత్తపెట్టే ఆరళ్ళు కనపడుతవి కాని, కోడలుచేసే కొంటెపనులు కనపడవు.

అత్త పేరుపెట్టి కూతురిని కుంపట్లో వేసిందట.

అత్త పోరు లేదు, మామ పోరు లేదు, ఏరుకొన (ఏరువాకకు) బోయిన చోట ఎనుబోతు లేదు.

అత్త పోరు లేదు, మామ పోరు లేదు, గుడిసెలో గుడ్డివాని పోరు.

అత్త మంచీ, వేము తీపి లేదు,

అత్త మిత్తి, [3]ఏరాలు కత్తి.

అత్తమీద కోపం, దుత్తమీద చూపినట్లు.

అత్తముండకన్న, ఉత్తముండ మేలు.

అత్తమెత్తన, కత్తి మెత్తన ఉండవు.

అత్త మెత్తన, వేము తియ్యన లేవు.

---

1 తేరు = స్వామి రథోత్సవము.

2 కండె = నేయుటకు నూలు తోడిపెట్టు చిన్నకొయ్యముక్క. ఇది సాలీలకో దేవాంగులకో సంబంధించిన సామెత.

3 ఏరాలు = తోడికోడలు.

అత్త అంకుపోతూ, కోడలికి బుద్ధి చెప్పినట్లు.
అత్తలేనమ్మ ఉత్తమురాలు, మామ లేనమ్మ మరీ భాగ్యశాలి.
అత్త లేనికోడ లుత్తమురాలు, కోడలు లేనత్త గుణవంతురాలు.
అత్తవల్ల దొంగతనము, మగనివల్ల అంకుతనము నేర్చుకున్నట్లు.
అత్తవారింట అల్లుణ్ణి చూడాలి, ఆముదాలచేలో ఆబోతును
చూడాలి. (క్రింద బాగా గడ్డిపట్టియుండును)
అత్తవారింటికి అల్లుడైనా కావాలి, ఆబోతైనా కావాలి.
అత్తవారింటి ఐశ్వర్యముకన్న పుట్టింటి గంజి మేలు.
అత్తవారింటి లేమి అల్లుడెరుగడు.
అత్తవారిల్లంటే కత్తులబోను. (కోడలికి)
అత్తవారింట సుఖం, మోచేతి దెబ్బవంటిది.
అత్తసొమ్ము అల్లుడు ధారవోసినట్లు. (దానం చేసినట్లు)
అత్తది అల్లుడు దానం చేసినట్లు.
అత్తా ఒకఇంటి కోడలే, మామా ఒకఇంటి అల్లుడే.
అత్తా కోడలు అల్లిబిల్లి, ఇరుగుపొరుగు ఇల్లామల్లి.
అత్తా కోడళ్ళమాట ఆనోటా ఆనోటా. (నానినట్లు, పడినట్లు)
అత్తా! నారాట్నం మాపకుండాచూడు, కదుటిదిండులో దారం పడ
కుండా చూడు.
అత్తా! నీకొంగు తొలగిందన్నా తప్పే, లేదన్నా తప్పే, (ఊరకున్నా
తప్పే.)
అత్తింటికాపురము కత్తిమీది సాము.
అత్తిపండు పగులకొట్టితే అన్నీ పురుగులే.
అదంతా ఒక కంపరామాయణము (అరవములోని కంబరామా
యణ మనుట.)
అదంతుడికి ఆలయ్యేదానికంటె, బలవంతుడికి బానిసగావడం మేలు.

అదను ఎఱిగి సేద్యం, పదును ఎఱిగి పైరు.
అదనుకాని పదును అయితేనేమి గియితేనేమి.
అదనుకాని పైరు, ముదిమిలోని బిడ్డ.
అదరిపాటు ఏదైనా గంతబరువు తప్పదు.
అది అడుసు, ఇది తోడుసు, పదరా పందిట్లోకి.
అదిగో అంటే ఆరునెలలు.
అదిగో పసుపు, ఇదిగో ముసుగు అన్నట్లు.
అదిగో పులిఅంటే, ఇదిగో తోక అన్నట్లు.
అదిగో పులిఅంటే, తోక తొంబై ఆమడ అన్నట్లు.
అది మంచిసరుకైతే అంగడివీధి కెందుకెక్కుతుంది?
అది లేనిదే గడెందుకు? (గడియ బిగించుటెందుకు)
అదునుచూచి పొదలో చల్లినా పండుతుంది.
అదుపుకురాని ఆలిని, అందిరాని చెప్పును విడువమన్నారు.
అదుపులేని గుఱ్ఱాలు అడవులు పట్టుకుని తిరిగినవట.
అదుపులేని మగనిమాట అరచీమ కుట్టినంత.
అదృష్టంఉంటే చేయి జారిపోయేదికూడా చేతికి వస్తుంది.
అదృష్టం కలిసివస్తే అదే (ఆలే) పెండ్లామవుతుంది.
అదృష్టంచాలని ఆడుబిడ్డను అక్కఱలేని అల్లునికిచ్చి, అమావాస్య ఆదివారం నాటి ఆరుద్రానక్షత్రాన అతివైభవంగా వివాహం జరిపినట్లు. (ఇది దుర్ముహూర్తమగును)
అదృష్టం చెప్పిరాదు, దురదృష్టం చెప్పిపోదు.
అదృష్టం పండితే, ఆరునూరవుతాయి.
అదృష్టము అందలమెక్కిస్తానంటే, బుద్ధి బురదలోకి లాక్కెళ్లిందట.
అదృష్టవంతుణ్ణి చెఱిపేవారు లేరు, భ్రష్టుణ్ణి బాగుపఱిచేవారూ లేరు.
అదృష్టానికి ఏడ్వనా? అదవమొగుడికి ఏడ్వనా?

అదే ఊరై తే, కోళ్లు కూయవా?
అదే పదకమయితే అమ్మెక బదకనా?
అదేపోతగాడు, ఎదురుమాటలవాడు, కంబంచాటుగాడు. (సేవకు లైనట్లు)
అదేమిటి రెడ్డీ, వంగివంగి నడుస్తా వంటే; ఎప్పటికాలు అట్లాటే అన్నాడట.
అద్దైవస్తే అడ్డగ, వాడై పోతే రూక.
అద్దం ఉంది. అంద మడుగనేల?
[1]అద్దంకివారి ముద్రకు అడ్డులేదు.
అద్దంకివారిముద్ర భుజం తప్పినా, వీపు తప్పదు.
అద్దంమీద అలిగి, ముక్కు గోసుకొన్నట్లు.
అద్దంమీద పెసరగింజ పడ్డట్టు.
అద్దంలోని ముడుపు అందిరాదు.
అద్దంలో నీడకు ఆశపడినట్లు.
అద్దద్ద అనేవానికి అర్థరూపాయి; మొద్దు కొట్టేవానికి పెద్దదుడ్డు.
అద్దుకోనే లేకుంటే తుంచుకో నెక్కడిది?
అద్దెకువచ్చిన గుఱ్ఱాలు అగడ్తలు దాటుతవా?
అద్దె పేరంటము [2]సిద్దె మురికి.
అద్వైతులు వస్తున్నారు చెంబుతప్పేలా జాగర్త (జాగ్రత్త) చేయండి.
అదృష్టం కలసివచ్చేనాటికి ఆలే పెండ్లామవుతుంది.
అధమునికి ఆలు అయ్యేదానికంటె బలవంతునికి బానిసఅయ్యేది మేలు.
అధరరసముచూచి అన్నియు మఱచును.
అధికారం ఆరుపాళ్లయితే, బొచ్చు మూడుపాళ్లు.
అధికారం బంగారుగొలుసుల బదిఖాన.

1 అద్దంకి = ఆంధ్రవైష్ణవగురువుల పీఠస్థానము.
2 సిద్దె = దివిటీలకు చమురుపోసే సన్నటిముక్కుగల చెంబువంటి పాత్ర.

అధిక భాషణంబు లాయాసదములు.
అధికారాంతమునందు చూడవలెరా ఆ యయ్య సౌభాగ్యముల్.
అధికారి అరుమూర, బంటు పదిమూర.
అధికారికి చెవులుంటాయిగాని, కళ్లుండవు. (చెప్పుడుమాటలు వినుటే గాని చూచుట లేదని)
అధికాశ లోకదరిద్రం.
అనంతమ్మ కట్టట్ల, జగ్గమ్మకు దగ్గు.
అనంతయ్య కాశీమాత్ర, వైకుంఠయాత్ర.
అనగా అనగా రాగం, తినగా తినగా రోగం.
అనపచేను ఆమదుండగానే బత్తుపిత్తులు బయలుదేరినట్లు.
అని అనిపించుకోవలెనా అత్తగారు?
అనిత్యాని శరీరాణి, అందటిసొమ్ము మనకేరాని.
అనిష్టానికి ఎవరంటే, అప్పిగాడే పాత్రుడు.
అనుకొన్నపని అంగవస్త్రంలో అయినట్లు.
అనుభవం ఒకరిది, ఆర్భాటం ఇంకొకరిది.
అనుభవం ఒకరిది, అగు(గ)డు ఇంకొకరిది.
అనుభవమే శాస్త్రం, మాటలే మంత్రాలు.
అనుమానం ప్రాణసంకటం.
అనుమానం ముందుపుట్టి, ఆడది (ఆయన) తర్వాత పుట్టింది (పుట్టాడు.)
అనుమానపు మొగుడు ఆలిని వీపుకు కట్టుకొంటే, పెండ్లాము మిండ మగని కొప్పులో బెట్టుకొన్నదట.
అనుములు తింటూ మినుములు పెట్టినట్లు.
అనుములుదిన్న (వాడి) గుద్దవలె వాగినాడు.
అనుములు దిన్నతర్వాత అపానవాయువులకు వెరిస్తే ఎట్లా!
అనువుగానిచోట అధికుల మనరాదు.

అనువుగానిచోట వుండు, అల్లుడి వైద్యం చెప్పకుంటే ప్రాణం పోతుంది.

అనూరాధ కార్తెలో అనాథకట్టయినా [1] ఈనుతుంది.

అనూరాధకు తడిస్తే మనోరోగాలు పోతవి.

అనూరాధలో అడిగినంత పంట.

అనూరాధలో తడిస్తే ఆడది మగవాడౌతాడు.

అనృతం అందచందాల అత్తిపండువంటిది.

అన్నం అడిగినవానికి సున్నం పెట్టినట్లు.

అన్నం ఉడికిందో లేదో, అంతా పట్టిచూడనక్కర లేదు.

అన్నం ఉడికినాక పొయ్యి మండుతుంది.

అన్నం ఎక్కువైతే ఆచారమెక్కువ, ఆచార మెక్కువైతే గ్రహచారం తక్కువ.

అన్నం తిన్నవాడు, తన్నులు తిన్నవాడు మరిచిపోరు.

అన్నం పెడితే అరిగిపోతుంది, చీర ఇస్తే చిరిగిపోతుంది, కట్టుకాల్చి వాతపెడితే కలకాలముంటుంది అన్నట్లు.

అన్నం పెట్టినవారింటికి కన్నము పెట్టినట్లు.

అన్నం లేకపోయినా పట్టుబట్ట.

అన్నం లేకుంటే జొన్న సాగుచెయ్యి.

అన్నదమ్ములపొత్తు చిన్నప్పుడు, అప్పచెల్లెళ్ళపొత్తు పెద్దప్పుడు.

అన్నదమ్ముల శత్రుత్వం, అక్కచెల్లెండ్ర మిత్రత్వం.

అన్నదమ్ములలో కడపటివాడికంటె, అడవిలో మానై పుట్టడం మంచిది.

---

1 ఈను = కొడుపుయీను, అనగా వెన్ను తీయవలసినదానికి మారుగా ఒక తెల్లటి ఈనె పుట్టి వరికర పనికిరాకుండా పోవుట. దీనివి కొడుపుయీనటందురు.
ఈను = గింజపట్టు.

అన్న దీక్ష యే కాని, అక్షర కీక్ష లేదు.
అన్న దేవర సన్నగి_స్తే, అన్నీ అణుగుతవి.
అన్న దేవర సన్నగి_స్తే గోలుకొండకు జాత రే.
అన్న దేవుడు సన్న గిల్లి తే అన్ని పనులూ తీరిపోతవి.
అన్న ద్వేషం బ్రహ్మ ద్వేషం పనికి రావు.
అన్న ప్రాశనమునాడే ఆవకాయ డిప్పా!
అన్న మదముతోడ నిఖిలమదంబులు
అన్నము అరగడియలో అరుగుతుంది, ఆదరణ శాశ్వతంగా ఉంటుంది.
అన్న రసంకన్న ఆదరణరసం మేలు.
అన్న వ_స్తే ముష్టికి పోతాను అన్నట్లు.
అన్న వస్త్రాలకు పోతే, ఉన్న వస్త్రం ఊడిపోయింది.
అన్నవారు బాగున్నారు, పడినవారు బాగున్నారు, నడుమఉన్న వారే నలిగిచచ్చారు.
అన్న హితవు లేనివానిని కరువేమి చేయును!
అన్నానికి ఆధారము (ఆదరవు) లేదుగాని, అందటికి పం_క్తిభోజనమట.
అన్నానికి పదనుతప్పినా, భూమికి అదనుతప్పినా పనికి రావు.
అన్ని కా_ర్తెలు తప్పినా హ_స్త తప్పదు.
అన్ని పెళ్లకు ఆషాఢం.
అన్ని రుచులు సరేగాని, అందులో ఉప్పు లేదు.
అన్ని రోగాలకు వాతలు వేసేవైద్యుణ్ణి అవతల ఉంచు.
అన్నీ అమర్చినతరువాత అ_త్తగారు వేలుపెట్టినట్లు.
అన్నీ అయినతరువాత అగ్ని వైద్యం.
అన్నీ ఉన్నవిగాని అంచుకు [1]తొగరు లేదు.
అన్నీఉన్న వి_స్తరి(ర) అణగిమణగి ఉంటుంది, ఏమీ లేని వి_స్తరి ఎగిరెగిరి పడుతుంది.

1 తొగరు = చీరకు ఎరుపుఅంచు; లేదు అని అంటే విధవ అని. విధవలు అంచు లేనికోకలు కట్టుట ఆచారము.

అన్నీ ఉన్నాయిగాని, [1]అయినాతీది లేదు.

అన్నీ ఉన్నాయిగాని, ఐదవతనం (ముత్తయిదుతనం) లేదు.

అన్నీ తెలిసినమ్మ అమావాస్యనాడు చస్తే, ఏమీ తెలియనమ్మ ఏకాదశినాడు చచ్చిందట.

అన్నీ తెలిసినవాడూ లేడు, ఏమీ తెలియనివాడూ లేడు.

అన్నీ పండించినరైతుకు అన్నమే కఱవు.

అన్నీ పాములు తలకాయ వెళ్లబెట్టితే, ఏలిక(x) పాము గూడ వెళ్లబెట్టిందట.

అన్నీ సాగితే రోగమంత భోగంలేదు.

అన్నం పున్నం తినడానికి ఆలితమ్ముడు, అబ్బ తద్దినం పెట్టడానికి మగని తమ్ముడు.

అన్నేసి చూడు, నన్నేసి చూడు.

అన్యాయం చేసినవాడు చేయించుకొనినవానికంటె అధముడు.

అన్యాయపు ఊరిలో ఆలూ మొగుడికే అంపు.

అన్యాయపు సంపాదన అసడ్డాలంగా పోతుంది.

అన్యులిచ్చు దానమది తల్లివంటిది.

అపండితునికంటె అర్ధపండితుడే అపాయకరం.

అపనింద అవతలపోతే, నిందవచ్చి నెత్తినపడ్డది.

అపశబ్దాలు ఏమిటోయ్ అంటే - మచ్చాలు దినేనోట సొచ్చాలు ఎట్లావస్తవిలేండి అన్నాడట.

అపానువాయువు వదలితే-అర్జునః ఫల్గునః కిరీటీ శ్వేతవాహనః-అని అదిరి, పిడుగుమంత్రం చదివినట్లు.

అపుత్రస్య గతిర్నాస్తి.

---

1 అయినాతీది = అవలది. (వగతవ మనుట)

అప్ప ఆర్భాటము, బావ బడాయేగాని, ఆకలివేస్తే అన్నంపెట్టేవారు లేదు.

[1]అప్పచెల్లెలు బ్రతుకగోరితే, తోడికోడలు చావు కోరుతుంది.

అప్పటికి దుప్పటిచ్చాముగాని కలకాలం ఇస్తామా.

అప్పటికోపము అన్యాయమెరుగదు.

అప్పటిమాటలకు దుప్పటి ఇచ్చినానుగాని, కలకాలం కప్పుకోను ఇచ్చినానా?

అప్పడి కాలమునుంచే లేదు ఉప్పువేసిన గంజి.

[2]అప్పను చూడబోతే చెప్పలు పోయినవి.

అప్పన్నగుళ్లోన ఆవులు పడ్డాయి రారోయి తమ్ముడా, తోలు కొద్దాము.

అపశబ్దం భయంనాస్తి అప్పశాచార్యస్య సన్నిధౌ, అనాచార భయం నాస్తి తిమ్మన్మాత్రస్య సన్నిధౌ.

అప్పవంక బావ చుట్టము, ఆళ్లవంక తిరగలి చుట్టము.

[3]అప్ప అత్తవారింటికి వెళ్లితే అప్ప [4]ఊరికలు, నా ఊరికలు నావే అన్నదట.

అప్పసిరి చూచుకొని మాచిమణమలు తొక్కిందట!

అపానవాయువును అణచిపెడితే ఆవులింత అగునా?

అప్పా! పప్పువండవే, చెడేవాడు బావ ఉన్నాడుకదా!

అప్పిగాడుపోతే ఆపంచా నాకే, పాపిగాడుపోతే ఆ పైపంచ నాకే.

అప్పు అదనుకూ రాదు, ఆకటికీ రాదు.

అప్పు ఆరుతెన్నులు, ముప్పు మూడుతెన్నులు.

అప్పు ఆరుమాడల కన్న, రొఖ్ఖం మూడుమాడలు మేలు.

---

1 అప్పచెల్లెలు=సోదరి.

2 అప్ప=సింహాద్రి వరాహ నారసింహస్వామి.

3 అప్ప=అక్క. 4 ఊరికెలు=అంకురములు.

అప్పు ఇచ్చిచూడు, ఆడపిల్లను ఇచ్చిచూడు.
అప్పు ఇచ్చినవాడు బాగుకోరును, తీసుకొన్నవాడు చెడుకోరును.
అప్పుచేసి ఆవును కొనవచ్చునుగాని, గేదెను కొనరాదు.
అప్పుచేసి కొప్పు దీర్చిందట.
అప్పుచేసి చెడును, చెట్టెక్కి చేయివిడిచి చెడును.
అప్పు చేసిఅయినా నిప్పంటి సారా తాగాలి.
అప్పుచేసి పప్పుకూడు.
అప్పుచేసి పప్పు దప్పళం.
అప్పుతీర్చి అంగట్లో కాపురం చేయాలి.
అప్పు తీర్చేవాడికి అపహరించేవాడికి పత్రంసంగతి అవసరం లేదు.
అప్పు తీసుకున్నప్పుడే చెప్పుచేతలలో ఉండాలి.
అప్పు పత్రానికి 'ఆర్ నట్' ఉన్నదిగాని చేబదులు కున్నదా.
అప్పులవాని నమ్ముకొని అంగడికి పోరాదు; మిండని నమ్ముకొని జాతరకు పోరాదు.
అప్పులువాడు చస్తేనేమి? పత్రాలు మునిగితే నేమి?
అప్పులున్నవాడి వెంట, చెప్పులున్నవాడి వెంట పోరాదు.
అప్పులేకపోతే ఉప్పుగంజైనా మేలు.
అప్పులేనిగంజి దొప్పెడే (దోసెడే) చాలు.
అప్పులేనిదే ఒక ఐశ్వర్యం.
అప్పులేని మనిషి, పిప్పిలేని పగడం ఉండునా?
అప్పులేనివాడు అధికబలుడు.
అప్పులేనివాడె అధికసంపన్నుండు.
అప్పులో అప్పు చెప్పాల; అప్పూ, చేటప్పూ ముప్పందుమే కదా.
అప్పుసప్పుచేసి ముచ్చెలు కొంటే, అప్పు తీరకమునుపే [1]బొచ్చెలు బొచ్చెలైనాయి!

1 బొచ్చెలగు = పట్టలుపట్టలుగా చినిగిపోవు.

అబద్ధం అంటే అతుకులమాట.

అబద్ధం చెబితే, నిజం చెప్పేవాడికంట్లో మిరప్పొడి కొట్టినట్లుండాల.

అబద్ధం చెపితే నిజం ముడ్డిలో మేకు కొట్టినట్లుండాల.

అబద్ధం చెప్పితే అన్నం పుట్టదు, నిజం చెప్పితే నీళ్లు పుట్టవు.

అబద్ధం చెప్పుతావేమిరా? వేనీళ్ల బిందెలో ఏడు కొరమీన్లు ఉంటే.

అబద్ధానికి అంతులేదు, అమ్మగారికి చింతలేదు.

అబద్ధమాడితే గోడ పెట్టినట్లుండవలె.

అబద్ధాల అంకయ్యకు అరవైనాలుగు అసత్యప్రమాణాలు.

అబద్ధాలనోటికి అరవీసెడు సున్నం కావాల.

అబద్ధాల పంచాంగానికి అరవైగడియలు త్యాజ్యం. (దినమంతా అనుట.)

అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడుతారు.

అబ్బచస్తే పొత్తుపంచ (పట్టుపంచ) నాది అన్నాడట.

అబ్బడినెత్తి దిబ్బడు కొడితే, దిబ్బడినెత్తి సుబ్బడు కొట్టినాడు (కొట్టుతాడు).

అబ్బ త్రవ్వితే అబ్బాయి పూడ్పించినాడు.

అబ్బపెంచిన బిడ్డయినా కావాల, అమ్మపెంచిన బిడ్డయినా కావాల, ముండ పెంచిన బిడ్డ మండలాధిపతి అవుతాడా?

అబ్బరాన అబ్బాయి పుడితే, ఆముదముతో ముడ్డి కడిగిందట!

అబ్బలేని బిడ్డ, గట్టులేని చేను.

అబ్బలేని బిడ్డ, మబ్బులేని (విడిచిన) ఎండ.

అబ్బాయి పోతురాజు, అమ్మాయి గంగానమ్మ.

అబ్బిగాడు చస్తే ఆ పంచా నాకే.

అబ్బితే సిగ, అబ్బకపోతే కాళ్లు.

అబ్బినవాని ఇల్లాలు గట్టగచూచు, తానియ్యవలసిన ద—చూపు.

అబ్బురాన అబ్బికి మీసాలువస్తే, అవి ఈచేతా ఆచేతా సాగదీసే సరికి ఊడిపోయినవట; పట్టిమూతికి ఒకచేయి చాలునని రెండోదానితో తలగోకుకొన్నాడట. [illegible]

అబ్బురాన బిడ్డ పుట్టింది, గడ్డపార తేరా చెవులు కుడుతాను-అన్నాడట.

అభాగ్యునికి ఆకలెక్కువ, నిర్భాగ్యునికి నిద్ర ఎక్కువ.

అభిమానానికి మంగలికత్తులు మింగినట్లు.

అభిషేకం చేసిన అగ్నిహోత్రంవలె.

అభ్యాసం [1]కూసువిద్య.

అభ్యాసం లేనిరెడ్డి అందలమెక్కితే, అటూఇటూ అయిందట!

అమరము నెమరకవస్తే కావ్యాలెందుకు కాల్చనా?

అమరితే ఆడది, అమరకుంటే గాడిద.

అమరినమ్మ అట్లు పోస్తుంటే, అమరనమ్మ పోలెలు బూరెలు పోస్తుంది.

అమర్చినదానిలో అత్త వ్రేలు పెట్టినట్లు.

అమావాస్యకు అట్లు, పున్నానికి బూరెలు.

అమావాస్య తరువాత పూర్ణిమ రాదా?

అమావాస్యనాడు అట్లు పెట్టలేను, పూర్ణిమనాడు బూరె పెట్టలేను.

అమావాస్యనాడు ఎందుకు కయ్యానికి దిగినావంటే, ఎదిరివాడికి అచ్చి రాకుండను అన్నట్లు.

అమావాస్యనాడు పొద్దుకు వంగలు కాచునా?

అముడు అంటే లెముడు, అత్త అంటే మామ.

అమురువచ్చిన గొఱ్ఱె అగడ్తలో అల్లాడినట్లు.

అమ్మ కడుపుచూస్తుంది, ఆలు వీపుచూస్తుంది (ఇంటికి రాగానే వీపున ఏమైనా మూట్లె ఉన్నదో లేదో అని.)

అమ్మకడుపున పుట్టినవాళ్లందఱూ నిక్షేపరాయుళ్లే!

1 కూసు = అత్యంతసులభమనుట; కూసు అనగా శిశువని కన్నడము; బాల్యంలో అభ్యసించవలసిన దనుట.

అమ్మకడుపులో ఉన్నవాడు, గోరీలో ఉన్నవాడే తురకలలో పెద్ద మనిషి.

అమ్మకళ గుమ్మంలో తేలుతుంది.

అమ్మకు పుట్టిన ఆరుగురూ గుగ్గిళ్ళ దొంగలే!

అమ్మ కూటికి, అయ్య కాటికి.

అమ్మ గృహప్రవేశం, అయ్య అగ్నిప్రవేశం.

అమ్మ చెడ్డచేటుకి ముసుగొకటా?

అమ్మదగ్గఱ కింద పడుకున్నా ఒకటే, అయ్యదగ్గఱ నేల పడుకున్నా ఒకటే!

అమ్మ తా పెట్టాపెట్టదు, అడుక్కొని తినా నివ్వదు.

అమ్మ దాసర్లకు, అయ్య జంగాలకు.

అమ్మను తిడతావేమిరా? లంజకొడుకా–అన్నాడట.

అమ్మన్న అమ్మకు మొగుడు, తిమ్మన్న తల్లికి మొగుడు.

అమ్మ పుట్టిల్లు మేనమామ కెరుక.

అమ్మ పుట్టిల్లు మేనమామదగ్గర పొగడినట్లు.

అమ్మ పెంచినబిడ్డా? అబ్బ పెంచినబిడ్డా?

అమ్మ పెట్టాపెట్టదు, అడుక్కతినా తిననీయదు.

అమ్మ పెట్టేవి నాలుగూ అప్పుడే పెట్టితే ఆపనిచేయనా–అన్నాడట.

అమ్మ పెట్టేవి నాలుగూ పెడితేగాని కుదరదు.

అమ్మ పెట్టేవి నాలుగు పెడితేగాని, ఆరికలచేట బయటపెట్టదు.

అమ్మబోతే అడివి, కొనబోతే కొరవి.

అమ్మ మంచిదేకాని, తెడ్డు మంచిదికాదు.

అమ్మయినా అడుగందే పెట్టదు.

అమ్మ రాకాసి; ఆలు భూకాసి.

అమ్మ (పెండ్లాము) వస్తే అన్నీ అణగతవి.

అమ్మవారి మొక్కుతీరదు, ఆడబిడ్డ అప్పు తీరదు.

అమ్మా అని పిలువనినోరును కుమ్మరి మను ద్రవ్వినట్టి గుంట.

అమ్మా! అమ్మా! నొప్పు లెత్తుకున్నపుడు నన్ను లేపవే అంటే, అలగా పడుకోబిడ్డ! ఊటగా నొప్పులెత్తుకుంటే ఊరెల్ల నీవే లేపుతావు అందట!

అమ్మా! నీ అల్లుడు వచ్చాడంటే, నన్నేమి చేస్తాడమ్మా! నిన్నే తీసి కెల్తాడు అన్నట్లు.

అమ్మా, పెట్టేవి నాలుగు పెందలాడే పెట్టవే. దూడ గడ్డికిపోవాల అన్నాడట.

అమ్మా, బాబు పిచ్చిగాని, నాకు చదువవస్తుందా!

అమ్మాయి పుట్టింది అంటే, ఆయువు సగం కుంగింది అన్నమాటే!

అమ్మాయి రాకపోయినా, ఆవులింతలు రాకపోవునా!

అమ్మాయివస్తే, అన్నీ అనుగుతవి (పెండ్లి అయినచో అని)

అమ్మి చిన్న, కమ్మ పెద్ద.

అమ్ముకొనుటకు నేర్చినమ్మ వంత ఓర్వదు.

అమ్మేదొకటి [1]అసిమిలో దొకటి.

అమృతమైనను చవుల జాత్యన్న సమమె.

అయిందమ్మా పెండ్లి అణిగిందమ్మా రంది.

అయిందిరా పెండ్లి అంటే, అణగిందిరా రంది అన్నాడు.

అయితంపూడి ఉద్యోగం అయితేగియితే, ఆరావుల పాడి చేస్తే గీస్తే, పెరుగు పాలు మావారికి పోస్తావా! మీవారికి పోస్తావా?

అయితే అవతలి ఒడ్డు, కాకుంటే ఇవతలి ఒడ్డు.

అయితే ఆడుబిడ్డ, లేకుంటే మగబిడ్డ.

అయితే ఆతుకూరు, లేకపోతే గదాతుకూరు.

అయితే ఆదివారం, కాకుంటే సోమవారం.

---

1 అసిమి=సంచి.

అయితే ఆముదాలు, కాకపోతే కంది.
అయితే ఆరిక, కాకుంటే కంది.
అయితే అమీరు, కాకుంటే ఫకీరు.
అయినపెండ్లికి మేళామా ?
అయినోణ్ణి అడిగేదానికంటె, కానోణ్ణి కాళ్లు పట్టుకొనేది మేలు.
అయినవారు లోతుకు తీస్తే, కానివారు మిట్టకు తీస్తారు.
అయిదవతనం లేని అందం, అడుక్కు తిననా ?
అయిదునాళ్లు పైచాలే తోలినట్లు.
అయిదు శిఖలున్నా ఇబ్బంది లేదుకాని, మూడుకొప్పులు చేరా యంటే ముత(ద)నష్టమే.
అయిదుసార్లు గొఱ్ఱెలమంద కట్టడం [1] తైనెలలో దున్నడం ఒకటే.
అయిదేళ్ళ ఆడపిల్లఅయినా, మూడేళ్ళ మొగపిల్లవాడికి లోకువే.
అయినకాడికి జమాబంది.
అయినవాడిని ఆశ్రయించేకంటే, కానివాడి కాళ్లుపట్టడం మేలు.
అయినవాడు కాలుదువ్వితే, కానివాడు మీదికి వస్తాడు.
అయినవారందఱు ఆదోవను పోగా, జంగాన్ని పట్టుకొని జాము ఏడ్చినట్లు.
అయినవాళ్ళకు ఆకులలోను, కానివాళ్ళకు కంచాలలోను.
అయినవాళ్లను అవతలకునెట్టి, కానివాళ్ల కాళ్లు పట్టుకొన్నట్లు.
అయినా కాకున్నా హైదరాబాదే గతి.
అయినాతిది లేదుగాని, అహంకార మెక్కువ.
అయిపోయిన పెళ్ళికి మేళం ఎందుకు ?
[2]అయిబ్ దీరె, [3]సయిబ్ దీరె, సాయిబ్ నీకు సలాం.
ఆయుష్యం గట్టిగా ఉంటే, అడవిలో ఉన్నా, అయోధ్యలో ఉన్నా ఒకటే.

---

1 తై నెల=పుష్యమాసము.

2 అయిబ్=రహస్యము. 3 సయిబ్=మంచి, రసము.

ఆయుష్మ్యంగల రోగి హస్తవాసిగల వైద్యునిదగ్గరకు పోతాడు.
అయ్య ఊరోళ్ల పాలు, అమ్మ మాలోళ్ల పాలు.
అయ్య కదురువలె, అమ్మ కుదురువలె,
అయ్యకు ఆరాటమేగాని పోరాటం తక్కువ.
అయ్యకు చెప్పమంటువా? పొయ్యెక్క మంటావా?
అయ్యకు రెండు గుణములు తక్కువ-తనకుగా తోచదు, ఇంకొకరు
చెపితే వినడు.
అయ్యకు రెండోపెండ్లి అని సంతోషమే కాని, అమ్మకు సవతిపోరని
ఎఱుగడు. (చిన్నకొడుకు)
అయ్యకు వణుకుప్రాయం, అమ్మకు కులుకుప్రాయం.
అయ్యకు విద్యాలేదు, అమ్మకు గర్వమూ లేదు.
అయ్యకు కోపం సంవత్సరానికి రెండుసార్లే వస్తుంది; వచ్చింది ఆరేసి
నెలలు ఉంటుంది.
అయ్యగాండ్రకైన ఆశలు పుట్టవా.
అయ్యగారి చేను ఎండితే, కమతగాడి [1]మల్ల ఎండునా?
అయ్య తిరుపతి, అమ్మ పరపతి.
అయ్య దాసర్లకు పెట్టితే, అమ్మ జంగాలకు పెట్టిందట.
అయ్య దేశసంచారం, అమ్మ గ్రామసంచారం.
అయ్యనా డెఱుగనే ఉయ్యెల, అమ్మనా డెఱుగునే ఉయ్యెల.
అయ్యనీటు అడుగతీరదు, అమ్మఏమో దమ్మాయపాళెంలో దంచు
కొని త్రాగుతున్నది.
అయ్యలకూ [2]మియ్యలకూ అప్పు పెట్టరాదు.
అయ్యలో ప్రాణం కొయ్యలోకి వచ్చినట్లు.
అయ్య వాత పెట్టనూ, బత్తె బ్రతకనూనా?
అయ్యవా రంతంత, అయ్యవారి పెండ్లాము ముంతంత.

---

1 మల్ల = మట్టి (కంచము): మూకుడు.
2 మియ్య-మియా = మహమ్మదీయుడు.

అయ్యవా రటికంత, అయ్యవారి పెండ్లాం పుటికంత.

అయ్యవార్లంగారి గుఱ్ఱం ఎనుబోతవే! (ఎనుబోతే అవే)

అయ్యవారిగుఱ్ఱాని కన్నీ అవలక్షణాలే!

అయ్యవారి జందెం అయ్యవారికే ముప్పు.

అయ్యవారిని చేయబోతే కోతి అయినట్లు.

అయ్యవారు తప్పులుచేసి దిద్దుకుంటూ ఉంటే, అమ్మగారికి పారబోయనూ ఎత్తనూ, ఎత్తనూ పారబోయనూ.

అయ్యవారు రాకపోతే అమావాస్య అట్టే ఉంటుందా?

అయ్యవార్లగారి నట్టిల్లు (తలవాకిలి) వలె. (గొడ్డు గోదా లేకుండ శుభ్రంగా ఉన్నదనుట)

అయ్య సంపాద్యానికి అరవై ఆరు జోలులా?

అయ్య సవాసేరు, లింగ మరవీశెడు. (లింగం అడే శేరు.)

అయ్య సామెల్ల ఇంట్లోనే!

అయ్యతో గూడ సద్దన్నంతిని, అక్కతో గూడ వేడన్నంతిని, అమ్మతో గూడ మారన్నం తింటాడు.

అయ్యారా! బోసేతు, వస్తాబో సింగమా.

అయ్యేదాక అరిసెల పాకం, అయినతరువాత బూరెల పాకం.

అయ్యేది లేదు, పొయ్యేది లేదు, వీరభద్రప్పా నా ఎనిమిది అణాలు నాకిచ్చి, నీ అర్ధరూపాయి నీవు తీసుకో.

అయ్యేపనికి అరకత్తు, కానిపనికి కుమ్మక్కు.

అయ్యేపూజ అవుతూఉండనీ, ఊదే శంఖం ఊదేస్తాం.

అయ్యేవఱకు ఉండి, ఆరేవఱకు ఉండనట్లు. (వంటకము)

అయ్యో! అంటే ఆరునెలల పాపం వస్తుంది.

అయ్యోపాపం! పోతున్నావా? అని పచ్చాకు పండుటాకుతో అన్నట్లు.

అయ్యోవదినా! అంతకుముందు వచ్చిన అన్నబంతిన తిందువు; ఇంతకుముందు వచ్చి వరాలి బంతిన తిందువు; ఇప్పుడేలాగు? ఎలుక పొయ్యి ఎత్తుకపోయిందే!

అరక అరిగితే గరిసె విరుగుతుంది (నాగలి అరుగా దున్ని తే ఎక్కువ పంట అని.)

అర(రి)కాలిలో కన్ను విచ్చినట్లు. (భృగుమహాముని కి)

అర కాసుపనికి ముప్పాతిక బాడుగ.

అరగడియ భోగం, ఆరునెలల రోగం.

అరగదీసిన గంధపుచెక్కకు వాసన తగ్గునా?

అరగని కూడు, జరగని మాట.

అర(రి)చే కుక్క కఱవదు. (మొరిగే కుక్క)

అరచేత వెన్న పెట్టుకొని, నేతికి ఏడ్చినట్లు.

అరచేతికి పండ్లువచ్చిననాడు మమ్ము కరతువులే.

అరచేతిలో ఉప్పుపెడితే, ఆరునెలలు తలుచుకోవలెను.

అరచేతిలో ఉసిరికాయవలె. (కరతలామలకం)

అరచేతి పుంటికి అద్దము వలయునా.

అరచేతిలో బెల్లం అని వ్రాసి నాకితే తీపగునా?

అరచేతిలో బెల్లంపెట్టి, మోచేతివఱకు నాకించినట్లు.

అరచేతిలో వైకుంఠం చూపినట్లు.

అరచేయిచూపి, అవలక్షణ మనిపించుకొన్నట్లు.

అరచేవి మేకఅరుపులు, దూసేవి కోరిందపొదలు.

అరటాకుమీద ముల్లుపడ్డా, ముల్లుమీద అరటాకు పడ్డా, అరటాకుకే ముప్పు.

అరటి కట్టు (కర - మరక) జ్ఞాతిగుట్టు వదలవు.

అరటికాయ ఆరునెలల రోగం.

అరటిచెట్టు రెండుసార్లు గొలవేయునా? (కదళీవంధ్య)

అరటికి ఆరు[1]గొప్పులు, నూరు తడుపులు.

అరటిపండు ఒలవను ఇనుపగోళ్లు కావాలనా?

---

1 గొప్పులు = త్రవ్వటలు.

అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు. (పండు ఒలిచి చేతిలో బెట్టినట్లు.)

అరటిపండ్లు తినేబికారీ! తోళ్లెక్కడ పెట్టిపో.

[1]అరణంకంటే మరణమే మగవానికి శరణం.

అరిటి దుఃఖం ఆరునెలలు, కడుపుదుఃఖం కలకాలం.

అరనిమిషం తీరికాలేదు, అరకాసు సంపాదనా లేదు.

అరనిమిషం భోగానికి ఆరునెలల రోగం.

అరపులగొడ్డు పితుకునా?

అరమనిషి సత్తువ, ఆర్గురి ఆక్రోశము. (క్రోపం)

అరయగ చెరసాలగును సంసారము.

అరయ తిండ్లు (తిండి) వేరు ఆకటి ఒకటే.

అరవం అధ్వాన్నం, తెనుగు తేట, కన్నడం కస్తూరి.

అరవ అత్తగారు, ప్రథమశాఖ మామగారు.

అరవ చెరచు, పాము కరచు.

[2]అరవ చెవులకేల అరిదివజ్రపుకమ్మలు

[3]అరవచాకిరి మంగలి అందరికీ దొరకదు.

అరవలపొట్ట తమలపాకులకట్ట ఎప్పుడూ తడుపుతూనే ఉండాలి.

అరవలేని దేశం కాకిలేని ఊరు లేవు.

అరవై ఆరు కూరగాయలు, అంచుకు మిరియపుపొడి.

అరవై ఆరు పిండివంటలూ ఆవుచంటిలోనే ఉన్నాయి.

అరవై ఊళ్లకు అములుదారుగూడ ఆలికి దాసుడు.

---

1 అరణం=ఇల్లరికము.

2 అరవ ఆడువారు బరువైన బంగారుకమ్మలు బెట్టి కమ్మబెజ్జము సాగిసాగి భుజాలపైన వ్రేలాడుచుండునట్లు చేసేవారు. ఎంతజారిన అంత యోగ్యత-నాణ్యము.

3 అరవచాకిరి=ద్రావిడ వైష్ణవబ్రాహ్మణులు సర్వాంగక్షౌరము-అధో రోమములతోసహా మంగలిచేతనే చేయించుకొందురు. ఇది అరవమంగలులకే అలవాటు.

అరవై ఏండ్లకు అగ్గిగండం అన్నట్లు.
అరవై ఏండ్లకు అడ్డగోడ పట్టుకొని నడిస్తే, అమ్మా అబ్బకు ఆశ్చర్యమైందట.
అరవై ఏండ్లు నిండిన వాడిని ఆలోచన అడక్కు, ఇరవై ఏండ్లు నిండని వానికి పెత్తన మీయకు.
అరవై ఏండ్లైతే అర్లమర్లు,
అరవై ఏళ్ళ అన్నంభట్టు అద్దంచూచి బిద్దంబిద్దం అంటే, అదీ వాళ్ళమ్మకు ఆశ్చర్యం వేసింది.
అరవై ఏళ్ళయినవి చదువుకోక మట్టి కొట్టుకుంటానా?
అరవై ఏళ్లు వచ్చినతరువాత అన్నంభట్లు అటక ఎక్కాడట!
అరవైవరహాలు ఇచ్చినా అత్తవంటిబాసన దొరకదు.
అరసుకి అంకెలేదు, దేవునికి కాటకము లేదు.
[1]అరసుణ్ణి నమ్ముకొని, పురుషుణ్ణి పోగొట్టుకున్నట్టు.
అరికాలి ముల్లు, సరిలేని గొల్లు.
అరిగినకంచు, మురిగిన చారు.
అరిష్టానికి అంగారకుడు, పాపాలకు భైరవుడు.
అరిసె ఆరు నెలలరోగం బయలేస్తుంది.
[2]అరుంధతీ గిరుంధతీ కనపడుటలేదు కాని, ఇరువంచల అప్పుమాత్రం కనపడుతున్నది.
అరువు సతంగాదు, పందిలి ఇల్లుగాదు.
అరువుసొమ్ములు బరువులచేటు, తీయాబెట్ట తీపులచేటు, అందులో ఒకటిపోతే అప్పులచేటు.
అరువు అంటే, ఆరుఏనుగులు కట్టివేయమన్నట్లు
అరువులసొమ్ములు అరువులవాళ్లెత్తకపోతే పెండ్లికొడుకుముఖాన పేడనీళ్లు చల్లినట్లయిందట.

1 అరసు = రాజు.

2 అరుంధతి అంటే నాయిక కొన. ధ్రువమంటే భ్రూముడి. (కాశీఖండం)

¹అర్తికాకలవాడు అరక్షణం ఓపలేడు.

అరే, పెంటతినే కోమటి! అంటే, ఏమోయి బెల్లంతినే సాయబూ అన్నాడట! అట్లా అంటివేమిటి కోమటీ? అంటే-ఎవరి అలవాటు వారికి అన్నాడట!

అర్థంకానిమాట అల్లిబిల్లిమాట. (పాట)

అర్థం ప్రాణం ఆచార్యాధీనం, తాళం దేహం నా అధీనం.

అర్థబలముకంటె అంగబల మెక్కువ.

అర్థరాత్రివేళ అంకమ్మ సివాలు.

అర్థరాత్రివేళ మద్దెల దరువులు.

అర్థరూపాయిపెండ్లి, అందులో బిరుసు బాణాలు!

అర్థశేరుబియ్యం తింటావురా? అంటే, మూడు మెతుకులు విడిచి పెడతా నన్నాడట.

అర్థాంగి అలుక, బోనులో ఎలుక.

అర్జీలకు పనులుకావు, ఆశీర్వచనాలకు బిడ్డలు పుట్టరు.

అర్వాలు తీయమంటె, పూర్వాలు దీస్తవి.

²అఱ్ఱుకడిగి వదలివేసిన ఎద్దు (వంటివాడు)

అఱ్ఱున్నమనిషీ, బొఱ్ఱున్న (తొఱ్ఱున్న) చెట్టూ ఒకటే.

అఱ్ఱోబుఱ్ఱో ఆయన అర్కగడ్ల (అర్లగడ్డ) మొదుర్తడు.

అలంకారంకంటె అయిదవతనం మేలు.

అలకాపురం కొల్లగొట్టినా అదృష్టహీనుడికేమీ దక్కదు.

³అలబడివాని ఆవైతేమాత్రం అందరికీ చులకనౌతుందా.

---

1 అఱ్ఱు త్వరగా కాక ఎక్కడం కొన్నిఎద్దులకు స్వభావం, అట్లనే యీయన ఏపనిలోనైనా క్షణం నిలవలేడు-అనుట.

2 బాగా సేద్యంచేసి ముసలిదైన ఎద్దు అఱ్ఱును పాలతోకడిగి పనిలేకుండా వదలి శ్రద్ధతో మేపుట సంపాదిధర్మము. అవగా, పనిలేక విశ్రాంతి తీసుకొను పెద్దకారు మనిషి అని. 3. అలబడి=క్రిందికులముల పేదజనము.

అలలు నిలిచేదెప్పుడు? స్నానం చేసేదెప్పుడు?

అలవాటులేని అగ్నిహోత్రాలుచేస్తే మూతిమీసాలు తెగ కాలిన వట!

అలవాటులేని ఔపాసనంచేస్తే, మూతిమీసాలు తెగ కాలినవి.

అలవాటుపడిన పసరం పాతగాటిచుట్టు తిరిగినట్లు.

అలవాటుపడిన ముండ అట్లే తిరిగితే ఆపేదెవరు?

అలవాటులేని రెడ్డి అందలమెక్కితే అటు ఇటు అయిందట.

అలవాటులేని (ఎన్నడెక్కని) రెడ్డి గుఱ్ఱమెక్కితే అటో ఇటో (వెనుక ముందు) అయినది.

[1]అలవాలకు దో వెక్కడ? అంటే, ఉలవలకు దున్నుతున్నాను అన్నాడట!

అలవికాని ఆలిని కట్టుకొని మురిగిచచ్చెరా ముండాకొడుకు.

అలవిమీరితే అమృతమైనా విషమే.

అలసిసొలసి అక్కపక్కలోకివస్తే, అక్క ఎత్తుకపోయి బావపక్కన వేసిందట.

అలికిన ఇంట ఒలికినా అందమే.

అలిగేబిడ్డతో [2]చలిగేగొడ్డుతో వేగేది కష్టం.

అలికి పూసినతావున గువ్వ గుడ్డుపెట్టిందట.

అలిగి అత్తవారింటికి, చెడి చెల్లెలింటికి పోరాదు.

అలిగి అల్లుడు చెడ్డాడట, కుడువక కూతురు చెడ్డదట.

అలిగి తన్నిన పరుపుపై బడినట్లు.

అలిగిన ఆలు తడిసిన మంచము (నులకమంచము) బిగుసుకొంటవి.

అలిగి నలుగురిలో కూర్చుంటే అలుకతీర్చే అయ్యె ఎవరు?

అలుకపాన్పుమీద అల్లుడలిగితే, అత్త కంగారుపడ్డట్లు.

అలువుడిని బలువుడు కొడితే, బలువుడిని బ్రహ్మదేవుడు కొడుతాడు.

---

1 చెలగు=ఊరకే తలాడించి కొమ్ముతో కొట్టుట.

2 అలవాలు=గ్రామనామము. హైదరాబాదులో ఉత్తరాన ఒకపేట.

అలుసైనవాని ఇల్లాలు నాక్రమింపగజూచు, తనకు ఈడైన పాదముల బట్టు.
అల్పజాతిమెప్పు అధికము నెరుగునా.
అల్పవిద్వాంసుడు ఆక్షేపణకు పెద్ద.
అల్పజాతికుక్క యధికుల నెరుగునా.
అల్పనరులకెల్ల నతివలపై చింత,
అల్పుడికి ఐశ్వర్యం వస్తే, అర్ధరాత్రి గొడుగు పట్టమన్నాడట.
అల్పుడెపుడుబల్కు ఆడంబరముగాను.
అల్పుని చేర్చిన అధికప్రసంగము, కుక్కను ముద్దుజేసిన మూతి నాకుడు.
అల్లమంటే తెలియదా బెల్లంమాదిర పుల్లగా ఉంటుంది అన్నాడట.
అల్లరిలేని కాపురం చిల్లిగవ్వకుకూడా గాదు.
అల్లి అడిగింది, ఇల్లి ఇచ్చింది, మల్లి మాయంచేసింది.
[1]అల్లికాయల సందటిని పెళ్ళి మరచిపోయినట్లు.
అల్లుడని పేరుపెట్టి పుల్ల విఱిచివేస్తే, ఎగిరి పడిందట!
అల్లుడా! ఎప్పుడు వచ్చావంటే, రాత్రి వండిన గారెల సంగతి చెప్పనా? అన్నాడట.
అల్లుడి కత్తికి రెండువైపులా పదునైతే, అతని అప్పకు (అక్కకు) ఆరువైపులా పదును.
అల్లుడికి చేసినపప్పు, అతిథికిగూడ పనికివచ్చినట్లు.
అల్లుడికి నెయ్యిలేదు, అల్లుని వెంటవచ్చినవానికి నూనెలేదు.
అల్లుడికి పెట్టినట్లు కొడుకుకు పెట్టితే ఇల్లు గుల్ల అయింది.
అల్లుడికి పెట్టినపెట్టు కొడుక్కుపెట్టి కోలుపోయిందట!
అల్లుడికి వండిన అన్నం కొడుకుకుబెట్టి కొట్టుకొన్నదట.
అల్లుడినిచూసి 'యీయన నా కూతురుమొగుడు' తోడి పెండ్లికొడుకునుజూసి 'యీయన నా మొగుడు, ఆరునెలలనుంచి ఉన్నాడు' అన్నాడట.

1 అల్లికాయలు=మడుగులలో ఎదిగే అల్లి(=చిన్నతామర) కాయలను ఉడకవేసి తిందురు.

అల్లుడితోగూడ గిల్లు డన్నట్లు.
అల్లుడితో భోజనము, కొడుకుతో చదువు.
అల్లుడి పాయసం అతిథికి ఉపయోగపడినట్లు.
అల్లుడు అంటే, వంకరతాడే (తాటిచెట్టు) లేచి నిలుచుంటుంది.
అల్లుడు అలిగితే కూతురుని తీసుకపోతాడు-అంతేగా?
అల్లుడు చుట్టముగాదు, ఆముదపుచెట్టు నీడ నీడకాదు.
అల్లుడు నా కూతురుమొగుడైతే, అల్లుడితోగూడ వచ్చిన గిల్లుడు నా మొగుడన్నాడట.
అల్లుడు వచ్చిందీ అపుడే, [1]ఆశగాడు వచ్చిందీ అపుడే.
అల్లుడే అర్ధబియ్యం!
అల్లునికి అత్తాశ, గొడ్డుకు దూడాశ.
అల్లునికి ఆరేళ్లు, ఆరేడ్లబిడ్డకు పన్నెండేండ్లు అన్నట్లుంటుంది.
అల్లునికి బెట్టు, ఇల్లాలికి గుట్టు.
అల్లునికే నూనె లేకపోతే, తోడిపెండ్లికొడుకుకు నేయి అట.
అల్లునిగుడ్డి, తెల్లారినాక తెలుస్తుంది.
అల్లుని మంచితనము, పొల్లున దంచిన బియ్యము లేవు.
అల్లూరమ్మ జాతరకు తల్లీమాడ, పిల్లామాడ (గొడ్డు).
అవతలవీధిలో అల్లరి ఏమిటి? అంటే, అవరల (అరవల) ఏకాంతం అన్నట్టు.
అవలక్షణవంతుడికి అక్షతలిస్తే, అవతలికెళ్ళి నోట్లో వేసుకొన్నాడట.
అవవలసింది అయింది ఆదెమ్మా! అంటే, కోకసద్దుకోవే గుబ్బాలమ్మా అన్నదట!
అవసరగాడికి ఆకులో పెడితే, నాకు [2]బోకిలో (నేలమీద) పెట్టుమన్నట్టు.
అవివేకి చెలిమికంటె వివేకి విరోధం మేలు.
అవ్వ అరకాసు, తలగొరగను మూడుకాసులు.

1 ఆశగాడు=హాస్యగాడు. 2 బోకి=మట్టిమూకుడు.

అవ్వకు మనుమడు ఆవులింత నేర్పినట్లు.
[1]అవ్వ కోడి, కుంపటి లేకుంటే తెల్లవారదా ఊరికి నిప్పుదొరకదా ?
అవ్వదీసిన గంధం తాతబుడ్డకు సరిపోయినట్లు.
అవ్వను పట్టుకొని వసంతా లాడినట్లు.
అవ్వ వడికిననూలు తాత మొలత్రాటికి సరి.
అవ్వా కావాలి, బువ్వా కావాలి.
అశ్రద్ధ [2]పితాళ్లకు ఆకతాయి తోరణాలు.
అశ్రద్ధ పితాళ్లకు ఏతాం తర్పణం.
అశ్వత్థ ప్రదక్షిణంచేసి, కడుపు పట్టి చూచుకొన్నట్లు.
అశ్వమేధయాగం చేయవచ్చుగాని, ఆడపిల్ల పెళ్ళి చేయలేము.
అశ్విని కురిస్తే అంతానష్టం.
అశ్విని కురిస్తే ఆరుకార్తెలు విడుపు.
అశుద్ధముమీద (పెంటమీద)రాయివేస్తే, ముఖమంతా చిందుతుంది.
అశోకునిరాజ్యంలో పశువైతేమాత్ర మేమి ?
అష్టభాగ్యమున్నా అత్తగారిల్లే! పురిటికూర [1](పొరుటుకూర) తిన్నా పుట్టినిల్లే.
అష్టభాగ్యాలు అక్కకుడిస్తే, అంబటిరకాలు బావకు.
అప్పైనా గోదానమే ! ఇప్పైనా గోదానమే !

1 ఒకఊళ్ళో ఒక ముసలమ్మకు ఒక కోడిపుంజు ఉండేది. అదే ప్రతి వేగువ కూసి మేల్కొలిపేది. ఆతర్వాత ఊరి ఆడంగులంతావచ్చి, రాత్రంతా చలి కాచుకొనుచుండిన ఆమె కుంపటినుండి నిప్పు తీసికొనిపోయి. ఇంటింట పోయి రాజేసుకొనేవారు. ఒకనాడు ఊరిమీద అలిగి ఆమె తనకోడిని చంకబెట్టుకొని కుంపటిని ఎత్తుకొని అడవికి పోయినది. దీనితో ఆ వూరిలో తెల్లవారదని, నిప్పు దొరకదనుకొన్నామె భంగపోయి తిరిగి ఊరు చేరినదట. నీ మొగానవే తెల్లవారుతుందా అనే చాటవ ఇట్టిదే।

2 పితాళ్లు=పితరులు.

అసత్యం సంపాదించుకొన్న పలుకుబడి సత్యం బయట బడునంతవరకే నిలిచియుండును.
అసత్యమాడుట పిరికిపందల గుణం.
అసలిది లేకపోతే, అహంకార మెక్కువ.
అసలుకంటె వడ్డీ ముద్దు.
అసలుకు గతిలేకుంటే కొసరడిగినట్లు.
అసలు దేవుడు మూలబడితే, హనుమంతరాయణికి తెప్పతిరునాళ్లట.
అసలు పసలేక దొంగని అరచినట్లు.
అసలు పిసలాయె, గొంగడి లాభమాయె.
అసలుమినహా కన్యాదానం.
అసలు మూడుపాళ్లు, వడ్డీ ఆరుపాళ్లు.
అసలు లేనిదానికన్న పెసరపుడక నయం.
అసలేలేదు శ్రీరామా! అంటే, మొలతాడులేని గోచి (పాత) [అన్నట్లు.
అసలే అయోమయం, అందుకుతోడు అంధకారం.
అసలే కోతి, దానికితోడు కల్లుతాగింది; పైన తేలు కుట్టింది.
అసలే సోమిదేవమ్మ, అందులో వేవిళ్లు.
అసహనం ఒకవిధమైన హింస
అసాధ్యమనేమాట సత్వహీనులది.
[2]అసిమిలో దొకటి, అమ్మోరొకటి.
అసురులకు మద్యపానం, సురలకు మద్యమావతి (రాగం)
అసూయకు కావలసింది బలంకాదు దౌర్బల్యం.
అసూయ పొరుగింటిగుత్తాన్ని గాడిద అనిపిస్తుంది.
అసూయ ముందు, ఆదుది వెనుక.
అస్తమానం అరిచేపిల్లి ఎలుకల పట్టలేదు.
అస్సిలేదు, గిస్సిలేదు, చచ్చినట్లు తొంగోసి!

1 పొరుటుకూర = పిండిని తడిపి పొరిటినది.
2 అసిమి = ఎద్దుమీదవేసే సంచి (గంత).

# ఆ

'ఆ' అంటే అపరాధము, 'ఊ' అంటే ఉపరాధము; నారాయణా అంటే బూతుమాట!

'ఆ' అంటే ఆరునెలలు.

'ఆ' అంటే అలసిపోతుంది, 'ఊ' అంటే ఊపిరి పోతుంది.

ఆ అగస్త్యభ్రాత ఎవడంటే, హనుమాయమ్మ మొగుడన్నాడట.

ఆ ఇంటికి తలుపులేదు, ఈ ఇంటికి దారబంధము లేదు.

ఆ ఇంటికి దడిలేదు, ఈ ఇంటికి గడి(య) లేదు.

ఆ ఇంట్లో తారాడే బాలవితంతువు మీ భార్యా? మీ అన్న భార్యా? అని అడిగినాడట.

ఆ ఉరుముకు ఈ చినుకులేనా?

ఆ ఊరికి ఈ ఊరు ఎంతదూరమో, ఈ ఊరికా ఊరు అంతేదూరం.

ఆ ఊరిదొర ఈ ఊరికి తలారి.

ఆకటికి గుక్కిళ్ళే ఆశ.

ఆకటికోలదే ఆహారం

ఆకటివానికి అన్నమే బ్రహ్మం.

ఆకలని రెండుచేతులతో తింటారా?

ఆకలి అయినవాడు ధర చెడగొడతాడు.

ఆకలి అరకవ లేనివాడికి ఆత్రమే లేదు.

ఆకలి ఆకాశమంత, నోరు సూది బెజ్జమంత!

ఆకలి ఎత్తుతున్నది అత్తగారూ! అంటే, రోకలి మింగవే కోడలా అన్నదట!

ఆకలికాకుండ నీకు మందుచెబుతా, ముందు నాకు కాస్త గంజి నీళ్లు పోయిమన్నట్లు.

ఆకలి కత్తులునూరితే ఆలితో అలుక తీరుతుంది.

ఆకలిగొన్న కరణము పాతకవిలె బయటికి తీశాడట.

ఆకలిగొన్నమ్మ ఎంగిలికి రోయదు.

ఆకలిగొన్నవానికి అనుష్టుప్పు శ్లోకాలతో కడుపునిండుతుందా?

ఆకలి రుచి ఎఱుగదు, నిద్ర సుఖమెఱుగదు.

ఆకలి రుచి ఎఱుగదు, వలపు సిగ్గెఱుగదు.

ఆకారం ఉంటే శ్రీకారం ఉండదు.

ఆకారంచూచి, ఆశపడ్డానేగాని; అయ్యారు అందులో పస లేదు.

ఆకారపుష్టి, నైవేద్య నష్టి.

ఆకాశంపొడవు ఆకాశమే ఎగురు.

ఆకాశంలో ఎగిరేపక్షి క్రిందనీటికి భయపడినట్లు.

ఆకాశంలో [1]గొజ్జితొక్కుడుపడితే, అతిసమీపంలో వర్షం.

ఆకాశంలో ఆగడపవేసిందే అత్తా అంటే, నాచేతిలో అబకఉన్నదితే కోడలా అన్నదట.

ఆకాశరామన్న చదివేది ఆకాశ పంచాంగం.

ఆకాశానికి నిచ్చెన వేసినట్లు.

ఆకాశానికి వెంద్రుక ముడివేసినట్లు.

ఆకాస్తా ఉంటే ఆలినే కట్టుకోనా!

ఆకు ఇస్తే, అన్నం పెట్టినంత పుణ్యం.

ఆకుకు అందక, పోకకు పొందక (చెప్పినట్లు).

ఆకు చుట్టను, ఆడదాన్ని నమ్మరాదు.

ఆకు నలిపినప్పుడే సువాసన బయటపడేది.

ఆకు నీదే, పొగాకు నీదే పకేలా! ఇంగలం కట్టుకో! (పట్టుకో)

---

1 గొజ్జితొక్కుడు = చిన్న, చిన్న మబ్బుతునకల పేరు. (ఆగడప)

ఆకుపోయి నూతబడితే, వెతుకబోయి ఏడుగురు పడ్డారట.
ఆకుల ఎత్తువుకు ఆకాశమంత రాసి.
[1]ఆకులకు బోయినవాడు, అవిసెలలో ఇరుక్కున్నాడు-అన్నట్లు.
ఆకులు చేబూని పోకలునమలుచు సున్నమడుగువాడు శుద్ధవిధవ.
ఆకులు ఎత్తరా అంటే, విస్తళ్లు లెక్కబెట్టినట్లు.
ఆకులో అంతాబెట్టి అంచున పెంట బెట్టినట్లు.
ఆకువేసి, నేలమీద వడ్డించినట్లు.
ఆకు సత్తువఉంటే, [2] అడుగు పండుతుంది.
ఆకొన్న కూడె అమృతము, తాకొంకక ఇచ్చువాడె ధాత.
ఆకొన్న సింహానికి ఏనుగు దొరికినట్లు.
ఆగం అడివప్పా అంటే, మడిగ తెరువప్పా అన్నదంట.
[3]ఆగడపలు వేసినవి అత్తా అంటే, అట్లకు బియ్యం నానబొయ్యి కోడలా! అన్నదట!
ఆగడపలు వేసినవి అత్తా అంటే, చేరెడు వెనక్కు కోడలా అన్నదట!
ఆగడపలు వేస్తే, అవస్యం కురుస్తుంది.
ఆగడప వేసిందే అత్తా అంటే, [4]అబక నాచేత ఉన్నదిలే అన్నదట.
ఆగబో(భో)గాలు అంకమ్మవి, పాలికేకలు పోలేరమ్మవి.

1 తమలపాకులతీగెను సాలుగాపోసిన అవిసెచెట్ల మొదలుకు (బోదెకు) చుట్టి ప్రాకించి, ఎదిగేకొంది ఆ చుట్టను క్రిందికి దించుచుందురు.

2 అడుగు=ఒక పైరుకోసి, వెంటనే దున్నిన చేలో పెట్టినపైరు.

3 ఆగడప=ఇసుకతిన్నెపై ఏర్పడిన అలలవంటి మబ్బుతునకలు. (గొర్తె త్రొక్కుడు) ఇది వర్షసూచన.

4 అబక=టెంకాయచిప్పతో చేసిన గరిటె.

[1]ఆగబోగాలు-అంకమ్మ శివాలు.

ఆగబోగాలు అక్క కుడిస్తే, అంబటిపరకలు (మెతుకులు) బావ కుడిచినాడు.

ఆగబోగాలు అక్కవి-అంబట్లో గింజలు బావవి.

[2]ఆగ మన్నాయ, శీలం శిష్టాయ, గోగా కటిక తేరా గోక్క తాగు దాము.

[3]ఆగానికి భోగమే సాక్షి.

ఆ గుటకాపోయే అనంతప్పా!

ఆగుదోట (తమలపాకుల) సేద్యం అన్ని అవసరాలు తీరుస్తుంది.

ఆగొడ్డు మంచిదయితే, ఆ ఊళ్లోనే అమ్ముడు పోతుంది.

ఆగ్రహాన ఆన పెట్టుకొన్నట్లు.

ఆచారం అదరిపడ్డది, ధూపాత్రి త్రుళ్లిపడ్డది, కొత్తకుండా తేరా నె(మె)త్తాళ్లు వండుకుందాం.

ఆచారం ఆచారం అన్నంభొట్లూ అంటే, పెద్దచెరువు కుక్క ముట్టు కొన్నది అన్నాడట.

ఆచారం ఆరుబారలు, గోచిపాత మూడుబారలు.

ఆచారం చెప్పిన పెద్దమనిషి ఆకూటికే!

ఆచారం ముందు, అనాచారం వెనుక!

ఆచారపు అచ్చమ్మలు. చేదస్తపు చెల్లమ్మలు.

ఆచారానికి అంతంలేదు, అనాచారానికి ఆదిలేదు.

ఆచారిగుట్టం బహుదొడ్డగుట్టం, నామాలసంచి మోయలేక చచ్చె!

---

1 ఆగ=అవినీతిపనులు. (కన్నడము)

2 ఆగ=సొగసు. మన్నాయ=మంటిపాలాయె.

3 ఆగము=అల్లరి.

ఆచారిగుజ్జం అతి పొగరుగుజ్జం, గడ్డింత లేక ముడ్డంత ఎండె, ఆచార్యులవారిని మరి మోసి మోసి, వేంచేసెనయ్యా వైకుంఠ పురికి!

ఆచార్యుడికి ద్రోహం చేసినా, ఆత్మకు ద్రోహం చేసికోరాదు.

ఆచార్యుని తలచి నిప్పులో చెయ్యిపెట్టితే కాలదా?

ఆచార్యుల కొడుకువై యుండి, పౌరాణికుని అల్లుడవై యుండి, ఘృతమంటే బట్టపేడ అని తెలియదా?

ఆటా తీరె, పాటా తీరె, కోటలో రామరాజ్యం!

ఆటాపాట మాయింట, మాపటిభోజనం మీయింట.

ఆటుపోటులు మనిషిమాటకు అణగిఉంటవా?

ఆడంగులలో పెదబావగారు.

ఆడ ఇంత, ఈడ ఇంత ఉంటే, నాకు మించినవాళ్లు లేరు.

ఆడ కాడక సమర్తాడితే, చాకలోడు కోక ఎత్తుకొని పోయినాడట!

ఆడకోడి కూతవేస్తే అడుగంటడమే ఇల్లు. (ఒక్కొక్క పెట్ట పుంజు కూతవేయును; ఇది అరిష్టమని కోసికొందురు. ఇల్లే తొలుగుడ్డు (మెత్తగావుండి బయటపడినతర్వాత బొసికగట్టిపడును) పెట్టిన పెట్టనుగూడ ఉండనీయరు.)

ఆడ చెత్త, మగ బంగారం.

ఆడదానికి అలుసిస్తే తలకెక్కుతుంది.

ఆడదానికి మగవాడు, అప్పులవాడికి షాహుకారు మొగుళ్లు.

ఆడదాని చేతిఅర్థం, మగవాడిచేతి బిడ్డ మనవు.

ఆడదానినోటిలో నువ్వుగింజ నానదు.

ఆడదానికి ఆయనకు ఆమడదూరం.

ఆడదానికి పురిటిపురిటికీ గండం; మగవాడికి దినదినము గండం.

ఆడదానిబుద్ధి అపరబుద్ధి.

ఆడదాని బ్రతుకు అరటాకు బ్రతుకు వంటిది.

ఆడదాని బ్రతుకు అనద (అనాథ) బ్రతుకు.

ఆడదానిమాట ఆపదలకు మూలం.

ఆడదానిమాట నీళ్ల మూట.

ఆడదాన్ని చూచినా, అర్థాన్ని చూచినా, బ్రహ్మకైనా పట్టు రిమ్మ తెగులు.

ఆడదాన్ని నోరుపెట్టుకొని బ్రతుకమన్నారు.

ఆడది చూచిన చేపలగుంటకు, మగవాడు చూచిన కందుల కళ్ళానికి పోరాదు. (దృష్టిదోషము తగులునని)

ఆడది తిరిగిచెడును, మగవాడు తిరగక చెడును.

ఆడది తిరిగిచెడితే, గుఱ్ఱం తిరుగక చెడుతుంది.

ఆడది బొంకితే గోడబెట్టినట్లు, మగవాడు బొంకితే తడిక బెట్టినట్లు.

ఆడది మెచ్చిందే అందం, మగవాడికన్ను మసక.

ఆడటిలేనిది అడివి. మగవాడులేనిది మఠము.

ఆడదే అమృతం. ఆడదే హాలాహాలం.

ఆడదై పుట్టేకంటే, అడవిలో మ్రానై పుట్టేది మేలు.

[1]ఆడపడుచు ఉసూరుమంటే, ఆరు తరాలు అరిష్టం.

ఆడపడుచు కొరతా, అడ్డగోడకొరతా తీరదు.

ఆడితప్పితే కడకపక్షి.

ఆడపిల్ల (ఆడుబిడ్డ) ఆశ, మూలవాసం గుంజుకపోయేవఱకు తీరదు.

ఆడపిల్ల పుట్టినప్పుడే ఆదరవు పుడుతుంది.

ఆడపిల్ల పెళ్ళి, అడుగుదొరకని బావి అంతం చూసేవే!

ఆడపెత్తనం [2]తంబళ్ల దొరతనం.

---

1 ఆడపడుచు-ఆడుబిడ్డ = మగని తోబుట్టువు. (కలకంఠి కన్నీరొలికిన సిరి యింట మండనొల్లదు.)

2 తంబళి = శివార్చకుడు.

ఆడబాయె కోల, ఈడబాయె కోల, [1]మద్దూరి గట్లల్ల మాయ మాయే కోల.

ఆడబిడ్డ అర్ధమొగుడు (అరమగడు).

ఆడబిడ్డమ్మా! అంత్రపిశాచమ్మా! వండే ఇంటిలోనికి తీసికెళ్ళి, మండే కొఱకంచు పెట్టు.

ఆడబోతే చూడబుద్ధి, చూడబోతే ఆడబుద్ధి.

ఆడబోయిన తీర్థ మెదురైనట్లు.

ఆడవారికి ఆవకాయ, మగవారికి బోడితెంకలు.

ఆడలేక అంగణం వంకర అన్నట్లు.

ఆడలేక పాతగజ్జెలు అన్నట్లు.

ఆడలేక మద్దెలవానిపై గోడు పోసుకొన్నట్లు.

ఆడలేనమ్మ మద్దెల ఓడన్నట్లు.

ఆడలేని బోగముది మద్దెలపైబడి కొట్టుకొన్నట్లు.

ఆడశోకం, మగరాగం ఒకటే.

ఆడా, పాడా, మద్దెలగొట్టా, మంగలి బజారులో అడుక్కుతినా.

ఆడింది ఆట, పాడింది పాట (అతడికి)

ఆడినవాడు అబద్ధమాడితే, కూడినవాడు కుడువవలసిందే.

[2]ఆడినెలలో ఆకులు రాలినట్లు.

ఆడీడి ధర్మాన అబ్బాయి పుడితే, ఎందోడి ధర్మాన కడియాలు దొరికినవి.

ఆడుకుయిని ఆలకుయిని అరయవలయు.

ఆడుదనం అంగడివేయదగునా?

ఆడుది నీతితప్పినతరువాత, అంతేమిటి ఇంతేమిటి?

ఆడుబుద్ధికంటె అపరబుద్ధి మరేది?

1 గట్లు = కొండలు. 2 ఆడినెల = ఆషాఢమాసం (తమిళం)

ఆడే కాలు, పాడేనోరు ఊరకుండవు.

ఆడేటందుకు నేను ఆటదాన్ని కాను, ఆడితే చూచేదాన్నే.

ఆడేది అడ్డనామాలు తీసుకుంటే, పాడేది పంగనామాలు తీసుకొన్నదట.

ఆడేరంటే తెలియదా? తోడేరువలె రెండుకొమ్ములుండు–అన్నట్లు.

ఆతండ్రికి కొడుకు కాడా?

ఆ...గొంచుపోయి అబ్ధిలోముంచిన దర్భయగునె యజ్ఞతంత్రమునకు.

ఆ తానులోదే ఈ పేలిక,

ఆతాడి (తాటిచెట్టు) లోనిదే యీ పేడు.

ఆతుగాడిక్రింద జీతగాడు.

ఆతుష్టికీ, ఈనష్టికీ సరి.

ఆత్మకానని యోగి కద్వైతములు మెండు.

ఆత్మసంతోషానికి రోకటిబండ తంబురా.

ఆత్మస్తుతి, పరనింద అర్థాపేక్షా లేని మహానుభావుడికి నాకూ డబ్బు, శుద్ధశుంఠకు వాడికీ డబ్బా!

ఆత్మా! రావే, నూతను పడుదాము అంటే, ఆదివార మందరమూ పడదాము అన్నదట!

ఆత్రగాడు, ఒళ్లో పెట్టేదా? దళ్లో (దడిలో) పెట్టేదా అన్నట్లు.

ఆత్రగానికి అవతల పెట్టుదువుగాని, నాకు ఒళ్లోపెట్టు.

ఆత్రగానికి ఆకులోపెడితే, నాకు బోకిలో పెట్టమన్నట్లు.

ఆత్రగానికి బుద్ధి[1]మట్టు.

ఆత్రానికి అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి.

ఆత్రానికిపోతే ఆడపిల్ల పుట్టిందట!

ఆత్రానికి భోగోణిలోకూడా చేయిపట్టదు.

1 మట్టు = తక్కువ (మట్టం)

ఆదర్శాలు శిఖరమెక్కి కూర్చుంటే, అవసరాలు అగాధంలోకి ఈడుస్తాయి.

ఆదాయంలేనిదే (లేకనే) సెట్టి వరదను బోడు.

ఆదారి ఎక్కడికి పోతుంది అంటే, ఎక్కడికీ పోదు. నేను పుట్టింది మొదలు యిక్కడనే ఉంది-అన్నట్లు.

ఆదిలో నాట (రాగం) అంతంలో సురటవలె (పాడినట్లు చక్కగా పరిష్కరించుట)

ఆదిలోనే హంసపాది. (దు)

ఆదివారం అందల మెక్కనూ లేదు, సోమవారం జోలె (కట్టనూ) ఎత్తనూ లేదు.

ఆనందమహారాజును ఎఱిగినవాడికి అగ్రహారం ఉండబోదు.

ఆనవాలు లేనిది అద్దంచూచుకుంటే బహుముఖ మయింది.

ఆనామికి, ఆడివాలుదానికి ఆగడమున్న సాగదు.

ఆపదుగులోదే యీపేక.

ఆపదకు పాపంలేదు.

ఆపద మ్రొక్కులు, సంపద మఱపులు.

ఆపదలు కాపురాలుండవు.

ఆపదలైనా, సంపదలైనా ఒంటరిగా రావు.

ఆపదలో అడ్డుపడేవాడే చుట్టము.

ఆపదలో ఆదుకోవాలి, ఆస్తిలో పంచుకోవాలి.

ఆపప్పు ఈవేళ ఉడకదు. (ఆపనికాదు-అనుట)

ఆపప్పులు యిక్కడ (నాదగ్గఱ) ఉడకవు.

ఆపస్తంబులా? అశ్వలాయనులా? అంటే, ఆపస్తంబులమూ కాము, అశ్వలాయనులమూ కాము, అప్పారావుగారి [1]హర్కారాలము అన్నారట!

---

1 హర్కారాలు=వార్తాహరులు.

ఆపాటి మగడవా? చెవులు తడవేవు.
ఆబోతు కండలకు పెద్ద.
ఆబోతుకు బందె లేదు.
ఆబోతుతో దుక్కి ఎద్దు పోలుతుందా?
ఆబోతు పేదలయశము గోరు.
ఆమంట ఈమంట, బ్రాహ్మణార్థం కడుపుమంట.
ఆమడ నడచినా, ఆరికకూడు తప్పలేదు.
ఆమడలు దూరమైతే, అంతఃకరణాలు దూరమౌతవా?
[1]ఆమనిలో లంజకాడువలె తగులుకొన్నాడు. (వసంతం ఉద్దీపనకారి యైన సమయం).
[2]ఆమరతానికిబోయి, కుక్కచావు చచ్చిందట.
ఆమాటకూ ఈమాటకూ పెద్దగోడలు, ఆచేతి పెట్టుకూ ఈచేతి పెట్టుకూ అడ్డగోడ.
ఆమాటా (నారాయణ) అనిపింతామా మామగారూ? (మరణ సమయమున)
ఆముఖాని కేల అర్థ శేరు పసుపు.
ఆముదపు చేటుకాని, బిడ్డ బ్రతకదు.
ఆముదపు విత్తులు ఆణిముత్యాలగునా?
ఆముదము కొలిచే తవ్వ ఎప్పుడూ జిడ్డే.
ఆముదముతో ముడ్డి కడుగుకొన్నట్లు.
ఆముద మున్నచోటే [3]నీళ్ళాడినట్లు.
ఆముదాలబేరం, కామెర్లరోగం నమ్మరానివి.
ఆమెపేరు కుంతలమ్మ, చూడబోతే బట్టతల.
ఆమొద్దులో దే యీాపేడు.

---

1 ఆమని=వసంతకాలం. 2 అమరతం=రోషము.
3 నీళ్ళాడు=ప్రసవించుట.

[1]ఆమ్నాయకళానిధికి ఆదిలోనే హంసపాది.
ఆయం తప్పితే, గాయమంత సుఖం లేదు.
ఆయన అన్ని దేవళాలమీద రెట్టవేసిన పిట్ట.
ఆయన ఉంటే మంగలినైనా పిలుచుకొచ్చేవాడు కదా అని వాపోయి నట్లు.
ఆయన కేమున్నది-అంకమ్మ ఆ...లు, పోలేరమ్మబొచ్చు (సెప్పాలు)
ఆయన లేనికూర అరటికాయ కూర.
ఆయన పెట్టినది అరచేతి గుంటె(టె)డు, గోకి నోట్లో వేసుకోరా గోవిందుగా!
ఆయాసం ఒకరిది అనుభవం ఇంకొకరిది.
ఆయువు గట్టిదయితే అన్నీ పోతవి.
ఆయుష్యం ఆరుపాళ్లు, యాతన ఏడుపాళ్లు.
ఆయుష్యమున్నరోగి హస్తవాసిగల వైద్యునిదగ్గఱకు పోవును.
ఆయుసులేక చస్తారుగాని, ఔషధం లేకగాదు.
ఆయుస్సు తీరినవాడు ఆరునెలలకుచస్తే, అనుమాన పడినవాడు అప్పుడే చస్తాడు.
ఆయెనమ్మా! పెండ్లి, అవిసెనమ్మా కన్నె.
ఆరంభశూరుడికి ఆర్భాటమెక్కువ.
ఆరగించగా లేనిది, అడిగితే వచ్చిందా?
ఆరవకాన్పు ఆడపిల్ల అత్తవారింటికి లక్ష్మి.

1 నెల్లూరు పండితుడు నేలటూరు పార్థసారథి అయ్యంగారు (వెంకటగిరి రాజాగా ఉన్నతపాఠశాల ఆంధ్రాధ్యాపకులు) ఆమ్నాయకళానిధి పేర ఆంధ్రభారతం ఉద్యోగ-స్త్రీ-శాంతిపర్వములకు టీకనువ్రాసి ప్రచురించారు. మొదటి శ్రీయన గౌరి నాటరగు-అనేపద్యములో గౌరికి అర్థమునుచెప్పక వదలివేసినారు.(వైష్ణవ ఛాందసం కామాల) దీనిమీద, పూండ్ల రామకృష్ణయ్యగారు తమ "అముద్రిత గ్రంథచింతామణి"-పత్రికలో యీ శీర్షికక్రింద తీవ్రంగా విమర్శించినారు.

ఆరాటపు కదురు ఏరాటాన పెట్టినా నిలువదు (గరగర లే)

ఆరాటపు పెండ్లికొడుకు పేరంటాళ్ల వెంటపడ్డాడట.

ఆరాటమేగాని, పోరాటం లేదు.

ఆరికకు చిత్త (కార్తె) గండం, ఆడదానికి పిల్ల గండం.

ఆరికకోసిన చేతితోనే కంది కోసినట్లు. (ఒకేచేనిలో పైరుబెట్టుదురు)

ఆరికకోస్తే ఇల్లంతా గింజలు, దంచితే దొడ్డి అంతా [1]పొట్టు.

ఆరిక చల్లిన రెడ్డికి, ఆలుమగలకు ఒకటేచీర. (దరిద్రం తీరదనుట)

ఆరితీరె, అల్లము శొంఠి ఆయె.

ఆరిపోయెడి దివ్వె కధిక దీప్తి.

ఆరు ఆవులమ్మ, మూడావులమ్మ ఇంటికి నేతికి వెళ్ళిందట.

ఆరు ఈతల నక్కకు, మూడు ఈతల నక్క ముక్క నేర్పిందట.

ఆరువేళ్ల అబ్బాయి 'అమ్మా!' అంటే, వాడి అమ్మ అబ్బుర పడిందట.

ఆరుకార్తెలకు పోతు ఆరుద్రకార్తె.

ఆరుగురిబత్తెం ముగ్గురు తిన్నారు, అమ్మవచ్చి అందలంలోకూర్చున్నది ఎవరు మోస్తారో మోయండి.

ఆరుగురు బంట్లు, మూడు ఫౌజులు.

ఆరుగురు బిడ్డలతల్లికి, ముగ్గురు బిడ్డలతల్లికి ముక్క నేర్పిందట.

ఆరుద్రకార్తె విత్తనానికి, అన్నము పెట్టిన ఇంటికి సేగిలేదు.

ఆరుద్ర కురిస్తే, ఆరుకార్తెలు కురుస్తాయి.

ఆరుద్ర కురిస్తే, దారిద్ర్యము లేదు.

ఆరుద్ర మొదటిపాదాన ఎత్తితే, ఆరంభాలు చెడుతాయి.

ఆరుద్రతో అదను సరి.

ఆరుద్రలో అడ్డెడు చల్లితే, పునాసకు పుట్టెడు పండుతుంది.

---

1 ఆరిక పొట్టు=ప్రతిగింజకు ఆరుపొరలుండును. కాబట్టి పొట్టు ఎక్కువ. ఇది ఒకలాగాన పోకదు. ఆరికలను విసరను ప్రత్యేకంగా తిరుగళ్లు ఉండును.

ఆరుద్రలో (అనూరాధలో) తడిస్తే ఆడది మగవాడగును.
ఆరుద్రలో వేసిన అరిక, ఆకులో పెట్టిన అన్నము ఒకటే!
ఆరుద్రవాన అదను వాన.
ఆరుద్రవానకు ఆమ్లములు పండును.
[1]ఆరుగాలం చేసినమాల, వాగునబడ్డట్టు.
ఆరు నెలలకు చచ్చేవాడికి అల్ప (అపర) బుద్ధి పుడుతుంది.
ఆరు నెలలకు చచ్చేవాడికి [2]అరుంధతి కనబడదు.
ఆరు నెలలకు చస్తాడనగా అసలుగుణం మారుతుంది.
ఆరు నెలలకే అల్లుని నోటికి వస్తుంది (మునగ.)
ఆరు నెలలదుమ్ము గూట్లో ఉన్నదేమిరా? అంటే, నేను పనిలో చేరి నెలే అయిందన్నాడట.
ఆరు నెలలు పుట్టింట ఉంటే, [3]అడపాపకంటె అన్యాయం (అధమం).
ఆరు నెలలు వాయించిన మద్దెల ఓటిదా? గట్టిదా? అన్నట్లు.
ఆరు నెలలు సహవాసం చేస్తే, వారు వీరవుతారు.
ఆరు నెలలు సాముచేసి, మూలనున్న ముసలమ్మను పొడిచినట్లు.
ఆరురాజ్యాలు జయించవచ్చునుగాని, అల్లు(డి)ని జయించలేము.
ఆరుద్ర చిందిస్తే, అరవైదినాలు వఱపు.
ఆరూరుకరణం బ్రతికీ ఏడ్పించినాడు, చచ్చీ ఏడ్పించినాడు.
[4]ఆరె, కత్తిలేని ఆరూళ్ళ మాదిగతనం.
ఆరెపుల్లకు పూరిపుల్ల తోడు.
ఆరెలమానుక్రింద బూరెల(గాదెల)మాను విరగబడ్డట్లు.

---

1 ఆరుగాలం = ఆరుఋతువులకాలం-ఒక ఏడాది.
2 అరుంధతి = నాణక కొన. (కాశీఖండం)
3 అడపాప = నగరిదాపి. (కాసాది)
4 ఆరె = తోళ్లుకుట్టే దబ్బనము.

ఆ రే[1]కులోదే యీా [2]పాత.
ఆరేండ్ల పిల్లవాడు అద్దలో గిద్దవేస్తే అదీ అపరూపమే!
ఆర్యమైనది అంబటివేళ లేచినా, గొదెమాలినది కోళ్ళుకూయగా
లేచినా ఒకటే?
ఆర్భాటపు అత్తగారికి ఆరుగురు మొగుళ్ళు.
ఆర్భాటరసికుడు (ప్రజాపతి) పాతకోకలన్నీ చించినాడట.
ఆర్భాట రసికుడొకడు, అనుభవ రసికుడింకొకడు, ఆలింగన రసికుడు
మరొకడు.
ఆర్భాటానికి ఆరు కుంపట్లు, ఒక దుంపదాలి!
ఆర్చేవా తీర్చేవా? అక్కరవస్తే మునిగేవా?
ఆర్చేవా తీర్చేవా? అడుగునపడితే లేవదీసేవా?
ఆర్చేవారేగాని తీర్చేవారు లేరు.
ఆలగోడు బాలగోడు.
ఆలపాటి కవిత్వం, అందులో పైత్యం.
ఆలస్యమైనా అంటుబోడ్డుదాన్నే కొనాలి. (ఎద్దునుగాని, ఆవునుగాని)
ఆలా? పిల్లా? అనకమైనా (అణకువైన) లంజా? లంజ కొతమ్ముడా?
నాకో బావమరిదా? [ప్రాయం పదేండ్లు.
ఆలి అలుక అరవైఏండ్లు, మగని అలుక ముప్పయిఏండ్లు, బాల
ఆలికి అదుపు, ఇంటికి పొదుపు.
ఆలికి అన్నం పెట్టడం ఊరికి ఉపకారమా?
ఆలికి అన్నంబెట్టి, ఊరును ఉద్ధరించి నట్లనుకొంటాడు.
ఆలికి గంజి పోయనివాడు ఆచారము చెప్పె; తల్లికి గంజి పోయని
వాడు తగవుచెప్పె.
ఆలికి లొంగినవాడు, [3]అరగాణిలో పడినవాడు అటేటు అవుతాడు.
ఆలితో కలహించి ఆకలికాదని పస్తుపండెడువాడు పంజావిధవ.

---

1 రేకు = విధవలుకట్టే అంచులేని చీర.

2 పాత = పాతగుడ్డ.

3 అరగాణి = చెరువులో వరవ పారి, నీళ్ళనిలిచే లోతుప్రదేశము.

ఆలిని అదుపులో పెట్టలేనివాడు, అందరినీ అదుపులో పెట్టునా!
ఆలిని ఒల్లనివాడు [1] ఈలకూరలో ఉప్పు లేదన్నట్లు.
ఆలిని విడిస్తే హరిదాసు, సంసారము విడిస్తే సన్యాసి.
ఆలి పంచాయితీ రామాయణం, పాలి పంచాయితీ భారతం.
ఆలిమాట విన్నవాడు, అడవిలో పడ్డవాడు ఒకటే.
ఆలివంకవారు ఆత్మబంధువులు, తల్లివంకవారు తగినవారు, తండ్రి వంకవారు దాయాదులు.
ఆలి శుచి ఇల్లు చెబుతుంది.
ఆలు ఆత్మకూరిలో, మొగుడు జోయపల్లెలో, కుండాచట్టి కుణుతూరులో, తలబ్రాలు తాడిపత్రిలో.
ఆలు ఏడ్చిన ఇల్లు, ఎద్దు ఏడ్చిన సేద్యం ముందుకురావు.
ఆలు ఒల్లక అరవై ఏళ్లు, మొగుడు ఒల్లక ముప్పై ఏళ్లు, బాల ప్రాయం పదేళ్లు.
ఆలు కుదురైతే, చేను కుదురు (ఆనందం).
ఆలు చచ్చినవాడికి ఆలు బంగారం.
ఆలు చచ్చినవానికి మనువు పోరాదు, పండుకొని తినేవానికి వండి పెట్టరాదు.
ఆలును అమ్మినవానికి ఇల్లమ్ముటెంత.
ఆలుబిడ్డలు అన్నానికి అకోరిస్తుంటే, లంజకు బిడ్డలు లేరని రామేశ్వరం పోయినాడు.
ఆలుబిడ్డలు లేనివానికి ఆంజనేయులు గుడి.
ఆలు బెల్లమాయె, తల్లి విషమాయె.
ఆలు మంచిది కాకున్న, ఆర్గురిబిడ్డల తల్లినైనా విడవాలి.
ఆలుమగల కలహం అద్దంమీద ఆవసరగింజ ఉన్నంతసేపే.
ఆలుమగల కలహం, అన్నం తినేదాకానే.
ఆలుమగల కలహం, ఆరికకూడు వండినంతసేపు. (ఆరికబియ్యం చాల సన్నటివి)

---

1 ఈలకూర (ఆకు) మొదలే ఉప్పుకషాయం.

అలుమగ లొక్కటయ్యేవఱకే అందఱితో అవసరము. (పని)

అలుమగని సందు ఆరామడల దూరం.

ఆలు లేత, నారు ముదురు కావాల.

ఆలు లేదు, చూలు లేదు, కొడుకు పేరు సోమలింగం.

ఆలు లేని బడాయి నీళ్లు తోడమన్నట్లు.

ఆలు లేనివానికి ఆత్మ కూరు.

ఆలు లేనివానికి హనుమంతరాయుని గుడి, బిడియ మిడిచినవాడికి వీరప్పగుడి శరణ్యం.

ఆలు సొత్తు, అత్త తొత్తు.

[1]ఆళ్లు కొత్తవైతే తిరగళ్లు కొత్తవా?

ఆవగింజ అట్టేదాచి, గుమ్మడికాయ కుప్పమీద వేసినట్లు.

ఆవగింజ అట్టేదాచి. గుమ్మడికాయ గుల్లకాసుగా ఎంచినట్లు.

ఆవగింజకు సందు ఉంటే, అరవైగాజెలు అప్పుడే తిననా? (పట్టించనా?)

ఆవగింజంత బూది (భూతి) మైనలదెనేని గుమ్మడికాయంత వెట్టిబట్టు.

[2]ఆవటించే సూర్యుడికి అంధకారం ఎదురా?

ఆవాలు తిన్నమ్మకు యావ, ఉలవలు తిన్నమ్మకు ఉలుకు.

ఆవాలు ముద్దచేసినట్లు.

ఆవాహనా లేదు, విసర్జనా లేదు.

[3]ఆవిలాటలో పడినవాడు అగడ్తలో పడినవాడు ఒకటి.

ఆవు ఎక్కడతిరిగితే నేమి? ఇంటికివచ్చి కడివేస్తే (పాలిస్తే) చాలు.

ఆవు చేలోమేస్తే, దూడ గట్టున మేస్తుందా?

---

1 ఆళ్ళు = అరికలు.

2 ఆవటించు = తపించు.

3 ఆవిలాట = పోరాటము, వివాదము.

అవుతల ఎద్దు.
ఆవు తోలిచూలు, గేదె మలిచూలు.
ఆవుదూడ ఉండగా గుంజకు వచ్చెరా గురకరోగం.
ఆవుదూడ ఉండగా గుంజ అరచినట్లు.
ఆవుదూడను బఱ్ఱెకు, బఱ్ఱెదూడను ఆవుకు మరగవేసినట్లు.
ఆవు నలుపైతే పాలు నలుపా?
ఆవునిచ్చి పలుపు దాచినట్లు.
ఆవును అమ్మినవాడు కన్నెతాడు ఇవ్వడా?
ఆవునుకొంటే దూడనుగూడ కొన్నట్లే.
ఆవును కొని, [1]తలుగుకు లోగినట్లు.
ఆవును చంపి, గోరోజనం రోగార్తుల కిచ్చిన పుణ్యాత్ముడగునా?
ఆవునుచంపి, చెప్పులు దానం చేసినట్లు.
ఆవును విడిచి, గాడిదపాలు పితికినట్లు.
ఆవుపాడి ఎన్నాళ్లు? ఐశ్వర్య మెన్నాళ్లు? బఱ్ఱెపాడి ఎన్నాళ్లు? భాగ్య మెన్నాళ్లు?
ఆవు పావలా, బందె ముప్పావలా.
ఆవు పొదుగులోనే అరవై ఆరు పిండివంట లున్నాయి.
ఆవు మరగిన, దూడ మరగదు; దూడ మరగిన ఆవు మరగదు.
ఆవురంగు పాలనుబట్టి తెలుస్తుందా?
ఆవులన్నీయిచ్చి ఒక్క బక్కావు ఇవ్వకపోతే పాడికి కొరవా.
ఆవుల మళ్ళించినవాడే అర్జునుడు.
ఆవులలో ఆబోతై తినాలి, అత్తవారి ఇంట్లో అల్లుడై తినాలి.
ఆవుల (క) సాదుత్వము, బ్రాహ్మణుల పేదరికము లేదు.
ఆవులించిన నోటికి అప్పళించినట్లు.

1 తలుగు = పలుపు.

ఆవులింతకు అన్నలున్నారుగాని, తుమ్ముకు తమ్ముడు లేడు.
ఆవులిస్తే పేగులు లెక్కపెట్టినట్లు.
ఆవులు ఆవులు పోట్లాడుకొని, లేగలకాళ్లు విరగగొట్టినట్లు.
ఆవులు కోరినచోట పూరి మొలచినట్లు,
ఆవులుచస్తూ దూడలకు మేత పెట్టిపోయినవా?
ఆవులేనింట అన్నమే తినరాదు.
ఆవూరివారి అంబలి తాగి, దూవూరివారి దూడలు కాచినట్లు.
ఆ వేలుకు ఇంకొక వేలుకు ఎడం.
ఆవేళటికి అడ్డదిడ్డంగ తిరిగితే, సంకురాత్రికి చంకనాకి పోతారు.
ఆవో! అంటే అర్థంకాక అగోరిస్తుంటే, ఖడో అనేదాన్ని అంట
గట్టావా?
ఆశ అరవైనాళ్లు, మోహం ముప్పైనాళ్లు.
ఆశ ఆలిమీద, పడక (ఆధారం) చాపమీద.
ఆశకు అంతులేదు, గోచికి దరిద్రములేదు.
ఆశకు అంతులేదు, నిద్రకు సుఖంలేదు.
ఆశకు అంతులేదు, నిరాశకు చింతలేదు.
ఆశకు పోతే, గోచి ఊడిందట!
ఆశకు మించినదూరం, వడ్డీకిమించిన వేగం లేవు.
ఆశకు ముదిమిలేదు, అర్థికి సౌఖ్యంలేదు.
ఆశకూ దరిద్రానికీ లంకె.
ఆశగలమ్మ దోషమెఱుగదు, పూటకూళ్లమ్మ పుణ్యమెఱుగదు.
ఆశగలిగినచోట ఆడినదే సరసం.
ఆశపడి, ఆరు ఉపోష్యాలుంటే, ఆరోజునగూడా ఆరిక మెతుకులేనా
(ఆరిక కూడేనా?)
ఆశపడి పాసినన్నంతింటే, పాడుపడి పదిలంఖనాలు చేసినట్లు.
ఆశపడి వెల్లుల్లితిన్నా, రోగం అల్లాగే ఉన్నది.

ఆశబోతు బాపడు గోచిపాతలో ముప్పందుం మూటగట్టుకున్నాడట!
ఆశ బోధిస్తున్నది, అవమానం బాధిస్తున్నది.
ఆశలుడిగినట్టి అయ్యలుగలరొకో!
ఆశలేని కూటికి ఆకలే లేదు.
ఆశలేని కూటికి ఆరళ్లు లేవు.
ఆశ సిగ్గెఱుగదు, నిద్ర సుఖమెఱుగదు.
ఆశ్లేష [1]ఊడ్పు ఆరుగురి (ఆరింతల) ఊడ్పు.
ఆశ్లేషలో ముసలిఎద్దుగూడ అంకెవేస్తుంది.
ఆశ్లేష ముసలికార్తె, ఆగిఆగి తుంపర కురియును.
ఆశ్లేషలో అడుగుకొక చినుకైనా, అడిగినన్ని వడ్లు.
ఆశ్లేషలో అడ్డెడు చల్లుట మేలు.
ఆశ్లేషలో ఊడ్చినట్లయితే అడిగినంత పంట.
ఆశ్లేషలో తడిస్తే, ఆడది మొగోడౌతాడు.
ఆశ్లేషలో పూచిన, అంతులేని పంట.
ఆశ్లేష వర్షం అందరికి లాభం.
ఆషాఢమాసంలో అరిసెలు వండను పొద్దుండదు.
ఆషాఢానికి ఆకుపోతలు. (నారుమళ్లు)
ఆషాఢానికి [2]పిషాణాలు బద్దలగును.
ఆసత్తకు [3]బోసత్తా, బోసత్తకు బోడిమొగుడు.
ఆసనంలో పుండు, అల్లుని వైద్యం.
ఆసనాలు వేస్తే, పాసనాలు పుట్టినట్లు.
ఆసలు విడిస్తే, అటుమట లేదు.

---

1 ఊడ్పు = పైరు నారు నాటుట.
2 పిషాణం = మేలైన వడ్లజాతి.
3 బోసత్త = బోసి + అత్త.

[1]ఆసాదికూతలకు అర్థమూ లేదు, గుడ్డికంటికి చూపూ లేదు.

ఆసుబోసినట్లు తిరుగుట. (అటు ఇటు)

ఆస్థిగలిగిన అన్నంభట్టు ఆలిప్రక్కనపడుకొని, [2]అరుణం చదివెనట.

ఆస్త్రీకొక కొడుకు ఆశకొక కూతురు.

ఆస్త్రీకొక పుత్రుడు, ప్రేమకొక పుత్రిక.

ఆహారంపట్ల, వ్యవహారంపట్ల మొగమాటం (సంకోచ) పడరాదు.

ఆళ్లు (ఆరికలు) జల్లినరెడ్డికి ఆలూమగలకు ఒకేచీర.

---

1 ఆసాదులు = మాలలో ఒక తెగ; పోలేరమ్మజాతరలలో, పోలేరమ్మను ఎల్లి వంపే ఊరేగింపులో దేవతను బూతులుతిడుతూ పొయ్యేవాళ్లు-వాళ్ళకూతలు = బూతులు. 2 అరుణం = వేదపాఠము.

## ఇ

ఇంకే చెరువుచేపలకు కొంగను కాపుంచినట్లు.

ఇంగిత మెరుగని ఇందుపూరు. (నెల్లూరు, కోవూరు తాలూకాలో ఒక గ్రామము)

ఇంగువ కట్టినగుడ్డ, బెల్లం వండిన పొయ్యి.

ఇంట ఆచారత్వం (ఆచారం) బయట బడాచోరత్వం (చౌర్యం).

ఇంట కుడిచి, ఇంటివాసాలు లెక్కించినట్లు.

ఇంటగెల్చి, రచ్చ గెలువు.

ఇంట లింగాకారం, బయట చక్రాకారం. ఇక్కడికి వచ్చావా జడలు దాల్చి?

ఇంటలేనిది గోచిలో పెడతావురా కొడుకా.

ఇంటింటా ఒక ఇటుకపొయ్యి, మాఇంట ఒక మట్టిపొయ్యి.

ఇంటి ఎద్దుకు బాడుగ ఏమిటి?

ఇంటికన్నా గుడి పదిలం.

ఇంటికళ ఇల్లాలె చెబుతుంది.

ఇంటికి అవ్వ, కొలతకు తవ్వ అవసరము.

ఇంటికి ఆడపిల్ల ముప్పు, దొడ్డికి వార[1]సత్రం ముప్పు.

ఇంటికి ఆడుబిడ్డ చేటు, మిద్దెకు పూరిపంచ చేటు.

ఇంటికి ఇత్తడిచిలుక(కు), బయటికి బంగారు చిలుక(కు).

ఇంటికి ఇల్లాలుకాదు, దొంతికి కుండకాదు.

ఇంటికి ఈలకత్తి, పొరుగుకు బంగారుకత్తి.

ఇంటికి ఏబ్రాసి, పొరుగుకు శ్రీమహాలక్ష్మి.

ఇంటికి ఒక గుప్పెడుబియ్యం, ఇల్లాలికి పదిపుట్లు. (పూటలు)

---

1 సత్రం = ఏటవాలు వసారా.

ఇంటికి ఒకపువ్వు, ఈశ్వరుడి కొకదండ.

ఇంటికి ఒక వెంట్రుకయితే, ఇల్లాలి ([1]ఇలారానికి) కొక కంబళి.

✓ఇంటికి గుట్టు, మడికి గట్టు.

ఇంటికి చుట్టంవస్తే, పొట్టగంజి (కడుపుకూటి)వాడికి దుఃఖం.

ఇంటికి జ్యేష్ఠాదేవి, పొరుగుకు శ్రీమహాలక్ష్మి.

ఇంటికి పేరు, తలకు జుట్టు, మొలకు మొలతాడు లేని తురకను నమ్మరాదు.

ఇంటికి ముసలి కీడు, ఏటికి మొసలి కీడు.

ఇంటికి [2]వెన్నుపోటు, మనిషికి పైపోటు.

ఇంటికి హేళనైతే బంటుకు హేళన, బంటుకు హేళనైతే [3]బాంచకూ హేళన.

ఇంటికుక్క ఇంటికుక్కను ముట్ట (కట్ట)నీదు. (ఎక్కనీయదు)

ఇంటికూటికి, దోవకూటికి రెంటికీ చెడినట్లు.

ఇంటికూడు తిని, అంకుమొగుళ్ల వెంటపడినట్లు.

ఇంటికొక వెంట్రుకైతే, ఇలారానికి (ఇల్లాలికి) ఒకకంబళి (గొంగళి)

ఇంటికోడళ్లు తిన్నా, కోళ్లుతిన్నా వృథాగా పోదు.

ఇంటిగుట్టు పెరుమాళ్ళ కెరుక.

ఇంటిగుట్టు పొరుగిండ్లలో చెప్పే [4]ఆడ(డు)బిడ్డతోపాటు దొంగిలించే కోడలు దొరికినట్లు.

ఇంటిగుట్టు లంకకు చేటు.

ఇంటిచిలుకను బోయ కిచ్చినట్లు.

---

1 ఇలారము = పేదగుడిసె; పూరిల్లు.

2 వెన్నుపోటు = ఒక ఇంటి వెన్నుగాడి ఇంకొకయింట వెన్నుగాడికి అడ్డము తగులరాదు.        3 బాంచ = బానిస.

4 ఆడబిడ్డ = మగని అప్పచెల్లెలు.

ఇంటిదీపమని ముద్దుపెట్టుకుంటే, మీసాలన్నీ తెగ కాలినవట!
ఇంటిదేవత యీడిగలబడితే, పొరుగుదేవతకు (కొలువట) జాతరట.
ఇంటిదేవర ఈగిచస్తే, పొలందేవర గంపజాతర అడిగినాడట.
ఇంటిదొంగను ఈశ్వరుడయినా పట్టలేడు.
ఇంటిద్యావర (దేవర) ఇగిలిస్తే, గూటిద్యావర గుగ్గిలానికి ఏడ్చినాడట!
ఇంటినిండా కోళ్లున్నా, పక్కింటికోడే కూయాల్సివచ్చింది.
ఇంటినుండి వెళ్లగొట్టగా, దొంతులు సవరించినట్లు.
ఇంటిపిల్ల ఇగిలిస్తే, లంజపిల్ల గంజి కేడ్చిందట.
ఇంటికి పెద్దకొడుకై పుట్టేకన్నా, అడవిలో తుమ్మదుబ్బై పుట్టేది మేలు.
ఇంటికి పెద్దకొడుకు, పెద్ద అల్లుడే లెక్కబడేది.
ఇంటిపేరు కస్తూరివారు, ఇంట్లో గబ్బిలాల (పెంట) కంపు.
ఇంటిపేరు క్షీరసాగరంవారు, ఇంట్లో మజ్జిగచుక్కకు గతిలేదు.
ఇంటిమగనికి ఈచ(త) కట్లు, బయటిమగనికి తాటికట్లు.
ఇంటిమగనికి ఎడ్లబండి, బయటిమగనికి గుఱ్ఱాలబండి.
ఇంటిమీాద రాయివేసి, వీపు ఒగ్గినట్లు.
ఇంటిమొగుడు [1]కుంటెనకాడైతే అంకుకు రామేశ్వరం పోవాలనా?
ఇంటిమొగుడు మట్టిగబ్బు, పొరుగింటి మొగుడు పూలవాసన.
ఇంటిలక్ష్మిని వాకిలి చెబుతుంది.
ఇంటిలో కొక్కును తెచ్చిపెట్టుకొంటే గోడల గుద్దలించక మానుతుందా?
ఇంటిలో చేరకమునుపే ఎలుకలదాడి.
ఇంటిలో ఏదు (పంది) ముల్లయ్యె. (ఇబ్బందులతో అనుట)

1 కుంటెనకాడు = తార్పుడుకాడు.

ఇంటివాడివలె చేసేవాడు లేడు, బయటివాడివలె తినేవాడూ లేడు.
ఇంటివాడు 'ఇలో' అంటే, పొరుగువాడు 'పొలో' అన్నాడట!
ఇంటివాడు ఈకన కొడితే, పొరుగువాడు పోకన కొడతాడు.
ఇంటివాడు గొడ్డు గేదంటే పొరుగువాడు పాడిగేదె అన్నట్లు.
ఇంటివాడు లేచేది, కుంటివాడిమీదికే.
ఇంటివాణ్ణిలేపి, దొంగచేతికి కట్టె ఇచ్చినట్లు.
ఇంటివానికి చులకనైతే, బయటవానికి చులకన, బానిసవానికీ చులకన.
ఇంటివారు 'ఒసే' అంటే, బయటివారు 'తసే' అంటారు.
ఇంటివారు వేలుచూపితే, బయటివారు కాలుచూపుతారు.
ఇంటిసొమ్ము విప్పపిండి, పొరుగింటిసొమ్ము పాడిబెల్లం.
ఇంటెద్దుకు బాడుగలేదు.
ఇంట్లో ఇత్తులు లేవు, ఇద్దఱికీ మాటలులేవు. (భార్యాభర్తలకు)
ఇంట్లో ఇల్లాలిపోరు, బయట బాకీలపోరు.
ఇంట్లో ఇల్లాలులేదంటే, 'పెళ్ళామా' అని పిలిచాడట.
ఇంట్లో ఈగ పులి (పిల్లి) బయట (పెద్ద) పులి.
ఇంట్లో ఈగలమోత, బయట పల్లకీలమోత.
ఇంట్లో కందురీగలు తెట్టెలుపడితే, ఇల్లాండ్రు గర్భవతులౌతారట.
ఇంట్లోదేవుణ్ణి వదలి, వీధిలోదేవుణ్ణి మొక్కినట్లు.
ఇంట్లోనుంచి తోసివేస్తూంటే, చూరుపట్టుకొని వ్రేలాడినట్లు.
ఇంట్లో పస్తు, వీధిలో దస్తు.
ఇంట్లో పిల్లి, బయట పులి.
ఇంట్లో పుష్టి, ఒంటిలో పుష్టి.
ఇంట్లో మొగుడుకొడితే, వీధిలో మాదాకవళంవాడు కొడతాడు.
ఇంట్లో యిత్తులు లేవు, ఊరిళ్ళకు సంబరమట.
ఇంట్లో యి(ది)త్తులు లేవు, విడగొట్టి సంకటి చేయమన్నట్లు.
ఇంత చక్కని పిల్లికి బాగా వాయించరా సన్నాయి.

ఇంతచక్కని మగవాడికి సమర్తాడుదునా?

ఇంతబ్రతుకు బ్రతికి, ఇంటివెనుకాల పడి చచ్చేనన్నట్లు.

ఇంతమంది దొరలు చావకపోతే, నేనుమాత్రం చస్తానా? నాకూ అక్కఱలేదు అన్నాడట (పెండ్లిబంతి వడ్డనలో).

ఇంతమంది కాపునాయాళ్ళకు (పనిలేక) అక్కరలేకపోతే, కమ్మనాయాలుకి, నాకూ పని లేదుపో అన్నాడట. (బంతిలో అందరూ వద్దనగా, ఇష్టముండిన అతడు అనినమాట)

ఇంత మీనువచ్చి, అంతమీనును మింగెనట.

ఇంతేనా బుద్ధులు కుఱ్ఱవాడా! అంటే, కడమవి కావిళ్లతో వస్తున్నవి అన్నాడట!

ఇందమ్మా! తియ్యకూర అంటే, ఇందమ్మ! పుల్లకూర అన్నట్లు.

ఇంద్రద్యుమ్నుడికి మహాకూర్మం దొరికినట్లు.

ఇక పుట్టేనా పెరిగేనా, పన్నెండేండ్ల బాలకుమారుడా ఇంట్లోనే ఏరుగు.

ఇక్కా! ఇక్కా! ఎక్కడుంటావురా! అంటే, అమ్మా! ఇక్కడుంటా, అక్కడా ఉంటా నన్నాడట.

ఇక్కడ మునిగి, అక్కడ తేలేవాడు.

ఇక్కడా అక్కడా ఉంటే ఈడేరిపోతావు, నాఇంటికి రావే నవసి పోదువుగాని.

ఇగిరిపోయిన చెంపలకు, ఇప్ప (విప్ప) నూనె పెడితే, సానిదాని ముఖం నవనవలాడిందట.

[1]ఇగురం ఇల్లలికితే, నెత్తి పొయ్యలుకుతుంది.

ఇగురం ఇల్లుఅలికితే, పిట్టలు ముగ్గు పెట్టినాయట!

ఇగురం తప్పినదాని ఇంటి వెనుక చూడు, [2]ఓగెం తప్పినదాని వంట ఇల్లు చూడు.

1 ఇగురము = పొదుపు. 2 ఓగెం = నేర్పు.

ఇగురం తప్పినపనికి ఊరట లేదు.

ఇగులుపండ్లవాడు ఇంటికిచేటు, పంగలబత్తె పందిరికిచేటు.

ఇ(వి)చిత్రాల పెండ్లికొడుక్కు అక్షింతలు పెడితే, నొసలు గులగుల అని నోట్లేసుకున్నడంట.

ఇచ్చకాలకు ఉచ్చతాగితే, గత్తు(చ్చు)కంపు కొట్టిందట!

ఇచ్చకాలవారు, బుచ్చకాలవారు పొట్టలకొరకు పొక్కులు గోకుతారు.

ఇచ్చింది ఇచ్చి, పుచ్చినదాన్ని కొన్నట్టు.

ఇచ్చినదిచ్చి పుచ్చినదానితో పోయినట్లు.

ఇచ్చింది ఇస్తే, కరణాన్ని కాదు అన్నాడట!

ఇచ్చితినమ్మా! వాయనం అంటే, పుచ్చుకుంటినమ్మా! వాయనం అన్నట్టు.

ఇచ్చి తిరిగేది కోమటి, తీసుకోని తిప్పేది కంసాలి.

ఇచ్చిత్రపు పచ్చిపులుసు, ఇస్తర మింగిందట.

ఇచ్చిన నిష్ఠూరంకంటే, ఇవ్వని నిష్ఠూరమే మేలు.

ఇచ్చినమ్మ ఈగ, పుచ్చుకొన్నమ్మ పులి.

ఇచ్చినవాడు కుక్క, చేసుకున్నవాడు చుక్క (పిల్లను).

ఇచ్చినవాడు తలమీద, ఇవ్వనివాడు నేలమీద.

ఇచ్చినవాడు దాత, ఇవ్వనివాడు రోత.

ఇచ్చినవాడే నచ్చినవాడు, చచ్చినవాడే అచ్చినవాడు.

ఇచ్చిననాడు ఇంట పీనుగ వెళ్ళినట్లు, పుచ్చుకున్ననాడు పుత్రకామేష్ఠి.

ఇచ్చిపుచ్చుకుంటూ ఉంటే వ్యవహారం, వచ్చిపోతూ ఉంటే బాంధవ్యం.

ఇచ్చిపుచ్చుకొని, మొగుడి పీపెల్లా తడివినట్లు.

ఇచ్చిపుచ్చుకోనివాడు గిచ్చిగిచ్చి చంపె.
ఇచ్చుడువాడు కాడు, చచ్చుడువాడూ కాడు; పూటపూటకీ వచ్చువాడు గాడు.
ఇచ్చెనా ఏనుగుపాడి.
ఇచ్చేగొడ్డునే పితికేది.
ఇచ్చేటప్పుడు కాముని పండుగ, పుచ్చుకునేటప్పుడు దీపావళి పండుగ (అప్పు).
ఇచ్చేవాడు తీసుకొనేవాడికి లోకువ.
ఇచ్చేవాణ్ణి చూస్తే, చచ్చేవాడైనా లేస్తాడు.
ఇచ్చేవానికి పత్రమువద్దు, చచ్చేవానికి మందువద్దు.
ఇటిటు రమ్మంటే ఇల్లంతా నాదే నన్నట్లు.
ఇటుకులాడికి రవికపెట్టితే, కంపకుపెట్టి చింపుకున్నదట.
ఇటువేస్తే హనుమంతుడు, అటువేస్తే వీరభద్రుడు.
ఇట్లయితే వైద్యకట్నం, అట్లయితే వైతరణీ గోదానం.
ఇడిసినగుద్ద వీదికి పెద్ద.
ఇదుపులకచ్చకు విడెముపెడితే, గుడిసెలో కుట్టకు పెట్టినాడు.
ఇతరులెరుగకున్న ఈశ్వరు డెరుగడా.
ఇత్తడి పుత్తడికాదు, తొత్తు దొరసాని కాదు.
ఇత్తు యిసరి (ఇసిరి) ఇరస అంబలి కాచి, ఇంటికి నలుగురిని పిలిచి ఇందు (విందు) చేసినట్లు.
ఇత్యర్థుల ఇగురు, ఇతిభావల పులుసు.
ఇదస్తం మాలినముండ వీదికెక్కితే, పొయ్యిమీద [1]గా(య్య)రకాళ్లు చిందులు ద్రొక్కినవి.
ఇది ఇట్లా, మొగుడట్లా, సేద్యగాడికి సంకటెట్లా?

1 గా(య్య)రకాళ్ళు (గేర) = పొట్టేలు మొదలగు సన్నజీవాల ముంగాళ్లు.

ఇదిగో! నున్నఅంటే, ఇదిగో! వెన్న అంటారు.

ఇదిగో పసుపు! ఇదిగో ముసుగు (అంత త్వరలోనే ముండమోసిన దనుట).

ఇదిగో! పులి అంటే, అదిగో! తోక అన్నట్లు.

ఇదిగో! పాము అంటే, అదిగో! పడగ అన్నట్లు.

ఇద్దఱికి సివముస్తే ఇల్లేమి కాను? అంటే, తడికేసి గుసిపెట్టినాను, (బిఱ్ఱు బిగించినాను) దానికేమి పరవాలేదు అందట!

ఇద్దఱు నొకచోట ఏకాంత మాడంగ, వద్ద చేరేవాడు వట్టివిధవ.

ఇద్దఱు కూడితే, ఇంగలం లేకుండానే మంట మండుతుంది.

ఇద్దఱు దెబ్బలాడితే, మూడవవాడికి లాభం.

ఇద్దఱు పెండ్లాలమగడు ఇఱుకునపడి చచ్చెనట.

[1]ఇద్దఱు పెద్దమనుషులు ఎదురుపడితే మూడుదారులు, ఒకపెద్దమనిషి ఇంకొక మూర్ఖుడు ఎదురుపడితే రెండుదార్లు, ఇద్దరూ మూర్ఖులైతే ఒకేదారి.

[2]ఇద్దుం చల్లితే, ముత్తుము పండినట్లు.

ఇనుపకుండ పగిలితే అతుకవచ్చును గాని, మట్టికుండ పగిలితే అతుకలేరు.

ఇనుపగుగ్గిళ్లుకాని, మినుపగుగ్గిళ్లు కావు. (ఇవి)

ఇనుము [3]అడచేవానిని తగరమడవ మనుట.

ఇనుము కరిగేచోట, ఈగలకు ఏంపని?

ఇనుముకు తగిలిన పీడ, ఇంగలానికి తగిలింది.

ఇనుమును జేరి అగ్గి ఇమిడినచందమా.

---

1 ఇద్దరూ యోగ్యులైతే దారివదలి ఇద్దరూ వేరువేరుగా నడచిపోదురు; అటు ఇటు అయిన పెద్దమనిషి వైదొలగిపోవును. ఇద్దరూ మూర్ఖులైన ఉన్న ఒక్కదారివి వదలక ఇద్దరూ ఢీకొందురని.

2 ఇద్దుం = రెండుతూములు. ముత్తుం = మూడుతూములు. 3 అడచు = కొట్టు.

ఇనుము విరిగితే అతకవచ్చును, మనసు విరిగితే అతుకలేము.

ఇన్నికంతులు (కణితలు) కోశానుగాని, నాకంతిఅంత నొప్పి మరేదీ లేదు.

ఇప్ప (విప్ప) పూలకు వాసన వెదుకవలెనా?

ఇప్పుడు వచ్చినవానికేమో ఇరస, అప్పుడు వచ్చినవానికి అడ్డెడు.

ఇమ్మగ జదువనినోరు కుమ్మరి మనుద్రవ్వినట్టి గుంట.

ఇయ్యగల ఇప్పించగల అయ్యలకేగాక మూతిమీసం బన్యులకేలా.

ఇరకట్లు (ఇరుపోటీలు) వల్ల ఇల్లు చెడె, వాయువు నొప్పులవల్ల ఒళ్లు చెడె.

ఇరాటపర్వం (విరాట) ఇంటాయనకొచ్చు, భాగోతం మా బావకొచ్చు, అండ్ల దోనుడుగు ఈండ్లదో నుడుగు నాకింతొచ్చు.

ఇరిగింటమ్మ [1]బఖీలకు పొరిగింటమ్మ నెయ్యి గానుకొన్నదట.

ఇరుగింటమ్మా! పొరుగింటమ్మా! మా ఇంటాయన గోడు చూడండమ్మా! అన్నట్లు.

ఇరుగు ఇంగలం, పొరుగు మంగలం.

ఇరుగుకాదు, పొరుగుకాదు, పెరుగుపోసిన గురిగెకాదు.

ఇరుగుగుడ్డి, పొరుగుగుడ్డి, ఇంటి ఇల్లాలుగుడ్డి.

ఇరుగునుచూచి, పొరుగు వాతపెట్టుకొన్నట్లు.

ఇరుగూరి వ్యవసాయం, ఇద్దరుభార్యల సంసారం ఒకటే.

ఇరుసున కందెనపెట్టక పరమేశ్వరుడి బండిఅయిన పారదు. (లంచము లేక పని కాదనుట)

ఇఱుకులో సరుకు దించినట్లు.

ఇఱుకులో సరుకు మంత్రం.

ఇట్టికొమ్మ అంటే, బట్టకొమ్మ అన్నట్లు.

ఇలను నమ్మి చెడినవాడు, కలికానికి కానరాడు.

1 బఖీలు = పోలెలు, బొబ్బట్లు.

ఇలమంచి ఎరుగని [1]తలమంచి గ్రామము.

ఇ(ల్ల)ల్లెటపు టల్లుడు (ఇల్లిఅకపు) ఇంటికి చేటు, కొమ్ములబర్రె కొట్టానికి చేటు.

ఇల్ల నారాయణమ్మా! అంటే, వెళ్లు గోవిందా అన్నట్టు.

ఇల్లరికముకన్న, మూలరికం (మూలరికం) మేలు.

ఇల్లలుకగానే పండు గౌతుందా?

ఇల్లాము(మ)ల్లకి ఇందునా రెండు, అందునా రెండు.

ఇల్లాలా! ఇల్లాలా! మగ లెందరే? అంటే, తోలాటకాయతో తొంభై మంది అన్నదట.

ఇల్లాలి గుడ్డ మల్లిని చీకె, లంజగుడ్డ బండను చీకె.

ఇల్లాలు గుడ్డిదయితే, ఇంటి కుండలకు చేటు.

ఇల్లాలు లేని ఇల్లు భూతాలకు నిలయము (నెలవు).

ఇల్లాలు శుచి ఇల్లుచూడగానే తెలుస్తుంది.

ఇల్లిటపుటల్లుడు ఇల్లెలపాదికి మొగుడు.

ఇల్లు ఇందువారం, పొయ్యి బుధవారం (కట్టాల).

ఇల్లు ఇచ్చినవానికి, మజ్జిగ పోసినవానికి మంచిలేదు.

ఇల్లు ఇరకటం, ఆలు మరకటం.

ఇల్లు ఈగలపాలు, దొడ్డి దోమలపాలు.

ఇల్లు ఈగలపెంట, దొడ్డి దోమలపెంట.

ఇల్లు ఈదుమాను, పందిరి పట్టెమంచం.

ఇల్లు ఉండగా, [2]ఇడుపున పెట్టుక తినవలెనా?

ఇల్లు ఎక్కి, కొరవి తిప్పినట్లు.

ఇల్లు ఎక్కి, కోక విప్పినట్లు.

---

1 తలమంచి- నెల్లూరు-కోవూరు తాలూకాలో ఒకగ్రామము.

2 ఇడుపు = గోడప్రక్క.

ఇల్లు ఎక్కి గంతులేస్తూ, చూసేవానిమీద తుపాకి పేలుస్తానందట!

ఇల్లు ఏడ్చె అమావాస్య, ఇరుగుపొరుగు ఏడ్చె తద్దినం, ఊరు ఏడ్చె పెండ్లి లేవు.

ఇల్లు కట్టగనే ఎలుకల [1]రావిడి.

ఇల్లు కట్టిచూడు, పెళ్లి చేసిచూడు.

ఇల్లు కాలబెట్టి, జల్లెడతో నీళ్లు పోసినట్లు.

ఇల్లు కాలింది జంగమయ్యా! అంటే, నాజోలె కప్పెర నావద్దనే ఉన్నవిలే అన్నాడట!

ఇల్లుకాలి ఒకడేడ్చె,(ఒళ్లుకాలి ఒకడేడ్చె)

ఇల్లుకాలి ఒకడేడిస్తే, [2]ఇంగిలీకాలకు ఇంకో డేడ్చిందట.

ఇల్లు కాలిపోతుంది ఓ రాజా! అంటే, నాదేమిపోతుంది నరసరాజా? అన్నాడట.

ఇల్లుకాలి యేడుస్తుంటే, చుట్టకు నిప్పివ్వమన్నట్లు.

ఇల్లు కాలుతుంటే (ఆర్పను నీళ్ళకు) బావి తవ్వించినట్లు.

ఇల్లు కాలుతుండగా వాసాలు మూసుకొన్నట్లు.

ఇల్లుచూచి, ఇల్లాలను చూడమన్నారు.

ఇల్లుచూచి పిల్లి సమర్తాడిందట!

ఇల్లుదాటితే ఈడుమాను దాటుతుంది.

ఇల్లుదాటిన ఆడుది లోకానికి లోకువ.

ఇల్లుతిరిగి రమ్మంటే, ఇలారం తిరిగి వచ్చినట్లు.

ఇల్లుపీకి, పందిరి(లి) వేసినట్లు.

ఇల్లుమ్రింగే అత్తకు యుగంమ్రింగే కోడలు.

ఇల్లులేనమ్మ హీనముచూడు, మగడులేనమ్మ మానముచూడు.

ఇల్లు విడిచినతరువాత ఇల్లాలవుతుందా?

---

1 రావి (యా)డి = రాకపోకల సమర్దము; కష్టము.

2 ఇంగిలీకాలు = ఒకవిధమైన చేపలు.

ఇల్లు విడ్చిన ఆడిది, చెట్టు ఇడ్చిన కోతి.

ఇల్లువిడిచిపోరా నంబి! అంటే, నా మాన్యమెక్కడ? అన్నాడట!

ఇల్లువిడిస్తే పిల్లకురుస్తుంది.

ఇల్లు వెళ్ళగొట్టగా ఇడుపుల శృంగారం, మొగుడు వెళ్ళగొట్టగా
　మొత్తం (మొత్తల) శృంగారం.

ఇల్లెక్కి కొరవి ద్రిప్పినట్లు.

ఇల్లే తీర్థం, వాకిలే వారణాసి, కడుపే కైలాసం,

ఇల్లేరు ఇంకితేనేమి? కొల్లేరు పొంగితే నేమి?

ఇలో నారాయణమ్మా! ఇల్లెక్కడంటె, [1]గోవిందరాజుల గోడల్లో
　ఉంది అన్నట్లు.

ఇవతెకూతలముండ ఇండ్లను అతకను పోయిందట.

ఇవతల చెఱ, అవతల సొర, నడుమ రాజ్యం.

ఇవ్వని మొండికి విడువని చండి.

ఇవ్వాళ అందల మెక్కడమెందుకు, రేపు జోలి పట్టడమెందుకు.

ఇవ్వాళ గుఱ్ఱాన్ని ఎక్కడమెందుకు? రేపు గాడిద నెక్కడమెందుకు

ఇష్టంతో ఇచ్చిందే ఈవి.

ఇష్టంలేని పెళ్ళాన్ని 'ఒసే' అన్నా తప్పే! 'అమ్మా' అన్నా తప్పే!

ఇష్టంలేని మొగుణ్ణిజూసి, కొనవేళ్లతో మొత్తుకున్నట్లు.

ఇష్టమైన వస్తువు ఇంగువతో సమానము.

ఇష్టమైనవారి పెంట ఇంగువతో సమానము.

ఇసుంటా రమ్మంటే, ఇల్లంతా అన్నట్లు. (గుద్దలించినట్లు; చెరచి
　నట్లు)

---

1 గోవిందరాజుల గోడలు = తిరుపతి గోవిందరాజులస్వామి దేవాలయప్రాకారాలకు పెద్ద లోగిళ్లు చాలా ఉన్నవి. శ్రీరంగం సప్తప్రాకారాలు మొదటి మూడింటిలో వలెనే యిక్కడా మొదటిప్రాకారంలో కాపురాల యిండ్లున్నవి.

[1]ఇసుక తక్కెడ, పేడ తక్కెడ (గాంధ్రము).
ఇసుకతో తాడు పేనినట్లు.
ఇసుకబావి త్రవ్వ ఎవ్వరి వశము?
ఇస్త్రీవా యనమంటే పుచ్చుకొంటివా యన మన్నట్లు.
ఇస్తే చెడేదిలేదు, చస్తే వచ్చేదిలేదు.
ఇస్తే పెండ్లి, ఇవ్వకపోతే పెటాకులు. (పెడాకులు)
ఇస్తే వరం, పెడితే శాపం.
ఇస్తే హిరణ్యదానం, ఇవ్వకపోతే కన్యాదానం.
ఇహం పరం లేనమ్మా, ఇచ్చినచోటే ఉండమ్మా.
ఇహం మన్ను, పరం పైడి.
ఇహాము పరము లేనిమొగుడు, ఉంటేనేమి? పోతేనేమి?



1 తూచి యిచ్చేబేరంలో ఎదిటివారిని మోసంచేయను ఒకడు ఇసుక మూటగట్టుకొని వస్తే రెండోవాడు పేడ కట్టుకవచ్చినాడట. అంటే ఒకరికి ఒకరు తీసిపోని సమ ఉజ్జీలమట.

## ఈ

ఈ అంబటికేనా ఇరవైనాలుగు నామాలు! (పెట్టవలసిన ద్వాదశ పుండ్రాలుగాక ఇబ్బడిగా పెట్టినట్లు).

'ఈ' (ఇవ్వు) అన్నది ఈ ఇంట లేదు, 'తే' అన్నది తరతరాలుగా వస్తున్నది.

ఈఇంట ఆచారమూ ? మా గ్రహచారమూ ?

ఈ ఊరిరెడ్డి పోరుగూరికి [1]పసు(స)ల పోలుగాడు.

ఈ ఊరికా ఊరెంత దూరమో, ఆ ఊరికి ఈ ఊరూ అంతే.

ఈ ఊళ్ళో పెద్దలెవరంటే తాళ్లు (తాటిచెట్లు), దాతలెవరంటే చాకళ్లు.

ఈఎద్దు ఆఎద్దు జోడు, (అయితే) ఈచేను ఆచేను బీడు.

ఈఎల్ల ఎరుకలమ్మ ఏరూరికి చుట్టమూ?

ఈఏటి పక్షులకుగా నిరుటిగూళ్లలో వెదకినట్లు.

ఈకంటికి ఆకప్పు దూరమూ ?

ఈకలు తీసినకోడి, ఈన(నె)లు తీసినమాల.

ఈకలు తోకలు దులిపి, నూకలలో కలిపినట్లు.

ఈకలు లేవుగాని, వింజమూరి పుంజే!

ఈకష్టాలకన్నా మాఅత్త పెట్టేకష్టాలే బాగున్నాయి అన్నదట.

ఈకీలు మళ్ళితేనే ఆకీలు మళ్లుతుంది.

[2]ఈ కొఱ్ఱకూటికా ఈ ఘోషశాంతి ?

ఈగకు ఇలిలేదు, పాముకు బలిలేదు. (పెట్టదు)

ఈగ పుండుమీద గంటుపెట్టునుగాని గట్టి ఒంటిపై వ్రాలలేదు.

ఈగ వ్రణంకోరు, నక్క పీనుగకోరు.

---

1 పసులపోలుగాడు = ఒక చిన్న వల్లివిపిట్ట: తోక పొడవు.

2 కొఱ్ఱలు మెట్టపైరు ధాన్యం; చాల సన్నితమైన బియ్యం. పథ్యకారి. ఆరికవంటి మెట్టపైరు.

ఈగను కప్ప మ్రింగితే, కప్పను పాము మ్రింగును.

ఈగుడి నేను కట్టించలేదు, ఆగుడి ఎవరు కట్టించారో ఎఱుగను అన్నాడట.

ఈచేత చేస్తారు, ఆచేత అనుభవిస్తారు.

ఈజొన్నకూటికా ఈస్తోత్రపాఠం!

ఈటెపోటు మానుతుందిగాని మాటపోటు మానదు.

ఈడిగవాని ఇంట్లో పాలుతాగినా కల్లే అంటారు.

ఈడుగానిది ఇంటికిరాదు, జోడుగానిది దొడ్డికిరాదు.

ఈడుచూచి పిల్లనియ్యి, పిడిచూచి కొడవలియ్యి.

ఈడ్పుకాళ్లు, ఈడ్పుచేతులు, ఇతడేనమ్మా! ఇల్లిటపుటల్లుడు!

ఈడ్పుకాళ్ళవానికి ఇద్దరు భార్యలు, ఒకతె ఈడవ, ఇంకొకతె ఏడువ.

ఈతకట్టెల నిప్పు ఇంటికిరాదు, ఈడిగవాని పెండ్లాము చేతికిరాదు.

ఈతకుమించిన లోతులేదు, గోచికిమించిన దారిద్ర్యము లేదు.

ఈతగింజ ఇచ్చి, తాటిగింజ లాగినట్లు.

ఈతచెట్టు ఇల్లుకాదు, తాటిచెట్టు తల్లికాదు!

ఈతచెట్టుకింద (తాటిచెట్టు) పాలుతాగినా కల్లే అంటారు!

ఈతనీళ్లు పడితే, పాతజోళ్లు వెళ్లుతవి; ఇప్పనీళ్లు (నీళ్లు-కల్లు అనుట) పడితే, ఎప్పటి జోళ్ళయినా వెళ్లుతవి.

ఈత నేర్చినవానికే జలగండం (నీట చావు).

ఈతవచ్చినపుడు లోతెనిపించునా?

ఈదబోతే, తాగ నీళ్లేలేవు.

ఈదాడంటే కోదాడన్నట్లు.

ఈదాడన్నను మదనుడు కోదాడనువాడు.

ఈదులకు[1] పోయినవాడు, ఇల్లు కాలినవాడు, తాళ్లకు పోయినవాడు తండ్రి చచ్చినా రాడు. (ఈటికల్లు త్రాగను పోయినవాడనుట)

---

1 ఈదులు = ఈతచెట్లు దట్టంగా పెరిగిఉన్నప్రదేశం; ఈతతోపు.

ఈనగాచి నక్కలపాలు చేసినట్లు.
ఈనిన పిల్లికి ఇల్లూ వాకిలీ తెలియనంత ఆకలి.
ఈనిన పులికి ఆకలెక్కువ.
ఈనినపులి పైన బడినట్లు.
ఈనాడు ఇంటిలో, రేపు మంటిలో.
ఈ నెలలో వడ్డీ లేదు, వచ్చే నెలలో అసలూ లేదు.
ఈపిలేనితావున పేలు వెతికినట్లు.
ఈపొడుము పీల్చు నీవే, నీపాడె బిగిస్తానన్నాడట.
ఈ ముడ్డి యిట్లాంటి ఏర్లను ఎన్నిటిని చూడలేదంటే; ఈ ఏరు యిట్లాంటి ముడ్లను ఎన్నిటిని చూడలేదు? అన్నట్లు. (కప్ప ఎగిరితే ఏటిమీద అలిగి ముడ్డి కడుగకుండావచ్చిన అతడు అని, అనిపించుకొనినమాట)
ఈ మొగానికా సేరు పసుపు?
ఈ మొద్దు మొగానికా ఆ గరుడసేవ?
ఈరక్క పెండ్లిలో, పేరక్క గర్భాధానం.
[1]ఈరు తీస్తే పేను రాదా?
ఈవలిగట్టున ఉండే ఆవుకు ఆవలిగట్టు పచ్చన.
ఈల ఒకచోట, చాకిరేవు ఇంకొకచోట.
[2]ఈలగద్దమూకలో కోడిపిల్లకు తలారితనమా?
ఈలోకములో ధర్మముంటే, పరలోకంలో బంధువవుతుంది.
ఈవేళ చస్తే, రేపటికి రెండు. (రెండవనాడనుట)
ఈ[3]సంబడా(ళా)నికేనా ఇంత ఆర్భాటం?
ఈసంబరానికేనా ఇంత వగిరింపు.
ఈసు దెబ్బ దీయును కనిపెట్టుకొనే ఉండును.

---

1 ఈరు = ఈర్పెన; పేమగుడ్డు, ఈపె.
2 ఈలగద్ద = ఈలవేసేగద్ద.
3 సంబడము-సంబరము; వేడుక; ఆర్భాటము. సంబళము = జీతము.

# ఉ

ఉంగరం చెడిపి బొంగరం, బొంగరం చెడిపి ఉంగరం చేసినట్లు.

ఉంగరాలచేతితో మొట్టేవాడు చెబితేనే వింటారు.

ఉంచుకున్నవాడు మగడుకాడు, పెంచుకొన్నవాడు కొడుకుకాడు.

ఉంటే అమీరు, లేకుంటే ఫకీరు.

ఉంటే ఉగాది, లేకుంటే శివరాత్రి.

ఉంటే ఊరు, పోతే పాడు.

ఉంటే అమీరుసాహెబు, లేకుంటే ఫకీరుసాహెబు, చస్తే పీరు సాహెబు.

ఉంటే [1]లిక్కి, పోతే కొడవలి. (పోయినతర్వాత గుణం బయటబడు ననుట)

ఉండ ఇల్లులేదు, పండ మంచములేదు.

ఉండనిస్తే పండుతుంది, ఊడదీస్తే ఎండుతుంది.

ఉండమనలేక ఊదర, పొమ్మనలేక పొగబెట్టినట్లు.

ఉండలేకపోతే, బొండను వేయుమన్నట్లు.

ఉండి యియ్యనిలోభి రండకొంపలో శ్రార్ధమైననేమి, శుభమైననేమి.

ఉండిఉండి ఉప్పరవానిని(తో)పోతే, చచ్చేదాక తట్టలమోతే!

ఉండిఉండి ఉప్పరవానిని కట్టుకొంటే, తట్టతట్టకు తలపోతలే!

ఉండిచూడు ఊరుఅందము. నానాటికీ చూడు నా అందము.

ఉండూరువాడికి కాటిభయం, పొరుగూరివాడికి నీటిభయం.

ఉండే ఒకబిడ్డా, [2]బసివి అయినట్లు.

ఉండేకర్మచాలక, ఉపాకర్మ ఇంకొకదానిని తెచ్చుకొన్నట్లు.

ఉండేదానికి స్థలమిస్తే, పండుకోను మంచం అడిగినట్లు.

---

1 లిక్కి = మెట్టలో కలుపుతీయు చిన్నకొడవలి.

2 బసివి = రాయలసీమలో కొందరు మొక్కుబడికిగా మొదట బుట్టిన ఆడుబిడ్డను పెండ్లిచేయక వదలివేయుదురు. ఈపె వ్యభిచరించినను తప్పుకాదు.

ఉండేది ఒకపిల్ల ఊరంతా మేనరికం.

ఉండేది గడ్డి, పోయింది పొట్టు.

ఉండేవాడు ఉలవ, వెళ్లేవాడు నువ్వు.

ఉండేవి ఉలవవిత్తులైతే, వచ్చేవి [1]పలవవిత్తులు.

ఉండేవెల్ల ఉండగా, ఉపాధ్యాయులభార్యకు ఉప్పుడుబియ్యం!

ఉంౘ్రాళ్లు ఒక పిండివంటేనా? మేనత్తకొడుకూ ఒక మొగుడేనా?

ఉంౘ్రాళ్లు పిండివంటూ కాదు, ఊదర ధాన్యమూ కాదు.

ఉంౘ్రాళ్ళమీద భక్తా? విఘ్నేశ్వరుడిమీద భక్తా?

ఉగ్గుతో నేర్చినగుణం నుగ్గులతోగాని పోదు.

ఉచితానికి ఊళ్ళు, లెక్కకు కాసులు.

ఉ(చ్చ)త్తకుండ ఉట్టికెత్తి నేతికుండ నేలను బెట్టినట్లు.

ఉచ్చగుంటలో చేపలు పట్టినట్లు.

ఉచ్చపోసి గొరిగించారు అంటే, ఎన్నిముంతలు అన్నట్టు!

ఉట్టికి ఎక్కలేనమ్మ స్వర్గానికి ఎక్కునా?

ఉట్టికి ఎగురలేనివాడు, స్వర్గానికి ఎగురుతా నన్నట్లు.

ఉట్టికి, చట్టికి రెంటికి చెడ్డట్టు.

ఉట్టికి నాలుగు [2]చేరులు తెగినట్లు.

ఉట్టిపై పెట్టమన్న, జుట్టుపై పెట్టు.

ఉట్టిమీద కూడు, ఊరిమీద నిద్ర.

ఉట్టిమీద వెన్నపెట్టుకొని, ఊరంతా నేతికి దేవులాడినట్లు.

ఉడకవే ఉడకవే ఓ ఉల్లిగడ్డ! నీ వెంతఉడికినా నీకంపు పోదే!

ఉడకేసుకొని తిని, తడకేసుకొని పడుకొన్నట్లు.

ఉడ(డు)తకు ఉడత(తా) భక్తి.

ఉడత (ఉడుము) కేలరా ఊరిలో పెత్తనం.

---

1 పలవవిత్తులు=పోకిరి విత్తనాలు. 2 చేరులు = తాళ్లు.

ఉడికించని అన్నం, వడుకనిబట్ట (చాకలికి, పల్లెలలో ఉతికించుకొనిన ప్రతి ఇంటివారు రెండుపూటలా అన్నం పెట్టుదురు. ఇక ఇష్టం వచ్చినగుడ్డ కట్టుకోవచ్చు.)

ఉడికిన మెతుకులుతిని, ఊళ్లో ఉండేవాణ్ణి నాకు ఎవరితో ఏమిపని ఉన్నది.

ఉడికిన మెతుకులుతిని, ఉబ్బరపోయినాడు అన్నట్లు.

ఉడికినా తంతా, ఉడకకపోయినా తంతా అన్నట్లు.

ఉడిగి ఉత్తరం చేరును. (వల్లకాదు ఉత్తరాన ఉండును.)

ఉడుకవే కూరా! ఉగాదిదాకా అంటే, నాకేమి పనిలేదు ఏరువాక దాకా అన్నట్లు.

ఉడుత ఊపులకు కాయలు రాలునా?

ఉడుత ఊపులకు మాకులు ఊగునా?

ఉడుత ఊపులకు ఏపులు (ఒకజాతి పెద్దచెట్లు) ఊగునా?

ఉడుము కొవ్వి పోలేరమ్మను పట్టుకొన్నదట.

ఉడుమును చంకలో పెట్టుకొని ఊళ్లో ప్రవేశించినట్లు.

ఉడుము పోతేపోయింది, నాచేయి వస్తే చాలు.

ఉడుములలో తల, పాములలో తోక.

ఉతికే వానికేగాని చాకలి ఉతకడు.

ఉత్తకుండకు ఊపులెక్కువ.

ఉత్తగొడ్డుకు అరపులు మెండు.

ఉత్తచెవికన్న [1]చెవ్వాకు చెవి మేలు.

ఉత్తచేతులతో మూరవేసినట్లు.

ఉత్తపుణ్యానికి మొత్తుక సచ్చిందట.

---

1 చెవ్వాకు=ముసలిఆడవారు చెవులలో పెట్టుకొను రంగువేసిన తాటాకుచుట్ట. చెవ్వు+ఆకు.

ఉత్తమమైన ఇల్లాలు ఊరేగివెళ్లితే, ఉత్తరేణి కాలి ఊళ్లన్నీ కాలి పోయినవట!

ఉత్తముండకన్న అత్తముండ మేలు.

ఉత్తముండవచ్చి, అత్తముండను దూత్ అన్నదట.

ఉత్తములమహిమ నీరుగొలది తామర (వంటిది)

ఉత్తర ఉరిమినా, త్రాచు తరిమినా కురువక-కరవకమానవు.

ఉత్తర ఉరిమి తప్పినా, రాజు పాడితప్పినా చెదలుపురుగుకు తెక్కలు వచ్చినా కష్టం.

[1]ఉత్తరజూచి ఎత్తర గంప, విశాఖజూచి విడువర కొంప.

ఉత్తర పదను ఉలవకు అదను.

ఉత్తరపువాకిలి యిల్లు ఊరకే ఇచ్చినా వద్దు.

ఉత్తరలో ఊడ్చేకంటె, గట్టుమీదకూర్చొని ఏడ్చేది మేలు.

ఉత్తరలో చల్లితే ఊల తగులును.

ఉత్తరలో చల్లినపైరు, [2]కత్తెరలో నరికిన కొయ్య.

ఉత్తరానమబ్బు ఏలితే ఊరకే పోదు (కురియుననుట.)

ఉత్తరాయణం వచ్చింది, ఉరిపెట్టుకో మన్నట్లు.

ఉద్ధతులమధ్య పేదల కుండతరమా?

[3]ఉద్ధరఅయితే ఊళ్లు కొంటారు, నగదు అయితే నశ్యంగూడ కొనరు.

ఉద్ధర అయితే నాకిద్దరు-అన్నాడట.

ఉద్ధరసొమ్ము దుడ్డుకు పంచేరు.

ఉద్ధరసొమ్ము నిద్దుర చేటు.

ఉద్ధరిగెడు నీళ్లు, ఉంగరపువ్రేలు దర్భ.

ఉద్యోగం గట్టిపడుతుంది, ఉన్నపుస్తె తేవే!

---

1 ఉత్తర కార్తెవరకు వానపడకుంటే అదునుదప్పి ఆ ఏడు ఏ పైరుగాని ఎక్కవు.

2 కత్తెర=కృత్తికాసంబంధమైనది కార్తె: కృత్తిక.

3 ఉద్ధర=అప్పుగా ఇచ్చుట (ఉదార్).

ఉద్యోగం పురుషలక్షణం, అదిపోతే అవలక్షణం.

ఉద్యోగం పురుషలక్షణం, గొడ్డలితేరా నిట్రాడు తెగనరుకుదాము.

ఉద్యోగికి ఒక ఊరనిలేదు, ముష్టివానికి ఒక ఇల్లనిలేదు.

ఉద్యోగికి దూరభూమి లేదు.

ఉన్నఅమ్మ గాదె (పాతర) తీసేసరికి, లేని అమ్మ ప్రాణం లేచి పోయింది.

ఉన్నఊరిలో ముష్టిఅయినా పుట్టదు.

ఉన్నఊరివాడికి వెలుతురుభయం, పొరుగూరివాడికి నీడ (ళ్ల)భయం.

ఉన్నఊరు కన్నతల్లి వంటిది.

ఉన్నదిఅంతా ఉండగా, ఉపాధ్యాయులవారిభార్య సమర్తాడిందట.

ఉన్నది ఉండగా, ఉయ్యాలమీద మేడూరు వచ్చిపడ్డట్లు.

ఉన్నది ఉలవకట్టె, పోయినది పొలికట్టె.

ఉన్నది ఒకకూతురు, ఊరంతా అల్లుండ్లు.

ఉన్నది ఒకబిడ్డ, ఊరెల్లా మొగుళ్లు.

ఉన్న ఒక్క మెతుకు కాస్త గంజిలో పోయినట్లు.

ఉన్నదున్నట్లు చెప్పమంటే తిన్నదేమిచేసేను-అన్నదట లంజ.

ఉన్నది పోదు, లేనిది రాదు.

ఉన్నది పోయె, ఉంచుకొన్నదీ పోయె.

ఉన్నదే మనిషికి పుష్టి, తిన్నదే పసరానికి పుష్టి.

ఉన్ననాడు ఉగాదిపండుగ, లేనినాడు కాముని పండుగ.

ఉన్నమాట అంటే, ఉండూరు అచ్చిరాదు.

ఉన్నమాట అంటే, ఉలుకెక్కువ.

ఉన్నమాట అంటే, ఊరికే చేటు.

ఉన్నమాట అంటే, ఊరికి నాకు ఐరాదు.

ఉన్నమ్మ ఉన్నమ్మకే పెట్టె, లేనమ్మా ఉన్నమ్మకే పెట్టె.

ఉన్నవాడు ఉన్నవాడికే పెట్టును, లేనివాడూ ఉన్నవాడికే పెట్టును.
ఉన్నవాడు ఊరికి పెద్ద, చచ్చినవాడు కాటికి పెద్ద.
ఉన్నవాడు కర్చుబెట్టకుంటే అంటారు, లేనివాడు కర్చుబెట్టితే అంటారు.
ఉన్న శాంతం ఊడ్చుకపోయిందిగాని, కోపమే లేదు.
ఉపకారం అంటే, ఊళ్లోనుంచి లేచిపోయినట్లు.
ఉపకారానికిపోతే అపకారం వెంటవచ్చినట్లు.
ఉపకారపు మొగుడువుండే, మనువిచ్చాడట!
ఉపనయనము నాటిమాట ఉన్నది సుమతీ![1]
ఉపాయం లేనివాడు ఉపవాసంతో చచ్చాడు.
ఉపాయం లేనివాణ్ణి ఊళ్లోనుంచి వెళ్లగొట్టుమన్నారు.
ఉపాయము చెప్పవయ్యా అంటే; ఉరిత్రాడు తెచ్చుకొమ్మన్నాడట!
ఉపాయమున్నవాడు ఊరిమీద (పడి) బ్రతుకుతాడు.
ఉపాయమెరుగని దాసరయ్యా, ఊళ్లఉపాసం ఉండయ్యా.
ఉపాయవంతుడు ఊరికి ఉరవడి.
[2]ఉప్పరసన్యాసం ఉభయభ్రష్టత్వం.
ఉప్పు ఊరగాయకాదు.
ఉప్పుకు నిప్పువలె.
ఉప్పుతిని ఉపతాప మందనేల?
ఉప్పుతిన్నకోడె ఊరిపోయింది, పప్పుతిన్నకోడె పాలిపోయింది.
ఉప్పుతిన్న ప్రాణ మూరుకోదు.
ఉప్పుతిన్నవాడు నీరు త్రాగక తప్పదు.
ఉప్పుతో తొమ్మిది; పప్పుతో పది.

1 భవతి భిక్షాందేహి-అనుట.
2 మట్టి త్రవ్వేజాతి; ఒడ్డెవంటి ఇంకొకకులము.

ఉప్పూ పులుసు కారము తినే శరీరానికి ఊపిరి వున్నంతవరకు వుండనే వుంటుంది—కామము.

ఉప్పూ మిరపకాయ ఊరకేరాగా, ఆలినిగొట్ట చేతుల కీటనా ?

ఉప్పుముల్లెను నీటిలో ముంచినట్లు.

ఉప్పూ లేదు, కారమూ లేదు, అమ్మతోడు ! కమ్మగుంది.

ఉప్పులేని పప్పు, ఊరగాయ లేని సద్ది.

ఉప్పువాడు ఏడిశాడు, పప్పువాడు ఏడిశాడు, [1]బొండాపు కాయల వాడు పొర్లి పొర్లి ఏడిశాడు. (ఎవరిసొమ్ము వారికి ఎక్కువనుట)

ఉప్పువాడు చెడె, పప్పువాడూ చెడె. తమలపాకులవాడు తమామూ చెడె.

ఉప్పువేసి పొత్తు కలిపినట్లు.

ఉప్పోడు పప్పోడు ఊరకుంటే, టెంకాయలవాడు పొర్లి పొర్లి ఏడ్చినాడంట (వానవలన దెబ్బ తినిన తర్వాత వాళ్లు ఊరకుంటే చెడని టెంకాయలవాడు ఏడ్చుటే ఇందు విశేషం).

ఉబుసపోకకు పిండిబొమ్మనుచేసి, పీటమీద కూర్చుండబెడితే, ఆడబిడ్డతనాన అదరి అదరి పడిందట.

ఉబ్బుమొగమువాడు ఊరు వెడదామంటె, రెప్పలేనివాడు రేపు వెడదామన్నారు.

ఉభయపవిత్రాలు తిని, ఉద్ధరిణెడు నీళ్లూతాగి, 'ఊహూ' అంటావా ఉత్తమాశ్వమా ?

ఉభయభ్రష్టత్వం, ఉపరి (ఉప్పరి) సన్యాసం.

ఉమ్మడికి (పనికి) బడుగు సొంతానికి పిడుగు.

ఉమ్మడిగా తిని, ఒంటరిగా బలవాలి.

ఉమ్మడిగొడ్డు పుచ్చి చస్తుంది.

---

[1] బొండాపు కాయలవాడు=టెంకాయలవాడు.

ఉమ్మడిబేరం, ఉమ్మడిసేద్యం ఇద్దరికి చేటు.

ఉయ్యాలలో బిడ్డనుపెట్టి, ఊరంతా వెదకినట్లు.

ఉరక కరకుదనము చూపనోర్తురె తజ్ఞుల్,

ఉరికిఉరికి పనులుకాస్తే, ఎన్నాళ్లు కాస్తావు?

ఉరిమి ఉరిమి ఊరిపిడుగు పోలిశెట్టి బుడ్డమీద పడ్డట్లు.

ఉరిమినమబ్బు కురవక మానదు.

ఉరిమిన మబ్బు, తరిమినపాము ఊరకేపోవు.

ఉరిమి మెరుగుకుక్క యోగినే మెరుగురా.

[1]ఉరిసినచోట ఉడుకులు చల్లినట్లు.

ఉరిసినపుండుపై ఉప్పు చల్లినట్లు.

ఉరుకు ఉరుకుమనే సవతేగాని, తోడు ఉరికే నా సవతే లేదు.

ఉరుకుతొత్తుకు విటుడుండనేల.

ఉర్సులకుపోతే, కర్సులకు కావాలి.

ఉలవ కానిపొలం ఊసరక్షేత్రం.

ఉలవచేను పెట్టిన మగ డూరకుండక, పత్తిచేనుపెట్టి ప్రాణంమీదికి తెచ్చినాడు. (పత్తిసేద్యానికి పని ఎక్కువ)

ఉలవలు తింటావా బసవన్నా? అంటే ఊ అన్నట్లు. (తలాడించినట్లు)

ఉలవలు తిన్నమ్మకు ఉలుకు, సజ్జలు తిన్నమ్మకు సలుకు.

ఉలవలు మూలజ్యేష్ఠలలో విత్తినట్లు.

ఉలవ లెత్తమంటే, పూర్వా లెత్తినట్లు.

ఉలవ లెత్తమంటే, ఊళ్ళడిగినట్లు.

ఉలిపీ! ఉలిపీ! ఎక్కడ కెడుతున్నావంటే, ఉలవచేలో [2]వరిగేర బోతున్నాను అన్నట్లు.

---

1. ఉరిసిన = కాలిన.

2 వరిగేరు = వరిపొలంకోసి పనగట్టిన తర్వాత రాలిన ధాన్యములను, వెన్నులను పేదలు ఏరుకొనుట.

[1]ఉలిపికట్టె కేలరా ఊళ్లో పెత్తనాలు?
ఉలుకున్నమ్మకు అలుకెక్కువ, గూద ఉన్నమ్మకు బాధ ఎక్కువ.
ఉల్లాసంబట్టి ఊరికరణాన్ని (కరణంతో) పోతే, దొమ్మరిపట్టి తొంబై యియ్యమన్నదంట.
ఉల్లి ఉంటే మల్లికూడా వంటలక్క!
ఉల్లిఊరినా, మల్లెపూసినా మంచినేలలోనే.
ఉల్లి ఎంతఉడికినా కంపుపోదు;
ఉల్లి కాడలు (కోవలు; కోళ్లు) [2]నిట్రాళ్లగునా?
ఉల్లిగడ్డంత కోడలువస్తే, [3]వలికలోఉన్న అత్త ఉలికిఉలికి పడ్డదట.
ఉల్లి చేసిన మేలు తల్లి అయినా చేయదు.
ఉల్లితిన్న కోమటి ఊరకున్నట్లు (నోరు తెరిస్తే కంపని)
ఉల్లితోట బెరుగు [4]మల్లెమొక్క కరణి.
ఉల్లినినమ్మి, తల్లినినమ్మి చెడ్డవాడు లేడు.
ఉల్లి పదితల్లుల పెట్టు.
ఉల్లిపాయంత బలిజఉంటే, ఊరంత చెడుస్తాడు.
ఉల్లిపాయ పెట్టనికోమటి ఊరంతా ధారపోసినట్లు.
ఉల్లిపూవు ఉల్లిపూవే! మల్లె(ల్లి)పూవు మల్లెపూవే!
ఉల్లి మల్లి అవుతుందా? ఉంచుకున్నది పెళ్ళామవుతుందా?
ఉల్లి మల్లికాదు, కాకి కోకిల కాదు.
ఉల్లి ముట్టనిదే వాసన రాదు.
ఉవిదలబుద్ధి పెడతల నుండుగాదె.

1 ఉలిపికట్టె=పనిలేనివాడు; మూర్ఖుడు.
2 నిట్రాయి=వసారా (పాక)కుగా నిలిపే నిలువు కంబము.
3 వలిక=శ్మశానం. (ఒలికిలి)
4 మల్లె=పొగాకుతోటలో పుట్టగొడుగువలె పెరుగు కలుపుమొక్క. ఇది మొలచిన నేలలో ఇక పైరు ఏపుగా పెరుగదు.

ఉసురు (ఊపిరి) ఉంటే, ఉప్పుకల్లు అమ్ముకొని బ్రతుకవచ్చు. (బ్రతికి యుండిన సుఖములు బడయవచ్చు)

[1]ఉసురుతప్పదు, [2]ఉండేలుదెబ్బ తప్పదు.

[3]ఉస్తికాయ ఊరనెంత? నంజ పెట్టనంత?



1 ఉసురు=గోష్ఠ. 2 ఉండేలుదెబ్బ=ఇంటిలిదెబ్బ. 3 చిన్న అడవికాయ.

## ఊ

'ఊ' అంటే తప్పు, 'ఆ' అంటే తప్పు; నారాయణ అంటే బూతు (మాట).
ఊక ఊకే, నూక నూకే!
ఊగిఊగి ఉయ్యాల, మొదట ఉన్నచోటికే వస్తుంది.
ఊచుగల మగవాడు ఊరికిపోతే, పెసరుచేను అడ్డమాయె నట.
ఊటగ (ఊటుకొని?) తింటే బూకలవాడు, కొంచెంతింటే ఏతలవాడు.
ఊటవేసిన మడి, వాతవేసిన పశువు (కొరగావు).
ఊదుపులు ఉద్ధర కగునా?
ఊదరకూ డెన్నాళ్లు, ఉద్యోగ మెన్నాళ్లు.
[1]ఊదర ఒకధాన్యమా? ఉండ్రాళ్లు ఒక పిండివంటా!
[2]ఊదువేయని దే పీరు లేవదు.
ఊపిరి ఉంటే, ఉప్పుకల్లు అమ్ముకొని బ్రతుకవచ్చు.
ఊపిరిపట్టితే బొజ్జ నిండునా?
[3]ఊబ నామొగుడు, ఊళ్ళో ఉన్నా ఒకటే, దండులో ఉన్నా ఒకటే.
ఊబ నామగడు ఉండీ ఒకటే లేకా ఒకటే.
ఊరంతా ఉత్తరం చూస్తే, దాసరిపుల్లయ్య దక్షిణం చూచెనట!
ఊరంతా ఉల్లి, నీవెందుకే తల్లి.
ఊరంతా ఉల్లిపూస్తే, మాలపల్లి మల్లెపూసె.
ఊరంతా ఊరిముఖం, దాసరి [4]తాళ్లముఖము.
ఊరంతా ఒకదైతే, చేనంతా ఒకమేర.
ఊరంతా ఒకత్రోవ, ఉలిపికట్టెది ఇంకొక త్రోవ.
ఊరంతా ఒకత్రోవ, [5]ఊదుదోకది ఇంకొకదోవ.

---

1 ఊదర = వరిచేలో మొలచే గడ్డిగింజ కలుపుమొక్క.
2 ఊదు = (సాంబ్రాణి) ధూపము.
3 ఊబ = నపుంసకుడు. 4 తాళ్ళు = తాటిచెట్ల తోపు.
5 ఊదుదోక = విడిచిన అడుది: అప్రయోజకురాలు.

ఊరంతా చుట్టాలు, ఉట్టి కట్టుకోను చోటులేదు.

ఊరంతా చుట్టాలు, ఉచ్చబోసుకోను చోటులేదు.

ఊరంతా మేనమామలు, ఉచ్చబోసుకోను చోటులేదు.

ఊరంతా తిరిగి ఇంటిముందుకు వచ్చి, పెళ్ళాం బిడ్డలను తలచుకొని కాళ్లు విరగబడినాడట.

ఊరంతా తిరిగి, నాపేరేమో మొత్తే.

ఊరంతా నాన్నకు లోకువ, నాన్న అమ్మకు లోకువ.

ఊరంతా వడ్లెండబెట్టుకొంటే, నక్క తోక ఎండబెట్టుకొన్నదట!

ఊరక 'మామా' అనక, 'పెళ్ళాంతండ్రీ' అన్నట్లు.

ఊరకరారు మహానుభావులు (మహాత్ములు).

ఊర(రు)కుంటే ఉత్త నా[1]బట్ట, గీరుకుంటే పలవ నాబట్ట!

ఊరకుండడంకంటే, ఊగులాడటం మేలు.

ఊరకుండలేక ఉప్పరిని తగులుకుంటే, తట్టకొక తన్ను తగిలిస్తు[న్నాడు.

ఊరకుండలేక ఒళ్లు ఉమ్మెత్తాకుతో (దురదగొండెతో) రుద్దుకొన్నట్లు.

ఊరకున్న దేవుడికి ఉపారాధన లెట్లు వస్తాయి.

ఊరకున్న ప్రాణానికి ఉచ్చుత్రాళ్లు తెచ్చుకొన్నట్లు.

ఊరకున్న ప్రాణానికి, ఉరిపోసుకున్నట్లు.

ఊరకున్నవాడే ఉత్తమయోగి.

ఊరకున్నవాడిని ఊరేమి చేయలేదు.

ఊరకున్నవాడికి ఊహాలు లావు.

ఊరకున్నవాడికి ఉల్లిమిరియం పెట్టినట్లు.

ఊరకే ఉండినా చేతులేమిచేస్తవని దండంపెట్టినా.

ఊరకే చేసేవాడు ఊళ్ళోవుంటే, అప్పుకుచేసేవాడు ఆరామడనుండి వచ్చినాడట.

---

1 బట్ట=ముట్టుబట్ట అవి ఆడవారి తిట్టు.

ఊరపందికి పన్నీరు, చెవిటికి వీణపాట వంటిది.

ఊరపిచ్చుకకు గుమ్మడికాయంత గూద.

ఊరపిచ్చుకకు తాటికాయంత గూద.

ఊరపిచ్చుకమీాద తాటికాయ పడినట్లు.

ఊరపిచ్చుకమీాద వాడి చంద్రాయుధమా?

ఊరించి ఊరించి, ఉగాదినాడు బూరె ఇచ్చెనట.

ఊరికంతా ఒక బోగముదయితే, ఆ బోగముది ఎవరివద్ద ఆడును?

ఊరికళ గోడలే తెలుపుతాయి.

ఊరికి అమాసే లేదు అన్నట్లు.

ఊరికి ఉపకారంగా, ఆలికి కోక కొనిపెడతాను, ఇంటింటికొక డబ్బి వ్వండి అన్నట్లు.

ఊరికి పోయేవానికి లేకపోయినా, బహిర్భూమికి పోయేవానికి భత్యం కట్టుమన్నట్లు.

ఊరికివచ్చినమ్మ నీరుకు రాదా?

ఊరికుక్క సింగ మొక్కటియగునా?

ఊరికేఉంటే ఊరా పేరా, కట్టదేరా కలిబెట్టుతాను అన్నాడట!

ఊరికేఉండక [1]ఉల్లంకలుపెట్టి, చెప్పుదెబ్బలు సేవకులకు ఇప్పించారట!

ఊరికే పెట్టేఅమ్మను నీమొగుడితోపాటు పెట్టమన్నట్లు.

ఊరికే వస్తే, మావాడు ఇంకొకడు ఉన్నాడు అన్నట్లు.

ఊరికొకవాన, ఊదరకింకొకవాన కురుస్తుందా?

ఊరిజబ్బు చాకలి ఎరుగును, ఉద్యోగిజబ్బు బంట్రోతు ఎరుగును.

ఊరిదగ్గరిచేనుకు అందరూ దొంగలే.

ఊరిన పుండుమీాద ఉప్పుకారం చల్లినట్లు.

ఊరినిండా అప్పులు, తలనిండా బొప్పులు.

---

1 ఉల్లంకలు = తగాదాలు.

ఊరినిండా అప్పులు, నోటినిండా పళ్లు.

ఊరిపిడుగు పోలిశెట్టి బుడ్డమీద పడినదట!

ఊరిమీద ఊరుపడ్డా, కరణంమీద కాసుపడదు.

ఊరిముందరికివచ్చి నా పెళ్ళాం పిల్లా ఎట్లున్నారని అడిగినాడట!

ఊరిముందరిచేను, ఊళ్ళో వియ్యము కొఱగావు.

ఊరిముందరిచేను, ఊరపిచ్చుకల పాలు.

ఊరిముందరిచేనైనా, ఉలవకట్టయినా, ఇంటిమనిషి అయినా, బద్ద పళ్ళుకైనా, బట్టకలిమివాడైనా, మరోకొండ్ర దున్నుతాను అంటుందట ఎద్దు.

ఊరిముందరిసేద్యం, మద్దికాడి, [1]బద్దెల పలుపు వుంటే, ఆ రెండ్లు సేద్యం చేస్తానన్నదట ఎద్దు.

ఊరిముందు [2]ఉరుకులాట, మగనిముందు గంతులాట.

ఊరిలో కుంటి, అడవిలో లేడి.

ఊరివరకు వచ్చి, ఊరి గవిడిముందు పరుగెత్తినట్లు.

ఊరివారంతా వడ్లు ఎండబెట్టుకొంటే, నక్క తోక ఎండబెట్టుకొన్నదట.

ఊరివారి పసుపు, ఊరివారి కుంకుమ, ఎవరిదేమిపోయె.

ఊరివారిబిడ్డను నగరివారు కొడితే, నగరివారిబిడ్డను నారాయణుడు కొడుతాడు.

ఊరివారిబిడ్డను రాజుగారు కొడితే, రాజుగారిబిడ్డను దేవుడు కొట్టును.

ఊరివారి వడ్లపుణ్యాన్ని, మా అత్త ముడ్డిపుణ్యాన్ని, నాకు నేడు భోజనం దొరికింది.

ఊరి శనివచ్చి పీరిసెట్టిని కొట్టినదట!

---

1. బద్దె = నేసినగుడ్డపొడవులో, చివరన నేతలేనిభాగం. దీనితో కాళ్లు పేనిన మెత్తగా వుండును. 2 ఉరుకులాట = పరుగెత్తుట.

ఊరుంటే మాదిగ[1] గేరి ఉండదా?
ఊరుంటే మాలపల్లి (మాలాడ) ఉండదా!
ఊరు ఉసిరికకాయంత, తగవు తాటికాయంత.
ఊరు ఉత్తికాయంత, సిద్ధాంతం తాటికాయంత.
ఊరుకాలిన మంటకు కూడుదుమునా:
ఊరుకొమ్మని ఉరి పెట్టుకొన్నదట!
ఊరుచూస్తే ఉస్తికాయంత, సిద్ధాంతమేమో తాటికాయంత.
ఊరు తిరిగిరమ్మంటే, రోలు తిరిగి వచ్చినట్లు.
ఊరు దూరము, కాడు దగ్గర.
ఊరున్నది, చిప్ప ఉన్నది నాకేమన్నట్లు. (కవళ మెత్తుకోను చిప్పా బొచ్చు)
ఊరుపండితే, ఊరకైనా దొరుకుతుంది.
ఊరు పుట్టినప్పుడే ఉగాది పుట్టినది.
ఊరు పుట్టినప్పటినుండి ఉగాదు లెన్నిరాలేదు! పోలేదు!
ఊరు పొమ్మంటున్నది, కాడు రమ్మంటున్నది.
ఊరుమాసినా పేరుమాయదు.
ఊరులేక పొలిమేర ఉండునా!
ఊరువిడిచినా, ఉలవఅడుగు విడువరాదు.
ఊరువిడిచి పొరుగూరికిపోయినా పూనిన కర్మపోదు.
ఊరూరు మాదిగలు జేరి, తోలు తెగకోసినారట.
ఊరేలినా తా పండుటకు మూడుమూర తావే.
[2]ఊళవేసిన మడిలో నీరు.
ఊళ్లుచేసిన బాకీ, [3]కూళ్లుచేస్తే తీరుతుందా!
ఊళ్ళేలనివారు రాజ్యాలేలుతారా?
ఊళ్లేలే కొడుకున్నా, ఉపాదానమెత్తే పెనిమిటి మేలు.

1 గేరి = వాడ. 2 ఊళవేసిన = [illegible]. 3 కూళ్ళు = కూలీలు.

ఊళ్ళో అధికారమైనా ఉండాల, ఊరంచు పొలమైనా ఉండాల.

ఊళ్లోఉండేది [1]ఉలవవిత్తయితే పైరావచ్చేది పలవవిత్తు.

ఊళ్లో ఇల్లులేదు, పొలంలో చేనులేదు.

ఊళ్ళోపెండ్లయితే ఆంకుముండలకు రాగిసంకటి దిగదు (దిగబడదు).

ఊళ్లోకి రాజుగారు వస్తున్నారంటే, పెండ్లామువంక అనుమానంగా చూచినట్లు.

ఊళ్లోకే రావద్దు రాతా అంటే, గుఱ్ఱాన్ని ఎక్కడ కట్టేసేది అన్నాడట.

ఊళ్లో చుట్టరికము (వియ్యము) ఊరిముందరి చేను పనికిరావు.

ఊళ్లో పెళ్లయితే, కుక్కలకు హడావుడి.

ఊళ్లో ముద్ద, గుళ్లో నిద్ర.

ఊళ్లోవాళ్ల ఉసురుబోసుకొని, నూరేండ్లు బ్రతుకమన్నట్లు.

ఊళ్లోవాళ్ళకు పనిచేసి ఒళ్ళంతా దుమ్ముచేసుకొన్నట్లు.

ఊళ్లోవాళ్ల గుఱ్ఱాలు, తంగేటి[2]సులగలు, మళ్లుకో మన మణికట్టులో ఓపిక ఉన్నంతమటుకు.

ఊసరవిల్లివలె, రంగులు మార్చేవాడు.

ఊసరక్షేత్రంలో [3]అలికితే ఉల్లికోపుల పంట.

ఊసరక్షేత్రంలో దూసరితీగ.

ఊసరక్షేత్రంలో పైరు, నీరులేని చెరువుక్రింద సేద్యము.

ఊహ ఊళ్లేలమంటే, వ్రాత (రాత) రాళ్లు మోయమన్నది.

ఊహాలు ఊళ్లేలుతుంటే, కర్మం కట్టెలు మోస్తున్నది.

---

1 ఉలవవిత్తు = పోకిరి. 2 సులగలు = పెల్లెలు.

3 అలికితే = అదునుకు నారునాటుట (ఊడ్పుట).

## ఋ

ఋణము, రణము ఒకటే.

ఋణశేషం, వ్రణశేషం, శత్రుశేషం, అగ్నిశేషం ఉంచరాదు.

ఋషిమూలం, నదీమూలం, స్త్రీమూలం విచారించరాదు.

---

## ఎ

ఎంగిలాకులు ఎత్తమంటే వచ్చినవాళ్లను లెక్కబెట్టినాడట.

ఎంగిలికి ఎగ్గులేదు, తాగుబోతుకు సిగ్గులేదు.

ఎంగిలిచేత(తితో) కాకిని తోలనివాడు (అదిల్చనివాడు) భిక్షం పెట్టునా?

ఎంగిలితిండికి ఆపోశనం ఎత్తాలనా?

ఎంగిలిబూరెను కడిగినట్లు.

ఎంచకురా పంచుకుంటావు,

ఎంచబోతే, మంచమంతా కంతలే.

ఎంచిన ఎరువేదిరా అంటే, యజమాని పాదమే.

ఎంచివేస్తే ఆరి తరుగుతుందా?

ఎంట్రకాయ కొవ్వితే కలుగులో నిలువదు.

ఎంట్రకాయ కొవ్వినా, యానాది కొవ్వినా కలుగులో ఉండరు.

ఎండ కాచిననాడు ఏకులు వడికి, వాన కురిసిననాడు [1]పత్తి పట్టుకున్నట్లు.

ఎండకు బెట్టిన టోపీ వడగండ్ల కాగునా?

ఎండనగాగక నీడహిత మెరుగవు.

1 పత్తి పట్టుట = పత్తిలో గింజలుతీయుట.

ఎండగాచినచోటే వెన్నెలగూడ కాసేది.

ఎండచే నీడ మెఱయును.

ఎండబడితే ఉండబడుతుంది, ఉండబడితే పండబడుతుంది, పండబడితే తిండిపడుతుంది, తిండిబడితే పండబడుతుంది.

ఎండమావులలో నీరు ఎందు కెక్కినట్లు?

ఎండ మిడిసి కాసినా చీకట్లుకు గుహ లుండనే ఉండును.

✓ఎండాకాలంలో ఏకులువడికి, వానాకాలంలో వడ్లు దంచినట్లు.

ఎండా చింతా తీర్చుకొని, ఎండ మధ్యాహ్నం వచ్చిందట!

ఎండావాన కలిసివస్తే, కుక్కలకు నక్కలకు పెండ్లి.

ఎండావానావస్తే నక్కలపెళ్ళి.

ఎండి ఏదుము పండేకంటే, మురిగి ముత్తుము పండేది మేలు.

ఎండితే తరుగుతుందని పచ్చిదే తినేవాడు.

ఎండిన ఊళ్లగోడు ఎవడికి కావాలి, పండిన ఊళ్ళకు అందఱూ ప్రభువులే.

ఎండినమోడుకు ఎఱ్ఱనిపూలు తగిలించినట్లు.

ఎండునేలమీద ఎండ్రకాయ కనబడితే వానతప్పదు.

ఎండుపండు లేకుండా ఉంటుందా!

ఎండుమామిడి టెంకలు ఒడిలో పెట్టుకొని, ఎవరికాడు తెంపవచ్చావోయి వీరన్నా అన్నదట!

ఎంత ఉన్నవాడైనా ఒకసారి ఒకేముద్ద మింగగలడు.

ఎంత ఉప్పు దింటే అంత దాహం, (దప్పిక)

ఎంత కఱవు అయినా. పులి పూరి మేస్తుందా?

ఎంతచెట్టు కంత గాలి.

ఎంతచెట్టు కంత పాటు.

ఎంతచేసినా ఎడమచేతి కడియం కుద(దు)వే.

ఎంత దరిగిన మిరియాలు జొన్నలు సరిపోవు!

ఎంత తొండమున్నా దోమ ఏనుగుకాదు.

ఎంత దయో దాసులపై అన్నాడు.

ఎంత దయో! [1]నరకడికి, చేతాండు పెతుకుతున్నాడు!

ఎంత నేర్చినా ఎంతజూచినా ఎంతవారలైనా కాంతదాసులే.

ఎంత పండినా కూటికే, ఎంతఉండినా కాటికే.

ఎంత పెద్ద చెట్టు ఎక్కినా. ముడ్డి నేలనే చూస్తుంది.

ఎంత పెద్దవారికయినా ముడ్డి పీతికంపే.

ఎంత పెరిగినా గొత్తెకు బెత్తెడే తోక.

ఎంత పొద్దుండగా లేచినా, [2]తుమ్మగుంటవద్దనే తెల్లారుతుంది.

ఎంత పొద్దుకాడ లేచినా, చింతగుంటపాలెందగ్గతే తెల్లవారుతుంది.

ఎంత పోట్లాడుకున్నా, కల్లుదుకాణంకాడ ఒకటే.

ఎంత ప్రాప్తో అంత ఫలము.

ఎంత మంచి కత్తిఅయినా, తనపిడిని గంటు చేయదు.

ఎంత మంచి గొల్లకయినా వేపకాయంత వెఱ్ఱి లేకపోలేదు.

ఎంత మంచి పందిఅయినా, అమేధ్యం తినకమానదు.

ఎంతయ్యా ఇవ్వాళ బేరంలో లాభమంటే, ఎఱిగినవాడు వెఱ్ఱివాడు రాలేదన్నాడట.

ఎంత లావు మొగవాడైనా ఆడదానికి లోకువే.

ఎంత వానికైనా వేప్పుడుమంగలమైనా ఎ(అ)రువుకావాలి.

ఎంత వారలయినా కాంత దాసులే.

ఎంత వారికైన నింతియె బల్గొతి.

ఎంత వెలుగుకు అంత చీకటి.

ఎంత సంపదో అంత ఆపద.

---

1 నరకడు = నరుడు అనుట; స్త్రీలు పురుషులనుటకు ఉపయోగించే పదము.

2 తుమ్మగుంట = దూరపుపేద్యము అనుట.

ఎంత స్వామిప్రసాద మైతేమాత్రం ఇంతచేదా?
ఎందరో మహాత్ములు. (వ్యంగ్యంగాకూడ ప్రయోగం)
ఎందరో మహానుభావులు, వారందరికి వందనమన్నారు.
ఎందుకు ఏడుస్తావురా పిల్లవాడా? అంటే, ఎల్లుండి మా అమ్మ కొడుతుంది అన్నాడట.
ఎందుకు పుట్టావు ఏకా? అంటే, ఎదుటివాళ్ళను ఎక్కిరించటానికి అందట!
ఎందుకు పుట్టినావు వక్రమా అంటే, సక్రమైనవాళ్ళను వెక్కిరించను అన్నదట.
ఎందుకైనా ముఖరాశి (జన్మరాశి) బాగుండాలన్నారు.
ఎందుకొచ్చినావే ల్లమ్మా? అంటే, అందుకు కాదులే అగ్గికొచ్చాను అన్న ని.
ఎందు పుట్టిన పు. అందులోనే చస్తుంది (బ్రతుకుతుంది).
ఎందులో పెట్టినా ఎడారే.
ఎక్కగా ఎక్కగా పాడవు.
ఎక్కడ ఉన్నావే కంబళీ? అంటే, వేసినచోటనే గొంగళీ అన్నదట.
ఎక్కడ కట్టితేనేమి? మనమందలో ఈనితే సరి.
ఎక్కడ కొట్టినా కుక్కకాలు కుంటుతుంది.
ఎక్కడయినా బావ అనుగాని, వంగతోటలో (కాడ) బావా, అనకు.
ఎక్కడ మేసినా, పేడ మనపెరట్లో వేస్తే చాలు.
ఎక్కడనుంచి వస్తున్నావోయ్ నత్తాయనా? అంటే, ర రెడ్డోరి రింటినుం నుంచో చోయ్ న నంగాయన అన్నాడట.
ఎక్కడ మేసినా, మనఇంట్లో పాలిస్తే చాలు.
ఎక్కడా దొరక్కపోతే, అక్కమొగుడే గతి.
ఎక్కడా లేకపోతే, అక్కమొగుడే దిక్కు.

ఎక్కడికి పోతావు విధవమ్మా? అంటే, వెంటవస్తాను పదవమ్మా అన్నదట.

ఎక్కడికి పోయినా, [1]ఏలినాటి శని తప్పదు.

ఎక్కడికి పోయినా, కర్మం ఎదురుగుండానే వస్తుంది.

ఎక్కడికి వెళ్ళినా తెడ్డు ఏగానే.

ఎక్కడి దక్కడే ఉంచి, ఎల్లమ్మ ఇల్లలికినట్లు!

ఎక్కడిదిరా ఈ పెత్తనం? అంటే, మూలనుంటే నెత్తిన వేసుకున్నానన్నాడట!

ఎక్కడి నీరూ పల్లానికే చేరుతుంది. (పారుతుంది)

ఎక్కమంటే ఎద్దుకు కోపం, దిగమంటే కుంటికి కోపం.

ఎక్కితే గుఱ్ఱపు రౌతు, దిగితే కాలిబంటు.

ఎక్కి కాయ పట్టిచూచి, దిగివచ్చి రాళ్లు రువ్వినట్లు

ఎక్కినవానికి ఏనుగు లొజ్జ.

ఎక్కిరించబోయి, వెలకిత్తలా (వెల్లికింతల) పడ్డట్లు

ఎక్కువగా తిన్నపొట్ట, ఏకులుపెట్టిన బుట్టి చిరుగక్క.

ఎక్కువ తెలివి ఏడ్పులకారణం, తక్కువ తెలివి తన్నులకారణం.

ఎక్కువయినసొమ్ము బ్రహ్మల కిత్తునా? బట్ల కిత్తునా?

ఎగతాళి అంటే ఏడువ వస్తాడు, కోడిగమంటే కొట్టవస్తాడు.

ఎగతాళి చేసేవారిముందు జారిపడినట్లు.

ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య.

ఎగవేసేవాడి యిల్లెక్కడా? అంటే, ఊరికడపట అన్నట్లు.

ఎగిరిన దూది గాలిలో ఎంతసేపో ఉండదు.

ఎగిరెగిరి దంచినా అంతేకూలి, ఎగరక దంచినా అంతే కూలి.

---

1 ఏలిననాటి శని—చంద్రలగ్నాత్ గోచారంలో శని జన్మ—అష్టమ వ్యయస్థానము లందుసంచరించునాటి ఫలితం. 2½ సంవత్సరం ఒక్కొక్కతావానికి సంతున 7½ సంవత్సరాలు. దీనిని ఏడ్డాళ్ళశని అనికూడ అందురు.

ఎగిరే ఎద్దే గంత మోసేది.

ఎగురబోయి బోర్లపడి, ఊరు అచ్చివచ్చిందికాదు అన్నాడట!

ఎగువా దాసంగం, దిగువా దాసంగం,

ఎగ్గును అనక వినక కనక కవి కావ్యమును వ్రాయలేడు.

ఎచ్చడి ఎగబలికితే, కల్లు గుగ్గిళ్లు కలబలికినవి.

[1]ఎచ్చులకు [2]ఏటపోతునుకోస్తే, ఒళ్ళంతా బొచ్చు అయింది.

ఎచ్చులకు ఏలేశ్వరంపోతే, పక్కతోలు కుక్క లెత్తుకపోయినవి.

ఎచ్చులకు వేటపాలెంపోతే, తన్ని తలగుడ్డ తీసుకున్నారట!

ఎచ్చులకు యామారంపోతే తన్ని తలగుడ్డ పెరుకున్నారట.

ఎట్లా (ఎట్లాంటి) చిగురుబోణికైనా, వేపకాయంత వెఱ్ఱుంటుంది.

ఎడు[illegible]చ్ఛ్యాన్ అల్లైపోతుంది, తేలికగా వచ్చింది తేలికగానే పోతుంది.

ఎడదిడ్డ మంటే, పెడదిడ్డ మన్నట్లు.

ఎడపిల్ల ఏరాలితో సమానం.

ఎడమచేత్తో చేసింది, కుడిచేత్తో అనుభవించవలె.

ఎడ్డెమంటే, తెడ్డెమన్నట్లు.

[3]ఎతలకు ఏరుపడితే, నెత్తికుంపటి అయిందట!

ఎతలున్నమ్మకు కతలు కావు.

ఎత్తం పోయేవాడా! ఏదుట్లో ఓనుడుగువేసి పోరా అన్నట్లు.

ఎత్తివచ్చిన కాపురానికి ఏకాలూనినా ఒకటే.

ఎత్తుకున్న చంక నుండదు, దించిన దిగువ నుండదు. (బిడ్డ)

ఎత్తుక తిన్నవాణ్ణి పొత్తులో పెట్టుకుంటే, అంతా తీసి, బొంతలో పెట్టుకున్నాడట!

---

1 ఎచ్చులు = దంభములు.  2 ఏట = (ఏదిక; వేట) పొట్టేలు.

3 ఎతలు = వెతలు, ఎత్తులు.

ఎత్తుకున్న బిడ్డ మొత్తుకున్నా దిగదు,

ఎత్తుకొనితిన్న బోలె ఎదురుగా వస్తే, చంకనున్న బోలె సలాం చేసిందట!

ఎత్తుపడిన గొడ్డు పులికి జడుస్తుందా?

[1]ఎత్తుబారం, సంజ చీకటి.

ఎత్తుబారపు పెండ్లికి ఏకాలుబెట్టినా ఒకటే.

ఎత్తుబారం మొత్తుకోళ్ళు.

ఎత్తు మరిగినబిడ్డ, వెలుగుదాటేగొడ్డు ఏమిచేసినా మానవు.

ఎత్తువారి చేతిబిడ్డ, (ఎవరిచంకనున్న వారిమాట వినును).

ఎత్తెత్తి అడుగువేస్తే, పుల్లాకుమీద పడిందట!

ఎత్తెత్తిపోసిన ఇత్తడి బంగారమగునా.

ఎత్తేవాడుంటే ఏకులబుట్టా బరువే.

ఎదలో కత్తెర, నాలుకలో బెల్లం.

[2]ఎదగొడ్డుకు బెదురుండదు.

ఎదిగినదానిని వెంటేసుకొని తిరిగినట్లు.

ఎదుట అన్నది మాట, ఎదాన పెట్టినది వాత.

ఎదుట ఉన్నవాడు పెండ్లికొడుకు.

ఎదుట బ్రాహ్మడు లేకపోతే, వెయ్యియజ్ఞాలు చేయవచ్చు.

ఎదుట లేకుంటే, ఎదలో ఉండదు.

ఎదుటింటిపొయ్యి మండితే, తనపొయ్యిలో నీళ్లు పోసుకొన్నట్లు.

ఎదుటింట్లో పెండ్లి అవుతుం దనుకొన్నట్లు.

ఎదుటివారిసొమ్ము (ద్రవ్యం) ఎల్లవారికి తీపు.

ఎదురుగుండా అద్దముంటే ఎక్కిరించుకో బుద్ధవుతుంది.

---

1 ఎత్తుబారం = వ్యర్థమైన; పనికిమాలిన.

2 ఎదగొడ్డు = ఎద, లేక పైరు అయినది; ఋతుకాలమునకు వచ్చినది.

ఎదురు తిరిగిన కుక్కను ఏదీ కరవలేదు.

ఎదురు తిరిగిన కుక్క, ఏదుపంది ఒకటి.

ఎదురుపడినవాడే నా మొగు డన్నట్లు.

ఎదురుపెట్టి, కుదురు కొట్టించుకున్నట్లు.

ఎదురుపెట్టి చదరంగమాడినట్లు.

ఎద్దుఅంత కుప్పయితే ఏడుపుట్ల [1]చోళ్లు.

ఎద్దుఅడుగులో ఏడుగింజలుపడితే పైరుపంట పలుచన.

ఎద్దుఅడుగులో ఏడు[2]చావిడములుంటే పట్టుకోబోతే పది పాటిపోయె.

ఎదు (దున్న) ఈనిందంటే, గాట కట్టివేయమన్నట్లు.

ఎద్దు ఉన్నవాడికి బుద్ధిఉండదు, బుద్ధున్నవాడికి ఎద్దుండదు.

ఎద్దు ఎండకులాగ, ఎనుబోతు నీడకులాగ.

ఎద్దు (నె) ఎక్కిన తీరుకాదు, సద్దితిన్న నోరుకాదు.

ఎద్దు ఎక్కినవాడే లింగడు, గద్దె నెక్కినవాడే రంగడు.

ఎద్దు ఏమెఱుగురా అటుకుల రుచి, గాడి దేమెఱుగురా గంధపుపొడి వాసన. (గందడివాసన)

ఎద్దు ఓగలేదు, పై బాగలేదు.

ఎద్దుకాలిలో ముల్లంత లేకపోయినా, ఏడూళ్ళ పెత్తనానికి తక్కువ లేదు.

ఎద్దుకు ఎనుబోతుకు లంకె వేసినట్లు.

ఎద్దుకు కొబ్బరికాయ ఇస్తే ఏంచేస్తుంది!

ఎద్దుకు చొప్పవేసి ఆవును పాలీయమన్నట్లు.

ఎద్దుకు తూలాలని ఉంది, గంతకు పడాలనీ ఉంది.

ఎద్దు కొగవేయ, బత్తెకు సగవేయ.

1 చోళ్ళు = పఞ్జలు.

2 చావిడులు-చవిడాలు = ఎండబెట్టిన కాటాకుచేప అనే సముద్రపు చేప.

ఎద్దు కేమి తెలుసు, అటుకుల చవి.
ఎద్దుకొద్దీ సేద్యం, సద్దికొద్దీ పయనం.
ఎద్దుకొమ్ము, ఆబోతుపై అంకె వేసినట్లు.
ఎద్దుగా ఏడాది బ్రతికేకంటే, ఆబోతుగా (ఇరు) ఆరునెలలే చాలు.
ఎద్దు చచ్చినా వాత బాగా పడింది.
ఎద్దు చేను మేసిపోతే, గాడిదకు చెవులు కోసినట్లు.
ఎద్దు తంతుందని, గాడిదకాళ్లు పట్టుకున్నట్లు.
ఎద్దు తన్నుతుందని గుఱ్ఱంచాటు చేరినట్లు.
ఎద్దుతో వ్యవసాయం, ఆలితో సంసారం.
ఎద్దు దున్నగా, పిణుజు వగర్చినట్లు.
ఎద్దును అడిగా గంత కట్టేది?
ఎద్దును కొద్దిలో కొనరాదు, బట్టను భారిలో కొనరాదు.
ఎద్దునుచూస్తే ముద్దువస్తుంది, ఈద్పుచూస్తే ఏడ్పువస్తుంది.
ఎద్దును ముద్దు పెట్టుకోబోతే, ఎడమకాలితో తన్నింది.
ఎద్దునోటికి చొప్ప అందించినట్లు (ఆదుకొనుట అనుట).
ఎద్దున్నవాడి వ్యవసాయం చూడు, మంది ఉన్నవాడి మారుబలం చూడు.
ఎద్దుపుండు కాకికి ముద్దా?
ఎద్దుపుండు కాకికి రుచి.
ఎద్దు పొడుస్తుందని, తన్నే గుర్రం చాటున చేరినట్లు.
ఎద్దుబలం ఏడు బలం.
ఎద్దు బీదయితే చేను బీద.
ఎద్దు మంచిదయితే వేరూరికి పోతుందా!
ఎద్దు మోసినంత, గోన పట్టినంత.
ఎద్దు రొమ్ములో ముల్లుకఱ్ఱ పొడిచినట్లు.
ఎద్దులవెంబడే కాళ్లు.

ఎద్దులా కష్టపడినా ఎంగిలిగంజే గతి.

ఎద్దులు కాసినందుకు ముద్దలు మింగినందుకు సరిపోయిందిపో అన్నాడట.

ఎద్దులు చెయ్యను, గుత్తాలు మొయ్యను. (మేయను)

ఎద్దు లెప్పటివేగాని గోనెలుమాత్రం కొత్తవి.

ఎద్దువలె ఉన్నావే! తేలుమంత్రం తెలియదా!

ఎద్దువలె కుక్కనుపెంచి, రెడ్డి తానే (ఆలుమగలు తామే) మొరిగినారట.

ఎద్దువలె తిని మొద్దువలె నిద్రపోయినట్లు.

ఎద్దైనా ఏడాదికి నేర్చును, మొద్దు ముప్పైఏళ్ళకయినా నేర్వదు.

ఎద్దో! అంటే, గిద్దెడు పాలు అన్నట్లు.

ఎనిసిన తెడ్డు చవులెరుగదు.

ఎనుబోతు పేదల యుశముగోరు.

ఎనుబోతు బలిసి ఏనుగువలెనున్న భ్రమరంబులకు మద ప్రాప్తిలేదు.

ఎనుబోతుమీద వాన కురిసినట్లు.

ఎనుబోతు ఈనింది రెడ్డీ! అంటే, నీకేమి కద్దేబొడ్డీ! అన్నాడట!

ఎనుబోతుతో ఎద్దును [1]ఏరుకొట్టినట్లు.

ఎనుము గొప్పదైనా ఏనుగు బోలునా.

ఎనుము ముసలి ఏనాది ముసలిలేవు. (ఈనుతూ కంటూనే ఉండును)

ఎనుముకు మేతవేసి, ఆవును పితికినట్లు.

ఎన్నడుగానని మొగానికి, ఇప్పపూత బెల్లమంట!

ఎన్నడులేని కల్మిగల్గెనా. వెన్నున కద్దముడుగు, కొనవేళ్లకు ముచ్చెలు దొడుగు.

1 ఏరు = పన్నిన (కట్టి సిద్ధముచేసిన) నాగలి; గడెము.

ఎన్నడూ ఎక్కని రెడ్డి గుఱ్ఱమెక్కితే, వెనుకముందయిందట!
ఎన్నడూ ఎఱుగని వానిని ఎద్దుల బేరానికి పంపితే, ఎఱ్ఱెద్దుకు ఎనభై, నల్లెద్దుకు నలభై అన్నాడట!
ఎన్నడూ దొరకనమ్మకు ఏగాని దొరికితే, ఏడుముళ్లు వేసిందట!
ఎన్నడూ నామగడు 'ఎల్లీ! ఎల్లీ!' అనలేదుగాని, ఇల్లుకాలిన్నాడు ఎల్లీ! ఎల్లీ! అన్నాడు.
ఎన్ని పుటాలేసినా ఇత్తడి ఇత్తడే, పుత్తడి పుత్తడే!
ఎన్ని పుటాలువేసినా పుట్టుబుద్ధి పోదు.
ఎన్నిబూతులైనా పిడికెడు కొట్లతో సరికావు.
ఎన్ని ముట్టుపాతలైతే, ఒక కట్టుకోక అవుతుంది.
ఎన్నివిద్యలైనా కులవిద్యకు సాటిరావు.
ఎన్ని సూదులైతే ఒక గడ్డపార కాను!
ఎన్నోవ్రణాలు కోసినానుగాని, నా వ్రణమంత తీపులేదు అన్నాడట.
ఎప్పుడు ఎరగనోడు ఏతాము తొక్కితే ఏటా ఆరుబారల అప్పు.
ఎప్పుడు బెట్టే నాలుగుబెట్టి (చీవాట్లు) కొట్లచేట బయటబెట్టు అన్నాడట.
ఎప్పుడూ యోచిస్తుండేవాడు అభాగ్యుడు, ఎన్నడూ యోచించని వాడు అవివేకి.
ఎప్పటి అమ్మకు [1]నిప్పటే గతి.
ఎముక కొరికే కుక్క ఇనుము కొఱుకునా!
ఎముకలేని నాలుక, ఎట్లా తిప్పినా తిరుగుతుంది.
ఎముకలేని నాలుక, ఏమయినా పలుకుతుంది.
ఎరవుల కంచమని, ఏదో పెట్టుక తిన్నట్లు.
ఎరవుల సొమ్ములు బరువుల చేటు, తియ్యను పెట్టను తీపుల చేటు, దానిలో ఒకటిపోతే అప్పుల చేటు.
ఎరువు ఉంటే, వెఱ్ఱివాడూ సేద్యగాడే.

1 నిప్పటి = అరిసె.

ఎరువును నమ్మి, బొంతను పొయిలో పెట్టుకొన్నట్లు.
ఎరువు పెట్టినపొలము, ఏలుబడి అయిన కోడలు.
ఎరువులేనిపైరు, పరువులేని రైతు.
ఎరువులేని పొలము, వేగంలేని ఏరు.
ఎరువులేని సేద్యం. కరవుదేవతకు వాద్యం.
ఎరువువేయగానే ఊసరక్షేత్రం ఫలించునా?
ఎరువు సతముకాదు, వాగు [1]జోదూకాదు.
ఎరువు స్థిరంకాదు, బరువు తేలికకాదు.
ఎరువూ వెంపలివేస్తే, ఎదిగిందే పైరు.
ఎఱిగిఎఱిగి చేసినపాపం, ఏడ్చిఏడ్చి పోగొట్టుకోవలె.
ఎలుక తేలిన (ఏలిన) ఏడుఘడియలకు వాన.
ఏలుక పిడికెడు ధనము.
ఎలుగనిడొళ్లో ఎమ్మెలుచేస్తే, ఏకులు నీమగడు వడుకుతాడా?
ఎఱ్ఱకోమటనీ, నల్లబ్రాహ్మణ్ణీ నమ్మరాదు.
ఎఱ్ఱమాదిగను, నల్లబాపని నమ్మరాదు.
ఎఱ్ఱని ఆకాశానికి బఱ్ఱున వానలు.
ఎఱ్ఱనువేసి, చేపను పట్టినట్లు.
ఎఱ్ఱనేలపంట ఒకనాటి వంట.
ఎలమఱ్ఱుకు ఎద్దు నివ్వరాదు, పామఱ్ఱుకు పడుచు నివ్వరాదు.
ఎలుక ఎప్పుడూ తనదిక్కుకే తవ్వుకుంటుంది.
ఎలుక ఎంత ఏడ్చినా పిల్లి కనికరిస్తుందా?
ఎలుక ఏట్లో పోతేనేమి? పులి బోనున పడితేనేమి?
ఎలుకకు పిల్లి సాక్షి.
ఎలుకచావుకు పిల్లి మూర్ఛపోతుందా?

1 జోదూ = ఊట.

ఎలుకతోలు ఎంత తోమినా నలుపే.
ఎలుకనోట్లోనుంచి ఏనుగదంతాలు రావు.
ఎలుకమీాద కోపంతో ఇంటికి చిచ్చుపెట్టుకొన్నట్లు.
[1]ఎలుక సంసారంచూచి, పిల్లి మూర్ఛబోయిందట.
ఎలుగ్గొడ్డుకు రోమాలేవి? సెప్పా లేవి?
ఎలుగుబంటికి [2]తంటసము తీసినట్లు. (ఒక్కొక్క వెంట్రుకలాగితే వగదెగేపని కాదనుట).
ఎల్లపాములు తలెత్తితే, ఏలికపామూ తల ఎత్తిందట!
ఎల్లమ్మ పెళ్లిలో పుల్లమ్మ శోభనం.
ఎల్లమ్మబ్రతుకు తెల్లవారితే తెలుస్తుంది.
ఎల్లయ్యకు ఎడ్లులేవు, మల్లయ్యకు మనుష్యులు లేరు.
ఎల్లయ్య కెడ్లులేవు, మల్లయ్యకు బండిలేదు, తెల్లవార్లు బాడుగే.
ఎల్లవారమ్మల బ్రతుకు తెల్లవారితే తెలుస్తుంది.
ఎల్లినదానికి ఏగాని, తార్చినదానికి టంకం.
ఎల్లిని మల్లిచేయు, మల్లిని ఎల్లిచేయు.
ఎల్లిమీాద పుల్లి, పుల్లిమీాద మల్లి.
ఎల్లిసెట్టి లెక్క ఏకలెక్క.
ఎవ్వడబ్బసొమ్మని వెక్కివెక్కి యేడ్వడం.
ఎవడికంపు వాడికి ఇంపు.
ఎవడిజందెం వాడికి ముప్పు.
ఎవడి నోటికంపు వాడికి తెలియదు.
ఎవడు త్రవ్వుకున్న గోతిలో వాడే పడతాడు.
ఎవరిఇంటి దోసకైనా తూట్లే!

---

1 ఎలుకకు ఏటికి మూడుకాన్పులు.

2 తంటసము=వెంట్రుకలు లాగెడి మంగలి పనిముట్టు; చింటా.

ఎవరిఏడుపు వాళ్ళకే ఎదురు తగులుతుంది.

ఎవరి కంతి కోస్తే వారికే నొప్పి.

ఎవరిపిచ్చి వారికి ఆనందం.

ఎవరికి పుట్టిన బిడ్డవురా ఎక్కిఎక్కి ఏడ్చేవు?

ఎవరికి పెట్టావే దండము? అంటే, మీాలో బుద్ధిహీనుడికి అన్నదట ఒక సాని.

ఎవరికి వారే యమునా తీరే.

ఎవరికో బుట్టిన బిడ్డను, తనబిడ్డని ఎగిరెగిరి ముద్దుబెట్టుకొన్నట్లు.

ఎవరి జానతో వారు ఏడు జానలబెత్తడే. (పొడవు)

ఎవరినీళ్ళలో వారు మునుగాలి.

ఎవరి పాపాన వాళ్ళు పోతారు.

ఎవరిపిచ్చి వాళ్లకు ఆనందం.

ఎవరి ప్రాణం వాళ్ళకు తీపి.

ఎవరిబిడ్డ వారికి ముద్దు.

ఎవరి ముడ్డికిందికి నీళ్ళువస్తే వాళ్ళే లేస్తారు.

ఎవరివల్ల చెడ్డావోయి వీరన్నా అంటే, నోటివల్ల చెడ్డానోయి పేరన్నా అన్నాడట!

ఎవరు ఇచ్చింది ఈమాన్యం అంటే, నేనే ఇచ్చుకున్నాను అన్నాడట.

ఎవరు ఏమిచేసినా ఇంటికి ఆలుఅవుతుందా; దొంతికి కడప అవుతుందా.

ఎవరూ లేకపోతే అక్కమొగుడే (అక్కరకు వచ్చేది) దిక్కు.

ఎవ రేలితే నేమి, వడ్లు దంచక బియ్యం రా(కా)వు.

ఎసటిలో మెతుకులన్నీ పట్టిచూడాలనా!



# ఏ

ఏఅన్నమైతే ఏం! వరిఅన్నమే ఒడ్డించమన్నాడట.

ఏఆకు రాలినా ఈతాకు రాలదు.

ఏఊరు ఏతామా? అంటే, దువ్వారే దూలామా? అన్నదట!

ఏఊరు రెడ్డి? అంటే, ఏట్లో మోకాటిలోతు అన్నాడట.

ఏ ఎండకు ఆగొడుగు పట్టినట్లు.

ఏకచక్రంబుగా ఏలినరాజైనా, కడ కేడుజేనల కాటికే.

ఏకదంతుం డిచ్చు నీకింత బొచ్చు.

ఏకట్టున నిప్పంటే, ఆకట్టే కాలును.

ఏకాదశా బ్రాహ్మడా? అంటే, ఆపదలు కాపురాలు చేస్తాయా? అన్నాడట! (పస్తున్నవానిమాట)

ఏకాదశి ఇంటికి, శివరాత్రి పోయినట్లు.

ఏకాదశినాడు తల అంటుకుంటావేమి? అంటే, అది నిత్యవ్రతము, నేడే ఆరంభించాను అన్నాడట; మర్నాడు తల ఎందుకు అంటుకో లేదంటే, నిన్నటితో వ్రతము సమాప్తి అయినది అన్నాడట.

ఏకాదశినాడు పేలపిండి తినకపోతే రాకాసులై పుడుతారు.

ఏకాదశి మరణమని, ఈతకొయ్యలలో పడతానా!

ఏకానికి బెల్లం? ఏకానికి ఉప్పు? అని అడిగినాడట ఒకశిష్యుడు. (పరమానందయ్య శిష్యుడు).

ఏకాల వచ్చి, మేకాల తేలినట్లు.

ఏకాలు జారినా పిట్టకే మోసం.

ఏకాలు జారినా మోపుకే మోసం.

ఏకుతో తాకితే, మేకుతో మోదుతారు.

ఏకు దారము, ఏగాని పుస్తె.

ఏకులవంటి మెతుకులు చేసుకొని, ఎనుము పెరుగు పోసుకొని, యమ
రాలిని గనుక తింటున్నాను గాని, దగ్గరికి రాకండి పిల్లల్లారా!
దడుసుకుంటారు అన్నదట.

ఏకులు పెడితే (ఉంచిన) బుట్టలు చిరు(ను)గునా ?

ఏకులు లేని రాటము, మొగుడు లేని పోరాటము.

ఏకులు వడికినట్టూ కాదు, మొగుడిదగ్గఱ తొంగున్నట్టూ కాదు.

ఏకైకరథులు ప్రత్యేకపు పాలెగాండ్రు.

ఏగాని ముండకు, డబ్బున్నర తువరం.

ఏగాలి కాడూగు ఊగినట్లు.

ఏగాలి కాచాప ఎత్తినట్లు. (పడవ తెరచాప)

[1]ఏగిలి చేస్తే, ఏలనివానికైనా పండుతుంది.

ఏగిలి దున్నితే, వెట్టిమాలకైనా పండుతుంది.

ఏగుంటలో నీరు ఆ గుంటలోనే ఇంకుతుంది.

ఏగుత్తానికి తోక ఉంటే, ఆ గుత్తమే ఊపుకొంటుంది.

ఏగూటి చిలుకకు ఆగూటిపలుకు.

ఏగూటిపక్షి ఆగూటికే చేరును.

ఏగ్రహము పట్టినా ఆగ్రహము పట్టరాదు.

ఏచంక నాకినా ఏమిలేదుగాని, ఏకుచంక నాకితే ఏగాని ఉంది.

ఏచెట్టూ లేనిచోట, వెంపలిచెట్టు (ఆముదపుచెట్టు) మహావృక్షము.

ఏజన్మమున పాత్రమెరిగి దానంబీక పూజించమరచి వేల్పునాడుకో
నేల.

ఏటి అవతల ఇచ్చేకన్న, ఎట్లో పడేస్తే నయం.

ఏటిఅవతలి మిరియాలు మాతాటికాయ అంతేసి అంటే, మా [2]ఇదు
మాకులే పట్టలేదన్నదట.

1 ఏగిలి = దుక్కి బాగుగ ఎండుట.

2 ఇదిమాకులు = ఇదుపులు. ఇంటిముందరి ప్రాంగణము.

ఏటి ఈతకు బీటిమేతకు సరి.

ఏటిబడ్డు చేను, ఏరువస్తే నిలుస్తుందా ?

ఏటివడ్డున చేను, చీటికిమాటికి భయం.

ఏటికాడ నక్కకు పాటిరేవేమి తెలుసు ?

ఏటికి ఎప్పుడు పోయినావు? ఇసుక ఎప్పుడు తెచ్చావు? అంటే, ఆడవారు తలిస్తే అదెంతసేపు అన్నదట; మగవారు తలిస్తే ఇదెంతసేపు అని, నాలుగు బాదినాడట.

ఏటికాల్వజాడ ఎక్కి తగ్గడిరీతి.

ఏటికి ఎదురీదినట్లు.

✓ ఏటికి ఎన్ని నీళ్లు వచ్చినా, కుక్కకు గతుకు నీళ్లే.

ఏటికిబోయి జారిపడి, ఊరు అచ్చిరాలేదన్నట్లు.

ఏటికి లాగితే కోటికీ, కోటికి లాగితే ఏటికి అన్నట్లు.

ఏటిగట్టున, కూటిగట్టున ఓపిక పట్టలేరు.

ఏటిదరి మ్రానుకు ఎప్పుడూ గండమే!

ఏటిమంటికి బీటిమన్ను తోడయినట్టు.

ఏటిమీద అలిగిన శెట్టి-నాముడ్డి ఇట్లాంటి ఏర్లను ఎన్నిటి చూడలేదు అని అంటే, ఇట్లాంటి ముడ్లను నేనుమాత్రం ఎన్నిటిని చూడలేదు అని అన్నదట ఏరు.

ఏటిమీద (పాటిమీద) దేవరకు కూటిమీదే చింత.

✓ ఏటివంక లెవరు తీరుస్తారు ? కుక్కతోక ఎవరు చక్కజేస్తారు.

✓ ఏటి వరద, నోటి దురద.

ఏటుకు ఏటు, మాటకు మాట.

ఏట్లో కలిపిన చింతపండువలె.

ఏట్లో పడ్డవానికి ఎన్నో ఎన్నికలు.

ఏట్లో పారేసిరు ఎవరు తాగితే ఏమి ?

ఏట్లో వేసినా ఎంచి వేయవలెను.

ఏడవ గలిగితే, ఏడ్చినకొద్దీ వ్యవసాయం.

[1]ఏడాటం మొగుడికి ఎత్తుబారం పెండ్లాము.

ఏడు ఎండల (ఎండవల) విత్తనాలు ఎంత వరపుకైనా ఆగుతాయి.

ఏడు కరువులు వస్తున్నాయిరా అంటే, తొలికరవులోనే పోతే, మిగత ఆరు ఏంచేస్తాయి అన్నాడట!

ఏడు కాండ్ల ఎద్దుల నిలేకనోయ్ మాలపోతాయి. (పోలాయ)

ఏడు కాన్పులమ్మకు, మూడుకాన్పులమ్మ ముక్క నేర్పినట్లు.

ఏడుగురిని మారిస్తే పెద్ద గాడసాని.

ఏడునెలలకు ఎందుకు నడకలు అన్నట్లు.

ఏడుపు ఏడింటి కనర్థం.

ఏడుపులో ఏడుపు, ఎడమచేయి చూపెట్టు అన్నట్టు.

ఏడుమనువులు పెళ్లైనా ఏకులరాట్నం తప్పలేదు.

ఏడుమాటలు మాట్లాడినా, ఏడు అడుగులు వేసినా, గుణం తెలుస్తుంది.

ఏడుమారినా, ఈడుముదిరినా, ఏమీమారదు ఈలోకంలో.

ఏడు మాసికల చీర, ఎదురు బాసింగాల రవిక, జరుగుతూ జరుగుతూ నేను సారెకట్టుక వచ్చినాను.

ఏడు మెతుకులు తింటే ఏనుగంత సత్తువ.

ఏడుసార్లు పాసిన చేలో పండిన కంకితో ఏడుగుర్ని చంపొచ్చు.

ఏడుస్తావు ఏమి ఎలుకా? అంటే, నాబాధ నీకే మెటుక అన్నదట.

ఏడుస్తున్నవాణ్ణి దాని(న)మ్మకాయలు కావాలా? అంటే, దాని కాయలే కావాలి అన్నాడట.

ఏడుస్తున్నా వెందుకు బ్రాహ్మడా? అంటే, ఒకనాడు నామొగం నవ్వి చచ్చిందా అన్నాడట.

---

1 ఏడాటం = ఇబ్బంది.

ఏడుస్తూ ఏరువాక సాగిస్తే, కాడిమోకు దొంగలు దోచుక పోయారట.

ఏడూళ్లూ తిరిగినా, ఎట్టికత్తెదాన్ని కానమన్నారు.

ఏడ్చి వెంకటస్వామి అనిపించుకొన్నట్లు.

ఏడ్చి తద్దినం పెట్టించుకొన్నట్లు.

ఏడ్చి మొహం కడుగుకొన్నట్లు.

ఏడ్చేదాని ఎడమచేతికిందా, కుట్టేవాని కుడిచేతికిందా కూర్చోరాదు.

ఏడ్చేదాని బిడ్డకు అరటిపండ్లు చూపినట్లు.

ఏడ్చేదాని బిడ్డను ఆమే కనవలెను అన్నట్లు.

ఏడ్చేదాని మొగుడు వస్తే, ఏకు వడికేదాని మొగుడూ వస్తాడు.

ఏడ్చేదాని మొగుడు వస్తే, నా మొగుడూ వస్తాడు.

ఏతానులో పీలిక ఆతానుకు చెందినట్లు.

ఏతాము ఎంతవంగినా తిరిగి లేచేదానికేకదా!

ఏతాము పాటకు ఎదురు పాటలేదు.

ఏతాము నేలకువంగడం లోతునీళ్లు తేనేగదా!

ఏదారి అంటే, గోదారి (కోదారి) అన్నట్లు.

ఏదిపట్టినా దయ్యము పట్టినట్లు.

ఏదీ కానివేళ గేదె ఈనినట్లు.

ఏదుందిన్నా[1] ఏకాదశి, [2]పందుందిన్నా పరగడుపు.

ఏదుకు పెడతల బుద్ధి.

ఏదేవుడు వరమిచ్చినా, పెనిమిటిలేందే పిల్లలు పుట్టరు.

ఏనాడు లేదు, [3]ఎట్టిగడ్డచారు.

ఏనుగంత తండ్రి ఉండేకంటే, ఏకంత తల్లి ఉండేది మేలు.

ఏనుగ నెక్కినవాడు దిడ్డకంత దూరగలడా?

---

1 ఏదుం=ఐదుతూములు. 2 పందుం=పదితూములు. 3 ఎట్టిగడ్డ=ఉల్లిపాయ.

ఏపులేని తీగ వెఱ్ఱితీగలు బెట్టు.

ఏపుట్టలో ఏపామో! ఏగుల్లో ఏ మాహాత్మ్యమో!

ఏపూజ తప్పినా పొట్టపూజ తప్పదు.

ఏబ్రాసికి పనిఎక్కువ, దేబిరాసికి తిండి ఎక్కువ.

ఏబ్రాసికి పనిఎక్కువ, లోభికి ఖర్చెక్కువ.

ఏబ్రాసి పెళ్లికెడుతూ ఉంటే, ఏకులరాట్నం ఎదురయిందట!

ఏమండీ కరణంగారూ! గోతిలో పడ్డారే అంటే, కాదు, మహాకత్తు చేస్తున్నాను అన్నట్లు.

ఏమందలో కట్టినా, మనమందలో (గాట) ఈనితే సరి.

ఏమయ్యా! మావారు బాగున్నారా? అంటే, అమ్మా! బాగానే ఉన్నారు; విత్తనాల వడ్లు తింటున్నారు. దాపుడు బట్టలు కడుతున్నారు అన్నాడట!

ఏమి అప్పాజీ? అంటే కాలంకొద్ది రాయజీ! అన్నట్లు.

ఏమి ఎరుగనమ్మా [1]ఎసర్లు లారమ్మా.

ఏమిచేసి బ్రతుకుదునమ్మా అంటే, నోరుచేసుకు బ్రతుకు బిడ్డా! అన్నదట.

ఏమి చేస్తున్నావురా? అంటే, ఒలుకపోసి ఎత్తుకుంటున్నాను అన్నట్లు.

ఏమిటి కేమీ లేదు, మూడిటి కెసరు!

ఏమిట్రా మేనమామ ముడ్డిలో కట్టె పెడతావు? అంటే, చిన్నాయన అనుకున్నాను అన్నాడట!

ఏమి పెట్టుక తిన్నావంటే, ఆకలెట్టుక తిన్నావందట!

ఏమిరా వెఱ్ఱిమొగమా అంటే, ఏమి చిన్నాయనా అన్నాడంట.

ఏమి పోలిసెట్టీ! అంటే, ఎప్పటి మొత్తుకోళ్ళే అన్నాడట!

1 ఎసరులు = కలహకారణములు కల్పించుట; మువ్వ.

ఏమిరా కోటా! అంటే, ఎప్పటిదే ఆట అన్నాడట!

ఏమి [1]సొచ్చాలు! అని వెక్కిరిస్తే, దొందూ దొందే అన్నాడట ఇంకోకాయన.

ఏమీ ఎరుగనివాడు ఏకాసినాడు చస్తే అన్నీ తెలిసినోడు అమావాస్య నాడు చచ్చినాడట.

ఏమీ ఎఱుగని ఎల్లిపాయె, దొంతులేస్తే దొల్లిపోయె.

ఏమీ ఎఱుగని పిల్ల, మామను మరిగిందట!

ఏమీ తోచకపోతే ఎక్కిరించాడట!

ఏమీ తోచనమ్మ తోడికోడలి పుట్టింటికి వెళ్ళిందట!

ఏమీ లేదంటగాని ఎల్లుండి పెండ్లంట.

ఏమీ దొరకనమ్మకు ఏగాని దొరికితే, ఎందులో బెడుదునే ఎంక టమ్మా అన్నదట!

ఏమీ లేనమ్మకు ఏడ్పులు శృంగారం.

ఏమీ లేనమ్మకు [2]ఏతులు లావు, ఉన్నమ్మకు ఆశలు లావు.

ఏమీ లేనివానికి ఏతులు లావు, స్వాములవారికి జడలులావు.

ఏమే గురుగారా! అంటే, ఎవరికేమి స్థిరమే బద్దాకా! అన్నదట!

ఏమే! వాడి దగ్గర పండుకొన్నావంటే, అంత పెద్ద మనిషి చేయి పట్టుకుంటే కాదనే దెట్లా అన్నదట.

ఏమోయీ! నీకూతురట్లా తిరుగుతున్నదే అంటే, అలవాటు బడిన ముండను అట్లానే పోనిస్తువ్వా, అన్నాడట.

ఏమోయి సెట్టీ! అంటే, ఎప్పటాటే అన్నాట్ట!

ఏమోయి సెట్టీ! ఏట్లో కొట్టుకు పోతావు అంటే, గడ్డిమోపు అమ్మ డానికి అన్నాడట!

1 సొచ్చాలు=వ్యవ్వాలు.

2 ఏతులు=ఎచ్చులు, డంబము.

ఏమోయీ, నారాయణా! [1]విధవగమనా అంటే, అది చిన్ననాటి సంగతి, ఊరుకో మన్నాడట.

ఏ యీకలపక్షీ ఆ గుంపులోనే చేరుతుంది.

ఏయూవాడుండ అమ్మేమిసేయు.

ఏయెండ కాగొడుగుపట్టినట్లు.

ఏ యెద్దు దాటినా, ఆవు మన గాట యీనితే చాలు.

ఏ రాజ్యానికి ఏ రాజో అన్నట్లు.

ఏ రాయి అయితేనేమి పండ్లూడగొట్టుకొనడానికి!

ఏరితే [2]మలిగండ్లు ఎందులో లేవు.

ఏరాలి కేడు, నాకు మూడా?

ఏరికోరి వ్యవసాయం చేస్తే, కాడిమేడి దొంగలెత్తుక పోయినట్లు.

ఏరుక తినేవాడి వెంబడి గీరుక తినేవాడు పడ్డాడట!

ఏరుకొని తినే పక్షికి, ముక్కున ముల్లు విరిగినట్లు.

ఏరూరి వ్యవసాయం–ఉండూరి వైద్యం.

ఏరు వస్తే వాన వెలుస్తుంది.

ఏ రేవుకు వెళ్ళినా ముళ్ళపరిగే దొరికింది.

ఏ రోటి దగ్గఱ ఆపాట పాడాలి.

ఏఱు అయినా మూడు నేరాలు కాస్తుంది.

ఏఱు ఎంత పారినా కుక్కకు గతుకు నీళ్లే!

ఏఱు ఎన్నివంకలు పోయినా సముద్రములోనే పడుతుంది.

ఏఱు ఏడామడ వుండగానే, చీర విప్పి చంకబెట్టుకొన్నదట.

ఏఱు నిండిపారినా పాత్రకు తగురీతి నీరువచ్చు.

ఏఱు దాటి, తెప్ప తగులబెట్టినట్లు.

ఏఱు దాటే వరకు ఎంగన్న, ఏఱు దాటినాక సింగన్న.

---

1 వి = పక్షి. ధవుడు = భర్త–గరుత్మంతునిపై పయనించేవాడని పైకి అర్థం.

2 మలిగండ్లు = మలిచి వేరుచేయబడినవి.

ఏఱు పోయిందే పోక, ఏలిక చెప్పిందే తీర్పు.

ఏఱు ముందా? [1]ఏకాదశి ముందా?

ఏఱు ముందా? [2]ఏఱువాక పున్నమ ముందా?

ఏఱు మూరెడు తీస్తే, కొలను బారెడు తీస్తుంది.

ఏఱు వచ్చినా ఎద్దడి నీరె, మొగుడు వచ్చినా మొండి మెడే?

ఏలడానికి ఊళ్లు లేకపోవు కాని, ఎత్తుక తినడానికి (అడుక్కు తినను) ఊళ్లు లేవా?

[3]ఏలాపు వెట్టి పట్టినా, అంకమ్మ సివమెత్తినా అడ్డు ఉండదు.

ఏలికపాము అన్నదట "విషపురుగులం, మాజోలికివస్తే కరచి చంపమా" అని. (నాగుబాము కరచిచచ్చినవానికై ఏడ్చే వారిని చూచి).

ఏలుమీద గోరు మొలిచింది, ఏంజేతు మొగుడా అన్నదట.

ఏలేటి పురుషునికి ఏడుగురు భార్యలు.

ఏలేవానికి ఎద్దు పోతేనేమి? కాచేవానికి కన్ను పోతేనేమి?

ఏళ్లు ఎగసన, బుద్ధి దిగసన.

ఏ వాడ చిలుక ఆ వాడ పలుకు పలుకుతుంది.

ఏవన్నె సులోచనం పెట్టుకొంటే ఆవన్నే కనుపించేది.

ఏవూరురెడ్డి, అంటే ఏట్లో మోకాటి (లోతు) నీళ్లు అన్నాడట.

ఏవూరే ఏతామా అంటే, దూవూరే దూలమా అన్నదట.

ఏ వేషం వచ్చినా, దిటిటీవానికే చేటు. (వీధిభాగవతాలలో)

---

1 ఏకాదశిముందా? = ఆషాఢశుద్ధ ఏకాదశి, తొలి ఏకాదశి అంటారు. ముందు ఏకాదశి వచ్చినచో ఆ ఏడు కరువు.

2 ఏరువాక పున్నమ = సర్కారులలో జ్యేష్ఠశుద్ధ పౌర్ణిమ, నెల్లూరు ప్రాంతానికి ఆషాఢపూర్ణిమ.

3 ఏలాపువెట్టి = పట్టుదలతో లాభనష్టాలు లెక్కింపక గొడ్డుదాటుగా పనిచేయుట. (ఏలాములలో పాడుట.)

## ఐ

ఐదుశిఖలకంటె మూడుకొప్పులు చేరితేనే మొదటికి మోసం.
ఐదోపేట అప్పంబొట్లు అడ్డగోడ పట్టుకోని అబ్బాఅంటే అరుచోద్యపోయినారట.
ఐశ్వర్యదేవత పాలంలోనే (కత్తుమొనలోనే) ఉంది!
ఐశ్వర్యానికి అంతంలేదు; దారిద్ర్యానికి మొదలూలేదు.

## ఒ

ఒంటరివాని పాటు ఇంటికి రాదు.
ఒంటిఎద్దు దాసుడా! వలపల ఉంటావా, దాపల ఉంటవా అన్నట్లు.
ఒంటిఎద్దు సేద్యం – ఒరు (వర) కాలి నొప్పి.
ఒంటి కంటె జంట మేలు.
ఒంటికి ఓర్వలేనమ్మ, రెంటికి ఓర్చునా?
ఒంటికిలేని వ్యాధిపాటు ఒరగబెట్టుకున్నట్టు.
ఒంటిచేతి దాహం, ఒకనాలి పొందు తనివి (తమి) తీరవు.
ఒంటేలికి పోతే, రెండేళ్లకు వచ్చిందట.
ఒంటేలికిపోయి ఇంతసేపేమిరా అంటే, రెండేళ్లకు వచ్చింది అన్నాడు.
ఒకఇంచుక ముల్లయినను బాదతలముననున్న నడువనగునే.
ఒక ఈగ బండిచక్రంమీదవ్రాలి ''నేనెంతదుమ్ము రేగగొట్టుచున్నానబ్బా'' అని ఉప్పొంగి పోయినదట.
ఒకఊరి కాపు ఇంకొకఊరి మాల. (అంటే లెక్కబడదనుట)
ఒకఊరి రాజు ఇంకొకఊరికి రైతు.
ఒకఊరి రెడ్డి ఇంకొకఊరికి [1]పసులపోలు(లి)గాడు.

1 పసులపోలిగాడు = వల్లటి చిన్నపిట్ట; దీని తోకవుతోక ఎప్పుడూ ఆడుచుండును.

ఒకబరలో రెండు కత్తు లిముడునా!
ఒక కంటిలో సున్నం, ఇంకొక కంటిలో వెన్న.
ఒకకన్న కన్నూ కాదు, ఒకకొడుకు కొడుకూ కాదు.
ఒక కలగనగానే తెల్లవారుతుందా!
ఒకకొడుకు కొడుకుకాదు, ఒక చెట్టు తోపూ కాదు.
ఒకచంట పాలు, ఒకచంట నెత్తురు.
ఒక చెంప కొడితే పాలు, ఇంకొక చెంప కొడితే తేనె.
ఒక చెయ్యి తట్టితే చప్పుడవునా?
ఒకచేత పసుపు, ఒకచేత ముసుగు.
ఒకచేతి వ్రేళ్లే ఒకటిగా లేవు.
ఒకటి తరక, ఇంకొకటి తాలు.
ఒక టేదెబ్బతో రెండుకాయలు కొట్టినట్లు.
ఒకటొకటిగా నూరా? ఒక టేమారు నూరా?
ఒకడినిచూస్తే పెట్టబుద్ధి, ఇంకొకడినిచూస్తే మొట్టబుద్ధి.
ఒకడి పాటు, పదిమంది సాపాటు.
ఒకడు అగ్గిరాముడు, ఇంకొకడు మైరావణుడు.
ఒకడు అహిరావణుడు, ఇంకొకడు మహిరావణుడు.
ఒకడు ఇల్వలుడు, ఇంకొకడు వాతాపి.
ఒకడు తిమి, ఇంకొకడు తిమింగిలము.
ఒకడు పినతల్లికి తప్పినవాడు, ఇంకొకడు తల్లికి తప్పినవాడు.
ఒకతీగ లాగితే పొదంతా కదలినట్లు.
ఒకదొడ్డి గొడ్లు పొడుచుకోవా!
ఒకనాటి అదను, ఏటాది బ్రతుకు.
ఒకనాటి పెళ్ళికి ముఖమంతా కాటుక.
ఒకనాటి భోగం, ఆరునెలల రోగం.
ఒకనాటి విందు, మరునాటి కుందు. (మందు)

ఒకనాటి వేషానికి (భోగానికి) మూతి మీసాలు గొరిగించు కొన్నట్లు.
ఒకనాటి సుఖం, ఆరునెలల కష్టం.
ఒకనాటి సుఖం, ఒకఏటి కష్టం.
ఒకనాడు ధారణ, ఒకనాడు పారణ.
ఒకని ఆలి(లు) ఒకని కన్నతల్లి.
ఒకనికి ఇగురుకూర ఇష్టం, ఇంకొకనికి పులుసుకూర ఇష్టం.
ఒకని సంపాదన పదిమంది పాలు.
ఒకపాముచేత రెండుసార్లు కఱపించు కుంటామా!
ఒకపుట్టలో పెడితే వెయ్యిపుట్టల్లో ఎల్లకొచ్చేవాడు.
ఒకపూట తిన్నమ్మ ఓర్చుకొని వుంటే, ముప్పూట తిన్నమ్మ మూర్ఛ (శోష) బోయిందట.
ఒకరాజుకు ముగ్గురు సేవకులు - ఒకడు పిలిస్తే పలుకనివాడు, ఇంకొకడు స్తంభం చాటుగాడు, మరొకడు అదే పోతగాడు.
ఒకరి అమృతం ఇంకొకరికి హాలాహలం.
ఒకరి కలిమి ఇంకొకరి ఏడ్పుకు కారణం.
ఒకరి కలిమికి ఏడిస్తే ఒకకన్ను పోయింది; తనలేమికి ఏడిస్తే రెండో కన్ను పోయింది.
ఒకరికి [1]ఇగురుకూర ఇష్టం, ఒకరికి పులుసుకూర ఇష్టం.
ఒకరితో ఊరు పావనం, ఒకరితో గారి పావనం.
ఒకరిదైతే ఓపినంత, తనదైతే తగరమంత.
ఒకరిద్దరిని చంపితేగాని, వైద్యుడు గాడు.
ఒకరినికోస్తే పాలు, ఇంకొకరిని కోస్తే నెత్తురు వస్తుందా!
ఒకరు ఏటికి తీస్తే, ఇంకొకరు కాటికి తీసినట్లు.
ఒకరేం పెట్ట! మనమేం తిన! వండుకుండేదాక ఉండవే మనసా!
ఒకలింగడు పోయినా పోయినట్లు, బాగా నమలి మ్రింగమన్నాడట (అన్నంలో రాయితగిలినప్పుడు, వైష్ణవుడన్నమాట).

1 ఇగురు = వేపుడుకూర.

ఒకవ్యక్తి క్రీనీడే ఒకసంస్థ.
ఒకూరికి వేయిదోవలు.
ఒకే కోకిల వసంతాన్ని కొనిరాదు.
ఒకేచెప్పులుజోడు అందటికీ సరిపోతుందా.
ఒకేతొడిమకు రెండుకాయలు.
ఒకే చెట్టుకాయలే ఒక్కలా ఉండవు.
ఒకే మద్దెలను చెరికాసేపు వాయించుకొన్నట్లు.
(ఒకవస్తువును ఇద్దఱు పంచుకొని అనుభవించుట – అని)
ఒకేమద్దెలను చెరిఒకప్రక్క వాయించుకున్నట్లు.
ఒక్కగ్రుడ్డు మురిగిపోగానే పొదుగు గుడ్లన్నీ పాడగునా?
ఒక్కడంటూ చెప్పనా? ఓరుగంటి సింగనా!
ఒక్కడే కొడుకని వరికూడు పెడితే, మీాటిచ్చి మిండగాడయినాడట!
ఒక్కతే కూతురని వరిఅన్నంపెడితే, మిద్దెఎక్కి మిండల పిలిచిందట!
ఒక్క దెబ్బకు రెండు పిట్టలు.
ఒక్క పుస్తె తెగితే, వేయిపుస్తెలల్లాడతవి.
ఒక్కప్రొద్దు మాట కుక్క ఎఱుగునా!
ఒక్కబిడ్డ పుట్టినతర్వాత వడ్డెనాగుగూడ పిల్లడు.
ఒక్కరున్న దేవులాట, ఇద్దరున్న తన్నులాట.
ఒక్కొక్క చినుకే వాన అవుతుంది.
ఒక్కొక్కరాయి తీస్తూంటే, కొండయినా తరుగుతుంది.
ఒగిచేవారే కాని, ఓదార్చేవారుండరు.
ఒజ్జల పుచ్చకాయవలె.
ఒజ్జలే కంకులతో కాలం గడుపుతూంటే, శిష్యులకు ఊచబియ్యమా!
ఒట్టుపోయి గట్టెక్కె, కానుపోయి చెట్టెక్కె.
ఒడిలో బెట్టుదునా? దడిలో బెట్టుదునా? అన్నట్లు (వేగిరపడుటను కూర్చి).
[1] ఒడుపుచేత కడుపు చేసుకొన్నట్లు.

1 ఒడుపు=తొందరపాటు; లాఘవము.

ఒడ్డున నిలబడే సముద్రాన్ని పొగడాల.
ఒడ్డెక్కి మోచేయి చూపినట్లు.
[1]ఒడ్డెపీకుడూ, ముడ్డి పీకుడూ ఒకటే.
ఒత్తాసి (ఒత్తు) పలికిన నోరు [2]ఎత్తుక తినవలసిందే.
ఒత్తిపలకవే వసనాభిపిల్లీ! అంటే, మ్ర్యావ్ మ్ర్యావ్ అన్నదట!
ఒత్తు పొత్తును చెఱచును.
[3]ఒత్తు వాములు కోరును, పలుచన పాతర కోరును.
ఒరగబెట్టి తాగేది చెటిచెరా కంచరవాడు.
ఒరపు కోరుస్తారుగాని, తెడుపుకోర్వరు.
ఒల్లని మగనికి తలంబ్రాలు పోసినట్లు.
ఒల్లనివానికి పెరుగులో రాయి.
ఒల్లీ బల్లనమ్మ తలంబ్రాలు పోసినట్లు.
ఒల్లీబల్లని చుట్టం వచ్చాడు, ఉసుకే ఉలవపప్పు ఉగాదిదాకా.
ఒళ్ళంతా తడిసిన వెనుక, ఓపలేనివారికైనా చలిలేదు.
ఒళ్లారితే లేసివలె.
ఒళ్లు ఎఱుగని శివము, మనసెఱుగని కల్ల ఉందా!
ఒళ్లు బలిసిన గంగానమ్మ పేడకడుము లడిగిందట.
ఒళ్ళు వంగనమ్మ కాలిమెట్టెలకు కందిపోయిందట!
ఒళ్ళు వంగనివాడు దొంగలతో కలసినాడట!
ఒళ్ళు వంగనివారికి ఊరు అచ్చిరాదు.
ఒళ్ళు వాచినరెడ్డీ వళ్లు ఏమిధర! అంటే, అవేలేక నా ఒళ్ళంతా వాచింది అన్నాడట!
ఒళ్ళో గింజలు ఉన్నా, వద్దభార్య ఉన్నా ఊరుకో బుద్ధికాదు.

1 ఒడ్డె = వేలమత్తవ్వి జీవించేకులము - ఉప్పరవంటిది.
2 ఎత్తుక = తిరిపి మెత్తుట.
3 ఒత్తు = దట్టము; విందు. (పైరు)

# ఓ

ఓంకారములేని మంత్రము, అధికారములేని ప్రజ్ఞ.
ఓకన్ను పూవుకన్ను, ఇంకోకన్ను కాయకన్ను,
"ఓ"కు ఎన్నివంకరలో తెలియనివానికే ఒయ్యారము.
"ఓ"నమాలు రానివాడు వడ్డీలు (వడ్లు) గుణించినట్లు.
ఓకు ఎన్నివంకలో తెలియనాయనే ఒరుకులు చూపేది.
ఓగల ముసలిది దొంగను కట్టుక ఏడ్చిందట.
ఓగు కడుపున వజ్రం పుట్టినట్లు.
ఓగును ఓగే మెచ్చును, అజ్ఞానిని అజ్ఞానే మెచ్చును.
ఓటికుండలో నీరు పోసినట్లు.
ఓటికుండలో వఱదు పలికితే వచ్చిందే వాన!
ఓటికుండలోన ఉండునా నీరంబు.
ఓటి తెప్పను నమ్మికోని ఏట్లోదిగినట్లు.
ఓడ ఎక్కేదాక ఓడమల్లయ్య, ఓడదిగ్గానే బోడిమల్లయ్య.
ఓడ విడిచి వదరుపట్టినట్లు.
ఓడనువిడిచి వరద ఊరికివచ్చునా!
ఓడలు బండ్లనువచ్చు, బండ్లు ఓడలవచ్చు.
ఓడినగుఱ్ఱం జీనుపై సొడ్డుబెట్టిందట.
ఓదుఓదు అంటే, కంచమంతా ఓడన్నట్లు.
ఓనార్చుకొంది ఏడ్చేబిడ్డవంటివి కష్టాలు.
ఓదెకట్టే దొంగ పరిగ ఏరేవానిని బెదరించి (దండించి) నట్లు.
ఓనమాలు చదివేవారేకాని, ఆనవాలు చూపించలేరు.
ఓనమాలే బుక్కలు, ఒకటిరెండే లెక్కలు.
ఓపనివాడు కోరనిదీ, ఒల్లనివాడు ఆడనిదీ లేదు.
ఓపనివానికి వద్దన్నవారే తల్లిదండ్రులు.

ఓపలేని అత్తకు వంగలేని కోడలు.

ఓబీ! ఓబీ! నీవు వద్దుదంచు, నేను పక్క లెగరేస్తాను అన్నట్లు.

ఓరీ రజకచక్రవర్తీ? అంటే, ఇంతపెద్దపేరు మాకెందుకు దొరా! మీాకే ఉండనీయండి అన్నాడట!

ఓర్చలేనమ్మ ఒడిని నిప్పులు కట్టుకుంటే, ఒడీ దడీ కాలిందట.

ఓర్చలేని రెడ్డి ఉండీ చెఱచెను, చచ్చీ చెఱచెను.

ఓర్చితే (ఓరిస్తే) ఓరుగల్లే పట్టణ మవుతుంది.

ఓర్చితే కోడిగుడ్డు చట్టెడు.

ఓర్చిన పసరానికి తేటనీరు.

[1]ఓలి ఇచ్చిన మొగుడికంటె, కూలి ఇచ్చిన మొగుడెక్కువ.

ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెండ్లాడితే, దొంతికుండలన్నీ పగుల గొట్టినట్టు.

ఓలి తక్కువని గుడ్డిదానిని పెళ్ళాడితే, నెలకు మూడ్పైకుండలు నీళ్లాడుతాయి.



## ఔ

"ఔ"ననటానికి, కాదనటానికి అత్త కధికారంగాని, కోడలి కేముంది!

ఔను-కాదు అనేమాట లెంతచిన్నవో, వాటిని అనడం అంత కష్టం.

ఔషధం కానిది అవనిలో లేదు.

ఔషధానికి అపథ్యానికి చెల్లు, రోగం పైపెచ్చు.



1 ఓలి = కన్యాశుల్కం.

# క

కంకణాలచెయ్యి ఆడితే, కడియాలచెయ్యి ఆడుతుంది.

కంకి ఎట్టనయితే, కన్నెట్టనవుతుంది.

కంచం అమ్మి, మట్టెలు (మెట్టెలు) చేయించినట్లు.

కంచంఇచ్చి, [1]మెట్టె పెట్టించుకొన్నా కానలేదు మొగుడు.

కంచంచెంబు, బయటపారవేసి. రాయిరప్పలోన వేసుకొన్నట్లు.

కంచంత (కంచి + అంత) బలగమున్నా, కంచంలో కూడువేసే దిక్కులేదు.

కంచం పొత్తేగాని, మంచం పొత్తులేదు.

కంచంలోకూడు కుడువనేగాని కాలదన్నను గాదు.

కంచరి కటుకు, దంచితే లొటుకు.

కంచరి వానింటి పిల్లలు తాటాకు చప్పుళ్లకు బెదరరు. (ఎపుడూ సుత్తెపెట్లు వినబడుచుండును కంచరిఇంట.)

కంచానికి ఒక్కడు, మంచానికి ఇద్దరు.

కంచి అంత కాపురం గడ్డలైనట్లు.

కంచి మేకకు వలె కడుపెడు బిడ్డలు. (ఈతకు రెండుపిల్లలు)

కంచిలో దొంగలించేదానికి, కాళహస్తి నుంచి వొంగిపోయినట్లు.

కంచు మెట్టె, మంటిగాజు ఉంటే కావలసిందేముంది? (ఇది ముత్తయిదువ తనం)

కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా!

కంచువట్టల ఆడుది (గయ్యాళి అనుట).

కంచె మంచిది కాకపోతే, కయ్య కొల్లపోతుంది.

కంచె లేనిచేను, కన్నతల్లి లేని బిడ్డ ఒకటి.

---

1 మెట్టె-మట్టె - పెండ్లి అయిన స్త్రీల కాలివ్రేలికి బెట్టు వెండి ఉంగరము - మెట్టు వచ్చుడు పెట్టునది కాలోదు.

కంచె వేసినదే కమతము.

కంచే చేను మేస్తే, కాపేమి చేయగలడు!

కంటికి ఇంపైతే, కడుపుకూ ఇంపు.

కంటికి తగిలే పుల్లను కనిపెట్టి తిరుగమన్నారు.

కంటికి మేను గురువై తోచుట, ఆజ్యప్రవాహంలో అన్న మిడుట వంటిది.

కంటికి రెప్ప, కాలికి చెప్పు!

కంటికి రెప్పాసరా, పులికి [1]మలాసర.

కంటికి తెప్పలు పోయాక, కాటుక పూలు ఉంటే ఏమాయె!

కంటివంటి ప్రకాశంలేదు, మంటివంటి ఆధారంలేదు.

కంటే సుంకం కానకుంటే బింకం.

కండి(డే) కొండవుతుంది.

కండ్లు ఆర్చినమ్మ ఇండ్లు ఆర్చును.

కండ్లు ఉంటేనే కాటుక!

కండ్లు కావాలంటవి, కడుపు వద్దంటుంది.

కండ్లు చెడిపిన దేవుడు మతిని ఇచ్చినట్లు.

కండ్లు పెద్దవి, కడుపు చిన్నది.

కండ్లు పోగొట్టిన దేవుడు ఇండ్లు చూపక మానడు.

కండ్లుపోయినతర్వాత సూర్యనమస్కారాలు.

కండ్లు మూయించవచ్చునుగాని, కలలు గనేటట్లు చేయగలమా!

కండెవంటి బిడ్డఅమ్మా! అంటే, కండె తెచ్చిపెట్టమని ఏడ్చాడట.

కండ్లేరు కారితే కరువు, పారితే పండుగ (తొలి ఏకాదశికి - ఆషాఢ శుద్ధ ఏకాదశికి ముందని; ఈ ఏరు నెల్లూరు తాలూకా దక్షిణంలో ఉన్నది).

[2]కంఠి బలపుకాదు, చింత తీరికకాదు.

---

1 మల=కొండ. 2 కంఠి=కఠిక.

కంటి తలగడగాదు, కల నిజంగాదు.

కందం చెప్పినవాడు కవి, పందిని పొడిచినవాడు బంటు.

కందకు లేదు, చేమకు లేదు; తోటకూరకు దురద ఎందుకు?

కందకు లేని దురద కత్తిపీటకా?

కందకు లేని దూల చేమకెందుకు?

కందకు లేని [1]నస బచ్చలికేల?

కందిగింజను, కాపువానిని వేచనిదే చవిగావు.

కందిచేలో కర్రు పోగొట్టుకొని, పప్పుచట్టిలో వెదికినట్లు.

కంది పండితే, కఱవు తీరును.

కందెన పెట్టనిదే పరమేశ్వరు బండియైనా పారదు.

కందెన వేయని బండికి కావలసినంత సంగీతం.

కంపతోడుగు ఈడ్చినట్లు.

కంపలో పడ్డ ఈగవలె.

కంపుమూడను పూవు నలపాలనా?

కంపునోటికి అల్లం పచ్చడా.

కంపునోటివాడు కూడబెడితే. మంచినోటివాడు మాయం చేసినట్లు.

కంపు పెట్టుకొని, గంపెడు తిన్నట్లు.

కంబళిలో తింటూ, వెంట్రుకలు ఏరినట్లు. [బాధ లేదు.

కంసాలికి పశువులు పోయినా, మారటతల్లికి బిడ్డలు పోయినా

[2]కంభం చెరువు చూచి. దున్నపోతు ఆ నీళ్ళన్నీ తానే దున్నాలను
కొని గుండెపగిలి చచ్చిందట.

---

1 నస=దురద

2 కంభంచెరువు - ఇప్పటి ఒంగోలు (పూర్వం కర్నూలు) జిల్లాలో కంభందగ్గర కృష్ణదేవరాయలు కట్టించిన పెద్దచెరువు. రెండు కొండలకు మోటించి నడుమ పెద్ద కట్టగట్టిన యీ జలాశయం ఇప్పటి ద్యాముల నిర్మాణపథకంలో నున్నది.

కంసాలివాని ఇంటి కెడితే బంగార మంటదుగాని కుమ్మరవాడి ఇంటి కెడితే మాత్రం మట్టి అంటుకుంటుంది.

కంసాలి [1]ఎల్లి, చాకలి మల్లి.

కంసాలికూడు కాకులుగూడ ముట్టవు.

కంసాలి గోటు, కరణం తేటు.

కంసాలి పెళ్ళికి ఇల్లంతా పొయ్యిలే.[2]

కంసాలి బత్తెనమ్ముకున్నాడు, లోపల లక్క లేకుండా చూడరా అన్నాడట!

కంసాలి మాయ కంసాలికి గాని తెలియదు.

కంసాలి లేకుండా చూచి, కథ చెప్పమన్నారు.

కంసాలివద్దనైనా ఉండవలె, కుంపటిలోనైనా ఉండవలె. (తగ్గిన బంగారు)

కంసాలివారు కాలానికి పెళ్ళికొడుకులు, కరువుకు కాటి పీనుగులు.

కక్కదింటె, గారెలు చేదంట.

కక్కిన కుక్కవద్దకు, కన్న కుక్కవద్దకు కానివాణ్ణయినా పంపరాదు.

కక్కిన కూటికి ఆశించినట్లు.

కక్కిన బిడ్డ దక్కుతుంది.

కక్కుర్తి మొగుడు కడుపునొప్పి బాధ ఎరుగడు.

కక్కుర్తిపడ్డా కడుపునిండాల.

కక్కుర్తిపడ్డా సుఖం దక్కాలి.

కచ్చెల్లో కందులు వేయించినట్లు.

కచ్చితానికి కాసులు, ఉచితానికి ఉళ్ళు.

కటకటఉన్న ఇంట కలిమి ఉండదు.

---

1 ఎల్లి = ఎల్లుండి రమ్మనుట. మల్లి = మరల రమ్మనుట.

2 ఒకరు వండినది ఇంకొకరు తినరు.

కటకటాలనే ఇంట కట్టబట్టా, తినతిండీ ఉండవు.

కటికవానికి కత్తి అందించినట్లు.

కట్టకింద కట్ట లాడితే, మాలదాని పిట్ట లాడుతాయి.

కట్టకు ఒకకంకి లేత (పచ్చి) దయితే, పుట్టికి ఏదుం తరుగు.

కట్టనిలువని చెరువు గడియలోపలనిండు, బ్రతుకలేనిబిడ్డ బారెడుండు.

కట్టిన ఇంటికి వంకరలు (పణుకులు) చెప్పేవారు వెయ్యిమంది.

కట్టిన ఇల్లు, పెట్టిన పొయ్యి.

కట్టిన ఇంటికి కణుకులు మెండు.

కట్టినవాని కొక ఇల్లయితే అద్దెకున్నవాని కన్నీ ఇండ్లే.

కట్టినవారు ఒకరైతే, కాపురం చేసేది ఇంకొకరు.

కట్టివేసిన బత్తెకు కావలి కాచినట్లు.

కట్టుకొన్న ఆపె, పెట్టుకొన్న ఆపె ఉండగా, ఎదురుపడ్డ ఆపె ఎండి [పోయిందట!

కట్టుకొన్నమ్మ, చుట్టుకొన్నమ్మ ఉండగా, ఎదురుకొన్నమ్మ ఎండి పోయిందట!

కట్టుకొన్న పెండ్లామే చెయ్యవలె, కన్నతల్లే చెయ్యవలె.

కట్టుకొన్న మగడు, పెట్టెనున్న నగలు.

కట్టుకొన్న వాడిమీదకంటె పెట్టుకొన్న వాడిమీదనే ప్రేమ.

కట్టుకోలు ఏకాదశికి కట్టె కంప కొట్టుకొస్తుంది.

కట్టుచీర లేనివాడు పట్టుచీర బయటికి వస్తుంది.

కట్టులేని ఊరు, గట్టులేని చెరువు.

కట్టె గొడ్డలిలో దూరి, కులానికి చేటు దెచ్చు.

కట్టె దేవునిదగ్గఱ, కన్ను లంజపైన.

కట్టెనా కంపనా కాలనివాడు

కట్టెలు ఆటని[1] ఇంట్లో కనకకషుగూడ ఆటదు.

---

1 ఆట = ఆగు, నిలుచు.

కట్టెలు తేరా తిమ్మా! అంటే కడుపు నొస్తదే అమ్మా! అన్నట్టు.

కట్టెలోన నగ్ని పుట్టిన విధమున.

కట్టె వంక పొయ్యి తీరుస్తుంది.

కట్టేయస్వాహా, కంపాయస్వాహా, నీకూ నాకూ చెరి సగాయస్వాహా.

కట్టెతేను కంపా లేదు, కాచిపోయా నీళ్ళులేవు, పదవోయి అల్లుడా బావికట్టుకు.

కట్టేవాడు అవివేకి, ఇంట్లో బాడుగకు ఉండేవాడు వివేకి.

కట్టేవి కాపాయాలు, దూరేవి దొమ్మరి గుడిసెలు.

కఠినచిత్తు మనసు కరగింపగా రాదు.

కఠినమైనా కన్నతల్లి, వట్టిదైనా వరికూడు.

కడగాఉన్న గొడ్డలిని కాలిమీద వేసుకున్నట్లు.

కడగా పోయే ఈశ్వరుడా, మాయింటిదాకా వచ్చి, మరీ పొమ్మనట్లు.

కడచి బ్రతికిన దెవరు?

కడచి బ్రతికినామని గంతులు వేయరాదు.

కడచిన దానికి వగచిన లాభమేమి?

కడజాతి కాని, కాసులు గలవాడె రాజు.

కడనున్న గొడ్డలిని కాలిమీదకు నెట్టకొన్నట్లు.

కడపటి మడివాని కటారిపోటు కంటె, ఎదుటి మడివాని ఏకుపోటు మేలు.

కడలిలో ఉప్పుకు అడవిలో ఉసిరికకు కొరతా!

కడవంత గుమ్మడి కాయఅయినా కత్తిపీటకు లోకువే.

కడవ వెళ్లి, కడముంతలో దూరినట్లు. (కుంజర యూధంబు దోమ కుత్తుకజొచ్చెన్-అన్నట్లు)

కడివెడు పాలకు ఒక్క మజ్జిగబొట్టు. (పేరుటకు)

కడవేరు మిగిలినా గరిక చిగుర్చక మానదు.

కడి అంటే నారు తెరిచి, కళ్లెమంటే మూసినట్లు.
కడి గండం కాచును, వత్తి మిత్తి కాచును.
కడిగిన నోరు, అడిగిన పిల్ల.
కడిగిన మొగముంటే ఎందుకైనా మంచిది.
కడియాలవారు వచ్చారు అంటే, కడియాలు కావాల అన్నాడట!
[1]కడుగు త్రాగినవాని కడుపేమి నిండురా
కడుగు త్రాగు కాకి కట్టని కూయదా.
కడుపా కల్లేపల్లి చెరువా!
కడుపా కొల్లేరు మడుగా!
కడుపా చెరువా!
కడుపు కాలి ఏడుస్తుంటే, మనవర్తి ఏమిస్తావు అన్నదట!
కడుపుకు పెట్టిందే కన్నతల్లి.
కడుపు కూటి కేడిస్తే, ఇంకొకతె కొప్పు పూల కేడ్చిందట.
కడుపు చించుకుంటే పేగులు కాళ్ళమీద పడును.
కడుపు చించుకున్నా గారడీవిద్యే అన్నట్లు.
కడుపు చేసినవాడే [2]కాయము, పిప్పళ్లు తెస్తాడు.
కడుపులో ఉన్నమ్మ కినక మానదు, వండినమ్మ తినక మానదు.
కడుపున పుట్టిన బిడ్డకన్న, కంటను కన్నబిడ్డ ఎక్కువ.
కడుపున పుట్టిన బిడ్డ-కొంగున గట్టిన రూక.
కడుపు నిండితే కడవలు మోయు, లేకపోతే పగులవేయు.
కడుపు నిండిన వానికి గారెలు కనరు.
కడుపు నిండినవానికి గారెలు చేదు.
కడుపు రాతిలోని కప్పకు కలుగదా.
కడుపులో కాపాడిన వాడు కాలాన కాపాడడా!
కడుపులో తిప్పండి కక్కొస్తుందా!

---

1 కడుగు బియ్యము కడిగిన నీరు; కుడితి.
2 కాయము = తినపెట్టే మందు.

కడుపులో ఎట్లాఉంటే, కాపుర మట్లా ఉంటుంది.

కడుపులో చల్ల కదలకుండా.

కడుపులోని మంట కానరాని మంట.

కడుపులో లేనిది కౌగలించుకుంటే వస్తుందా!

కడుపులో లేనిప్రేమ కావాలంటే వస్తుందా!

కడుపు వస్తే కనే తీరవలెను.

కడుపే కైలాసం, ఇల్లే వైకుంఠం.

కతకు కాళ్లు ముంతకు చెవులు కల్పించినట్లు.

కలతమారి మొగుడు కమ్మలు చేయిస్తే, అప్పాలకూటి మొగుడు అమ్ముక తిన్నాడు.

కత్తితీసి కంపలో వేసి, ఏకుతీసి పొడుచుకుంటానన్నాడట!

కత్తిపీటకు పళ్ళు పులుస్తాయా?

కత్తిపోటు తప్పినా, కలంపోటు తప్పదు.

కత్తిమీది సాము కడతేరబోదయా.

కత్తిమీద సాము కానివాడికైనా తగదు. (అసిధారావ్రతం)

కత్తిమీద సాము, కొత్తిమీద కూడు.

కత్తి మెత్తనా, అత్త మంచీ లేదు.

కత్తు కలిస్తే, పొత్తు కలుస్తుంది.

[1]కత్తెరలో వాన కనకపు పంట.

కత్తేస్తావా! బద్దేస్తావా! అన్నట్లు.

కథ అడ్డంగా తిరిగింది.

కథ కంచికి, మన మింటికి.

కథకు కాళ్ళులేవు, ముంతకు చెవులు లేవు.

కదనభీతుజూచి కాలుడు నవ్వురా.

కదళి మ్రింగువాడు గరళంబు మ్రింగునా.

---

[1] కత్తెర=కృత్తిక కార్తె.

కదిపితే కందిరీగల తెట్టు (ట్టె)
కదిలిస్తే గచ్చపొద.
కదుటిలో పడదు, దిండులోనూ పడదు. (దేనికీ కొరగాదనుట)
కదురు కవ్వము ఆడితే కఱవే లేదు.
కదురు కవ్వం ఆడితే, కాలం చల్లంగా ఉంటుంది.
కనకతరుణుల ఆస లేని సంసారులు కలలోనైన కలరా.
కనబడినప్పుడంతా దండాలుపెట్టుతా వెందుకంటే - చేతులు ఊరకే
ఉండి ఏమిచేస్తవిలే - అన్నాడట.
కనికని కొత్తెవ్వ డింటి కంబము చేసెన్.
కని గ్రుడ్డి, విని చెవుడు.
కనిపెంచిననాడు కాలు జాఱినట్లు.
కనిపెంచిననాడు కొడుకులుగాని, కోడళ్లు వచ్చాక కొడుకులా!
కనుక్కొన్నాడోయ్! కంబట్లో వెంట్రుకలు! అన్నట్లు.
కనుమనాడు కాకిని అయినా కదలనీయరు.
కనుమునాడు మినుమ కొరకాల (వడలు తినాలనుట).
కనుమలమీద [1]మొయిలు మేస్తే కళ్ళముందర వాన.
కనుముకు కాకర, భోగికి పొట్ల.
[2]కనుమునాడు కాకికూడా మునుగుతుంది.
కనుమునాడు మినుములు తినాలి.
కనుసైగకురాని కాంతను బలిమిడి కరమిడ వశమగునా.
కన్నతల్లికి కడుపుకాలితే పిన్నతల్లికి పిత్తకాలిందట.
కన్నతల్లికైనా కనుమరుగుండాల.
కన్నపుదొంగ వాడ లేదని ముంత ఇంటివానికి వదలిపోవునా.
కన్నా మేగాని, కడుపులో పెట్టుకొనివుంటామా!

1 మెయిలుమేయు=కొండలపై మబ్బు గోరాడినట్లు అలముకొనుట.
2 కనుమ=కనుపండుగ, పసులపండుగ, సంక్రాంతి మరునటివాడు.

[1]కన్నెతీకానికి కాసు లేనిఆయన కలకాలం కాపాడుతాడా?

కన్నవిచ్చినవాని కన్నిచ్చినవాని (దృష్టి లేక జ్ఞానము) కడవరకు మరువరాదు.

కన్నీరు కిందికి కారుతుంది, పన్నీరు పైకి చిమ్ముతుంది.

కన్ను ఉండ, కంటిపాపను గొన్నట్లు.

కన్ను ఎరుగకున్నా కడుపు ఎరుగుతుంది.

కన్ను ఎఱ్ఱబడ్డా, మిన్ను ఎఱ్ఱబడ్డా కారకమానదు.

కన్ను కైకలూరులో, కాపురం డోకిపఱ్ఱులో.

కన్ను గుడ్డిదైతే కడుపు గుడ్డిదా?

కన్ను గుడ్డిదైనా నిద్ర కేం లోటు

కన్ను చూచి కాటుక, పిఱ్ఱ చూచి పీట.

కన్ను చూచినదానిని నమ్మితే, చెవి విన్నదానిని నమ్మను.

కన్ను పోయేటంత కాటుక పెట్టుకుంటారా?

కన్ను మనదే, వేలూ మనదే నని, పొడుచుకుంటామా?

కన్నులు కంచాలమీద, నోరు రామఃరామా రామా. (రామరామ)

కన్నులు పెద్దవైతే కనుపాపలు పెద్దవౌతవా?

కన్నెల పోయెనోయి కనకలింగమా? అంటే, చేసుకున్న కర్మ మోయి శంభులింగమా? అన్నాడట!

కన్ను లెంతపెద్దవైనా కలిమే, చన్ను లెంతపెద్దవైనా జవ్వనమే!

కన్నువంటి ప్రకాశంలేదు, మన్నువంటి ఆధారంలేదు.

కన్నరుగకున్న కడుపెరుగు.

కన్నొక్కటి లేదుకాని, (కా) కంతుడు కాడా?

కన్నొక్కటి లేదుకాని, కవాటంవంటి బిడ్డ.

[2]కన్యలో చల్లితే, ఊకుకొని తినడానికి ఉండవు.

కన్యలో చల్లితే, కనుగంటులకైనా చాలవు.

1 కన్నెతీకము = వెలయాలి మొదటివిషేకము.

2 కన్యామాసం = ఆశ్వయుజం, పిరటాశి.

కపటము బయట దేవుడు, ఇంట దయ్యము.
కప్ప కాటు లేదు, బాపన పోటు లేదు.
కప్పకూతలు కూయు కాలభుజంగము (దుష్టుడు)
కప్పల తక్కెడ గాండ్రు. (ఒక ముఖానికి రాని వ్యక్తులు)
కప్పలు అరుస్తూనే ఉంటవి, దరులేమో (గట్లు) పడుతూనే ఉంటవి.
కప్పలు ఎఱుగునా కడలిలోతు ?
కప్పలు కూస్తే వర్షము పడినట్లు.
కప్పి పెట్టేస్తే కంపుకొట్టకుండా ఉంటుందా?
కప్పురం మించ్చి ఉప్పుకొన్నట్లు.
కమలాసనుని వాహనమైనా కలహంసకు [1]తూటికాడలే తిండి.
కమ్మ అండగాదు; తుమ్మ నీడగాదు.
కమ్మకు వరుసలేదు, కప్పకు తోక లేదు.
కమ్మ (కాపు) గుట్టు కడప దాటదు.
కమ్మని రోగాలు, తియ్యని మందులు.
కమ్మ నీచుకడిగి [2]కల్లె అవతలపోస్తే ఎగిరొచ్చి ముక్కు కంటుకొన్నదట.
కమ్మ నీచు కడిగినా పోదు, కాకిచిప్ప పెట్టి గోకినా పోదు.
కమ్మత్యాగంబు భువిలోన నమ్మకమ్మ.
కమ్మనీ, తుమ్మనీ నమ్మరాదు.
కమ్మను కందిని వేచేకొంది రుచి.
కమ్మరి వీథిలో సూదు లమ్మినట్లు.
కమ్మించి (=ప్రోత్సహించి) కడాగ తొలిగేవాడు.
కమ్ముల దుప్పటికి, కొమ్ముల బత్తె.
కయ్యానికైనా, వియ్యానికైనా, నెయ్యానికైనా సమత ఉండాలి.

---

1 తూటికాడ = చిన్న ఆకుతో తీగపారై కాలువలలో తేలియాడు ఆకుకూర.
2 కల్లె = కంపతో వేసిన పెఱుగు (కర): తెట్టు.

కరక తురక రెండూ భేదికారులే; ఒకటి లోపలికి పోవాలి; ఇంకొకటి దగ్గరకు వస్తేనే చాలు.
కరక్కాయ కన్నతల్లి.
కరచీ కాటుబడనట్లు.
కరడికాటు పడినవాడు, కంబళిచూచినా భయపడును.
కరణం, కంసాలి కపటం మరువరు. (విడువరు)
కరణంకాపు నా పక్కనుంటే, కొట్టరా మొగుడా ఎట్లా కొడ్తావో- అన్నదట.
కరణం గంటమెత్తితే కంఠానికి రావాలిగాని, లేకుంటే కంఠానికిరాదు.
కరణంతో కంటు, కాటికి పోయినా తప్పదు.
కరణంతో కంటుపడితే, కాడి కదలదు.
కరణంవాడు (కంసాలి) లేకుండా కథ చెప్పమన్నారు.
కరణం సాధుకాదు, కాకి తెలుపు కాదు.
కరణము గ్రామదండుగ గోరు, జంబుకం బేవేళ శవము గోరు.
కరణముల ననుసరింపక విరసంబున తిన్నతిండి వికటించును.
కరణానికే కాపుకే జత, ఉలికి గూటానికే జత.
కరణానికి తిట్టుదోషం లేదు, చాకలికి ముట్టుదోషం లేదు.
కరణాన్ని కంసాలిని కాటికిపోయినా నమ్మరాదు.
కరణాలు కాపులు ఏకమయితే, కాకులుగూడ ఎగురవు.
కరవగ వచ్చునే బలిమి గాడిదకు౯ పులితోలు గప్పిన౯.
కరవది బ్రాహ్మల తిండి కాటేరి తిండి.
కరవమంటే పామైనా కరవదు.
కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం.
కరికి ప్రాణము తొండము, సిరికి ప్రాణము మగువ.
కరి గుట్టులో కాలుపెట్టదు, అంబటిలో వేలు పెట్టదు.

కరిని గాంచిన కుక్క మొరిగిన సామ్యమౌ.

కరువు కాలంలో ఒల్లని మొగుడు, పంటకాలంలో పంపమని వచ్చాడట.

కరువుకు గ్రహణాలు ఎక్కువ.

కరువుకు చింతలు, కాలానికి మామిళ్ళు. (సిరులకు చింతలు మరణానికి మామిళ్ళు కాస్తవి.)

కరువుకుతోడు ఆవపంట కలిగినట్లు.

కరువుకు దాసరులైతే, పదాలెక్కడ వస్తాయి?

కరువుకు మామిళ్ళు, కాలానికి నేరేళ్ళు.

కరువునాటి కష్టాలుండవుగాని, కష్టాలనాటి మాటలుంటాయి.

కరువులో అధిక మాసం. (శ్రాద్ధాలు పెట్టను ఒక నెల ఎక్కువగును.)

కరువులో అరువు.

కరువులో బిడ్డను అమ్ముకొన్నట్లు.

కరువు వస్తుందని సద్ది కట్టిపెట్టినట్లు.

కర్మ కంతంలేదు, కాలానికి నిశ్చయం లేదు.

కర్మ చండాలుని కంటె, జాతిచండాలుడు మేలు.

కర్మంగాలి మొగుణ్ణి కంబట్లో కట్టి, భుజంమీద వేసుకుంటే జారి వీధిలో పడ్డట్టు.

[1]కర్కాటకం బిందిస్తే కాటక ముండదు.

కర్కాటకం వర్షిస్తే, కాడిమోకు తడవదు.

కర్ణుడు లేని భారతం, శొంఠిలేని కషాయం ఒకటే.

కర్ణుని తల భారత మన్నట్లు.

కర్ణునితో ఉందమ్మా, భారతయుద్ధం అంతా అన్నట్లు.

కర్ణునితో భారతం సరి, కార్తీకమాసంతో వానలు సరి.

---

1 కర్కాటక మాసం=శ్రావణం (ఆడినెల).

కఱకులకళ్లెం [1]కల్యాణికిగాక గాడిదకేల.

కఱచే కుక్కకు కఱ్ఱ అడ్డము.

కఱచేది చెఱుకు, పట్టేది అనుము.

కఱ్ఱకు పెట్టినా, గొఱ్ఱెకు పెట్టినా చెడదు.

కఱ్ఱచేతలేని వాణ్ణి గొఱ్ఱెగూడ కఱుస్తుంది.

కఱ్ఱ విరగకుండా, పాము చావకుండా కొట్టు.

కఱ్ఱికుక్క కపిలగోవు అవుతుందా?

కఱ్ఱిది కస్తూరి, ఎఱ్ఱది ఎఱ్ఱమన్ను!

కఱ్ఱు అరిగితే గాని, గరిసె నిఱగదు.

కఱ్ఱు అరిగితేనే కాపు బ్రతుకు.

కఱ్ఱుగొట్టిన గంపెడు సూదులు.

కఱ్ఱు కందిచేలో పోగొట్టుకొని, పప్పుచట్టిలో వెదకినట్లు.

కల నిజంగాదు, [2]కణితి దిండుగాదు.

[3]కలకవేసిన చేప వలకు రాకుండా పోతుందా?

కలకాలం బ్రతికినా కాటికి (ఒకనాటికి) పోక తప్పదు.

కలకాలం బ్రతికే బ్రతుకులు, కుడికాలు పెట్టవే కూతురా అన్నట్లు.
(గృహప్రవేశ శుభసమయంలో)

కలకాలపు దొంగ ఒకనాడు దొరకును.

కలగక ఆడుమాట లయకాలునినైన శమింపజేయు.

కలగన్నచోటికి గంప ఎత్తినట్లు.

కలబంద ఎండు, కోడలి కొత్తా లేదు.

కలలో ఉచ్చ తాగినట్లు వస్తే, ఎవరితో చెప్పుకోను.

---

1 కల్యాణి-పంచకల్యాణి=నాలుగుకాళ్ళు మోర తెల్లగా ఉండే జాతిగుఱ్ఱము.

2 కణితి=మోద. గడ్డగా ఏర్పడిన మాంసగ్రంధి; కంతి.

3 కలకవేయు=నీటిపైకి ఎగిరిపడుట.

కలలో కనుపించిన లంకెబిందెలు రాకపోయినా, పెరికిపెరికి పరుపంతా [1]నీళ్ళచాయ మాత్రం అయింది.

కలలో కాంత, నీటిలో నీడతో సమానం.

కలలో జరిగింది ఇలలో జరుగదు.

కలలోని కౌగిలికి కడుపు లొస్తాయా?

కలలో భోగం కలతోటే సరి.

కలలో మాత్రం తాగినట్లు వస్తే ఎవరితో చెప్పుకోను.

కలవారింటి ఆడపడుచుకు కాకరకాయ కానరాదు.

కలిగింది తినేసి, కట్టుకున్నది విప్పేసి వెళ్ళమన్నట్లు.

కలిగి ఉంటేనే కామితఫలములు కలిగేది

కలిగి ఉన్నవాడు రాజ్యాన్ని సున్నానికి తీసుకుంటా నన్నట్లు.

కలిగి తిననేర నివ్వదు గంపకమ్మ.

కలిగితే కాళ్లమ్ముయ్య, లేకపోతే మోకాళ్లు ముయ్య.

కలిగినది చెబితే కంటిలో పుల్ల పెట్టినట్లు.

కలిగినమ్మ గాదేతీసేటప్పటికి లేనివాని ప్రాణంపోయింది.

కలిగినమ్మ గాడిదతోపోతే అదొకవ్రతం, లేనమ్మ మొగుడితోపోతే మోహం. (గుల)

కలిగినమ్మ అంకు కాషాయి బొంకు

కలిగినమాత్రం తిని, కరణంగారి కమతం చేయమన్నట్లు.

కలిగినయ్య కలిగినవానికే పెడుతాడు; లేనయ్యా కలిగినవానికే పెడుతాడు.

కలిగినవాని కందఋా చుట్టాలే.

కలిగినవారింటి కడగొట్టు కోడలయ్యే కంటే, పేదవారింట పెద్ద కోడ లయ్యేది మేలు.

కలిగినవారి కోడలు కులుకు మానదు.

కలిగెరా కయ్యం, దింపరా గంప.

కలిపి కొట్టరా కావేటిరంగా! (కస్తూరిరంగా!)

---

1 నీళ్ళచాయ = చెంబట్లకు.

కలిపోసి పెట్టినా ఉట్టివంకే చూపు.
కలిమి ఉన్నంతసేపు బలగము, కండ ఉన్నంతసేపు మిండడు.
కలిమికి పొంగరాదు, లేమికి కుంగరాదు.
కలిమి కలిగెనేని కాముగా జూతురు.
కలిమి కులాల మిండడు.
కలిమి లేకుంటే కులం గవ్వచేయదు.
కలిమి లేములు కావడి కుండలు.
కలిమి వచ్చిన తలుపు మూయునట్లు.
కలియుగం రెండు దినాలు పోవాలి.
కలివిపళ్ళు (కలేపళ్ళు) పండితే, కాలం తీరుతుంది.
కలిసివచ్చే కాలానికి నట్టింటికే కుందేలు వస్తుంది.
కలిసివచ్చే కాలానికి కుందేలు వంటఇంటికి వస్తుంది.
కలిసివచ్చే కాలానికి, నడచివచ్చే పిల్లలు (పుడతారు)
కలుపు తీతకు [1]తిల్లిక కావాలనా?
కలుపు తీయనిపైరు [2]కట్ట చేయదు.
కలుపు తీయని మడి, దేవుడు లేని గుడి.
కలుపు తీయనివాడు కోత కోయడు.
కలుపు తీయనివానికి కసవే మిగులును.
కలుపు తీసేనాడు కండ్లకు రానీ, కోత కోసేనాడు గోటికి రానీ,
అంతలో మాఅమ్మ అంపమని రాసి! (ఆడపడుచు కోరిక)
కల్పతరువు క్రింద గచ్చ చెట్లున్నట్లు.
కల్పవృక్షం క్రింద గచ్చపొద ఉన్నట్లు.
కల్పవృక్షం దగ్గఱకు వెళ్లి, కాయ లడిగినట్లు.
కల్పవృక్ష మెంచి, కలివి చెల్లించుట.
కల్యాణం వచ్చినా, కక్కొచ్చినా ఆగవు.
కల్యాణానికి ఒకరు వస్తే, కన్నం వేసేదానికి ఇంకొకరు వస్తారు.

1 తిల్లిక = దీపం; తిర్లిక. 2 కట్ట = దంటు (పెట్టుట).

కల్లందగ్గఱ [1]కరణీకం, కంచందగ్గఱ రెడ్డిరికం.

కల్లాకపటం లేనివారికి కష్టాలు తప్పవు.

కల్ల పసిడికి కాంతి మెండు.

కల్లపైడికి కలుకులు మెండు.

కల్లమున్నచోటికే కంకి పోవును.

కల్లరి నాలుక కోడెత్రాచు కోరవంటిది.

కల్లలాడి కడుపు పల్లము నింపుకొన నేల.

కల్లుకుండ కాడిదే కయ్యాం, జుట్టు ఊడిపోయేదే దయ్యాం.

కల్లుచట్టిలో పొడగువ్వ పడితే వానరాకట.

కల్లులొట్టిదుదాగి కైపెక్కి వదరిన శాస్త్రవాది కాదు.

కల్లరికి మంచి జ్ఞాపకశక్తి అవసరం.

కల్తీవిత్తనం వెల్తి గాదెలు.

కళపెళయ్యగారు కస్తూరి అడుగుతున్నాను నాన్నా! అంటే, మూల గురిగెలో ముత్యాలసరాలున్నవి తీసుకెళ్లమ్మా! అన్నాడట.

కళాసు బ్రతుకు గాలివానతో సరి.

కళ్లం (కల్లం) పళ్ళెం పెద్దదిగా వుండాలి,

[2]కళ్ళం వెళ్ళిన తర్వాత కంది గుగ్గిళ్లు.

కళ్లు కానని పెళ్ళికూతురు, కమతగాని వెంట పోయిందట.

కళ్ళు కావాలంటాయి, కడుపు ఒద్దంటుంది.

కళ్ళు రెండున్నా కనుపించే వస్తు వొకటే.

కళ్ళు వచ్చినప్పుడే చళ్ళువస్తే, మదపుటేనుగును మంచానికి కట్టేద్దును, నీదాకా రానిద్దునా! అన్నదట.

కవికి కంసాలికి సీసం తేలిక.

---

1 కరిణీకం=లెక్కలు బెట్టుట.

2 కళ్ళం వెళ్ళుట-కుప్పవెళ్ళుట=కల్లంపని. కుప్పనూర్పిడి పని అయిపోవుట.

కవితకు మెప్పు, కాంతకు కొప్పు.
కవి యను నామంబు నీరుకాకికి లేదా.
కవిత నేర్పు యతికూర్పే తెలుపుతుంది.
కవిత్వం గడ్డి అనుకోని గాడిదలన్నీ పడి మేయసాగినవట.
కవిలి (కలే) చెట్లు కాస్తే, [1]కారు వరి పండుతుంది.
కవిలి (కలే) చెట్లు పండితే, కఱ(రు)వు తప్పదు.
కవ్వం కదురు తిరిగిన ఇంట కరువు లేదు.
కష్టపడి ఇల్లుకట్టి, కల్లుతాగి తగుల బెట్టినట్లు.
కష్టపడి సుఖ పడమన్నారు.
కష్ట సంపాదనము, ఇష్ట భోజనము.
కష్టాలు కలకాలం కాపురముండవు.
కష్టాలు నిన్ను కష్టపెట్టేవరకు నీవుగా వాటిని కలియబెట్టవద్దు.
కష్టాలు మానవులకు గాక మాకులకా?
కసవు లేనిదే పశువు లేదు, పశువు లేనిదే పెంట లేదు, పెంట లేనిదే పంట లేదు.
కసవులో పనసకాయ తరిగినట్లు.
కసికింత దొరతనం వచ్చింది, కసికింత పప్పు వేయమన్నాడట!
కసిపోనమ్మ మసి పూసుకొన్నదట.
కసాయివాడికి కత్తి అందిచ్చినట్లు.
కసుమాలవు కమ్మ (కాపు) కులము కంపనా కట్టినా కాలదు.
కసువుకు పోరా కమ్మా అంటే, కడుపు నొప్పే నా అమ్మా; బొచ్చె ఎత్తుకరా బొమ్మా అంటే, అట్లా చెప్పవే నాయత్తా అన్నాడట.
కస్తూరీ నలుపే, తెలికపిండీ నలుపే.

---

[1] కారు = రెండవకారు పైరు.

## కా

కాంచనం కర్మ విమోచనం.

కాంచీపురం ఉపచారం లాగ.

కాంతల భ్రమలు కన్నుగట్టు మాయలు.

కాంతా కనకం [1]కాశ్యపులే కయ్యాలకు మూలం.

కాకరకాయకు కంతలు (గంట్లు) ఎన్ని? అంటే, ములగకాయకు ముండ్లెన్ని? అన్నాడట.

కాకరబీకర కాకు జాతారే! అంటే, దూబగుంటకు దూదేకను జాతారే అన్నాడట—ఇంకొక దూదేకుల సాహేబు. (ఉరుదు వచ్చీరాని దూదేకులవారి సంభాషణ).

కాకి కట్టుమన్న కడుపాయె వదినా; [2]కత్తవబావికి పోతే కరిగిపోయె వదినా?

కాకి కట్టుమంటే, మొగుణ్ణి అప్పా అనెనట.

కాకి కావుమంటే, కాంతుని కౌగులించుకొన్నట్లు.

కాకికి కంకెడు లేదు, పిట్టకు పిడికెడు లేదు.

కాకికి కాని పాలనెమ్ములు కాస్తేనేమి, పూస్తేనేమి.

కాకికూత బోలు కర్మబంధుల కూత.

కాకి కూయగాలేచి, కాటుకమాదిరి అన్నం కాకరకాయ మిరియం చేసి, పసువు లొచ్చేవేళకు పరుగెత్తిపరుగెత్తి వడ్డించిందట.

కాకిగూటిలో కోకిల పిల్లవలె.

కాకి గూడుపెడితే కడపటి వర్షం.

కాకి చిక్కనగొడ్డు డొక్క చీల్చును గాని, బలిసిన పసరం పొంత పోగలదా!

---

1 కాశ్యపి = భూమి.

2 కత్తవ = ఏటికి కట్టిన అడ్డకొమ్మ (కట్ట).

కాకిని కొడితే గద్ద చచ్చిందట.

కాకిని తెచ్చి పంజరంలో ఉంచితే, చిలుకపలుకు పలుకుతుందా?

కాకిపిల్ల కాకికి ముద్దు.

కాకిముక్కున దొండపండు వలె. (భార్యాభర్తలు ఒకరు నలుపు ఇంకొకరు ఎరుపు అయితే చెప్పే సాటవ).

కాకి ముక్కర తన్నుకొని పోయి డొంకపాల్జేయ గలదు గాని తిన గలదా?

[1]కాకిసోమాల కూతురు - [2]అంకమ్మకళల అల్లుడు.

కాకులు అరుస్తూనే వుంటవి, [3]కరవాడ ఎండుతూనే వుంటుంది.

కాకులకు కాని ముషిణి పండితేనేమి ఎండితేనేమి?

కాకులను కొట్టి, గద్దలకు వేసినట్లు.

కాకులమధ్య కోకిల!

కాకులు రోక శ్లెత్తుక పోయినవి అన్నట్లు.

కాక్కై కలకాల ముండే కంటే, హంసై ఆరునెల లున్నా చాలు.

కాగలకార్యం గంధర్వులే తీరుస్తారు.

కాగెడు (కాగు+ఎడు) జొన్నలు బొక్కినా, కొజుకు మొండికాలే!

కాచిన చెట్టుకు కఱకురాళ్ల దెబ్బలు.

కాచిన చెట్టుకే కఱ్ఱ దెబ్బలు.

కాచుకొన్న గంజి తాగనిస్తే, నేను కమ్మనాయుడని (కాపు) కాదు-అన్నాడట.

[4]కాటంరెడ్లోరి కూడుతిని, పెరమారెడ్డోరి పసులు గాచినట్లు.

---

1 కాకిసోమాలు=వెఱ్ఱిచేష్టలు. 2 అంకమ్మకళలు=అవ్యక్తచేష్టలు.

3 కరవాడ=ఉప్పుపట్టించి ఎండబెట్టిన ఉప్పునీటిచేప.

4 వంటరెడ్లలో కాటంరెడ్డి - పెరమారెడ్డి అని రెండు తెగలున్నవి. వీరినే లేత. ముదురు కాపు లందురు. సాధారణంగా. కాటంరెడ్డివారు స్మార్తులు. పెరమారెడ్డివారు వైష్ణవులు.

కాటికి కాళ్ళుచాచి, తిండికి చేతులు చాచినట్లు.

కాటికి పోయినా కరణాన్ని నమ్మరాదు.

కాటికి పోయినా కాసు తప్పదు.

కాటికి పోయిన పీనుగు, కట్టెల పాల్గాక ఇంటికి వస్తుందా?

కాటిదగ్గఱి మాటలు కూటిదగ్గర ఉండవు.

కాటిలో పండినవి కాకులు తిన్నవి-ఒకటి.

కాడికిందకు వచ్చిన గొడ్డు, చేతికిందకు వచ్చిన బిడ్డ.

[1]కాడిన పోట్లలో కత్తితో గోకినట్లు.

కాడీమేడీ కడగాబెట్టి కప్పతో పొయ్యే కాపోడా.

కాడు కాలుతూ ఉంటే, కన్నె ఎదుగుతూ ఉంటుంది.

కాదు అంటే కళతక్కువ, అవును అంటే ఆయుస్సెక్కువ.

కాదు అన్నవాడే కారణం.

కాదుకాదు అంటే, నాదినాది అన్నాడట!

కానకుండా కట్టెడిచ్చేను గాని, వినకుండా వీరణాలు వాయించ గలవా?

కానకుండా మాట్లాడే మాట-కడగని గుద్ద ఒకటే.

కానని ముఖానికి గంధము అక్షతలు.

కాననివారి పాయసం గంపలాది.

కానవచ్చే కొండలను గట్టెక్కి చూడటం ఎందుకు?

కాని కాలాని అల్లే పెండ్లామైంది. (వ్యంగ్యం)

కాని కాలానికి కందిఅయినా కాయదు.

కాని కాలానికి కర్రే పామై కఱుస్తుంది.

కాని కాలానికి పైబట్టను పక్షులెత్తుకొని పోతాయి.

కానికి టెంకాయ ఇస్తారని కాశికి వెళ్ళినట్లు.

కాని కూడుతిన్నా, కడుపు నిండవలెను.

1 కాడిన=గుచ్చుకొనిన; తెగిన.

కానిచోట కందయినా కాయదు.
కానిదానికి కలతలు మెండు.
కానిపనులుసేయ ఘను లాసపడుదురా.
కానిదానికి కష్టం మెండు, చెల్లని కాసుకు గీతలుమెండు.
కానివాడు లేనివానితో జత.
కానివాని కొంప కాచి తెఱచవలెను.
కానివేళకు కందులే గుగ్గిళ్లయినట్లు. (వ్యంగ్యం)
కానుగ నీడ-కన్నతల్లి నీడ.
కానుగ వాసాలు కదోయి కాదరుసాహెు బంటే, పుచ్చినదాకా వుందునా బురానుసాహెబా అన్నాడట.
కానున్నది కాకమానదు, రానున్నది రాకమానదు.
కాన్పుతోకూడ తల్లి చేపినట్లు.
కాపు కక్కసం, కంసాలి కువాడం.
కాపుకరణం నాపట్లయితే, ఎట్లాకొడతావా! కొట్టర మొగుడా! అన్నదట.
కాపుకు [1]నెనరులేదు, కందికి చమురులేదు.
కాపు చేసిన పాపం కళ్లంతో తీరుతుంది.
కాపుజాడ, గొర్రె జాడ.
కాపుతోనే కలవ్వా వచ్చింది.
కాపు బీదయితే కళ్ళం బీద.
కాపు మంత్రులలో [2]కాటేరిదైవము.
కాపురం ఎట్లా చేశావే? కమ్మతిమ్మక్కా! అంటే, నువ్వు చెప్పినట్లు చేస్తినే, బొచ్చుతిమ్మక్కా అందట.

1 నెనరు = విశ్వాసం.
2 కాటేరి = క్షుద్రదేవత. పైరులకు కలిగే రక్తస్రావక వ్యాధికి.

కాపురం గుట్టు, రోగం రట్టు.

కాపురం చేసేకళ, కాలు తొక్కేటప్పుడే కనబడుతుంది.

కాపురానికి కడగండ్లు, మగనికి రేజీకట్లు.

కాపుల కష్టం, భూపుల సంపద.

కాపుల చదువులు కాసుల నష్టం, బాపల సేద్యం భత్యం నష్టం.

కాపుల జాతకాలు కరణాల కెరుక.

కాపువాని పస, కావడి [1]పంటే చెప్పుతుంది.

కాపువానికీ, కందిగింజకూ నిజం లేదు.

కాపువాళ్ళింట్లో పందిటి గుంజలకుకూడ పనిబెట్టుతారు.

కామము కాలమెరుగదు.

కామమ్మ మొంగుడంటే, కామోసు అనుకున్నాను, కాకుంటే కావడి కుండలు పడెయ్యోంది.

కామమ్మ మొగుడు కామోచంటే, కామోచన్నాను, కాకపోతే నాకత్తా బుత్తా ఇట్టా పారెయ్యమన్నాడట.

కామరాజు గాదెలు, భీమరాజు పాదులు.

కామాతురాణాం నభయం, నలజ్జా.

కామాతురుడు అర్థకాంక్షపీడడు.

కామానికి కండ్లులేవు [2]గుడిసేటికి గుణంలేదు.

కామిగాక మోక్షగామి గాడు.

కామిని వేషధారికి సాధ్వీనడత లేమి తెలియును.

కామిరెడ్డి అనేభూతానికి, రామిరెడ్డి అనే రక్షరేఖ.

కామెర్లరోగికి కనపడేదంతా పచ్చనే.

కాయ కొడవలి నీచేతికిచ్చినా, నీ యిష్టంవచ్చినట్లు చేసుకో.

---

1 పంటి = మట్టికుండ.

2 గుడిసేటి = లంజ = దేవదాసి అనట.

కాయతిన్నా కంపే, గడ్డతిన్నా కంపే.

కాయని కడుపు-కాయని చెట్టు.

కాయలో పత్తి కాయలో ఉండగానే, కామన్న కారుమూళ్లు, నాకు మూడుమూళ్లు. (గుడ్డ)

కారణం లేక కార్యం పుట్టదు.

కారణం లేని కార్యం, పూరణం లేని బూరి; [1]వీరణం లేని పెండ్లి ఉండవు.

కారణ గుణమ్ములుగదా కార్యమునకు?

కారము లేని కూర, ఉపకారము లేని మనుష్యుడు.

[2]కారాకువలె కర్మం కాలిపోతుంది.

కారాని కాలానికి రారానిపాట్లు.

కారాని కాలానికి కప్ప దయ్య మవుతుంది.

కారుచిచ్చుకు గాడ్పు తోడయినట్లు.

[3]కారుజొన్న మేసే కోడెకు కైలాసం కావాలా?

కారువరికి గొర్రెలమంద, [4]పిషాణాలకు రొట్ట ఎరువు.

కార్యం అయ్యేదాకా గాడిద కాళ్లయినా పట్టాలి.

కార్యంనాడు తలవంచుకొని, కలకాలం తలెత్తి తిరుగవచ్చు.

కార్తీకం కలకాశ, వైశాఖం పులకాశ.

కార్తీకం తల్లవేసి కాపాడవలె.

కార్తీకం రాని, కమ్మలు కడియాలు చేయిస్తానన్నాడట వైద్యుడు.

---

1 వీరణం=వాద్యవిశేషం.

2 కారాకు=పండుటాకు.

3 కారు=రెండవకారు (అదను) పైరు; వానలు పోయినతర్వాత కార్తీకమాసంలో వేసే (జొన్న) పైరు; కాఱు-వర్షఋతువు.

4 పిషాణాలు=మంచి వరిజాతి; పూర్వం నెల్లూరులో ప్రసిద్ధి.

కార్తీకంలో కలవారి అమ్మాయి, కడవనీళ్ళు తెచ్చే పొద్దుకూడా వుండదు.

కార్తీక పున్నానికి కలకపంటలు.

కార్తీక మాసానికి కాకులు తొక్కుతాయి.

కార్తీక మాసాన కడవలు కడుగ ప్రొద్దుండదు.

కార్తీకమాసానికి (క)కుదురంత ఉందునా, మాఘమాసానికి నామహిమ చూపిస్తాను.

కార్తీకానికి [1]కరుగు మోపుతుంది (మొలగొలుకుల వరిపైరు)

కార్తెముందు ఉరిమినా, కార్యంముందు వదిరినా (పదరినా) చెడుతుంది.

[2]కార్తెమూల మెరుపు కార్తెకు బలం.

కార్తెమూల మబ్బు కారక మానదు.

కాలంతో కరవులేదు, మగనితో దరిద్రం లేదు.

కాలం కర్మం కలసి రాకుంటే, కమలబాంధవుని కైనా కష్టాలు తప్పవు.

కాలం కానప్పుడు ఆలే తేలై కరుస్తుంది.

కాలం గడచిపోవును, మాట నిలిచిపోవును.

కాలం తప్పినవాడిని, పై (మీద) బట్టే పామై కరుస్తుంది.

కాలం తీరిందంటే, పమిటచెఱగు పామై కరుస్తుంది.

కాలంనాటి కందిగింజ, పెద్దలనాటి పెసరగింజ.

కాలం పోతుంది, మాట నిలుస్తుంది.

కాలంమారి కంచు పెంకయినట్లు.

కాలం మూడినవ్యక్తికి కాశికి పోయినా సేగితప్పదు.

కాలంలో విత్తనాలు కలలోనైనా చల్లాలి.

1 కరుగు=వెన్నునన; వెనుమూవు.

2 కార్తెమూల=ఈశాన్యము. కృత్తిగా నక్షత్రపుదిక్కు.

కాలంవస్తే గాడిదకాళ్ళు తిన్నన.
కాల కర్మగతుల కనిపెట్టవలెనయా.
కాలక్షేపం లేకపోతే, [2]కంచిమేకను కొనుక్కోమన్నారు.
కాల తంతే పెరిగేది పుచ్చకాయ, కుళ్ళేది గుమ్మడికాయ.
కాలను పాతకొయ్య, తాగను పాతకల్లు (మద్యము) నమ్మను పాత స్నేహితుడు చదువను పాత పుస్తకాలు శ్రేష్ఠములు.
కాలమందు చేస్తే దేవతలకు ప్రీతి; అకాలమందు చేస్తే అసురులకు ప్రీతి; ఇద్దరివాత మన్ను కొడతాను అన్నట్టు.
కాలమా! యాలమా! కడకు చూడె పెళ్లమా ?
కాల మొక్కరీతి గడిపినవాడే గడచి బ్రతకినవాడు.
కాలానికి కడగండ్లూ, దేశానికి (ముప్పు) తిప్పలు.
కాలికి చుట్టుకొన్న పాము కఱవక మానదు.
కాలికి దూరమైతే కంటికి దూరమా ?
కాలికి వేస్తే మెడకు, మెడకు వేస్తే కాలికి.
కాలికి బలపం కట్టుకోని, కడపముగ్గులు బెట్టుతాడు. (పనిలేక ఇంటింటికి తిరుగును-అనుట)
కాలికిరాని చెప్పును కంచెలో వేయమన్నారు.
కాలికిరాని చెప్పు కడగా ఉంచు.
కాలికోసం చెప్పులు ఒళ్లో పెట్టుకోవాలి ?
కాలినట్టి బ్రమాకు కడురమ్యమై యుండును.
కాలితో కదుపుకోవడం, చేతితో జుట్టుకోవడం.
కాలితో నడిస్తే కాశికి పోవచ్చును గాని, తలతో నడిస్తే తనవాకిలి దాటవచ్చునా ?
కాలిది తీసి, నెత్తికి రాచుకొన్నట్లు.

2 కంచిమేక=కంచిమేక అమడల యీనును, పని ఎక్కువ.

కాలిన గుడిసెకు పీకిన వాసమే లాభం.
కాలిన మన్నూ, కాలనిమన్నూ అంటవు. (అతకవు)
కాలిమెట్లు తలకెక్కినట్లు.
కాలుకడుగ ముంత లేదు, కల్లుకు కళాయిగిన్నె.
కాలు కాలిన పిల్లివలె. (తిరుగాడుట)
కాలు చెయ్యి ఉన్నంత కాలం కాలం గడుస్తుంది.
కాలు జారితే గంగానమ్మదే మహిమ - అన్నట్లు.
కాలు జారితే తీసుకోగలం గాని, నోరుజారితే తీసుకోగలమా?
కాలు జారితే పడి, నేల అచ్చి వచ్చింది కాదు అన్నట్లు.
కాలు జారినా, మాటజారినా పడమన్నారు.
కాలుజారితే పట్టుకోవచ్చుగాని నోరుజారితే పట్టుకోలేరు.
కాలు తొక్కిన వేళ, కంకణం కట్టిన వేళ (మంచిది కావాలి).
కాలుతొక్కని మొగుడు దేనికంత, కని పెంచని బిడ్డ బారెడంత.
కాలు పట్టుకొని లాగితే చూరు పట్టుకొని వేళ్ళాడినట్లు.
[1] కాలుబట్టిన ఎద్దు-ఆలు చచ్చిన పురుషుడు.
కాలు వంగినగాని, గంగానమ్మయినా పట్టదు.
కాలువ దాటలేనివాడు కడలి దాటగలడా?
కాలు విరిగిన ఎద్దే గట్టెక్కితే, కొమ్ము విరిగిన ఎద్దెక్కదా?
కాలే కడుపుకు మండే గంజి.
కాల్చిన పందికొక్కులకు కొట్లాట పెట్టేవాడు.
కాళిదాసు కవిత్వం కొంత, నా పైత్యం కొంత.
కాళ్లకు చుట్టుకొనినపాము కరవక మానునా?
కాళ్లకు మ్రొక్కేవాడు పోయి, కంఠాన్ని పట్టుకొనేవాడు వచ్చినట్లు.
కాళ్లదగ్గరకు వచ్చిన బేరం, కాశికి వెళ్లినా దొరకదు.
కావడి ఎన్నివంకలు తిరిగితేనేమి? ఇల్లు చేరితే సరి.

---

1 కాలుబట్టుట = పశువులకు పట్టు గొట్టుట.

కాశికి పోగానే, కట్టెకుక్క గంగగోవు అవుతుందా!
కాశికి పోయి, కుక్క (పిల్లి) సెప్పాలు తెచ్చినట్లు.
కాశికి పోయి కుక్కపిల్లను దెచ్చినట్లు.
కాశికిపోయి కొంగరెట్ట తెచ్చినట్లు.
కాశికి పోయినవాడు, కాటికి పోయినవాడు ఒకటే. (పూర్వం)
కాశికి పోయినా కర్మం తప్పలేదు.
కాశికి పోయినా కావడి బరువు తప్పలేదు.
కాశికి పోయివచ్చింది మొదలుకొని, కామిశెట్టి ఒక్కడే గద్దకడిగేది మావూళ్లో అన్నాడట.
కాశిలో కన్నుమూసినా రాని పుణ్యం, కాళహస్తిలో కాలుపెడితే వస్తుంది.
కాశిలో కాసుకొక లంజె.
కాశిలో బెండను వదలినాడుగాని ముండను వదలలేదు.
కాశివాసులైన కనలేరు మోక్షంబు.
కాశ్మీరపు గాడిదవలె.
కాసిచ్చేదే గొప్ప కలిలో రాజులకు.
కాసీ పూసే చింతా, గన్నారపు సంతా, నీళ్లకడవ కాడ ముంతా, నిద్రకేమి పుచ్చుకొంటావే?
కాసు కుండకు రువ్వాలక్క.
కాసుకు కాలేత్తే దానికి కాశీయాత్ర కావాలనా?
కాసుకు గతిలేదు, కోటికి [1]కొడి ఎత్తినాడు.
కాసుగలమ్మ కట్టావిప్పా, పీసంగలమ్మ విడవామడవా.
కాసుగొడ్డుకు రూకబందె.
కాసును వెతుకగ రత్నమును గన్నరీతి.

1 కొడి=పతాకము

కాసుకు మారితే నాకనుబోతే, మూడునూర్ల ముంగిర పోయిందట!
కాసు గొడ్డుకు రూక బందె.
కాసులకును దిరుగ కలుగునా మోక్షంబు.
కాసులేనివాడు కడుబ్రహ్మచారియా.
కాస్త ఓడంటే, అంచంతా ఓడన్నట్లు.
కాస్తకాస్త పెత్తనం వస్తోంది, వేయవే బారెడుమాకు అన్నట్లు (?)



## కి

కించిత్తు నల్లిగరచిన మంచమునకు పెట్లువచ్చు.
కిం(క్రి)ద ఒకబొంత, మీద ఒకబొంత నాకేమిచింత!
కింద పడినా, మీసాలకు మన్ను కాలేదన్నట్లు.
కింద పడ్డా [1]పీటికి మన్ను కాలేదు.
కింద పెట్టిన పంటలుండవు, పైన పెట్టిన వానలుండవు.
కిందపెట్టిన పంటలుండవు, పైనపెట్టిన బానలుండవు.
కిందపడ్డా, పైచేయి నాదే అన్నట్లు.
కిందిమట్ట రాలుతుంటే, పైమట్ట నవ్వేస్తుంది. (టెంకాయచెట్టుకు)
కిట్టులో కిట్టు కలిస్తే కంపేడకు పోతుంది?



1 పీట=పీఛ.

## కీ

¹కీటు విడిచి గోడ పెట్టలేము.

కీటు లేని గోడ. కొండ్ర లేని దుక్కి.

కీడొంది మేలెంచ వలెను.

కీర్తిమార్గం కాటికే దారిచూపును.

కీలూడిన యంత్రము-తొండము లేని ఏనుగు.

కీ లెఱిగి వాత పెట్టాలి.

---

1 కీటు=మట్టిగోడలు పెట్టునపుడు ఒక్కొక్కపరి ఒకపాటి ఎత్తుగా (? అడుగుల) చుట్టూ గోడలేపుట.

## కు

కుంచమంత కూతురుంటే మంచం మీదే కూడు (తల్లికి).

కుంచంలో కదుళ్ళు పోసినట్లు.

కుంచాలమ్మ కూడు వేస్తే, మంచాలమ్మ మాయం చేసిందట.

కుంచె ఉంటే ¹కుడికొప్పు, అడ్డకుంటే ఎడమకొప్పు.

కుంచెడు గింజలకు కూలికి పోతే, తూమెడు గింజలు దూడలు తిని పోయినవట.

కుంచెడున్నమ్మకు కూర్కు పట్టదు.

కుంజరయూథము దోమ కుత్తుక జొచ్చినట్లు.

కుంజరాళియున్న గుహఁ బ్రవేశించునే సత్యహీనమైన జంబుకంబు.

కుంటి ఎద్దు రానిదే దూలాల మెత్తరు.

---

1 కుడికొప్పు - కుడికొప్పు కలవారింటి ఆడువారు పెట్టుదురు.

కుంటి కులాసం, ఇంటికి మోసం.

కుంటి గాడిదకు జారిందే సాకు.

కుంటి గుఱ్ఱానికి జారిందే సాకు.

కుంటి గుఱ్ఱాలు తోలు కత్తులు.

కుంటి చేతులవాడు నువ్వులుతిన, బెదిరించినట్లు.

కుంటివానికి కుయుక్తు లెక్కువ.

కుంటివాని తిప్పలు కుంటివానికి, గూనివాని తిప్పలు గూనివానికి.

కుంటివాని పారుపత్తెము ఇంటిముందటే.

కుంటి సాకులు-కొంటె మాటలు.

కుంటోడైనా ఇంటోడు మేలు.

కుండ ఎప్పుడు కేటో, కుదురు అప్పుడే వేటు.

[1]కుండమార్పు మనువులు కూడైనా వస్తవి, కుమ్మయినా అవుతవి.

కుండను మూయను మూకుడున్నదిగాని, లోకుల నోరు మూయ కేమున్నది!

కుండల దుమ్ము రోకళ్లతో దులిపినట్లు.

కుండలు, చేటలు లేవని వండుక తినటం మానుకుంటామా?

కుండలు దాచినా, కండలు దాచలేము.

కుండలోకి కూడు గుదములోకి గూటాము తా తెచ్చుకొంటేనే గాని రావు.

కుండలో కూడుంటే, ముండకు నిద్రరాదు.

కుండలో కూడు కదలకుండా ఉండాల బిడ్డలు మాత్రం పెరగాల.

కుండలో కూడుమాత్రం కుండలో ఉండాల, బిడ్డ గుండ్రాయి మాదిరి కావాల.

కుండలో గుఱ్ఱాలు తోలినట్లు.

1 కుండమార్పు మనువు=బావమరదులు అప్ప చెల్లెండ్రను ఇచ్చి పుచ్చుకొనుమని.

కుండలో మెతుకులన్నీ పట్టి చూడవలెనా?
కుండలో లేనిది నా సిండలోనుండి తెచ్చిపెట్టనా - అన్నదట.
కుండ వెళ్లి బిండెకు తగిలినా, బిండెవచ్చి కుండకు తగిలినా కుండకే
మోసం. (మోపు)
కుండ వేరైతే, కులం వేరా?
కుందేటి కొమ్ము సాధించినట్లు.
కుందేలు కాలు నాకుకొన్నట్లు (దాహం దీరును)
కుందేలు దొరికేవేళకు, కుక్కకు బయలికి వచ్చిందట.
కుందేళ్లతోకూడ పరుగెత్తి, కుక్కలతోకూడ వేటాడినట్లు.
కుంపట్లో తామర మొలచినట్లు.
కుంభకర్ణుని నోటికి అరకాసు మజ్జిగా?
కుక్క ఇల్లు సొచ్చి కుండలు వెదకదా.
కుక్క, అతిమూత్రవ్యాధి బంధువైరం లేకుంటే గంటకు ఆమడదూరం
పోతాన్నదట. (చూచిన దాని మీదంతా కాలెత్తి ఉచ్చ
పోస్తూ, కనబడ్డ కుక్కలతో అంతా కలహిస్తూ పోతుంటుంది)
కుక్క ఉట్టిచేర్లు తెంచగలదు గాని, పాలకుండ పడకుండా పట్ట
గలదా?
కుక్క ఎక్కలేక కాదు చచ్చేది, పెకక్కలేక.
కుక్క గోవు కాదు, కుందేలు పులికాదు.
కుక్క కాటుకు చెప్పుదెబ్బ.
కుక్కకు ఏమి తెలుసు మొక్కజొన్న రుచి?
కుక్కకు ఏవేషం వేసినా, మొరగక మానదు.
కుక్కకుకూడ కలిసివచ్చే కాలమని ఉంటుంది.
కుక్కకు కూడువేస్తే కూటికుండకు ముప్పు.
కుక్కకు జరికుచ్చులు కట్టినట్లు.

కుక్కకు జలతారు టోపి బెట్టినట్లు.
కుక్కకు నేయికూడు బెట్టడం, చెడ్డజాతికి విద్య జెప్పినట్లు.
కుక్కకున్న గుణము, గురునకు లేదయా.
కుక్కకు పులితోలు కప్పగానే కరవనేరుస్తుందా?
కుక్కకు పుట్టేదంతా గొక్కిరిపండ్లే.
కుక్కకు పెత్తనమిస్తే కుండలు క(గ)లకదా?
కుక్కకు పెత్తనమిస్తే, చెప్పులన్నీ కొరికి పెట్టినదట.
కుక్కచంటిలో పాలు కుడిచేమా!
కుక్క చింపిన విస్తరైనట్లు (కాపురం)
కుక్కతీసిన గొయ్యా? నక్కతీసిన గొయ్యా?
కుక్క తెచ్చేవన్నీ గొడ్డలే.
కుక్క కూయనేమి గుబ్బమునకు లెక్క
కుక్కతోక గట్టి కుదురునా చక్కగా.
కుక్కతోక వంకర దీర్చలేనివారు ఏటివంకల దీర్చగలరా.
కుక్కతోక పట్టుకొని, గోదావరి ఈదినట్లు. (దాటినట్లు)
కుక్కదానం పట్టిఅయినా, కుటుంబాన్ని పోషించాలి.
కుక్క దాటలేక గాదు పెరుక్కోలేక బాధపడేది.
కుక్కను అమ్మితే డబ్బు మొఱుగుతుందా!
కుక్కను ఎక్కితే సుఖమూ లేదు, కూలబడితే (నష్టమూ) దుఃఖమూ లేదు.
కుక్కను కొట్ట(ను) బచ్చనకోల కావలెనా?
కుక్కను తెచ్చి అందలంలో కూర్చోబెడితే, కుచ్చులన్నీ తెగ గొరికిందట!
కుక్కను గుఱ్ఱంవలె సాకి దొంగవస్తే రెడ్డే మొరిగినాడంట.

కుక్కను పెంచితే గండాయె, కూటికుండకు చేటాయె.

కుక్కను పందివలె పెంచి దొంగవస్తే ఆలుమగడే మొరిగినారట.

కుక్కను సింహాసనమున కూర్చుండబెట్టినా వెనుకటి గుణం మానదు.

కుక్కను ముద్దుచేస్తే, మూతెల్లా నాకుతుంది.

కుక్కనోటికి టెంకాయ అబ్బునా? (అరవునా)

కుక్కపైన కంబళి వేయగానే గంగిరెద్దు అవుతుందా.

కుక్క బతుకు - నక్కచావు.

కుక్క బలిస్తే గోనెలు మోస్తుందా?

కుక్కబుద్ధి [1]నాలిగుంటలో ఉన్నంతసేపే.

కుక్క ముట్టినకుండ అక్కఱకు వస్తుందా?

కుక్క మొరిగితే జంగం పరపతి పోతుందా?

కుక్క (అ)రపు ఊరిదారి చూపితే. నక్కరపు కాటిదారి చూపును.

కుక్కల [2]రంద ఏమిటంటే, చిత్తకార్తె పెట్టిందేమో చూడమన్నాడట.

కుక్కలకు కులం పంచాయతా? (జాతివైర మనుట)

కుక్కలు ఏగలు పడికితే, గుడ్డాలు చీరలు కడతాయి.

కుక్కలు కుక్కలూ పోట్లాడుకొని, కూట్లో దుమ్ము పోసుకున్నాయట.

కుక్కలు చెప్పులు వెదకును, నక్కలు బొక్కలు వెదకును, తక్కిన లంజకొడుకు తిప్పె వెదకును.

కుక్కలు మొరుగుతుంటవి, (బిడారు) సాతు సాగిపోతూనే ఉంటుంది.

కుక్కవంటి మనసు కూర్చుండనిచ్చునా.

కుక్కవస్తే రాయి దొరకదు, రాయి దొరికితే కుక్క రాదు.

---

1 రంది = గరంప

2 దాలి చిన్నగుంట త్రవ్వి, అందు కూడబెట్టి మట్టూ ఆకు అన్నము తొక్కి పీరు మొదలైనవి కాచుకొనునది.

కుక్క సంతకుపోయి, వచ్చినట్లు. (కొనదు-అమ్మదు)

కుక్కసింహ మగున గోదావరికి బోవ.

కుక్కస్వారికి కుచ్చులజీనా.

కుక్క చక్రమే (బండి) గోల చేసేది.

కుచ్చి (గుచ్చి) కుదుటిలో పెడితే, విచ్చుకొని వీధిలోకి వచ్చినట్లు.

[1]కుచ్చెలక్రింద త్రాచువలె.

కుజనుడౌ వైద్యుండు ప్రజకు రోగముగోరు, సామాన్య విప్రుండు చావు గోరు.

కుటిల మానవులకు గుణమేల కలుగురా.

కుట్టని రవిక చేతులో వున్నా సరే, ఏలని మొగుడు ఊరిలో ఉన్నా సరే.

కుట్టికుట్టి గుంజగాటికి దుప్పటి నేయించినట్లు.

కుట్టితే తేలు, కుట్టకుంటే కుమ్మరిపురుగు.

కుట్టిన ఏడు కట్టెండ, మరోఏడు మట్టెండ, మూడో ఏడు మొదలెండె.

కుట్టిన చవికి బుత్తగలు లేవు, మధ్యాహ్నం సద్దికి ఉప్పులేను.

కుట్టిన తేలు గుణవంతురాలు, కూసినమ్మ కుక్కముండ.

కుట్టిన తేలు కుట్టకున్న కుమ్మరిపురుగు.

కుట్టిన తేలు గుణవంతురాలు, కూసినముండ [2]రాళ్ళగాయి ముండ.

కుట్టిన తేలు గోడఎక్క, కూసులంజ రచ్చకెక్క.

కుట్టినమ్మ కుదుట్లో ఉంటే, కూసినమ్మ గయ్యాళి.

కుట్లు [3]మొయ్య తిని కప్పకావలి పొమ్మంటే అగులు బుగులు కాల మత్తా! ఎరలో పండకుంటా నన్నాడట!

---

1 కుచ్చెలం పిడకలు పేర్చిన గుట్ట

2 రాళ్ళగాయి=మాటకారి, వాగుడుకాయ.

3 మొయ్య=ఒక సముద్రపు చేప.

కుట్టేవాడికి కుడిపట్టు చీదేవాడికి ఎడమపట్టు ఉండరాదు.

కుట్టేవారు కుడితే చెవులు నొప్పెట్టవు.

కుడికన్ను కుదెయ్యడం, ఎడమకన్ను ఎగరెయ్యడం.

కుడికాలు పెడితే కలతక్షయం, ఎడమకాలు పెడితే వంశక్షయం.

కుడిచి కూర్చొని గుదంలోకి మేకు దెచ్చుకొన్నట్లు.

కుడిచి కూర్చొలేక కుమ్మరావము తెచ్చుకొన్నట్లు.

కుడిచెయ్యి చేసేదానం, ఎడమచెయ్యి ఎఱుగరాదు.

కుడిచేతికున్న మన్నన ఎడమచేతికేదీ?

కుడిచేతిలో ఇచ్చి, ఎడమచేత్తో తీసుకున్నట్లు.

కుడితి కుండలో (తొట్టిలో) పడ్డ ఎలుకవలె.

కుడితి పులుపే బఱ్ఱె బలుపు.

కుడితి మరుగు బఱ్ఱె కూసిన చేపునా.

కుడితి మరుగు బఱ్ఱె విడినీరు త్రాగునా.

కుదుపు మంచిదైనా కడుపు మంచిది కాదు.

కుడుము చేతికిస్తే పండుగనేవాడు. (అల్పసంతోషి)

కుడుము మింగేవానికి అప్పడాలు ఒక లెక్కా?

కుడుములు తిన్నవాడే కట్టువెళ్ళును.

కుడుములు వండని ఆడుదీ, కూన(ని)రాగం తీయని మగవాడూ ఉండరు

కుడుమువలె వాచింది అంటే, అన్నా! కుడుములు వండమన్నట్లు.

కుడువకూడు, [1]తినగుగ్గిళ్లు, తలకు చమురు తిరుణాలల నంబితనమే మేలు.

కుడువబెట్ట కొంచ మారడి గొనినట్లు.

కుడువబోతూ కూరలరుచి అడగడ మెందుకు.

1 నంబి = వైష్ణవాలయ అర్చకునికి, నైవేద్యపు ముంతలు. దేవదాసి గణకమట.

కుడువబోతూ కూరాకు రుచి అడిగినట్లు.
కుడువమంటే పొడువ వచ్చినట్లు.
కుత్తుకలబంటి తామర(లకు) తూండ్లకు (నీళ్ళు)
కుత్సితునకు నేల గురుదేవతా భక్తి.
కుదిర్చినదే వైద్యం, మాన్పినదే మందు.
[1]కుదిరెకు గుఱ్ఱమంటే, పూనెకు పుట్టమన్నాడట!
కుదువ సొమ్ముకు కొంతహాని.
కుదురు (కుదట)పడ్డ కాపురము కూలగొట్టకపోతే నీకు అంత మొగుడినే కాదన్నాడట.
కనప్పండుగనాడు కంచంలో ఎముక ఘల్లుమంటే కాసిలో గంట మ్రోగించినంత పుణ్యం.
కునికిపాట్లు పడేవానకి కూలబడి తన్నేవాడే తండ్రి.
కునుకుబట్టి, చుట్టు(కొను) దవాగ్ని. (మోసగాడు)
కుప్ప తగులబెట్టి, పేలాలు వేయించుకున్నట్లు.
కుప్ప పీకేదాంగ, పరిగ ఏరుకొనేవానిని బెదరించినట్లు. (దండించినట్లు)
కుప్పపై పండుకొని, ఉప్పరిగ కలకన్నట్లు.
కుప్పలో [2]కేడిగింజ-కులంలో [3]కులాల కోడలు.
కుప్పలో ధాన్య మున్నట్లు.
కుప్ప విత్తనాలు-చప్పనారు.
కుమ్మరక్క నాది, [4]ఫజీతు నీది. (బజీగు=హైన్యము)
కుమ్మర పురుగుకు మన్ను ఒంటపట్టునా?

---

1 కుదిరై = తమిళమున గుఱ్ఱమని (కుదరై)
2 కేడిగింజ = ఒక ధాన్యంలో కలిపిన అన్యజాతి ధాన్యపుగింజ.
3 కులాలు = తక్కువజాతి కులములు.
4 పజీతు = అవమానము.

కుమ్మరవీధిలో కుండలమ్మినట్లు.

కుమ్మరావంలో గచ్చకాయ వేసినట్లు.

కుమ్మరావంలో రాగిముంత తేరగలమా!

కుమ్మరికి ఒక యేడు, గుదియకు ఒక పేటు (దెబ్బ).

కుమ్మరికి కుండ కఱవా? కమ్మరికి గెడ్డు కఱవా?

కుమ్మరికి కుండకఱవు, సాలెకు బట్టకఱవు ఉండునా!

కుమ్మరికి కుండలు కఱవు, మాదిగకు చెప్పులు కఱవు ఉండవు.

కుమ్మరి లేకుండా కుండ పుట్టునా?

కుమ్మరివాని కోడలు ఆవం దగ్గరనైనా కనుపించదా!

కుమ్మరివానింటి పెద్దకూతురు ఆవంకట్టకు రాక ఎక్కడికి పోతుంది.

కుమ్మరి కాని కూతురా అంటే. ముసలి మొగుడే అమ్మా.

కుమ్మ చప్పుకొనేవానికి గూడూరు పోతే, ఏడూళ్ళ [1]కుమ్ము ఎదురుగా వచ్చిందట.

కుమ్మెతక్క పూలుగుచ్చితే, కురిమెళ్ళ కామాక్షమ్మ కులికివస్తుంది.

కుమ్మీమిటే కూతురా అంటే, అవ్వకు ఇంకు మొగుడే! అన్నదట.

కుయుక్తుల మాయల విట్టపిలని యోగ్యులనాథ యోగులవ యోగులు.

[2]కురువోళ్ళ పిల్ల [3]బాయిల పడితే, ఎలిగోళ్ళ పిల్ల ఎక్కి ఎక్కి ఏడ్చిందట.

కురూపి పొత్తుకంటె సురూపి తిట్టు మేలు.

కురూపీ! ఏటా చేస్తున్నావంటే, సురూపాల వెక్కిరిస్తున్నాను అన్నట్టు.

---

1 కుమ్మ = వ్యథ. వివాదము. (పొయ్యిలో వేసిబూడిద)

2 కుఱవోళ్ళపిల్ల గొల్లకురువజాతిపిల్ల. కేవలం ఉన్నితో వేయడం వీరివృత్తి.

3 బాయిల = బావిలో.

కుఱ్ఱవాడి గుణగణాలు తెలుసును గాని, చెవ్వులకమ్మల సంగతి మాత్రం తెలీదు అన్నట్లు.

కులంకన్నా గుణం ప్రధానం.

కులం కొద్దిగుణం.

కులంగాదు తలంగాదు, కుసవాళ్ళపిల్ల దయ్యమై పట్టిందట.

కులంలో ఒద్దికుండి, పిరుదురోగం లేకుంటే, కుక్క అమడపోయి వస్తానన్నదట.

కులటబిడ్డ కొడుకగునా, మెఱపు దీపమగునా.

కులనాశకుడైన కొడుకు దీర్ఘాయుష్మైన నేమి లేకున్న నేమి.

కులమింటి కోతిఅయినా మేలు.

కులముకన్న నెన్న కలిమిప్రధానంబు.

కులముగాక, స్థలముగాక, కుమ్మరివారిపిల్ల కోరి. దయ్యమై పట్టింది.

కులము చెడ్డా, సుఖం దక్కవలె.

కులము చెఱిచే వారేగాని కూడు పెట్టేవారు లేరు.

కులము తక్కువవాడు కూటికి ముందు.

కులము తక్కువవానికి [1]నీటు ఎక్కువ.

కులము తప్పినవాడు బంతికి ముందు, కూరగాయలవాడు సంతకు ముందు.

కులము మొదలెచెడ్డ కూలెపోమానంబు.

కులము వాళ్లను చూస్తే, కుక్కకు కోపం గుఱ్ఱానికి సంతోషం. (కుక్క మొఱుగుతుంది, గుఱ్ఱం సకిలిస్తుంది)

కులమెఱిగి కోడలిని, [2]ఆణెమెఱిగి ఆవును తీసుకోవాలి.

కులమెఱిగి చుట్టము, స్థలమెఱిగి వాసము.

కులవిద్యకు సాటిరావు కువ్వాలచెన్నా.

---

1 నీటు=టెక్కులు. 2 ఆణెము=సద్వంశము; మంచిజాతి.

కులహీనమైనా వరహీనం కారాదు.

కులానికి ఇంత అంటే, తలా గోరంత అన్నట్లు.

కులానికి కులం తెగులు, నీటికి పాచి తెగులు.

కులానికి పొద్దు అంటే, చిన్నప్పుడే వేఱుపడ్డాను అన్నట్లు.

కులికేదాన్ని ఒలికిలో పెడితే, ఒలికంతా చెడ కులికిందట!

కుళ్లికుళ్లి కాయనష్టి, కాలికాలి కట్టెనష్టి.

కుళ్లుబోతువాడు గుడిసె కట్టితే, కూలినదాకా ఒకటే పోరు.

కుళ్లుముండకి అల్లంపచ్చడి అన్నట్లు.

కుళ్ళైవాని ముందు గుసగుసినట్లు.

కుళ్ళైవాళ్ల ఎదుటే కులకమన్నారు.

కుసివెళ్ళి గొడ్డలిలో దూరి, కులానికే చేటు తెచ్చినట్లు.



## కూ

కూకున్న (కూర్చున్న) కూతురు కూలిపోయింది, చేసిన కోడలు చేవ దేలింది.

కూచం ఇంటికి బరువైతే, మీసం రోషానికి బరువౌతుందా?

కూచమ్మ కూడబెడితే, మూచమ్మ మాయం చేసిందట!

కూచిపూడి దొంగతనానికి కత్తా చెప్పులు కావలెనా?

కూచిపూడిలో కుక్క మొరిగినా సంగీతమే.

కూచుంటే లేవలేదు, కూరకట్ట లమ్మలేదు. కొట్టొస్తడమ్మా! నాకు నవ్వొస్తది.

కూచుంటే లేవలేదు, కూరచట్టి దించలేదు మాబావ, కొట్టొస్తడే నాకు నవ్వొస్తదే.

కూటికి గతిలేదుగాని, కుంచెనలకు ముత్యాలు.
కూటికి గింజలు పనికి కొరముట్లులేక చేసేసేద్యం కోత.
కూటికి జరిగితే కోటికి జరిగినట్లు.
కూటికి తక్కువైతే కులానికి తక్కువా?
కూటికి పేదయితే. కులానికి పేదా?
కూటి కి ఖ్యాని విటకాని పోటుమెండు.
కూటికి లేకున్నా కాటుకచుక్క మానదు.
కూటికిలేని నాబట్టా, గుడ్డకులేని నిబిడ్డెంట బడ్డావా.
కూటికుంటే కోటి కున్నట్లు.
కూటికుండ కుక్క ముట్టి=ట్లు.
కూటిపేద తోడు పోగొట్టుకొంటాడు.
కూటిమీదా ఆశ, మీసంమీదా ఆశ.
కూటిలోని రాయి తీయలేనివాడు ఏటిలోని రాయి తీయగలడా?
కూడబెట్టినవాడు కుడువ నేర్చునా?
కూడబెట్టినసొమ్ము కుడువను రాదు.
కూడలి కాపురం కుతకుతలు, వేరడి కాపురం వెతవెతలు.
కూడా తిని కుల మెంచినట్లు.
కూడినకొద్ది కుండ లమ్ముకొని తిన్నట్లు.
కూడి యూడెకివాడెపో కోవిదుండు.
కూడుండగానే, [1]కులాలవాళ్ల [2]కుడిపైట మారదు,
కూడు అయితే కద్దుగాని, కులస్థులకు వెరచి వచ్చినాను.
కూడు ఉంటే కులగోత్రా లెందుకు?
కూడు ఉడక లేదని కుండట్టుక కొట్టాడట.

1 కులాలవాళ్లు=తక్కువకులమువాళ్లు; అలబడివాళ్లు.
2 ఎడమపైట. కలిగిన వంసారుల. పై వర్ణమువారి స్త్రీలు వేయుదురు. ఇప్పటి నాగరిక లక్షణం గూడ ఇదే.

కూడు ఉడికిన వెనుక పొయ్యిమండును, కులం చెడ్డ వెనుక బుద్ధి వచ్చును.

కూడు ఎక్కువైతే [1]కువ్వాడ మెక్కువ.

కూడు ఒల్లనమ్మను కలవేమి చేస్తుంది!

కూడు గుడ్డ తాను గోరునా దైవంబు.

కూడు కలుగగానే కులం మరచిపోతారు.

కూడు గుండెకాయ, మెతుకు మేనమామ.

కూడు చీరలేనిచోటు కొరగానిది.

కూడు పారవేసి కొప్పెర నాకినట్లు.

కూడు పెట్టను, గుడ్డ ఇవ్వను, నామీద ప్రాణమే అన్నట్లు.

కూడు పెట్టినామెను తోడవిందు అడిగినట్లు.

కూడులేక కూరదిన్న ఆకలి దీరునా?

కూడు లేనమ్మకు గుడ్డ లేనివాడు జతపడ్డట్లు.

కూడు వండని ఆపది, మంచం అల్లని మగవాడూ ఉండరు.

కూడు వండుట గంజి కొరకా!

కూడు వేడైతే కూరాకు నంజినట్లు.

కూడూ, గుడ్డా అడక్కపోతే, బిడ్డను సాకినట్లు సాకుతానన్నాడట.

కూడేకూడే కాపురం తియ్యకపోతే, నీ అంకుమొగుణ్ణి కాదన్నాట్ట.

కూత లార్భాటమేగాని, కుప్పలో యిత్తులు లేవు

కూతును గుత్తరూకలక మ్మేవాడు అల్లునికి అరణమిచ్చునా.

కూతురికి దొరికేవంతా కుళ్ళాయి మిండగాళ్లే.

కూతురికి మంగళవారం శుక్రవారం, కోడలికి దివ్వెలు దివ్వెలు.

కూతురి పురుడు కుండల్లో, కోడలి పురుడు కొండల్లో.

కూతురు అని కుంచెడిస్తే, కన్నతల్లి అని కంచెడు పెట్టిందట.

కూతురు కనలేకపోతే, అల్లుడుమీదపడి ఏడ్చినట్లు.

---

1 కువ్వాడం = ఓర్వలేనితనం.

కూతురు చెడితే తప్పు తల్లిది.

కూతురు బిడ్డవని కోరి తెచ్చుకొంటే నాకే కోరికైనావా, నామనసు రాలా?

కూతుళ్ల కన్నమ్మకు కుర్చీపీటలు, కొడుకులు కన్నమ్మకు గోడపంచలు.

కూతుళ్లు కన్నమ్మ కుళలేసులలో, కొడుకులు కన్నమ్మ లక్ష్మీసులలో.

కూన అని పెంచితే, గండై కరవ వచ్చిందట!

కూన పులికి లేడి దేటా?

కూనలమ్మ సంగీతం వింటే పుణ్యమూ లేదు, వినకుంటే పాపమూ లేదు.

కూనలు కూటి కేడుస్తుంటే అవ్వ అంకు కేడ్చిందట.

కూనా మొగుడూ కూటి కేడిస్తే, అవ్వ అంకుమొగుడి కేడ్చిందట!

కూర ఎంతైనా కూడుకాదు.

కూరకుండ మొదలుంటే, కూసుముండైనా చేస్తుంది కాపురం.

కూరకు [1]తాలింపు, చీరకు జాడింపు.

కూరగాయలు చెడిపోయినవంటే, బత్తెలకు వేయమన్నాడట; అవీ తినవంటే పిలిచి బ్రాహ్మడి కివ్వమన్నాడట.

కూర లేని తిండి కుక్క తిండి.

కూరలో కసవేరినట్లు.

కూరిమిగల దినములలో నేరము లెన్నడును కలుగనేరవు.

కూరిమి విరసంబైనను నేరములే తోచుచుండు.

కూర్చుంటే కుంటి, లేస్తే లేడి.

కూర్చుంటే కుక్కయినా కఅవదు.

కూర్చుంటే మరా(ర)మేకు, నుంచుంటే మరామేకు.

1 తాళింపు - పోపుపెట్టుట.

కూర్చుండి కూడు వండలేను, వంగుండి తీర్థం వస్తాను అన్నట్లు.

కూర్చుండి చేసినపాపం గుడి కట్టినా పోదు.

కూర్చుండి తింటూఉంటే, కొండఅయినా కరిగిపోతుంది. (సంపాదన లేకుండా అనుట)

కూర్చుండి తింటే, గుళ్లుగోపురాలు (మళ్లు) ఆగవు.

కూర్చుండి లేవలేదుగాని, ఎగసి తాటికాయ తంతానంటాడు.

కూర్చుండి లేవలేనమ్మ వంగుని శివరాత్రికి వస్తానన్నదట.

కూర్చున్న వానికి కుప్పలు, తిరిగినవానికి తిప్పలు.

కూర్చోమంటే గుద్దకు, తినమంటే నోటికి తెగులు. (కూర్చోమంటే పోతాననుట, తినమంటే తినివచ్చినాననుట)

కూలబడిన కుండ కుదురుట అరదయా.

కూలికి ఏడిస్తే కొలుకులు తడౌతవా?

కూలికి వచ్చి, పాలికి మాట్లాడినట్లు.

కూలి కుండకురాదు, అంకు పన్నుకు రాదు.

కూలి కూటికిరాదు, [1]లేకి చేతికిరాదు.

కూలిచేస్తే కుండకాలె, లేకుంటే పొట్టకాలె.

కూలిచ్చినవాడు పనిగొనక మానునా?

కూలిబంటు కొకమాలబంటు, మాలబంటు కొక మద్దెలకాడు.

కూలినాలిచేసి కుదురాల ఉండక, మొగుణ్ణి కట్టుకొని సగమైపోతినే అందట!

కూలివాడి ప్రొద్దా, క్రుంకవే ప్రొద్దా.

కూశమ్మ కూడబెట్టితే మాశమ్మ మాయంచేసిందంట.

కూసి, కుక్క [2]దువ్వునం తెచ్చుకొన్నట్లు.

కూసికూసి గుంటనక్క గూడెల్లి చచ్చిందట.

1 లేకి=దుచారము గలవాడు. 2 దువ్వ=పులి.

కూసి కూలిమాల కుక్కలైపోయెరా.
కూసుముండ నోరు కుట్టిపెట్టితే, అయ్యవారా, ఏం వెంకాయకు పసుపు పూయలేదు అన్నదట.
కూసేగాడిద వచ్చి, మేసే గాడిదను చెఱచిందట! (చెఱచినట్లు)



## కృ

కృతఘ్నత ప్రతిదేశంలో ప్రతివాతావరణంలో మొలిచే కలుపు మొక్క.
కృతమెఱుఁగని వానికి మిత్రద్రోహ మెంత.
కృత్తికలో కుతికె పిసుకుడు.
కృత్తికలో విత్తితే కుత్తుకలు నిండవు.
కృష్ణాస్నానానికి కొండు భొట్లాక్షా?



## కెం

కెంపు నేనెఱుగనా? (కుంపటివలె) కోతికివలె రెండుకొమ్ములుండు.



## కై

కైకపుట్టి చెరచెగా రాము (ని) పట్టంబు.



## కొ

కొంగ కన్నులు మూసుకొనగానే దేవతల ధ్యానమగునా.
కొంగ కొక చెఱువని లేదు, కోమటి కొక ఊరని లేదు.
కొంగజపము చేపల కొఱకే.
కొంగలు గుమికూడి కొరకవా బోదెలు.
కొంగవంటి ధ్యానముచే తన కోర్కులు నెరవేరునా.
కొంగు తగిలినా కొంత మేలే.
కొంగు తాకితే కోటివరహాలు.
కొంచెమైనను పంచి కుడువ మేలు.
కొంగు తడిస్తే చలిగాని, కోకంతా తడిస్తే ఏంచలి?
కొంగు తడిస్తే వగపుగాని, కోకంతా తడిస్తే వగపేమి?
కొంచపు నరుసంగతి అంచితముగ కీడుదెచ్చు.
కొంటిమి, తింటిమి, కోలాట మెందుకు?
కొంటే రానిది కొసరితే వస్తుందా?
కొండంత తనతప్పు గోరంత, గోరంత ఒరుతప్పు కొండంత.
కొండంత తెలివికంటె గోరంత కలిమి మేలు.
కొండంత దూదికి కొండంత నిప్పెందుకు?
కొండంత దేవుడికి కొండంత పత్రి పెట్టగలమా?
కొండంత దేవుడికి గోరంత బెల్లం నైవేద్యం.
కొండంత మదపుటేనుగకు తొండము లేకుంటే జంత్రము కీలూడినట్లు.
కొండంత రాగంతీసి [1]తుంబదీలో అన్నట్లు.
కొండంత రాగం తీసి, పిచ్చికుంట్లపాట పాడినట్లు.
కొండంత రెడ్డి కొంగు పట్టుకుంటే లేదనే దెట్లా అని అన్నదట.

---

1 తుంబదీలో=పసరాలను తోలుధ్వని.

కొండంత రెడ్డే పోంగా కొడవలి లిక్కి-కొచ్చిందా.

కొండంత మొగుడే పోగా, పిడికెడు బొచ్చుకు ఏడ్చేందుకు?

కొండ అద్దమందు కొంచమై ఉండదా?

కొండ ఎక్కే-వాని ముడ్డిలో కొడవలి చెక్కి-నట్లు.

కొండ ఎక్కే-వాని ముడ్డిలో (గుద్దలో) కొడవలి చెక్కి, వచ్చే టప్పుడు పచ్చిగడ్డి తెమ్మన్నట్లు.

కొండకు కట్టెలు, కోనేటికి నీళ్లు మోసినట్లు.

కొండకింద మెరక, తూముకింద మెరక మంచిది.

కొండకు ఒక వెంట్రుక ముడివేస్తే, వస్తే-కొండే వస్తుంది, పోతే - వెంట్రుకే పోతుంది.

కొండతో తగరు డీకొన్నట్లు.

కొండనాలుకకు మందు వేస్తే, ఉన్న నాలుక కాస్త ఊడి (ఊడ్చుకోని) పోయిందట!

కొండను చదర పెట్టి, ఉలవ జల్లినట్లు.

కొండను తలక్రింద పెట్టుకొని, రాళ్ళకు వెదకినట్లు.

కొండను త్రవ్వి, ఎలుకను పట్టినట్లు.

కొండమంగలి (తిరుపతి) గొరిగినట్లు. (పూర్వం ఒకరికి కాస్త గొరికి, ఇంకొకరికి గొరికి తడవలు తడవలుగా పూర్తి చేసే వారు. కొందరు దారులు దారులుగా గొరిగితే ఇంటికివచ్చి మరలా గొరిగించుకొనేవాళ్లు).

కొండలు మింగేవానికి గోపురా లడ్డమా? గుడి మింగేవానికి లింగ మడ్డమా?

[1]కొండమిరపకాయకు కారం జాస్తి, పొట్టివాడికి బుద్ధులు జాస్తి.

కొండమీద గోల ఏమంటే కోమట్లు గుసగుస లన్నట్లు.

---

1 కొండమిరపకాయ = చాలా చిన్నకాయ.

కొండమీదనుంచి పడ్డవానికి గాయాలెన్ని-అన్నట్లు.

కొండమీదనెక్కి- గుఱ్ఱు తెఱ్ఱుంగ వళవె

కొండమీదికి భక్ష్యాలకు పోతే, కొండకింద పాయసం పోయిందట.

కొండముచ్చునకును కోతియె [1]విందాను

కొండముచ్చు పెండ్లికి కోతి పేరంటాలు

కొండలు పడ్డ కొన్నాళ్ళకు, కోనలూ పడును.

కొండలు పిండి కొట్టినట్లు.

కొండవలె వచ్చి, మంచువలె తేలినట్లు.

కొండవలె వచ్చి, బెండువలె తేలినట్లు.

కొండవీటి చేంతాడు (చాల పొడవైనదనుట; ఆ సీమలో బావులలో నీరు చాల లోతున నుండును.)

కొండవీటి దండుముండా, కుండలిటు తేవే!

కొండీ! కొండీ! కొడవలిటు తేవే అంటే, చస్తి నీ కాళ్ళకు మ్రొక్కుత, దీప మిటు తే అందిట!

[2]కొండూరు జంగాలు. తరుణాయి సన్నాసులు.

కొండ్రను నమ్మినవారికి కొదువ లేదు.

కొందఱిని కొంతకాలం ఏమర్చవచ్చును గాని, అందఱిని అంత కాలమూ ఏమరించ లేము.

కొంప అంటుక పోతూఉంటే, నీళ్ళబాన నిప్పుదగ్గఱ పెట్టిందట!

కొంప చెరుపకురా సుపుత్రా!

---

1 విందు - అతిథి.

2 ఈ రెండుగ్రామాలు నెల్లూరుజిల్లాలో పరమట వంగం దగ్గర నున్నవి ఈ జంగాలు సన్నాసులు ప్రతిరాత్రి రచ్చబావిడిదగ్గర చేరి లోకాలన్నీ మరామత్తు చేసినట్లు పొద్దు పోయినదాకా మాట్లాడి లేచిపోయి, పొద్దునవే ఎవరిపాటికి వాళ్లు భిక్షానికి పోయేవారట. అంటే — మాటలేగాని చేతలు లేవనుట.

కొక్కిరాయి! కొక్కిరాయి! ఎందుకు పుట్టావే? అంటే చక్కని వాళ్ళని వెక్కిరించటానికి అన్నదట!

కొక్కిరాయిళ్ళలో కొంగ ఘనము.

కొక్కు (పందికొక్కు) తిండియాశజిక్కి చచ్చినక్కైవడి.

కొక్కొరొకో అనగానే తెల్లవారినట్లా?

కొక్కు బోనులోన చిక్కి చచ్చినరీతి.

కొక్కోకశాస్త్రవిదులు నరసన్నుతు లందుదురు గాని, భక్తిశాస్త్రసంవిదులు కారు.

[1]కొటారు కొల్లపోతున్నది అంటే, పాలివాడు లేకుండ చూడరా అన్నాడట.

కొటిపి దిన్నెలో గుడిసె వేసినట్లు.

కొట్టకు ముందే ఏడుస్తావేమంటే, ముందు కొట్టబోతావని ఏడుస్తున్నా నన్నట్లు.

కొట్టావద్దు, తిట్టావద్దు, వట్టలు పిసికితే వాడే చస్తాడు!

కొట్టినా వంగని కొడుకు, తిప్పినా తిరగని మీసం.

కొడితే కొట్టాడుగాని, కొత్త కోకెట్టాడు.

కొడుకు ఏడ్చిన ఏడ్పుకు అబ్బ [2]బందారాకు మోయలేక చచ్చినాడట!

కొడుకు కలిగినంత కులముద్ధరించునా.

కొడుకు పెండ్లిసంగతి యోచించేటప్పుడు మనమళ్ళ [3]మనవర్తి సంగతి కూడ మనసులో బెట్టుకోవాల.

కొడుకు బాగుండాల, (చల్లం గుండాల) కోడలు ముండమొయ్యాల.

కొడుకు బిడ్డకు, కూతురు బిడ్డకు తాత ఒకడే.

1 కొటారు = ఉప్పుకయ్యలు.

2 బందారాకు = వాపులకు కాచికట్టే ఆడవిఆకు.

3 మనవర్తి = బ్రతుకు తెరువు.

కొడుకు మనవాడైతే, కోడలు మనదౌతుందా?

కొడుకు మర్మం కన్నతల్లి ఎరుకగాక, అడవిలో తిరిగే అయ్యకేమి తెలుసు.

కొడుకు ముద్దు, కోడలు మొద్దు.

కొత్త అప్పుకుపోతే, పాతఅప్పు పైనపడ్డదట!

కొత్త ఆవకాయ, కొత్తపెళ్ళాము రుచి.

కొత్తఎద్దు పేడ ఇంటిల్లపాది (ఇంటిలపాది) ఎత్తినట్లు.

కొత్త ఒకవింత, పాత ఒక రోత.

కొత్త కలిమి సేవ కత్తిమీద సాము.

కొత్త కృషికి పాత తరిసేల.

కొత్త గదరా కొమ్మా! అంటే, మరగనీరా ఇరగ (విరుగ) తందాం అన్నట్లు.

కొత్తగా సిరివస్తే అర్ధరాత్రి గొడుగు పట్టమన్నాడట!

కొత్తగిత్తల నాగలి- కొత్తసాగు వగిలి.

కొత్తగుడ్డకు రంగు పట్టినట్లు పాతగుడ్డకు పట్టదు.

కొత్త చింతకాయతొక్కు, కొత్త చుట్టరికము రుచి.

కొత్త చీపురు బాగా ఊడ్చు. (చిమ్మునట్లు)

కొత్త జవ్వనమునకు గురుతలేదు.

కొత్తది గొత్తెల [1]మడుగు, పాతది బత్తెల మడుగు.

కొత్తది నేర్వలేదు, పాతది మరువలేదు.

కొత్తదొక వింత, కోడీకల బొంత.

కొత్తనీరు వచ్చి పాతనీరు కొట్టుక పోయినట్లు.

కొత్తనీళ్ళకు చేప ఎదు రెక్కినట్లు.

కొత్త బిచ్చగాడు పొద్దెరుగడు.

1 మడుగు = ఉద్పగుంట.

కొత్త భర్తురాలు ఉడుకు ఊబిది పూసుకొని, నాసలు కాలెనే పేరమ్మా! అన్నదట!

కొత్త మురిపెము కొమ్మన్నా! తెల్లగ కొట్టరా [1]మడేలా.

కొత్త వైద్యునికంటె పాత రోగిమేలు.

కొత్తశిగంపై నాక మంట.

కొత్త[2]శిగం[3]పై నాశనము.

కొత్తసేద్యగాడు ప్రొద్దెరుగడు.

కొద్దికొద్దిగా తీస్తే కొండయినా కరిగి (తరిగి) పోతుంది.

కొద్దివానలకే తెక్కుల పురుగులు.

కొనగా తీరినది, కొసరితే తీరునా?

కొనజాలకు కోతి పుడితే, కులమువాళ్ళంతా కుంటికుక్క అని పేరు పెట్టారు.

కొన లేదు, అన లేదు, కొడుకుపేరు సోమలింగం.

కొని తింటూఉంటే, కోమటి నేస్తం, ఇచ్చి తీసుకుంటూఉంటే ఈడిగ నేస్తం.

కొనేది కొయ్యగూర, తినేది చెంచలకూర.

కొనేవాడికి కోటికళ్లయితే, అమ్మేవాడికి అవిటి దొకటే చాలు.

కొనైనా కొసకు నూనే రాయాలి

కొన్న అంగడిలోనే మారుబేరమా?

కొన్నకాంతలు వన్నెచీరలు దైవలోకమగునా

కొన్నదగ్గఱ కొసరుగాని, కోరినదగ్గఱ కొసరా?

కొన్నది వంకాయ, కొసరింది గుమ్మడికాయ.

---

1 మడేలు - చాకలి.

2 శిగం - శివం {కొత్తగా పూవిన శివలో ఊరేగి ఊగి శరీరం పాడౌతుంది. అల్లే
3 పై - శరీరం {ఏదైన కొత్తవిషయాన్ని అధికం చేసినప్పుడు పాడౌతుంది.

కొన్నవాడికన్న తిన్నవాడే మేలు.
కొన్నాక తినక మానడు.
కొన్నాళ్లు చీకటి, కొన్నాళ్లు వెన్నల.
కొప్పుకు [1]సగరం అందము, చెప్పుకు తగులం అందము.
కొప్పున్నామె ఎటు తిప్పినా అందమే.
కొమ్ము మాడ కూలుస్తుంది.
కొమ్ములు చూచి బేర మాడినట్లు (కొటనున్న పశువుకు)
కొయ్యబొమ్మదెచ్చి కొట్టినా పలుకునా
[2]కొయ్యారా! కొయ్యారా! పోలి(లు)గా అంటె, టంగుటూరి మిరి
యాలు తాటికాయలంతేసి అన్నాడట!

కొరగామికి మేరఎద్ది.
కొఱకబోతే పడికట్లు ఉరికిమీద పడ్డట్లు.
కొఱతన పడేవాడు ఒకడు, కూర్పులు లెక్కపెట్టేవాడొకడు.
కొఱవితో తల (కొప్పు) గోకు కొన్నట్లు.
కొఱవి పెట్టేవాడు కొడుకు, కూడుపెట్టేది కూతురు.
కొఱ్ఱకు నక్క కొఱ్ఱ.
కొఱ్ఱ గింజంత కోడలిని చూస్తే, కొండంత జ్వాగం వచ్చిందట.
కొఱ్ఱల [3]సేవ్య కూటికైనా రాదు.
కొఱ్ఱు ఇంటికంబమగునా!
కొలని హంసలకడ కొక్కెరలున్నట్లు
కొలను లెండినంత కొక్కెర లుండునా
కొలిమి వీదిలో సూదులమ్మినట్లు

1 సగరము - సవరము.
2 కోయుట (పొరకాయలు) = ఎచ్చుమాటలు, అబద్ధాలు ఆడుట.
3 పేద్యం = సేద్యం, వ్యవసాయం.

[1]కొలుచుదంచుట పొట్టుకొరకా!

కొలువు కన్న గోపాలమే నయం.

కొల్లకు పోయి పైచీర కోల్పోయినట్లు.

కొల్లు మునిగిన కొన్నాళ్లకు కోనా మునుగుతుంది.

[2]కొల్లేటి పంట కూటికే చాలదు.

కొల్లేటి బ్రహ్మహత్య కాపుమీదుగా కొట్టుకపోయినట్లు.

కొల్లేటిలో పండేపంట పంటలో లెక్కగాని చచ్చే దున్నపోతులకు లెక్కలేదు.

కొల్లేటి వ్యవసాయానికి కోతకూలి దండుగ.

కొలేటి వ్యవసాయం గొడ్ల వినాశం.

కొవ్విన ఎంట్రాకాయ కలుగలో నిలువనట్లు.

కొసరకాబోతు నాబోతు క్రుమ్ములాడ, నడిమి లేబెయ్యగతి.

కొసరిన కూరలో గాని పసఉండదు.

## కో

"కో" అంటే కోటిమంది.

కోకకు బెట్టిన గంజి కూడిరాదు.

కోకడాపుతో కోరిక లీడేరేనా

కోకలు వెయ్యున్నా కట్టుకొనుట ఒకటే.

కోటగోడల ఇల్లు, తాటాకుల పందిరి.

కోటచక్కదనము గమిడిచెప్పినట్లు.

కోటలో కొల్ల వంక (దా)ధారలో పోయినట్లు.

కోటలో పాగా వేసినట్లు.

---

1 కొలుచు = ధాన్యము.

2 కొల్లేరు = పశ్చిమగోదావరి, కృష్ణజిల్లాలలో ఉండే పెద్దమడుగు.

కోటవఱకు, నీటివఱకు సాగనంపవలెను.
కోటికి పడగెత్తువాణ్ణి, పదివేల కాపవై బ్రతుకుమన్నట్లు.
[1]కోటికి లాగితే బిళ్ళకు, బిళ్లకు లాగితే కోటికి.
కోటిపల్లి గుళ్లు ఎవరు కట్టించారో తెలియదు కాని, అంతర్వేది
గుళ్లు నేను కట్టించలేదు అన్నాడట!
కోటివిద్యలకంటె కోరుకు పొలం దున్నడం మేలు.
కోటివిద్యలు కూటికొరకే.
కోటివిద్యలు కొండ్రకు లోకువ.
కోటివిద్యలు నేర్చినా, కోల అచ్చితే కోలవలె కాదు.
కోడలా! కోడలా! కొడుకు కోదూరుకు పోయనే, నీకు కోశక్కడదే!
అంటే, అత్తా! అత్తా! మామ మడమనూరు పోయెనే, నీకు
మెట్టె లెక్కడివే అన్నదట.
కోడలా! నీభోగ మెంతసేపే అంటే, మాఅత్త మాలవాడకు పోయి
వచ్చిందాక అన్నదట.
కోడలికి బుద్ధిచెప్పి, అత్త తెడ్డు నాకిందట!
కోడలికి బుద్ధిచెప్పి, అత్తే ఱంకుపోయిందట!
కోడలిదాని మొగుడు కొట్టం పట్టుకొని ఏడ్చినాడట!
కోడలు కొట్టిన కుండ కొత్తకుండ, అత్త కొట్టిన కుండ అడుగోడు
(టి) కుండ.
కోడలు కొడుకును కంటాను అంటె, వద్దనే అత్త ఉన్నదా!
కోడలు గృహప్రవేశం, అత్త గంగా (అగ్ని) ప్రవేశం.
కోడలు నలుపైతే కులమంతా నలుపగునా!
కోడలు వచ్చినవేళ, కోడెలు వచ్చిన వేళ.
కోడి అడుగులో కోటివర్ణాల భూమి.

1 కోడు బిళ్ళ = క్రీడావిశేషము.

కోడికి ఉన్న కోర్కెలతో పిల్లి కేమి అక్కఱ?

కోడికి కులాసం లేదు, కోమటికి విశ్వాసం లేదు.

కోడికి గజ్జెలు కడితే కుప్ప కుళ్లగించదా?

కోడికి పుట్టినపిల్ల కొక్కొరొకో అనక ఏమంటుంది!

కోడి కుళ్లగించేది (గెలికేదంతా) అంతా పెంటకుప్పలే.

కోడి, కుంపటి లేకపోతే తెల్లవారదా?

కోడికూత, కాడి [1]పూత.

కోడి కొత్త అప్పులు, పంది పాతఅప్పులు తీర్చును.

కోడిగుడ్డంత సంసారంలో కోరిక లేలా?

కోడిగుడ్డుకు ఈకలు తీసినట్లు.

కోడిగుడ్డు కొట్టను గుండ్రాయి కావాలా?

కోడిగుడ్డుతో కొండలు బద్దలు కొట్టగలమా?

కోడి తొక్కుడు, గాడిద ఎక్కుడు. (అనగా బలవంత మైథునము లన్నమాట.)

కోడి నలుపైనా గుడ్డు తెలుపే.

కోడిపియ్యి మందంటే కొట్టెక్కి ఏరిగింది.

కోడిని అడిగి మసాలా నూరుతారా?

కోడిని కోసి, గోత్రానికంతా పగ ఐనట్లు.

కోడిని కోసే ఇంట్లో కొరకొర తప్పదు.

కోడిని తిట్టినతిట్టు కోడలి కెఱుక.

కోడిపిల్లకు గొర్రెపిల్లను బలాదూరు (దిష్టి) తీసినట్లు.

కోడిపెట్ట ఎక్కడున్నా, మనసు గుడ్లమీదే.

కోడి తెక్కర వేస్తే, గొప్పవాన (కురుస్తుంది)

కోడు ఒకడు తీస్తే, కొమ్ము ఒకడు తీస్తాడు.

1 పూత=పూంచుట, పన్నుట. కోడికూతతోగూడ పనికి దిగుట-అని.

కోడెల పోట్లాట మధ్య లేగలకాళ్లు విరిగినట్లు.
కోతలకాలంలో ఎలుకన్నకు ఏడుపెండ్లా లుంటే మాత్రం ఏమి!
కోడెలు కోడెలు పోట్లాడి, దూడల కాళ్లు విరుగగొట్టినట్లు.
[1]కోతలకు ఉత్తర కుమారుడు.
కోతలుఉన్నన్నాళ్లు కోతీ బతికింది, తరువాత బతికిందే బతుకు.
కోతల్లో కునికిపాట్లు పడి, కొత్త అమావాస్యకు కొంపగోడి సంగతి అనుకున్నట్లు.
కోతల్లో కూడదీసుకుంటే కూటికి కొఱత ఉండదు.
కోతికి అద్దం చూపినట్లు.
కోతికి కల్లు తాగించినట్లు.
కోతికి టెంకాయ దొరికినట్లు.
కోతి చస్తే గోడఅవతల పారేసినట్లు.
కోతి చెట్టు కొనకొమ్మకు నెక్కిన, క్రింద మత్తవేదండ మహోగ్ర సింహములు తాలిమి నొందవా.
కోతికి తేలు కుట్టినట్లు.
కోతికి జల్తారు కులాయి పెట్టినట్లు.
కోతికి పుండైతే, గోకా నాకా.
కోతికి పెత్తన మిస్తే, గోదావరి కడ్డంగా ఈదిందట!
కోతికి బెల్లం చూపరాదు, కోమటికి ధనం చూపరాదు.
కోతి గెంతడం సాయబు సంపాదించడం.
కోతిగుంపుల పాడు [2]కొడవలూరు.
కోతిచావు - కోమటి జంకు.
కోతిచేతి పాము వలె (పడగను గట్టిగా పట్టుకొని వదలకుండా ఉండును)
కోతిచేతి పూలదండ.

---

1 కోతలు=బిడాయిలకు.

2 నెల్లూరు దగ్గర కోవూరు తాలూకాలో ఒక పెద్ద గ్రామము.

కోతి టెంకాయ త్రుంచగలదు గాని నీరు తాగగలదా!
కోతి పంచాయతీ కొంప లారుస్తుంది.
కోతి పిల్లులకు రొట్టె పంచిపెట్టినట్లు.
కోతిపుండు బ్రహ్మాండ మైనట్లు.
కోతి పులిగాదు. కోమటి దొరగాడు.
కోతిముండకైనా గీత బాగుండవలె.
కోఁ(న)ంగి చెట్టుపై కొక్కెర, ఎక్కమన్న చెట్టు ఎక్కెర!
కోపం గొప్పకు ముప్పు, అల్లరికి హాంగు ముప్పు.
కోపం పాపమునకు పొత్తు.
కోపం పోంగు క్రుంగు కొన్నాళ్లే!
కోపంరాను కారం తిన్నట్లు
కోపము ఎదుటి గొప్పకొద్దు లెరుగదు.
కోపానికి పోయిన ముక్కు, శాంతానికి రాదు.
కోమటి ఇల్లు కాలినట్లు.
కోమటి ఏవేళ క్షామమే కోరును, ధారుణీపతి ధనముగోరు.
కోమటికి, కోతికి ముల్లె చూపరాదు.
కోమటితో మాట, కోతితో సయ్యాట!
కోమటిని చూచి, నక్క శాంతి అడిగిందట!
కోమటి భక్తుడుకాడు, తగరం కత్తికాదు.
కోమటి లేమి, కంసాలి కలిమి ఉండవు.
కోమటి సాక్ష్యం, బాపన వ్యవసాయం.
కోమటి వైష్ణవము, ఉప్పరసన్యాసము.
కోమట్ల కొట్లాట, గోచి ఊగులాట.
కోమలి విశ్వాసము పాములతో చెలిమివంటిది.
కోరి అడిగితే కొమ్మెక్కుతారు.
కోరికలు కొండలెక్కుతుంటే అదృష్టాలు అడుగంటుతుంటవి.

కోరికోరి బావతో పోతే, కుంటివాడు పుట్టాడట!

కోరినంత పెట్టెనమ్మ కోతికి శివుడు

కోరి పిల్లను ఇస్తామంటే, కులం తక్కువ అన్నట్లు.

కోరి, వీగి కొడుకును కంటే, మూగ చెవుడు ముంచక వచ్చినవట.

కోరుకున్న కోడలు వస్తే, కొప్పులో చెప్పు పెడుతుంది.

కోరుకొండ తీర్థానికి కోడుగుడ్డంత మామిడిపిందెలు అగును.

[1]కోరుగింజలు కొంగులోకే సరి.

కోల ఆడితే, కోతి ఆడును.

కోలలేని పెట్టు, తాడులేని కట్టు.

కోళ్లను తింటారా? అంటే, బొచ్చు పారేస్తాము అన్నట్లు.

కోళ్ళ బేరాని కెళ్ళి, కోటలో కబుర్లడిగినట్లు.

కోళ్ళు కూయగా లేచినా, కాళ్ళు కాలేవఱకే అవుతుంది.

కోళ్ళుపాకిన [2]పొంతలో రెట్టవేసినట్లు, కొద్దితొత్తులపొందు రచ్చకీడ్చును.

కోర్టుకెక్కి గెలిచినవాడు ఇంట్లో ఏడిస్తే, ఓడినవాడు వీధులో ఏడుస్తాడు.

కోర్టుకెక్కినవారు, ఒకరు ఆవుకొమ్మును, ఇంకొకరు తోకను పట్టుకొంటే, మధ్య వకీలు పాదుగుదగ్గర కూర్చుంటాడు.



1 కోరు = పంటలో సగభాగానికి చేపే పేద్యము: మేడిపాలు; వంగోరు.

2 పొంత = పొయ్యికి ఒక ప్రక్క గడ్డగా కుండమంచి నీరుపోసి కాచుకొందురు. ఈ కుండను పొంత రందురు. (పొంతకుండనీళ్లు); ఒత్తు.

## ఖ్వా

ఖాజా (ఖ్వాజా) మొగుడు ఒడిలో ఉంటేనేమి, దడిలో ఉంటేనేమి?
[1]ఖాజీని ఫాజీగాను, ఫాజీని ఖాజీగాను మార్చినట్లు.
ఖానాకు నహీ, ఎల్లీకి బులావ్ అన్నట్లు.

---

## గ

గంగ ఈతకు, గరిక మేతకు సరి.
గంగ కిద్దరిమేలు, అద్దరికీడునుంగలదె!
గంగకు, సాంగకు పంగకు తప్పులేదు.
గంగగోవుపాలు గంటెడైనచాలు, గడవెడైననేమి ఖరముపాలు.
గంగను పడ్డ కాపురం గట్టున పడుతుందా?
గంగమ్మ గయ్యాళైతే, సింగరాజేమి చేస్తాడు.
గంగలోని ఓడను నమ్మితే భవసాగరమీదగవచ్చునా
గంగలో మునిగినా కాకి హంస అవుతుందా?
గంగానమ్మ నెత్తిమీద తురకాడు కాలుపెడితే, కాపువాణ్ణి తీయమన్నదట.
గంగాస్నానం, తుంగాపానం (తుంగభద్రనీళ్లు చాల తియ్యగానుండును)
గంగిరెద్దును బండికికడితే వాడవాడ, గంగిరావును బండికి కడితే ఇల్లిల్లు.
గంజాయి తోటలో తులసి మొక్కవలె.

---

1 ఖాజీ = ముస్లిము పెండ్లిండ్లు జరిపించే గురువు.

గంజాయి పీకకు, కల్లు [1]రేకకు అంటు లేదు. (ఎంగిలి లేదు)

గంజి తాగినా, లంజ కావాలి.

గంజి తాగేవానికి మీసాలు ఎగబెట్టేవాడొకడు.

గంజిలోకి ఉప్పు లేకుంటే, పాలలోకి పంచదారట.

గంటెలు పండిన ఇంట [2]కణుజుపండిన ఇంట కఱవు లేదు.

[3]గంటైనా బలవాలి, గాదైనా తిరగాలి.

గండం గడచి, పిండం బయటపడినట్లు.

గంత కట్టేదా? బసవన్నా అంటే, ఊహూ అని, గుగ్గిళ్ళు తింటావా అంటే, ఆహా అన్నదట.

గంతకు తగిన బొంత దొరకనే దొరుకుతుంది.

గంతకు పడాలని ఉంది, ఎద్దుకు తూలాలనీ (తోయాలనీ) ఉంది.

గంతలో బావ ఉన్నాడని, సంతలో [4]కాల్మడిచిందట.

గంతా బొంతా కలిసి, గాడిద మోతైనట్లు.

గంధపుచెక్కలు మోసిన గాడిద వాటివాసన అనుభవించ లేదు.

గంధం అమ్మినచోటే కట్టెలమ్మట.

గంధద్రవ్యాలు మోసినా, గాడిద గాడిదే!

గంధంలో కూసు కల్పినట్లు.

గంధం సమర్పయామి అంటే, గొడ్డలి నూరరా అన్నాడట!

గంధపు పొడిలో బూరగ పట్టినట్లు (ఊదినట్లు).

గంధమలద మేని కంప దగినయట్లు

గంపదింపుడు ఘనమాయె, పూర్వపు బుద్ధులు పోవాయె.

గంపదింపులు ఘనమాయె, పూర్వాలు బుగ్గాయె. (బ్రతికి చెడి గంప నెత్తిన బెట్టుకొని అమ్మట అనుట)

---

1 రేక = తాటిఆకుతో మడచిన పెద్ద దొప్పవంటిది.

2 కణుజు-కముజు = పూరేటిజాతి అడివిపిట్ట.

3 గంట=పైరుమొదట గుబురుగా పిల్లలుబెట్టుట.

4 కాల్మడుచు = ఒంటికిపోవు.

గంపలాభం చిల్లి తీసినట్లు.
గంప [1]సిడి (సిరి) కాదు, గాలపు సిడి. (చేపకు)
గచ్చకాయంత బెల్లాని కైనా, గానుగ కట్టాలి.
గచ్చకాయల కుండ వలె. (గలగల శబ్దం ఎక్కువగా చేయును)
గచ్చకాయలకు కొన్న గుఱ్ఱం, కందకం దాటునా ?
గచ్చపొద పట్టుకొని నట్లు.
గచ్చపొద మీద ఇసుక వేసి, కయ్యానికి నిలిచినట్లు.
గచ్చముండ్లమీద తగులుకొన్నబట్ట గ్రక్కున తీవశమా.
గజముపై చౌడోలు గాడిదకెత్తిన కూయునేగాని మోయదు.
గజమూ మిథ్య, పలాయనమూ మిథ్య అన్నట్లు.
గజశాస్త్రవేత్తలకు గజారోహణం వస్తుందా ?
గజ్జి ఉన్నవాడికి లజ్జ ఉండదు.
గట్టిగ ఆయుష్యముంటే, గటిక నూరిపోసినా బతుకుతాడు.
గట్టిగా తిట్టినా గాలికి పోవును.
గట్టిని విడిచి పొట్టుకు పారాడినట్లు.
గట్టిగింజల విడిచి, పొట్టుకు పోరాడినట్లు.
గట్టుచేరిన వెనుక, [2]పుట్టివానితో పోట్లాడినట్టు.
గట్టుమీద వానికి గప్పాలెక్కువ.
గట్టెక్కితి, పుట్టెక్కితి, మేటి మెట్టెక్కితి అన్నట్లు.
గడ ఎక్క తిమ్మన్నా ! గంతులు వేయి తిమ్మన్నా !
గడనుడుగు మగనిజూచిన నడపీనుగ వచ్చినట్లు నగుదురు.
గడించేది ఒకడు, అనుభవించే దింకొకడు.
గడించే వాడొకడు, గుణించే వాడొకడు.

---

1 సిడి = వేదన (జాతరలో సిడిమానుపై పశువు పడేబాధ.)

2 పుట్టి = వెదురు పేళ్ళతో కట్టిన గుండ్రని చిన్నపడవ; దీనికి బయట తోలు కప్పుదురు.

గడి ఎక్కా నేనే, గంతులువేయ నేనే. (దొమ్మర ఆటలో అన్ని పనులు ఒకరిద్దరే చేయుచుందురు)

గడియ గడచినా గడిసిందే గంగి! సిద్ధ(ద్ది)లో నిప్పు పెట్టు.

గడియ పురసత్తు లేదు, గవ్వ ఆదాయం లేదు.

గడియారం చూచి, [1]గడాలు కట్టిస్తారా!

గడుసురాలు మగని గంపతో నమ్మురా.

గడుసువాడు మూడందాల చెడును.

గడెము కట్టిన, గొడెము విడుస్తుంది.

గడ్డం కాలి ఏడుస్తుంటే, చుట్టకు నిప్పిమ్మని వెంటపడ్డాడట!

గడ్డగడ్డకు గ్రుక్కెడు నీళ్లు తాగినా, రెడ్డే వ్యవసాయం చెయ్యాల.

గడ్డ తిన్నా కంపే, (ఉల్లి) పాయ తిన్నా కంపే.

గడ్డపలుగులు మింగి, శొంఠి కషాయం తాగినట్లు.

గడ్డపార గాలికి పోతుంటే ఉల్లిపాయనా [2]జంబులీకం (ఏటు) చూడమన్నదట.

గడ్డపార తినేవాడికి శొంఠికషాయం ఏమిచేస్తుంది?

[3]గడ్డపారలు గాలికి కొట్టుకొని పోతూంటే, పుల్లాకు నాగతి ఏమి? అన్నదట!

గడ్డపారలకు పగులని బండలు, చెట్లవేళ్లకు చెప్పకుండా పగులుతాయి.

గడ్డింత లేక, ముడ్డింత ఎండి, వేంచేసెనే గుఱ్ఱం దేవలోకము!

గడ్డివామిలో సూది వెదకినట్లు.

గడ్డివెంటిబట్టి కట్టరే యేనుంగు.

గడ్డివేయ పోట్ల గొడ్డు కొమ్మాడించు.

1 గడాలు = అరకలు. నాగేళ్లు.

2 జంబులీకం = జంబాలు.

3 గడ్డపార = పలుగు.

గణకు లొప్పియున్న గవ్వలు చెల్లవా.
గణనాయకుని చేయ కోరగా కడు వానరుడైన తీరు.
గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్.
గతజల సేతుబంధనము. (నూతికప్పల విధానం)
గతికితే అతకదు. (మనువు చూపులకు వచ్చినప్పుడు)
గతి చెడినా, మతి చెడరాదు.
గతిమాలిన వానికి కుతి(క)లావు.
గతిలేనమ్మకు గంజే పానకం.
గతిలేనమ్మకు, మతిలేని మొగుడు.
గతిలేని ఊరికి, మతిలేని గంగానమ్మ.
గతిలేనినాడు గంగానమ్మా! నీవే గతి.
గతిలేనివాడు గాడిదకాళ్లు పట్టుకొన్నట్టు.
గతిలేనివానికి కనబడిందే కూడు.
గతుకులకు పోతే, బతుకులు పోయినవి.
గదరింటిలో పెండ్లి, గడియ కింత తిండి.
గదిసి తామరందు కప్ప కూర్చున్నట్లు.
గద్దకు సంక్రాంతిముందు సంకెళ్లు.
గద్దించే అత్త, మర్దించే మామ.
గద్దెకు పోయిన సుద్దులు తక్కువా!
గప్పాల పోతిరెడ్డికి ముప్పైమూడు దొడ్లు, మూడు ఎడ్లు.
గబగబా అరచేవాడి పంచచేరవచ్చునుగాని, నేలముచ్చోడి కడప తొక్కరాదు.
గబ్బరీదుకాత్రె వర్షాలకు దిబ్బలుకూడా కరుగుతాయి.
గబ్బిలము ఆకాశాన్ని పడకుండా పట్టుకొని ఉన్నానన్నట్టు.
గబ్బిలమువలె అటు పక్షీ కాదు, ఇటు జంతువూ కాదు.

గబ్బిలాయి మొగం నవ్వినా ఒకటే, ఏడ్చినా ఒకటే.

గబ్బుకు గంపె డీగలు.

గబ్బువాడు, గదరువాడు వియ్యమందితే, మురికివాడు వచ్చి ముద్దాడినాడట!

గయ్యాళి, గచ్చపొద ఒకటి.

గయ్యాళి రచ్చకెక్కితే, సంసారి దొంతుల సందున దాగుతుంది.

[1]గరిబడ్డ గింజ ఇక ఉడకబోతుందా?

గరిసె విత్తనాలు పోసి, గంపెడు విత్తనాలు తెచ్చుకొన్నట్లు.

గటిక చేను గాడిద పాలు.

గటిక మేసిన గాడిద చస్తుందిగాని, గటిక చావదు.

గరుడాయ లెస్సా? అంటే, శేషాయ లెస్సా? అన్నాడట!

గరుత్మంతుణ్ణి చూచిన పామువలె.

గర్భాధానం అంటే వడలు తినడ మనుకొన్నానే, గుద్దదిరే పనే అన్నదట - కొత్తపెండ్లికూతురు.

గర్భాధానంనాటి ముచ్చట్లు లంఘణాలలో తలచుకొన్నట్లు.

గర్భాధానానికి రమ్మని జాబువ్రాస్తే, రాను తీరికలేదు నేనున్నట్లే పని జరిపించండి అని వ్రాసినాడట ఒక ఛాందసుడు.

గవ్వన్నరకు గడ్డం గొరుగుతా నంటే, వెంట్రుకున్నరకు ఎంత! అన్నాడట!

గహనమున కోతులుండగానే ఘన వనవాసమగునా.



1 గరిబడు = ఉడుకుటలో లోపమై గట్టిబడిపోయిన గింజ.

## గా

గాండ్లవాని ఆశ గోతం పట్టదు.
గాజుకుప్పెలో దీపంవలె.
గాజుపూసల గనిలో మణిదొరుకునా?
గాజుల బేరం భోజనానికే సరి.
గాజులచెయ్యి గలగలలాడితే, ఇల్లు కలకలలాడుతుంది.
[1]గాటాలుతిన్న కోడె గాటికి రానట్లు.
గాటిపిచ్చి, కూటిపిచ్చి రేగితే అణగేది కష్టం. (పశువుకు గాటి - దొడ్డిపైన ఆలాపన, మనిషికి ఇంటిపైన మరులు, అని)
గాటిలో కుక్క గడ్డితినదు, తిన నీయదు.
గాడితప్పిన బండివలె.
గాడిదకు గడ్డివేసి, ఆవును పాలిమ్మనట్లు,
గాడిదకు తనకూత (ఓంద్రం) కమ్మగానే ఉంటుంది.
గాడిదకు పులితోలు కప్పితే కఱవగలదా?
గాడిదకు భోగనీళ్ళు పోస్తే, బూడిదలో పొర్లాడిందట!
గాడిదకేమి తెలుసు గంధపుపొడి (గంధవడి) వాసన?
గాడిదకొడకా అంటే-తమరు తండ్రులు మేము బిడ్డలము అన్నాడట.
[2]గాడిద గుడ్డు, కప్ప తలకాయ.
గాడిద గుడ్డు - గరుడ థంగం.
గాడిద గుడ్డు గరుడ స్తంభం.
గాడిన గుడ్డు గంధపు సాన.
గాడిద చంటిలో కడివెడు పాలు.

---

1 గాటాలు = కష్టాలు; గట్టి అనుభవాలు.

2 గాడిదగుడ్డు = God is good - అన్న పాదిరీల మాటను. మొదటిదినాలలో చదువురానివాళ్లు ఇట్లా అన్నారట.

గాడిదలతో సేద్యం చేస్తూ, కాలి తన్నులకు దడిస్తే ఎట్లా?
గాడిదతో స్నేహం కాలి తాపులకే!
గాడిదపిల్ల కోమలం (ఎదిగేకొంది వికారమగును)
గాడిద పుండుకు బూడిద మందు.
గాడిద, పూర్వ వంశగౌరవంగాని, భవిష్యత్సంతతిపై ఆశగాని లేని ప్రాణి.
గాడిదముండా! నీటేటూ కంటూ వేలనే? అంటే, నాకు కోపమొస్తే నడుంగలకూడా కంటాను అన్నదట!
గాడిద మోయదా గంధపు చెక్కలు.
గాడిదలకు నేల గడ్డముల్ మీసముల్.
గాడిదల మోత, గుఱ్ఱాల మేత.
గాడిద లెన్ని మేసినా గరికతరుగుతుందా.
గాడితలే దున్నితే, దొమ్మరులు పంటకాపులుకారా?
గాడిద సంగీతానికి ఒంటె ఆశ్చర్యపడితే, ఒంటె అందానికిని, గాడిద మూర్ఛపోయిందట.
గాడిదాల పరుగెత్తినా వేమంటే, గుంపులో చేరబట్టి బెదురుతీరింది అన్నాడట!
గాడుపట్టిన గంగానమ్మ పూజారితో పోయినట్లు.
గాఢాలింగనసౌఖ్యము ప్రౌఢాంగన ఎరుగుగాక బాలేమెరుగున్.
గాడుపుకు గడ్డపార కొట్టుకపోగా, ఉల్లిపొట్టు నాగతి ఏమి? అన్నదట!
గాదెకింద ఎలుక గాదెకిందే బతకాలి.
గాదెకింద పందికొక్కు వలె. (గింజలుతిని బాగా బలిసింది)
గాదెడు కొఱ్ఱలు తిన్నా, [1]కౌజు మూడేకానులు (కాసులు)
గాదెడు దోసకాయలలో చేటడు కొఱ్ఱలు పట్టవా?

1 కౌజు = చిన్న అడవిపిట్ట (పూరేలుజాతి)

గాదెనిండా బియ్యముంటే, కఱవునా కాలానా నాభార్యను పిల్లలను నేనే రక్షిస్తాను అన్నాడట!

గాదెలో గింజలు గాదెలోనే ఉండాలి, బిడ్డలు గారకాయలులా ఉండాలి.

గానుగ ఎద్దు ఒక్కసారిగా దుక్కిటెద్దు అవుతుందా?

గానుగ రోట్లో చెయ్యిపెట్టి, [1]పెరుమాళ్ళకృప అన్నట్లు.

గానుగరోలు పెద్దె కుడుపెడయింది.

గానుగల(లో) నూ(వు)గులు పోసి, గానుగకింద సిద్దిపట్టిందట.

గానుగాపే, గానుగాపే, నీవు కూర్చున్న పనేగా నూనెపోయడం.

గాము సోకినట్లు.

గారాబం గంజికేడిస్తే, ముసలివాడు ముండకేడ్చాడట.

గారాబం గారెలకు ఏడిస్తే, వీపు దెబ్బలకు ఏడ్చిందట!

గారాము గజ్జలకేడిస్తే, వీపు దెబ్బలకేడ్చిందట.

గారాలబిడ్డ పుడితే, గడ్డపారతో చెవులు కుట్టినట్లు. (సలికెపార తగిలించినట్లు)

[2]గారువాలబిడ్డకు గడ్డపారలో చెవులుగుట్టి, [3]సలికెపారలు తీగలేసిందట.

గారెలు వండాలే పెళ్ళమా అంటే, [4]వేలు చూపినట్లు.

గాలి ఇరవుగాలికే తెలుసు.

గాలి ఉన్నప్పుడే, తూర్పార (ర) పట్టాల.

గాలి చిన్నదీపాన్ని ఆర్పి మంటను పెద్దచేస్తుంది.

గాలికి పుట్టి, (దుమ్ముకు) దూళికి పెరిగినట్లు.

---

1 పెరుమాళ్ళు = విష్ణువు.

2 గారువాలు = గారాబాలు.

3 సలికెపార = మన్ను చెలిగేపార.

4 వేలు = (బొక్కచేయిను వేలుమాత్రం ఉన్నదని సూచించుట.)

గాలికి పోయిన కంపను కాలికి తగిలించుకొన్నట్లు.
గాలికిపోయిన పేలాలు కృష్ణార్పణం.
గాలికి పోయే పేలపిండి రామార్పణ (కృష్ణార్పణం) మన్నట్లు.
గాలికి పొయ్యేదానిని కాలిమీదకు దోచుకున్నట్లు.
గాలివాటం చూచి తూర్పార (న) పట్టాల.
[1]గాలికుంటు అయితే, [2]కురము అన్నట్లు.
గాలితో తాడు పేనినట్లు.
గాలిని మూట కట్టినా గయ్యాళి నోరు కట్టలేదు.
గాలి పాటు, కలిమి తేట.
గాలిమేడలు గురివెంద సామ్యం.
గాలిలేనిదే దుమారం లేచునా?
గాలిలో దీపం పెట్టి, దేవుడా! నీ మహిమ అన్నట్లు.
గాలిలో మేడలు కట్టినట్లు.
గాలివానా వస్తే కథమాసింది.

## గి

గింజలు ముత్తుము, పిట్టలు పన్నిద్దుము.
గిరిపూను భారము కరిపూనగలదా?
గిరాకి కొన నివ్వదు, మందం అమ్మ నివ్వదు.
గిరాకి కోమట్ల పాలు, మందం మాలల (మాలల) పాలు.

1 గాలికుంటు = (గిరసకాలు) గిట్టలకు నోటికి తగులు పశువుల రోగవిశేషము.
2 కురము = పశువులకు వచ్చే జలుబు జ్వరము.

# గు

[1]గుంటక పురాణం, గంప శతకం.

గుంటకాకి వింటిదెబ్బ ఎఱుగదు.

గుంటలో బిడ్డ, కడుపులో బిడ్డ. (బిడ్డ పోయీ పోకముందే గర్భధారణ)

గుంటూరు పొగాకు గూట్లో ఉన్నా ఒకటే, నోట్లో ఉన్నా ఒకటే!

గుండి (గుండ్రాయి) మింగేవాడికి తలుపులు అప్పడాలు.

గుండ్రాయి దాస్తే కూతురు పెండ్లి ఆగునా?

గుండ్లకమ్మ నిండి దరి జేరనీయదు, గంపకమ్మ కలిగి తిననీయదు.

గుండ్లు తేలి, బెండ్లు మునిగినట్లు.

గుంతకు వస్తే మరదలు, మిట్టకు వస్తే వదిన.

గుగ్గిలం వేయకపోతే పోయినావుగాని గుళ్లో పిత్తవద్దు.

గుగ్గిళ్లకు కొన్న గుఱ్ఱాలు అగడ్తలు దాటగలవా?

గుగ్గిళ్లకు నోరు తెరచి, కళ్లానికి నోరు మూసినట్లు.

గుట్టకు మొరిగిన కుక్క గ్రుడ్లువెళ్లి చచ్చిందట!

గుట్టు మీరు వారు గురునకు గురువురా.

గుడగుడ ఆలోచన గుడిసెకు చేటు.

గుడగుడ శబ్దం కుండకు నష్టం (మోసం).

గుడారంలో గూని బతుకు.

గుడిఅంతా దేవుడైతే గుదమెక్కడ బెట్టేది.

గుడి ఉమ్మడి గంటలకు గుట్టు ఉంటుందా?

గుడి కట్టేవాడొకడు, గూట్లో దీపం పెట్టేవాడొకడు.

గుడిగొట్టి ఇటికల తులసి తిన్నెలగట్టిన ధర్మాత్ముడగునా.

గుడి చిన్నదైనా గుళ్లో దేవుని మహిమ మిన్న.

గుడిచుట్టూ తిరిగి, బొడ్డులో వేలు పెట్టుకొన్నట్లు.

---

1 గుంటక = మెట్టచేను చదరపెట్టు పనిముట్టు.

గుడి దగ్గరైతే గురుత్వం దూరమౌతుంది.

గుడినుండి గుడిరాళ్లు దీసేవారు.

గుడిపాము కఱచినట్లు, గంగిగోవు పొడిచినట్లు.

గుడిమణియము చేయబోకు.

గుడి మింగేవానికి తలుపులు అప్పడాలు.

గుడి మింగేవాడికి గుడిలో లింగం ఉట్రవడియం.

గుడి మింగేవా డొకడయితే, గుడిని లింగాన్ని మింగే వా డింకొకడు, గుడిని గోపురాన్ని మ్రింగేది మరియొకడు.

గుడి మింగేవానికి నంది పిండిమిరియం.

గుడిమీద నుండి పడినా, గుండాములో పడినా ఒకటే (చావుకు)

గుడిముఖం ఎరుగని దాసరి గుడివెనక దండం పెట్టినాడట.

గుడిమేళం కాదు గుద్దత్రిప్పను, ఇది నగిరిమేళం నడుము విరుగుతుంది.

గుడిలో ఉండి, గుడిరాళ్లు దీసిందట.

గుడిలో దేవునికి గుడ్డ లేకుంటే వాకిట్లో దేవునికి వన్నెచీరె అట.

గుడిలో లింగం పోతే, [1]నంబి శంఠం పోయినట్లు.

గుడిలో లింగంపోతే, నడుమ నంబికేం నష్టం.

గుడిసెకు చాందిని, గుడ్డికి అద్దము ఏల.

గుడిసేటికి ఇల్లాలు గుత్త లంజ.

గుడ్డకు జాడింపు, కూరకు తాలింపు, కోడలికి సాధింపు లేకున్న ఇంపు లేదు.

గుడ్లమీది కోడిపెట్టవలె. (వదలక కనిపెట్టుకొనే యుండును)

గుడ్డిఎద్దు చేలో పడ్డట్టు. (మేపు మంచిచెడ్డలు చూడలేక నోటికి తగిలిన దానినే తినును)

గుడ్డికంటికి కాటుక పెట్టినట్లు.

గుడ్డికంటికి కుంచెడు కాటుకా?

---

1 నంబి = వైష్ణవాలయ అర్చకుడు: శైవుల లింగంపోతే యీయనకేమి అనుట.

గుడ్డికంటికి గుదం చూపినా ఒకటే అద్దం చూపినా ఒకటే.
గుడ్డికంటికి పగలైతే నేమి? రాత్రయితే నేమి?
గుడ్డికంటికి రెండు కూటాలు, మెల్లకంటికి రెండు మేళాలు.
గుడ్డికన్న మెల్ల మేలు.
గుడ్డికన్ను చారెడైతేనేమి, చిన్నదైతే నేమి.
గుడ్డి కన్ను మూసినా ఒకటే, తెరచినా ఒకటే!
గుడ్డికుక్క (కొక్కి) రాళ్లకు కొంగరాజు.
గుడ్డి కేమి తెలుసు కుందనపుచాయ?
గుడ్డి గుణమెఱుగదు, వడ్డి మొద లెఱుగదు.
గుడ్డిగుఱ్ఱము తట్ట గుగ్గిళ్లు దినపెద్ద.
గుడ్డి గుఱ్ఱమెక్కి గుడి చుట్ట నగునా.
గుడ్డిగుఱ్ఱానికి గుగ్గిళ్ళు చేటు.
గుడ్డిగుఱ్ఱానికి దారి ఒకటే.
గుడ్డిగేదెలలో గూనిగేదె శ్రీమహాలక్ష్మి.
గుడ్డిదానితో పోతే, గుడిసెదాకా సాగనంపాల.
గుడ్డిది బెదిరిస్తే, బిత్తరపోయి బావిలో పడినాడంట!
గుడ్డిది నీళ్ళకుపోతే ముగ్గురికి చేటు.
గుడ్డినక్క ఊరిన పడినట్లు.
గుడ్డి పెండ్లానికి చెవిటి మగడైనట్లు.
గుడ్డిమామగారు! నమస్కారమయ్యా! అంటే, రంధి(ది)కి మూలమా
అంటుకోడలా అన్నాడట.
గుడ్డి మొగుడికి, రేజీకటి పెండ్లాం.
గుడ్డివా డెరుగునా గురుతైన రత్నంబు.
గుడ్డివాడి ఉపాయం గుడ్డివాడిది, గూనివాడి ఉపాయం గూని వాడిది.

గుడ్డివాడి కన్ను రానోరునా ? పోనోరునా ?
గుడ్డివాడి కాలు కుంటివాడి కాధారమైనట్లు.
గుడ్డివాడి చేతి నూలు కదట్లో పడుతుందో [1]దిండులో పడుతుందో ?
గుడ్డివాడు అలావు తొక్కినట్లు.
గుడ్డివాడు ఎటు రువ్వినా గురే ?
గుడ్డివాడు కోల కోల్పోయినట్లు.
గుడ్డివాళ్ళరాజ్యంలో ఒంటికంటివాడే రాజు.
గుడ్డివాళ్లు ఏనుగును అంగాలు పట్టుకొని ఒక్కొక్కవిధంగా వర్ణించినట్లు.
గ్రుడ్డివేటు గువ్వకు తగిలినట్లు.
గుడ్డీ! రావే, గడ్డికి పోదాము అన్నట్లు.
గుడ్డు పెట్టబొయ్యే కోడిపెట్ట కేరినట్లు.
గుడ్డుపెట్టలేక పెట్ట చస్తుంటే తొక్కను పుంజు చూస్తుండినట్లు.
గుడ్డువచ్చి పిల్లను గోరడాలాడినవిధము.
గుడ్డువచ్చి, పిల్లను వెక్కిరించినట్లు.
గుడ్డుపెట్టేకోడికేగాని, కూసేకోడి కేమితెలుసు గుద్దనొప్పి ?
గుడ్డెద్దు చేలో (గడ్డిలో) పడినట్లు.
గుడ్లగూబను చంకలో బెట్టుకొని బయలుదేరినట్లు.
గుడ్లు దిన్నదిగాక గూడెక్కికూసినట్లు.
గుణము మానవే గూటాలపోలీ! (బుట్టా!) అంటే, నా మనువైనా మానుతానుగాని, నాగుణం మాననన్నదట!
గుణము కొఱకా ? గునుగుకొఱకా వచ్చింది.

---

1 దిండు = రాట్నపుదారము ఇమిడి కదురున త్రిప్పుటకు అమర్చిన కొయ్యపూసః గింక. రేక పుల్లివంటిది.

గుణము లేకయున్న గుణహీనురాలయా
గుణము లేకయున్న కుదురునా యూహలు.
గుణమేమి చేసిందే గునకకడ్డీ! అంటే, ఎప్పటి నాపేరు పంగలకడ్డీ అందట!
గుణుపూరు జంగాలు అమ్మ కిల్లు కట్టినట్లు.
గుత్తికిపోయి గూటం తెచ్చుకొన్నట్లు.
గుద్ద ఒకటి, గూటాలు పది.
గుద్దనొప్పి గుడ్డు పెట్టేకోడికి తెలుసును.
గుద్దకు కళ్లెం బెట్టినట్లు.
గుద్దులాడిన ఇంట్లో గుప్పెడు గింజలు నిలువవు.
గుప్పిడి(లి)మూసి ఉన్నంతవఱకే, తెరిస్తే అంతా వాళక్కే.
[1]గుబలకమ్మ చళ్లుజూచి, సన్న్యాసిగాడు సంబరపడినాడు.
గుమ్మగట్టు జోగులు అమ్మ కిల్లుకట్టినట్లు.
గుమ్మడికాయంత తెలివికంటే, గురిగింజంత అదృష్టం మేలు.
గుమ్మడికాయ దొరికిననాడే తర్పణం వదలినట్లు.
గుమ్మడికాయ పోయిన తావు గుర్తులేదుగాని, ఆవగింజపోతే అద్దుక తిన్నదంట.
గుమ్మడిగాయ పోయేదారి తెలియక ఆవగింజకు అల్లాడినట్లు.
గుమ్మడికాయల దొంగ అంటే, భుజాలు తడుముకున్నట్లు.
గుమ్మడికాయలో ఆవగింజంత. (జరిగినపనినిగూర్చి చెప్పుట)
గుమ్మలో గింజలు గుమ్మలో ఉండాలి, పిల్లలు పిడుకల్లాగ ఉండాలి.
గుమ్మళ్లు కుళ్ళినవి, ఆవాలు అల్లినవి.
గురికాడు నక్కను కొడుతాడా
గురి కుదిరితే, గుణం కుదురుతుంది.
గురుగింజకు ఎన్నివన్నెలున్నా గొప్పలేదు.

---

1 గుబలకమ్మ = స్తనములురాని ఆడుది. (లేనిదానికి ఆశపడుట-అనుట)

గురిగింజ తన గుద్దకింద నలుపెఱుగదు.

గురితప్పిన [1]ములికి, బరి తెగిన కలికి.

గురువుకన్న గుడ్డు మించింది.

గురువుకు కంకే దొరకకపోతే శిష్యుడికి ఊచబియ్యమా.

గురువుకు తగిన (మించిన) శిష్యుడు.

గురువుకు తిరుమంత్రం చెప్పినట్లు.

గురువుకు రేగినా గుఱ్ఱానికి రేగినా పట్టేదికష్టం.

గురువు కెగ్గుజేసినవానికి కృతఘ్నత్వమెంత.

గురువు నిలుచుండి తాగితే, శిష్యుడు పరుగెత్తుతూ తాగుతాడు.

గురువుమాట మీరరాదు గడ్డపార మింగరాదు.

గురువులు వస్తున్నారంటే, గోచులిప్పి తోరణాలు కట్టమన్నారట.

గురువులేని విద్య గుడ్డివిద్య.

గుఱ్ఱం ఎక్కిన తీరుకాదు, సద్దితిన్న నోరుకాదు.

గుఱ్ఱం ఎక్కి, మూట నెత్తిన పెట్టుకున్నట్లు. (గుఱ్ఱానికి బరువు తగ్గుతుందని)

గుఱ్ఱం ఎక్కేవాడే పడేది.

గుఱ్ఱం గాడిదను ఒకటిగా చూచినట్లు (చేసినట్లు)

గుఱ్ఱం [2]చవలం, జీను ముచ్చవలం.

గురువే చిల్లగింజ.

గుఱ్ఱం తన తోకతో తానే విసురుకొంటుందిగాని. చావడిలో గుఱ్ఱాల కన్నిటికీ విసరుతుందా ?

గుఱ్ఱం ముడ్డికి కళ్లెం పెట్టినట్లు.

గుఱ్ఱం పడద్రోసిందిగాక గుంట త్రవ్వినట్లు.

---

1 ములికి - కొరముట్ల (పనిముట్ల) ఇనుపకొన. (ముల్లు)

2 చవలం = ఒకనాణెము (1/4 భాగం పావలా)

గుఱ్ఱము కడుపులో గాడిదపిల్ల పుట్టునా?

గుఱ్ఱము గుగ్గిళ్లు తింటూంటే, గాడిదకు కడుపునొప్పి వచ్చిందట.

గుఱ్ఱము గుడ్డిదైనా దాణాకు తక్కువ లేదు.

గుఱ్ఱము చచ్చిందిగాక, గుంట త(తొ)వ్వను ఒకరూక.

గుఱ్ఱము పేరు గోడా అయితే, గోడపేరు గుర్రంగదా, ఇక నాకు ఉరుదు అంతా తెలుసు అన్నాడట!

గుఱ్ఱము పోతూ గూటము పీకుకొని పోయినట్లు.

గుఱ్ఱమూ అశ్వమూ కలిసి గుశ్వమైనట్లు.

గుఱ్ఱానికి కొమ్ములు మొలిస్తే ఒకరినీ ఉండనీయదు.

గుఱ్ఱానికి గుగ్గిళ్లు తిన నేర్పాలనా?

గుఱ్ఱానికి గుద్దలో కాలితే [1]ఆరికగడ్డి కూడా మేస్తుంది.

గుఱ్ఱానికి సకిలింత సంగీతానికి ఇకిలింత ఉండాల.

గుఱ్ఱానికి సన్యాసికి విధవకు బ్రహ్మచారికి ఎప్పుడూ మైథున చింతే గతి.

గుఱ్ఱానికి తోక ఉండం తనమటుకు తాను విసరుకోనేగాని కడమ గుఱ్ఱాలకు విసరునా.

గుఱ్ఱాన్ని గుగ్గిళ్లకు అమ్మినట్లు.

గుఱ్ఱాన్ని చూచి, కుంట నారంభించినట్లు.

గుఱ్ఱాన్ని చూస్తే కాళ్ళునొప్పి.

గుఱ్ఱాన్ని ఎక్కిన గుద్దాగాదు - చద్దిదిన నోరూ కాదు.

గుఱ్ఱాన్ని తొట్టిదగ్గరకు ఈడ్చుకొని పోగలమేగాని త్రాగించ లేము.

గుళ్లో దేవుడికి అంగట్లో బెల్లం నైవేద్యం.

గుళ్ళో దేవుడికి నైవేద్యం లేకుంటే, పూజారి పులిహోర కేడ్చాడట!

---

1 ఆరిగ (క) గడ్డి పొట్టిగా నల్లగా బిరుసుగా ఉంటుంది. తినను పనికిరాదు. చీకదు కాబట్టి ఇండ్లకు కప్పుగా ఉపయోగిస్తారు. కుళ్లదు కాబట్టి (వరిగడ్డివలె) తమలపాకులను చుట్టిపెట్టను ఎక్కువగా వాడుతారు. గింజ పొట్టు ఎప్పటికీ కుళ్లదు. బియ్యం బాగుండును. అంటే హీనస్థితిని అనుభవించుట - అని.

గుళ్ళో పిత్తకపోతే, గుగ్గిలం వేసినంత పుణ్యం.

[1]గువ్వకూర్చున్న వెంకాయ, గూబకూర్చున్న కొంప కొరగావు.

గువ్వ గూడెక్కెను, అవ్వ మంచమెక్కెను. (మునిమాపున)

గువ్వ గూడెక్కె, రాజు మేడెక్కె.

గుసగుసలు వచ్చి గుడిసెకు దాడితెచ్చె.

గుసగుస యోచనలు గుడిసెలు తీయటానికి కారణం.

## గూ

గూటి గూటంతో గుండెలు గుద్దుకొన్నట్లు.

గూట్లో దీపం, నోట్లో ముద్ద. (దీపం పెట్టడంతోనే భోజనం చేయుట అనుట)

గూట్లో మిరపకాయ గుంటలో బువ్వ.

గూట్లో మిరపకాయ చూస్తూ అన్నం తినమన్నట్లు.

గూదదిగిన పేరంటాలు అత్తగారింట ఉన్నా ఒకటే, అమ్మగారింట [ఉన్నా ఒకటే!

గూనికితోడు దొబ్బుడు వాయువు.

గూని గుగ్గిరిచ్చె, దండు దగ్గరొచ్చె.

గూని దున్న కంటె, గుడ్డి దున్న మేలు.

గూనివాడు పడుకునేవల్ల గూనివాడికే తెలుసు.

గూనివాని ఒడుపు పడుకొన్నప్పుడు చూడాలి.

గూనువీపు కుదురు అవుతుందా!

గూబ ఎక్కిన కొంప చెడును.

గూబ ఎక్కిన గృహము కూలు.

1 గువ్వకూర్చుండుట = చెట్టుమీదనే వెంకాయ కొబ్బరి, నీరు లేకుండా చెడిపోవుట.

# గృ

గృహప్రవేశానికి వెడుతూ, గుడ్లగూబను చంకను బెట్టుకొని పోయినట్లు.



# గె

గెలువని రాజుకు [1]గప్పాలు మెండు.

1 గప్పాలు = ఎచ్చులకారి మాటలు. కోతలు.



# గే

గేదె ఉండగా, దూడ ఉండగా, గుంజకు వచ్చెరా గుఱకవాయువు అన్నట్లు.

గేదె దూడ ఉండగా గుంజ అరచిందట.



# గొ

గొంగట్లో అన్నం తింటూ వెంట్రుకలు ఏరినట్లు.

గొంగట్లో గుద్దులాట. (ముసుగులో గుద్దులాట)

గొంతుకలో పచ్చి వెలక్కాయ పడ్డట్లు.

గొంతుకోసేవాడు కత్తి ఏమరునా?

గొంతు చిన్నది [1]గోలెము పెద్దది.

గొంతులో పుస్తెబొట్టు, గుంటనక్కంత మొగుడు.

1. గోలెము = కడుపు.

గొంతెమ్మ కోరికలు - ఎండమావుల నీళ్లు.
గొంతెమ్మ కోరికలకు గాలిమేడలు కట్టడం ఒక లెక్కా పక్కా.
[1]గొడారిబేరం గొడ్డుకు లాభం.
గొడారివానివద్ద తోలుకొన్నట్లు.
గొడుగు పట్టితే పిడుగుకు అడ్డమా!
గొడెము తెగిన గ్రాసం పట్టదు.
గొడ్డలి ఎక్కడ పెట్టినావురా! అంటే, కొట్టేచెట్టువగ్గఱ; కొట్టే చెట్టెక్కడుందిరా! అంటే గొడ్డలిదగ్గఱ అన్నాడట.
గొడ్డలిలో దూరినకట్టె కులాన్నంతా కొట్టివేస్తుంది.
గొడ్డావుపాలు గొడ్రాలి బిడ్డ కిచ్చినట్లు.
గొడ్డుకు ఎక్కువదెబ్బ, గుడ్డకు తక్కువదెబ్బ పెట్టాలి.
గొడ్డుకు ఒకదెబ్బ, మనిషికి ఒకమాట.
గొడ్డుకు తిన్నది పుష్టి, మనిషికి ఉన్నదే పుష్టి.
గొడ్డు కొఱికిన [2]కొయ్యకాలు గొఱ్ఱెకు చాలు.
గొడ్డుటావు (గొడ్డుపోతు) పాలు పితికినట్లు.
గొడ్డుటావు గోకిన చేపునా.
గొడ్డునుకొని తలుగుకు (పలుపుకు) ఏడుస్తాడు.
గొడ్డుపోతేమి ఎఱుగురా బిడ్డచలి.
గొడ్డు బలిస్తే పాటుకి, మనిషి బలిస్తే కాటికి.
గొడ్డుబోతు ఆవు గోకితే పాలిస్తుందా?
గొడ్డు రైతుబిడ్డ.
గొడ్డు లేనివాడు బిడ్డ లేనివాడు ఒకటి.
గొడ్డు వచ్చినవేళ, బిడ్డ (కోడలు) వచ్చినవేళ.
గొడ్డువాడు గొడ్డుకేసిస్తే, గొడారివాడు తోలుకేడ్చెను.

1 గొడారి = కసాయి. 2 కొయ్యకాలు = వరి కోయగా నేలవ మిగిలిన కుదురు.

గొడ్డోడు గొడ్డుకేడిస్తే (చచ్చిందని) మాలచచ్చినోడు చియ్యకేడ్చి నాడంట.

గొడ్రాలి కేమి తెలుసు కాన్పు నొప్పులు, (బిడ్డకుట్టు)

గొడ్రాలి ముండకు గొంతు పెద్ద. [లేదు.

గొడ్లు కాచేవాణ్ణి కొట్టనివాడు, గొఱ్ఱెలు కాచేవాణ్ణి తిట్టనివాడు

గొద్దకుపెత్తనమిస్తే గోదావరంతా తేలియాడిందట. (పారికాడిందట)

గొప్పగ తెలిసినవారే గోతిలో పడుతారు.

గొప్ప సత్యాలు గొప్పవారివలెనే నిరాడంబరంగా ఉండును.

గొప్ప లేని బుద్ధి కొంచమై పోవురా.

గొరకగా మిగిలిందే జుట్టు.

గొరిగించి గోపినామం బెట్టినట్లు. (తిరుపతిలో వలె)

గొఱ్ఱు గుచ్చిన నేలకు కొఱత ఉండదు.

గొఱ్ఱె ఎంత ఎదిగినా తోక బెత్తెడే.

గొఱ్ఱె ఏడిస్తే తోడేలుకు కనికరమా?

గొఱ్ఱె కటికి వాణ్ణి నమ్మినట్లు గొల్లవాణ్ణి నమ్మదు. [పోరాదు.

గొఱ్ఱెకు ఎదురు, గుఱ్ఱానికి వెనుక, (గొఱ్ఱె చీమును, గుఱ్ఱం తన్నును)

గొఱ్ఱె ఏడిస్తే తోడేలుకు విచారమా?

గొఱ్ఱె కొవ్వి సెలకట్టె (జాటి) కొరికిందట.

గొఱ్ఱె కొవ్వేదంతా (బలిసేదంతా) గొల్లవానికే లాభం.

గొఱ్ఱెదాటు, ఏలంవెఱ్ఱి (కండ్లు మూసుకొని అనుసరించుట).

గొఱ్ఱెను అడిగి గొంతు కోస్తారా?

గొఱ్ఱెను తినేవాడు పోతే, బఱ్ఱెను తినేవాడు వచ్చినట్లు.

గొఱ్ఱె పడుకున్నచోట బొచ్చెంత రాలిందని చూచినట్లు.

గొఱ్ఱెల పెంట ఏడాది, ఆవుల పెండ ఆరేండ్లు. (సత్తువకు)

గొఱ్ఱెబలసి, చింత కొఱికినట్లు.

గొఱ్ఱెల [1]మందకంటె, లోతు దుక్కి మేలు.

---

1 మందకట్టు - పెంటవేయుటకు పొలములో రాత్రులలో పశువుల కుదురవేయుట.

గొఱ్ఱెల [1]మందలో తోడేలు పడ్డట్లు.

గొఱ్ఱెలు కాచినందుకు, లోడుగు తాగినందుకు సరి.

గొఱ్ఱెలు గుంపు కూడితే, (కట్టితే) గొప్పవాన.

గొల్లకంపుగాలి కొట్టింది అత్తగారూ! అంటే, అంటుఅయినది, కుండలో నీరు పారబోయి కోడలా! అన్నది.

గొల్ల చల్ల పుల్లన, గున్న చింతనల్లన.

గొల్ల ముదిరి పిల్ల అయినట్లు.

గొల్లమెండు ఇల్లు పట్టదు.

గొల్లల [2]యిరదాళ్లు (వీరత్రాళ్ళు) లేని [3]గంగమ్మ కొలుపువలె.

గొల్లల గోత్రాలు గొఱ్ఱెల కెరుక, గొఱ్ఱెల గోత్రాలు గొల్లలకెరుక.

గొల్లవాడా! గొల్లవాడా! ధాన్యం ఎక్కడుంది అంటే, నా గొఱ్ఱె ముడ్డిలో ఉంది అంటాడు.

గొల్లవాడి ఇంట పెండ్లి తెల్లవారుతుంది.

గొల్లవాడి కొమ్ము హెచ్చనూ హెచ్చదు, తగ్గనూ తగ్గదు.

గొల్లవాడు గొఱ్ఱెపిల్లను చంకనబెట్టుకొని, అడవిఅంతా వెతికినట్లు.

గొల్లవెఱ్ఱి మంచ మెక్కింది. (విరుగదొక్కిందట)

గొల్లసుద్దులు గోవింద రొట్టెలు.

గొల్లసుద్దులు పిల్లముద్దులు.

గొల్లింట గుఱ్ఱాలు కుక్కపిల్లలు, ఆవులు ఆడుబిడ్డలు.

గొళ్లెంలేని తలుపు, కళ్లెంలేని గుఱ్ఱము.

---

1 మంద=గుంపు.

2 ఇరదాళ్ళు-పన్నగా మొనతేలిన లావుమోకులను ఒంటిచుట్టు త్రిప్పి కొట్టుకొని శబ్దము చేయునది.

3 కొలుపు=జంతుబలి లేని జాతర (అంకమ్మకొలుపు, పోలేరమ్మజాతర)

# గో

గోంగూరలో చింతకాయ వేసినట్లు.

గోకి దురద తెచ్చుకొన్నట్లు.

గోకుడుకు గీకుడే మందు.

గోకులాష్టమికి పీర్లతిరునాళ్ళకు (పండుగకు) సంబంధమేమి?

గోగు పెళు(డు)సు, గొల్ల బిరుసు.

గోచికి ఎక్కువ కోకకు తక్కువ.

గోచికి పెద్ద, కోకకు చిన్న.

గోచికి పెద్ద, గావంచాకు చిన్న.

గోచికి మించిన దరిద్రం లేను, ఈతకు మించిన లోతులేదు.

గోచిపాతల రాయుడు దొంగలకు మిండడు.

గోచిలో గొంగడి చించుతాడు.

గోచివిప్పేసి, పాగా చుట్టినట్లు.

గోటితోపోయే పనికి (త్రుంచేదానికి) గొడ్డలి ఎందుకు?

గోడ ఉంటే చిత్రం వ్రాయవచ్చు.

గోడకు పూసిన సున్నము విడెములోనికి వచ్చునా?

గోడకు పెట్టిన సున్నం, లంజకు పెట్టిన సొమ్ము తిరిగిరావు.

గోడపై సున్నం గోకితే రాదు.

గోడ దూకినవా డెవడంటే, ఆలుచచ్చిన వాడన్నట్లు.

గోడనుబెట్టి త(డి)డక తన్నాలిగాని, తడకగట్టి గోడను తన్నరాదు.

గోడ పట్టుకో, కూలి అడిగివస్తాను.

గోడమీద పిల్లి వాటము, కోమటి సాక్ష్యము.

గోడలకు చెవు లుంటాయి, నీడలకు నోళ్లుంటాయి.

గోతిని త్రవ్వినవాడే అందులో పడేది.

గోదావరి పారినా, కుక్కకు గతుకునీళ్లే!

గోదావరీ పారింది, గొడ్డలేరూ పారింది.
గోధుములు వేస్తే, బాదములు పండునా!
గోనెల కంటె గోతులు మెండు.
గోనెలే కొత్తవి, కోడ లెప్పటివే!
గోప్రదక్షిణము భూప్రదక్షిణ ఫల మిచ్చినట్లు.
గోముఖ వ్యాఘ్రం.
గోరంత ఆలస్యం కొండంత నష్టం.
గోరంత నీరైనా గోతులు చేస్తుంది.
గోరంతను కొండంత చేయడం.
గోరీకాడ నక్కవలె,
గోరుచుట్టుపై రోకలి పోటు.
గోరువాచిన వేలంత, వేలువాచిన కాలంత, కాలు వాచిన రోలంత,
రోలు వాచిన ఎంత!
గోల గోవిందుడిది, అనుభవం వెంకటేశ్వరులిది[1].
గోలుకొండ ఉద్యోగం, గొంతుకోత ఒకటి.
గోవధ గావించి గోరోజనము రోగార్తుల కిచ్చిన పుణ్యాత్ము డగునా.
గోవును [2]గోలెం దగ్గరికి తీసుకెళ్ళ గలం గాని, కుడితి తాగించ
గలమా?
గోవులను కోసి, చెప్పులను దానం చేసినట్లు.
గోవులేని ఊళ్ళో గొడ్డుగేదే శ్రీ మహాలక్ష్మి.
గోవే తల్లి, ఎద్దే తండ్రి!

---

1 గోవిందరాజులు దిగువ తిరుపతిలో ఉండే దేవుడు. తిరుమల ఎక్కే వారంతా గోవిందా అంటూ పోయి వెంకటేశ్వరునికే ముడుపులు చెల్లింతురు. గోవిందరాజులను చూచేవారు తక్కువ. 2 గోలెము=తొట్టి.

## గ్ర

గ్రహచారం చాలకపోతే, వసుదేవుడు గాడిద కాళ్లు పట్టుకొన్నాడట!

గ్రహచారం చాలక [1]రాచాలకు పోతే, జన్మనక్షత్రం జూచి నెత్తి గొరిగిరట.

---

## గ్రా

గ్రామంలో ఒక కోమటుంటే, వెయ్యిరూపాయల నష్టం, ఒక్క ఆబోతు ఉంటే, వెయ్యి రూపాయల లాభం.

గ్రామ మిచ్చినదాత ఇల్లు కట్టించి యివ్వలేదా?

గ్రామశాంతికి బోడితల.

గ్రాసం లేని కొలువు-మీసం లేని బ్రతుకు.

గ్రాసం లేని కొలువు-రసం లేని కావ్యం.

గ్రాసం లేని బంటుకు రోసం ఎక్కువ.

---

1 రాచాల = ఊరిపేరు.

## ఘు

ఘుంటాకర్ణునికి అష్టాక్షరి ఉపదేశం చేయబోయినట్లు.

ఘుటము లెన్నియైన గగనంబ దేకమౌ.

ఘుడియకు హాజీ, ఘుడియకు ఫాజీ.

ఘుడియ తీరుబాటు లేదు, దమ్మిడీ ఆదాయం లేదు.

ఘుడియ పురుసత్తు లేదు, గవ్వ సంపాదన లేదు.

ఘునమగు పులి గోరూపము కాగానే బిడ్డకు (శిశువుకు) పాలుకల్గునా.

## ఘో

[1]ఘోటక బ్రహ్మచారి.

## చ

చంకకు ఎక్కిన పిల్ల చచ్చినా దిగదు.

చంకజోలె చిల్లి పోలేదు, చందలూరు కాలిపోలేదు.

చంక దుడ్డుకు దండం అన్నట్లు.

చంకదుడ్డు శరణార్థి.

చంకన పిల్ల కడుపులో పిల్ల.

---

1 జాతిగుఱ్ఱములకు లేపనము ఎక్కువ: [యతికి మరి బ్రహ్మచారికి అతులితముగ విధవముండ యశ్వంబునకున్, పతతము మైథునచింతయె, గతియప్పా కుందవరపు కవిచౌడప్పా.] దానిని నివారించుటకు ముళ్లు అమర్చిన తోలుతిత్తి నొకదానిని దాని లింగమునకు కట్టిపెట్టి యుంతురు. నిగిడినప్పుడు ముళ్లు గుచ్చుకొనగా, వెనుకకు లాగుకొనును. అనగా పట్టి బలవంతాన బ్రహ్మచర్యం పాలించే వా డనుట.

చంకలోతుకు దిగిన వాడికి చలేమిటి?
చంకలో పిల్లనుంచుకొని ఊరంతా గాలించినట్లు.
చంకలో పిల్ల నుంచుకొని, సంతలో వెదకినట్లు.
చంకలో పిల్లను పట్టుకొని, లంకలన్నీ వెదికినట్లు.
చంటిలో ఎముకలు ఏరినట్లు.
చండామార్కులవిద్య చేతులు కావు, కాళ్లు!
చందమామకు తోకవచ్చి, 'ఈ'కు ఇఅకటమైనట్లు.
చంద్ర పరివేషము వర్ష యోగము.
చంద్రుడు క్రుంకిన వెన్నెల నిలుచునా!
చంద్రునిచూచి కుక్కలు మొఱిగినట్లు.
చంద్రునికి ఒక నూలుపోగు! (నెలపొడుపునాడు)
చంద్రునిలో కందు వెన్నెలలో గలదా?
చక్కగా కూర్చోరా చాకలి నాయుడా! అంటే, విన్నావటోయ్ ఈడిగనాయుడా! మంగలినాయుడి సరసం అన్నాడట!
చక్కదనానికి లొట్టిపిట్ట, సంగీతానికి గాడిద.
చక్కనమ్మ చిక్కినా చక్కనే! (అందమే)
చక్కని రాజమార్గముండగా సందులు దూరనేల.
చక్కనివాళ్ళు చిక్కినా బాగుంటారు. సన్నచీర మాసినా బాగుంటుంది.
చక్కిలాన్ని చూచి, జంతిక నవ్విందట!
చక్కిలాలు తింటావా? చల్ది తింటావా? అంటే, చక్కిలాలూ తింటాను, చలికేతింటాను, అయ్యాతోగూడ అవతల అన్నమూ తింటాను అన్నదట.
చక్కెర తిని చేదు అన్నట్లు.
చక్కెర దినునోరు చవిగొనునే చేదు.

చక్కెర పందిట్లో తేనెవాన కురిసినట్లు.

చక్కెర పూసిన విషమువలె.

చక్కెరతిన్న నోటితో, తవుడు బొక్కినట్లు.

చక్రవర్తి చేస్తే శృంగారం, చాకలిచేస్తే వ్యభిచారం.

చచ్చిన ఆవుమీద చెప్పు లుంచినట్లు.

చచ్చిన గొడ్డుకు బోరగలు, పుండుకు ఈగలు కనిపెట్టుకొని ఉంటవి.

చచ్చిన చారమేక పాలు, పోయిన బోసిముంతెడు.

చచ్చినతరువాత తెలుస్తుంది (బయటపడుతుంది) సెట్టి భండారం.

చచ్చినదాని పిల్లలు వచ్చినదాని కాళ్ళకింద.

చచ్చినట్లు కలవచ్చినా మేలుకోక తప్పదు.

చచ్చిననాటి దుఃఖం మరునాడు ఉంటుందా?

చచ్చినపామును కొట్టడానికి అందరూ బంట్లే.

చచ్చినపామును చావగొట్టినట్లు.

చచ్చినబిడ్డకు చేరెడు కండ్లు.

చచ్చినమొగుడు చనుబాలమీద, బతికినమొగుడు మంచంమీద.

చచ్చినవాడి కండ్లు పత్తికాయలంత.

చచ్చినవాని కండ్లు చారడేసి.

చచ్చినవాని తల తూర్పున నుంటేనేమి? పడమట నుంటేనేమి?

చచ్చినవాని పెండ్లికి వచ్చిందే లాభం.

చచ్చినవాని పెండ్లికి వచ్చినంతే కట్నం.

చచ్చినవారు వత్తురె యేడ్చినంత.

చచ్చినా పైకం తప్పదు అచ్చమ్మా! ఇక తిట్టకు.

చచ్చినోడి గుడ్డ తక్కెడో బిక్కెడో.

చచ్చినోడు [1]చాటడంత.

1 చాచెడు = చేటవెడుగ.

చచ్చిపోయిన బత్తె పగిలిపోయిన ముంతెడు పాలిచ్చేది.

చచ్చేకాలానికి సత్యభామవేషం వేసినట్లు.

చచ్చేటప్పుడు సంధ్యమంత్రమా?

చచ్చేటప్పుడు సారెకావళ్ళు?

చచ్చేదాకా బతికితే, పెళ్లిచేస్తానన్నట్లు.

చచ్చేదాకా వైద్యుడు వదలడు, చచ్చినా పంచాగంబ్రాహ్మడు వదలడు.

చచ్చేపిళ్ళాన్ని 'అమ్మా' అంటే బతుకుతుందా!

చచ్చేరోగికి మందు పట్టదు.

చచ్చేవానికి సముద్రము మోకాలిబంటి.

చట్టిలోకి కూరాకు, ముడ్డిలోకి మేకు తెచ్చుకొంటేగాని రావు.

చట్టిలో వుంటే [1]అబకకు వస్తుంది. (ప్రాప్తివుంటే అనుట)

చట్టుబొమ్మకు గిలిగింత పెట్టినట్లు.

చత్రాతిన నార తీసినట్లు.

చత్రాతిలో నీరు ఛండాలవాటికలో బ్రాహ్మణగృహం ఉంటవా!

చతురతకు జాణగాడేగాని, చేతిలో చిల్లిగవ్వలేదు.

చనవిచ్చిన ఆలు చంకకెక్కు.

చదివింది, చదువనిది ఒకటిగా ఉండడమే పండితలక్షణం.

చదివిన కూతలుంటే, ఉణ్ణీగాని, సంచులుమాత్రం ముట్టవద్దు.

చదివి నతనికన్న చాకలిసతిమేలు.

చదివినవాడికన్న చాకలివాడు మేలు.

చదివేది రామాయణం, పడగొట్టేది దేవాలయం.

చదువక ముందు కాకరకాయ, చదివిన వెనుక కీకరకాయ.

చదువక ముందు పెసలంటూ, చదివేస్తే పిసలన్నట్లు.

1 అబక = టెంకాయచిప్పతో చేసిన గరిట.

చదువక ముందు వరవరఅంటే, చదివిన వెనుక వడవడ అన్నాడట.
చదువనేర్చిన ఆడువారితోను, వండనేర్చిన మగవారితోను ఓపలేము.
చదువ నేర్తువా? వ్రాయ నేర్తువా? అంటే-చదువ నేరను, చించ నేర్తును అన్నాడట!
చదువరి మతికన్న చాకలిమతి మేలు.
చదు(వ)వేస్తే (చదువబెట్టగా) ఉన్నమతి పోయినట్లు.
చదువా లేదు, మరువా లేదు.
చదువుకున్న వాడికీ, సేద్యగాడే అన్నం పెట్టవలె.
చదువుకు ముదురు, సాముకు లేత.
చదువుకో నన్నాళ్లు పసులు పసులు అని, చదువుకున్నాక పచులు పచులు అన్నాడట!
చదువు, చన్నువిడిచి చన్నుపట్టుకొనే లోపలే రావాల. (పాలు తాగడంమాని, జవ్వనం వచ్చేలోపల అనుట)
చదువు చేరెడు, బలపాలు దోసెడు.
చదువు మాఇంట లేదు, సంధ్య మావంశాన లేదు.
చదువురాని మొద్దు-కదలలేని ఎద్దు.
చదువులచెట్టుకు వేళ్ళు చేదుగాని పండ్లుతీపు.
చదువులు చదివెడి యయ్యలు పదవిని పొందంగలేరు.
చదువు సంధ్యాలేకుండా మాదిగవెధవ అవుతున్నావన్నది విని, మాదిగ-ఆరె అట్టలేకుండా బ్యామ్మణగాడిద అవుతున్నావన్నాడట.
చదువు సన్నమయ్యె, అయ్య లావయ్యె.
చదువూ లేదు, సంధ్యా లేదు, సంతానం మాత్రం మెండు.
చద్దికంటె ఊరగాయ ఘనం.
చద్దికూడు తిన్నమ్మ మగనిఆకలి ఎఱుగదు.

చద్ది తెచ్చుకొన్న బ్రాహ్మణుడా! భోజనం చెయ్యి.

చద్ది నాకుపెట్టమ్మా, ఆకలిగాకుండా నీకు మందిస్తా నన్నాడట.

చద్ది పురిసెడు, ఊరగాయ దోసెడు.

చద్దిమాటలలో సారం చాకలి ఎఱుగును.

చద్దెన్నం మీది వెన్న చంద్రుడౌతుందా!

చనువిస్తే, చంక కెక్కినట్లు.

చనువు చేసిన ఆలు చంక కెక్కు.

చన్ను కుడిచి, రొమ్ము గ్రుద్దినట్లు.

చన్ను, తోటకూర చేయి తగులనిదే పెరుగవు.

చమురు దండుగ భాగవతం. (బోగాతం)

చమురు నష్టియే గాని, పిల్ల బ్రతుకదు.

చమురున్న పెంకు ఎప్పుడూ పేలదు.

చరిత్ర పునరావృత్తి నొందును.

చరిత్ర వివేకులకు దారిచూపి, అవివేకులను వెంట ఈడ్చుకొనిపోవును.

చలాకి లేకపోయినా సలాకిలా ఉండాలి.

చలికి జడిసి కుంప టెత్తుకొన్నట్లు.

చలిజ్వరము! అన్నంలో చెయ్యి తీయ బుద్ధికాదు.

చలి దూరందే బీర పూయదు.

చలిబడనేల సీతుగాయనేల?

చలివేంద్ర (చలిపందిరి) కుండలకు తూట్లు పొడచినట్లు. (కొట్టినట్లు)

చల్లకుండకు, చంటిబిడ్డకు చాటుండాలి.

చల్లకు వచ్చి, ముంత దాచనేల!

చల్ల కేంగాని, గొల్లది బాగుం దన్నాడట.

చల్లయు బాలును గలసిన చల్లకు దోడంటినట్లు. (తోడుబెట్టుట, చేమిరివేయుట మజ్జిగబొట్టుతోనే)

చళ్ళు చూచుకోని సంబరపడితేనే సరా! ముందరి పాటు చూచుకో అన్నాడట. (ముడ్డిపడేపాటు చూచుకో)
చళ్ళు జారిన ముండకు, వట్టలు జారిన విటకాడు
చవి ఎఱిగిన కుక్క చావగొట్టినా పోదు.
చవితి చంక నాకినట్టే ఉంది ఏకాదశీ అన్నాడట!
చవిటిఉప్పు కండచక్కెరవలెనున్నా అనుభవ సుఖములేదు.
చవిలేనికూడు కుడుచినట్లు.
చవిసారం లేని కూర చట్టినిండా, ఆగంపాగం లేని మొగుడు మంచం నిండా.
చవీసారం లేనివాడు సంచారం పోతే, ముసలికుక్కలన్నీ గుసగుస లాడినవట.
చవుక (చౌక) కొననివ్వదు, ప్రియము అమ్మనీయదు.
చస్తానని చద్దన్నం తింటే చల్లగా నిద్రవచ్చిందట.
చస్తూఉంటే సంధ్యమంత్రం చెప్పమన్నట్లు.
చస్తే చచ్చాడుగాని, చలిజ్వరం చప్పగా వదిలింది.
చస్తేనేగాని బత్తెపాడి బయటపడదు.



## చా

చాకలి అత్త, మంగలి మామ, కొడుకు సాలోడైతేనేమి? సాతానోడైతేనేమి!
చాకలి కట్టని గుడ్డ, [1]పైను ఎక్కని గుఱ్ఱము లేదు.
చాకలి కొత్త, మంగలి పాత.
చాకలి తెలుపు, మంగలి నునుపు దప్ప, అయ్యదగ్గర ఏమీ లేదు.

---

1 పైను=గుఱ్ఱంకాపరి.

చాకలిదాని చక్కదనానికి సన్యాసులు గుద్దుకొని చచ్చారట.

చాకలిదానితో సహవాసం చేస్తే, గాడిదవచ్చి గర్భపడిందట.

చాకలిది సందెఱుగదు, మాలది మంచమెఱుగదు.

చాకలిని తువరం చేయమంటే, చెక్కదీసి చేతిలో పెట్టినాడట!

చాకలి మంగలిపొత్తు, ఇంటికిరాదు విత్తు.

చాకలివాడి భార్యకు మంగలివాడు విడాకు లిచ్చినట్లు.

చాకిరిచేసే చాకలికి లేదుగాని, గొరిగే కొండయ్యకిస్తారు.

చాకిరేవు ఒక చోట, ఏలపాట ఇంకొక చోట.

చాడుతిని చెడితి, వాకిలిదాటి పడితి.

చా(చే)దను చూచి, బొక్కెన బాయిల ఏసిందట.

చాదస్తం అంటే, చెరిసగం అన్నట్లు.

చాదస్తం మొగుడా! నీ చారెడు వేరె వండుకో అన్నట్లు.

చాదస్తపు మొగుడు చెపితే వినడు, చెప్పకుంటే కరుస్తాడు.

చాపచిరిగినా చదరంత కాదు.

చామలుచల్లి చేనువిడవాల.

చామచేలకు పరిగకుపోయినట్లు.

చాలకపోతే బలాదూరు అన్నట్లు.

చాలనిబట్టకొంటే చినిగేవరకు దుఃఖము, చాలనిమగని చేసుకుంటే
చచ్చేవరకు దుఃఖము.

చాలమ్మా! నీ ఇరుస రాగుల గద్దె!

చాలీచాలని దానికి చాకలి సంతుఅన్నట్లు.

చాలుపై చాలుదున్నితే చచ్చుచేనైనా పండుతుంది.

చాలులో చాలుపోతే నాపాలెక్కడికిపోతుంది!

[1]చాత్రీలు [2]శకణ్ణాలు చెడేస్తే, పైత్యం పడేసే వయస్సు.

చావడిముండతో కొంప కదపాపుల్లకు సరి.

---

1 చాత్రీలు = కోదెగపుమాటలు, చేష్టలు.

2 శకణ్ణములు = కొంటెపనులు.

చావ దీరనంత పనిఅయినా, చా(చే)రెడు గంజికి నోవలేదు.

చావా చావడు, చాపా ఇవ్వడు.

చావాలని సన్యాసం తీసుకొంటే గంత బొంత గాడిదమోత అయినదట.

చావుకంటె గండంలేదు, గోసికంటె దరిద్రం లేదు.

చావుకబురు చల్లగా చెప్పమన్నారు.

చావుకాలానికి సమర్త కట్నాలు.

చావుకు చావు ఉన్నదా?

చావుకు పెడితేగాని లంఖ(ఘ)ణాలకు తేలదు.

చావుకు ముదురు - లేత ఉందా?

చావు కెరచి చాటుకు బోతే, మిత్తి వచ్చి ముందర కూర్చున్నదట.

చావు తప్పి, కన్ను లొట్టపోయినట్లు.

---

## చి

చింతకాయల కాజ్ఞగాని, గ్రుక్కిళ్ళ కాజ్ఞా?

చింతకాయలు అమ్మేదానికి సిరిమానం వస్తే, ఆ వంకరటింకరవి ఏమికాయలు అన్నదట!

చింతకాయలు ఎరుగని దొరసాని, చింతకాయలను చూచి, కొడవళ్లా అన్నదట!

చింతకాయలు తిన్ననోర కొట్టలు తినగునా (కొట్టలు గట్టివి; చింత పులుసుకు పులిసినపండ్లతో తినలేమనుట)

చింతకాయలు బేరంచేస్తూ, వంకరటింకర కాయ లేమి అన్నట్లు.

చింత చచ్చినా పులుసు చావలేదు.

చింతజిక్కిన మనసు అగ్గిపొంత వెన్న.

చింతదూత తూతిందే! అన్నదట ఒకతె; తూతేకాలం వస్తే తూతదా! అన్నాడట ఇంకొకాయన; దొందూ దొందే అన్నాడట మూడోఆయన.

చింత పండితే, జీడి పండదు.

చింతపండు అంటే, పొంతకుండ తెస్తాడు.

చింత లేదు, చింత లేకపోతే పులుసు లేదు.

చింత లేని అంబలి చేరెడే చాలు.

చింత లేనమ్మ సంతలో నిద్రపోయిందట!

చింతాకంత బంగారం-మెడచుట్టూ తీగె కావాలన్నట్లు.

చింతా [1]చిగిరింత ఏపు.

చింతపులుసుకన్న చిక్కగ, పచ్చిపులుసుకన్న పలుచగ.

చింతలు పూస్తే సిరులు, మామిళ్ళు పూస్తే మరణాలు.

చిక్కనిపాలు మీగడలుండగా ఛీయను [2]గంగాసాగర మేల.

చిక్కానికి చేరులు తీసినట్లు.

చిక్కి [3]చికిలించేకన్న, వెళ్ళి వెక్కిరించేది మేలు.

చిక్కితే దొంగ, చిక్కకుంటే దొర.

చిక్కిన తగువా? చిక్కని తగువా?

చిక్కినవాడు సిగ్గెఱుగడు, బలసినవాడు వావి ఎఱుగడు.

చిక్కిన సింహాన్ని బక్కకుక్కగూడ కఱుస్తుంది.

చిక్కుడు గింజకు తన పాదే తెలియదు.

చిక్కుడు తీగకు బీరకాయ కాస్తుందా?

చిక్కుదీసి, కొప్పు బెట్టినట్లయింది.

---

1 చిగిరింత = ఒకవిధమైన పీటిగడ్డి.

2 గంగాసాగరము = కల్లు.

3 చికిలించు = చింతించు.

చిక్కుల గుత్తానికి కక్కులక శ్లేము.

చిగిరింత మొక్క చింత చెట్టుతో డీకొన్నదట.

చిగురించే కోరిక చేతిలో దాగదు.

చిచ్చాయ చిచ్చాయ అంటే, సందాయ సందాయ అన్నట్లు.

చిచ్చు అంటుకొంటే, చేతులతో ఆర్పగలమా ?

చిచ్చు ఉబుకంగ పోతూ, చీరకొంగు సవరించుకొన్న దానివలె.

చిచ్చుకు తోడు కరువలి.

చిచ్చుగలవారికోడలు చిత్రాంగి, బావిగలవారికోడలుపనిమంతురాలు.

చిచ్చును ఒడిగట్టి తెచ్చినట్లు.

చిచ్చును కౌగిలించుకొంటే చిమిడించు.

చిటికిన వేలు శ్రీపతి.

చిటికెలో పందిరి వేసినట్లు.

చిట్టెడు నూనె తెచ్చి, చిన్నింట్లో దీపం, పెద్దింటిలో దీపం; వత్తికి వదిన నెత్తికి; మంగలివాడి కత్తికి, మాబావ జుత్తుకు.

చితి చచ్చిన వానిని, చింత బ్రతికినవానిని కాలుస్తుంది.

చిత్తం చెప్పులమీద, ధ్యానం దేవునిమీద.

చిత్తం మంచిదయితే, చేదూ (తీపు) మంచి దవుతుంది.

చిత్తం శివుడిమీద, భక్తి చెప్పులమీద.

చిత్తం శివునిమీద, భక్తి పెరుమాళ్లమీద.

చిత్త ఎండకు పిట్టల తల పగులును.

చిత్తకార్తె కుక్కల్లాగా (చిత్త కుక్కలు కట్టే అదను).

చిత్తకు చిఱుపొట్ట (వరి).

చిత్త కురిస్తే, చింతలు కాయును.

చిత్త చిత్తగించి, స్వాతి చల్లచేసి, విశాఖ విసరకుంటే, అనూరాధలో అడిగినంత పండుతాను అన్నదట వరి.

చిత్త చిత్తగించి, స్వాతి చల్లగ చూచి, విశాఖ విసరకుంటే, వీసానికి పుట్టెడు పండుతాను అన్నదట జొన్న.

చిత్త చినుకు తన చిత్తమున్నచోట పడుతుంది.

చిత్త జల్లు—చిత్త [1]ఉబ్బ.

చిత్త జల్లు—స్వాతి వాన.

చిత్తరమయిన మొగుడు ఉత్తరం వేస్తే, చింతల తోపులోకి వెళ్ళి చదివించుకుంటే, ఇంకా చిత్తరంగా ఉందట!

చిత్తము చెడియుండ రిత్త ఒడలఁ జవిచేరునా?

చిత్తరువునకు జీవం వచ్చినట్లు.

చిత్తలో చల్లితే, చిట్టెడు కావు.

చిత్తలో చల్లితే, చిత్తుగా పండును—ఉలవ.

చిత్తలో పుట్టి స్వాతిలో చచ్చినట్లు.

చిత్తశుద్ధికలిగి చేసిన పుణ్యంబు కొంచమైన నదియు కొదువగాదు.

చిత్తశుద్ధిలేని శివపూజలేలరా.

చిత్త స్వాతి సంధించినట్లు (ఎక్కువ వానలు).

చిత్త స్వాతులు కురవకపోతే, చీమకు కూడ నాంబ్రం.

చిత్త స్వాతులు చిత్తగించి, విశాఖ ఒక్కవిసరు విసరితే, మొదలు తంతే ఏడుగింజలు రాలుతాయి.

చిత్రం చూడండి, చీమ గుడ్డుపెట్టింది; బూటకం చూడండి [2]బురక గుడ్లు పెట్టింది.

చిత్రప్రబంధము లల్లగలిగినవాడే కవి, అనిలో నరుక గలిగినవాడే అవనీశుడు.

1 ఉబ్బ = ఉక్క.

2 బురక = గువ్వజాతిపిట్ట.

[1]చిత్రినెలలో దుక్కి పుటంపెట్టిన (వేసిన) పుత్తడి.
[2]చిదంబర రహస్యం! (ఆకాశలింగం; ఏమీ లేదని)
చిదికి చిదికి చిన్నవాని పెండ్లి చేసేవఱకు, పెద్దవాని పెండ్లాము పెద్దలలోకి పోయిందట.
చిన[3]పేరి తాడు తెగితే, పెదపేరి తాడు అప్పుడే తెగుతుంది.
చినికి చినికి గాలివాన అయినట్లు.
చినిగిన తట్ట బరువుకు వెరుస్తుందా? [మామ!
చినిగిన వానిదే చిరుగుతుంది గాని, చాకలివాని కొడుకు చంద
చినుకులకు చెఱువు నిండునా?
చిన్న అక్కను పెద్దక్కను, పెద్దక్కను చిన్నక్కను చేసినట్లు.
చిన్న ఇల్లు కట్టుకొని, పెద్ద కాపురం చేయవలె.
చిన్న చేపను పెద్దచేప మింగితే, పెద్దచేపను బెస్తవాడు మింగుతాడు.
చిన్ననాడు లేవు, పెద్దనాడు లేవు, చంద్రశేఖరుడి నాడు చెవుల పోగులా?
చిన్ననోటికి పెద్దమాట.
చిన్నన్న గుణ్ణం చిట్లికి పోయి, పెద్దన్న గుణ్ణం పెండ్లికి పోయె.
చిన్న పామైనా పెదకఱ్ఱతో కొట్టవలె.
చిన్న పునర్వసు కార్తెలో చిట్టెడు విత్తితే గరిసెడు పండును.
చిన్న పుల్లయినా పల్లుగుచ్చ పనికివస్తుంది.
చిన్నప్పటినుంచి చింతకాయలమ్మి ఆ వంకరటింకర కాయల పేరేమి రాజా అన్నదట.

---

1 చిత్రి = చైత్రము.

2 చిదంబరము = శివతాండవములో ఆయన కాలిఅందె విడబడివచ్చి పడినచోటు అది. తమిళములో వ్యుత్పత్తి.

3 పేరి = పేరమ్మ అనుట-పేరయ్య అనగా తమిళమున శివుడని.

చిన్నమా కావలె, చిదరా కావలె, మేలిమీ కావలె, పెండా తిరగవలె!

చిన్నమ్మకు (పిన్నమ్మకు) మీసాలుంటే చిన్నాయన.

చిన్నమ్మ సిందేస్తే, చీరదారి చీరది, సింగారం దారి సింగారానిది.

చిన్నమ్మ సింహద్వారాన వస్తే, పెద్దమ్మ పెరటిద్వారాన పోతుంది.

చిన్నతాతితో ముడ్డి తుడుసుకోని, చేయంతా పీయి చేసుకొన్నట్లు.

చిన్నవాళ్లు తింటే చిఱుతిండి, పెద్దవాళ్లు తింటే ఫలహారం.

చిన్న నాపొట్టకు శ్రీరామరక్ష.

చిప్ప తెచ్చుకోరా తిమ్మా! అంటే, అట్లా చెప్పు మాయమ్మ అన్నాడట!

చిమ (మ్మ) టను చీరేమి చేసింది? చీడపురుగును చేనేమి చేసింది?

చిమ (మ్మ) ట సింగమా? గాజు రత్నమా?

చిమడకే, చిమడకే ఓచింతకాయా, నీవెంతచిమిడినా నీపులుసు పోదు.

చియ్యాబువ్వ చీకులాట, గొల్లాడువస్తే గోగులాట.

చియ్యోడొచ్చి, బువ్వోడిని తీసుకొనిపోయినట్లు.

చిఱుతపులి కడుపున పెద్దపులి పుట్టినట్లు.

చిలుం పట్టలేనివాటికి చిత్తం కుదరదు.

చిలుం వదిలి తేగాని, ఫలం దక్కదు.

చిలుం వదిలితే, ఛిద్రం (చిద్రం) వదులుతుంది.

చిలుకకు చక్కెర, చీమకు పంచదార.

చిలుకకూన బ్రహ్మాస్త్రమునకు తగునా.

చిలుక తన ముద్దేగాని, ఎదుటిముద్దు కోరదు. (ఎరుగదు)

చిలుకను పెంచి, బావురుగానికి అప్పచెప్పినట్లు.

చిలుక పంజరములో గూబను పెట్టిన ఉలుకుగాని పలుకునా.

చిలుక బోయిన పంజర మేమిచేయు.
చిలుకముక్కున దొండపండు ఉన్నట్లు.
చిల్లర దేవతలకు మొక్కి, చిత్తం చెడగొట్టుకున్నట్లు.
చిల్లర శ్రీమహాలక్ష్మి!
చిల్లి పేరే తూటు.
చిల్లి బాగాలేదని, బెజ్జం వేశాడట!
చివుకు పోవ, చేవ దొరికినట్లు.



## చీ

చీకటింటికి పోతే సిగ్గయితది అంటే, అట్లయితే సంసార మెట్లైతది?
చీకటింట్లో శివాలాడినట్లు.
చీకటి కొన్నాళ్లు, వెన్నెల కొన్నాళ్లు.
చీకటిచేత వెలుతురు రాణిస్తుంది.
చీకటి తన నల్లదుప్పటితో అందరినీ సమానంగా కప్పును.
చీకటి లేకుంటే దీపమేమిటికి?
చీకితే లేనిది, నాకితే వస్తుందా?
[1]చీకు [2]లావుకం త్రొక్కినట్లు.
చీటికి ప్రాణం ప్రాలు.
చీడ అంటుతుందే గాని, సిరి అంటదు.
చీడ సిగ్గెఱుగదు.
చీదితే ఊడేముక్కు ఎన్నాళ్లు నిలుస్తుంది? (ఉంటుంది)
చీద్రానికి (ఛీద్రము) చీరపేలు, దరిద్రానికి తలపేలు.

1 చీకు=ముసలి.
2 లావుకం=స్త్రీసంభోగ శకునం.

చీపురుకట్టకు పట్టుకుచ్చు కట్టినట్లు.

చీపురుకట్టకు సిరివస్తే, కోడిఈక గొడుగు పట్టెనట!

చీమ ఒళ్లు చీమకు బరువు, ఏనుగు ఒళ్లు ఏనుగుకు బరువు.

చీమలు చెట్టెక్కితే, భూములు పండును. (వానలుపడును)

చీమలు పాకిన రాళ్ళరుగునా?

చీమలు పెట్టిన పుట్టలు పాముల కిరవగును.

చీర కట్టినమ్మ శృంగారం చూడు, గుడ్డకట్టినమ్మ కులుకు చూడు.

చీరకు కంటె మొదలు, చిన్నవాడికి ఉపనయనం మొదలు.

చీరగట్టినమ్మ సింగారం ఏమిచూస్తావు, ఏలికలు గట్టినమ్మ ఎగిరింతలుచూడు.

చీర చిత్తారు, రవిక జల్తారు.

చీర చిరుగును, పెయ్యి పెరుగును.

చీరచేల బొంత ఎప్పుడైనా కాలవేసేదే!

చీరపోగా నాకో మొగుడు.

చీరపోతుకు సిరివస్తే గోలకొండకాడికి గొడుగు తెమ్మన్నదట.

చీరపోతు తేరివేయటం కన్నా, బొంతును కాల్చివేయటం నిమ్మళం (మేలు.)

చీర సింగారించేటప్పటికి పట్నమంతా చూర (కొల్ల) పోయిందట!

చీర సింగారించేసరికి, ఊరు మాటుమణిగింది.

చీరే స్త్రీకి శృంగారం.

[1]చీలమడిమలదాకా చీరఉంటే, మోకాలుదాకా సిరిఉంటుందనుకొన్నట్లు.

---

1 చీలమడిమ=మీగాలు కీలు.

# చు

చుక్కలూళ్ళో చక్కిలాలు.

చుట్టం ఆకలి మంచానికి కరుక.

చుట్టంగావచ్చి దయ్యమై పట్టుకొన్నాడట.

చుట్టకాలిస్తే, మాట్లాడనీయదు. (అంటే ఘాటని పైకి, మాట్లాడితే ఆరిపోతుందని లోపలికి అర్థం)

[1] చుట్టం వచ్చాడంటే, చెప్పులు ఎక్కడవదిలాడో చూచిరా అన్నట్లు.

చుట్టతాగి చూరులో పెడితే, ఇల్లుకాలి వెళ్ళవలసి వచ్చిందట!

చుట్టము చేప మూన్నాట్లకు మురుగుకంపు కొట్టును.

చుట్టమై చూడవస్తే, దయ్యమై పట్టుకున్నాడట!

చుట్టరికం, పేరంటం కలిసివచ్చినట్లు.

చుట్టాలకు పెట్టినిల్లు చూఱపోయింది, వేల్పులకు పెట్టినిల్లు హెచ్చిపోయింది.

చుట్టు అయినా, మెట్టదారి మేలు. (దారిన పొమ్మన్నారు)

చుట్టు అయినా సుఖంగా పోయేది మేలు.

చుట్టు అయిన సుళువుదారి మేలు.

చుట్టుకపోయే చాప, మూసుకుపోయే తలుపు, అలిగిపోయే పెండ్లాము. (సాతానివాని గర్భాధానం)

చుట్టుడు చాప, విసురుడు తలుపు, పెడసరపు పెండ్లాము.

చుట్టూ చూఱు మంగళం, నడుమ జయమంగళం.

చుట్టూ సుడిమంగలం, నడుమ జయమంగలం.

చుట్టూరా శ్రీవైష్ణవులే, చూస్తే కల్లుకుండ లేదు.



---

1 మగవి చుట్టమైతే ముంగిట, భార్య చుట్టమైతే వంటఇంటిదగ్గర చెప్పులు ఈడ్చురట!

# చూ

చూచింది పాము, కఱచింది మామిడిటెంక.

చూచిందెల్లా సుంకము, పాసిందెల్లా పంకము.

చూచిగాని త్రాగవలదు, చదివిగాని వ్రాలుంచవలదు.

చూచినమ్మ కళ్ళు శూలాలు, మాఅమ్మకళ్ళు పేలాలు.

చూచి మురుసుకొని, చెప్పి ఏడ్చుకొని.

చూచి రమ్మంటే, కాల్చివచ్చినాడట. (హనుమంతుడివలె)

చూచి రమ్మంటే, పెండ్లాడి వచ్చినట్లు.

చూచేవాగుంటే సొమ్ములు పెట్టాలి, చేసేవారుంటే పిల్లలుకనాలి.

చూడగా చుట్టములేదు, మ్రొక్క దైవము లేదు.

చూడగా చూడగా గుఱ్ఱం గాడిద అయిందట!

చూడను చుంచెలుక, గోడలు త్రవ్వను పందికొక్కు.

చూడబోతే చుట్టాలు, రమ్మంటే కోపాలు.

చూడబోతే చుండెలుక (చుంచెలుక) తెంచేదెమో తోలుమోకులు.

చూడబోతే వెండిగిన్నె, తాకబోతే వెలితిగిన్నె.

చూడవచ్చినవారికి శుక్రవార మేమి?

చూడవమ్మా సుతారాం! ఇంటిఆవిడ అవతారం!

[1]చూపవిదే చూపెనయ్యా సూరపరాజా.

చూపితే మానం పోయె, చూపకపోతే ప్రాణం పోయె. [గాడిద)

చూపులకు గుఱ్ఱమే కాని, చుఱుకుతనంలేదు. (చుఱుకుతనానికి

---

1 సంభావకుపోయిన యిద్దరు బట్టుకవుల (భట్రాజుల) సంభాషణ పద్యభాగమిది:

జూపల్లి ధర్మరాయం
దేపాటి ధనంబొసంగె వీరపరాజా?
పాపాత్ముం డెవ్వరికివి
చూపనిదే చూపెనయ్య సూరవరాజా। (మర్మాంగము ననుట)

చూపులకు చుంచు, పనికి పర్వతం.
చూపులకు మగడే కాని, సుఖానికి మగడు కాడు.
చూపుల పసేగాని, చేపుల పసేలేదు. (పాడిగొడ్డు)
చూరులో నిప్పుపెట్టి, కొప్పులో పెట్టనా అన్నట్లు.
చూస్తూ ఊరకుంటే, మేస్తూ పోయిందట.
చూ స్తే చుక్క, లే స్తే కుక్క.
చూ స్తే నీది, చూడకుంటే నాది.
చూ స్తే పొరపాటు, చూడకుంటే సాపాటు.
చూ స్తే సుంకం, చూడకుంటే బింకం.
చూ స్తే సూదిమాదిరి ఉంది, లే స్తే గాలిమాదిరిఉంది.
చూపులకు గుర్రమేగాని, చురుకుదనానికి దున్న.
చూరుక త్తి తెగుతుందిగాని, [1]చూపుడుక త్తి తెగుతుందా!

---

# చె

చెంత దీపమిడక చీకటిపోవునా
చెంప (జలపాలు)లు నెరసిన వెనుక, చామ (చాన) పతివ్రత.
చెంబు అమ్మి తప్పేలా, తప్పేలా అమ్మి చెంబు.
చెంబు ఎక్కడ బెట్టి మరచిపోయినావురా, అంటే నీళ్లచాయ (చెంబట్లకు) కూర్చున్నచోటికి ఇటు అన్నాడు; నీళ్లచాయ ఎక్కడ కూర్చున్నావంటే, చెంబు బెట్టిన దానికి అటు అన్నాడట.

---

1 చూపుడుక త్తి = జాతరలో పోతును నరకేటప్పుడు పైకి ఎ త్తి చూపించేది.

చెంబు కంచం పోతే, ముఖంమీద కొట్టినట్లు ముంతా మూకుడూ తెచ్చుకోలేనా ?

చెట్ట బట్టని నా భీతి, బొట్టు గట్టని కన్యరీతి.

చెట్టడచిన చేటెడన్ని, నిటలాంబక మూర్తులు. (లింగా లనుట)

చెట్టుఎక్కి కాయ పట్టిచూచి, దిగివచ్చి రాళ్లు రువ్వినట్లు.

చెట్టు ఎక్కే-వానికి ఎంతదాక ఎక్కు-డు పెట్టగలము ?

చెట్టు ఎక్కి-ంచి, నిచ్చెన తీసినట్లు.

చెట్టు ఎక్కే-వాణ్ణి ఎంతదాకా తొయ్యగలం.

చెట్టుకు (మానుకు) కరువు, కోమటికి బరువు లేవు.

చెట్టుకు చావ నలుపు, మనిషికి చావ తెలుపు.

చెట్టుకు తగిన గాలి. (ఎంత చెట్టో అంతగాలి)

చెట్టుకు పుట్టకు వరుసగాని, మనిషికేమి వరుసరా మాల నాయాల ?

చెట్టుకు మడిగుడ్డ కట్టి వున్నదిలే, దొంగ చెట్టెక్కడు అన్నదట సోమిదేవమ్మ,

చెట్టుకు విస్తళ్లు కట్టినట్లు.

చెట్టు చచ్చినా, చేవ చావదు.

చెట్టు చెడేకాలానికి కుక్కమూతి పిందెలు పుట్టును.

చెట్టు నరికి పండ్లు దానము చేయగానే సుకృతి అగునా.

చెట్టు నాటిపెట్టినవాడు నీళ్లు పోయడా !

చెట్టునాటే దొరకడు, ఫల మనుభవించే దొరకడు.

చెట్టునీడకు పోతే కొమ్మ విఱిగి పడ్డట్లు.

చెట్టును తేరా అంటే, గుట్టను తెచ్చినట్లు.

చెట్టు పట్టించి చేతులు వదలినట్లు.

చెట్టు పెరగడం మొదలు నరుకుడికే.

చెట్టుపేరు చెప్పుకొని కాయ లమ్ముకొన్నట్లు.

చెట్టును బట్టే కాయ.

చెట్టుమీదనుండి పడ్డవానికి గాయా లెన్నేమిటి !

చెట్టుమీదిది చేతికి వచ్చినట్లేగాని, ఇక తొమ్మిదయితే పదవుతాయి.

చెట్టుమీదివాడు జుట్టుమీది కెక్కు.

చెట్టుమీది విరులైనా చేతుల గోయక రావు.

చెట్టు లేని చేను, చుట్టము లేని ఊరు.

[1]చెట్టు లేనిచోట ఆముదపుచెట్టే మహావృక్షము.

చెట్టు ముదరనిచ్చి చిదిమిన పోవునా.

చెట్టు మొండి అయితే, చేరికలో వాన.

చెట్టెక్కి చేతులు విడిచినట్లు.

చెట్టెక్కుగువానికి ఆకులు చిదుమనేల !

చెడదున్ని సెనగలు చల్లమన్నారు.

చెడిందిరా పిల్ల అంటే, చేరిందిరా తెనాలి అన్నట్లు.

చెడి కాపుపొరుగు చేరు, బ్రతికి బ్రమ్మపొరుగు చేరు.

చెడి చెన్నపట్నం చేరు.

చెడిన కాపురానికి ముప్పేమిటి ? చంద్రకాంతలు వండే పెండ్లమా! అంటే, అయిన అప్పుకి అంతేమిటి ? అవే వండుతాను మగడా! అన్నదట !

చెడిన చేను చెరుకు, రాజనాలు పండునా !

చెడిన చేనుకు ఇంటివద్దు పొంగలా ?

చెడిన చేనుకు ముప్పేమిటి, మొండికాలికి చెప్పేమిటి ?

చెడిన చేను జూచి యొడయుడు మెచ్చునా.

చెడిన శ్రాద్ధం చెడనే చెడ్డది, పిత్తరా పీట పగుల.

1 నిర్వృక్ష విషయేదేశే, ఏరండోపి ద్రుమాయతే.

చెడినా పడినా, చేసుకున్న మొగుడు తప్పడు.
చెడినా సెట్టి సెట్టే, చితికినా పట్టు పట్టే!
చెడిపోయిన బ్రాహ్మడికి చచ్చిపోయిన ఆవు దానం.
చెడిపోయెపో గుడిపాడని కోడలంటే, పచ్చరాగుల పాడు పాడాయెపో–
అన్నదట అత్త. (ఇవి ఆ అత్తకోడండ్ర పుట్టినఊళ్లు)
చెడి బతికినమ్మ చేతులు జూడు, బతికి చెడ్డమ్మ చెవులు జూడు.
చెడిన బ్రతికినవాడు చెప్పుమీద కుచ్చువలె త్రుళ్లి పడును.
చెడి బ్రతికిన వాని శౌర్య మెక్కువ. బ్రతికి చెడినవానికి బడవలు ఎక్కువ.
చెడిబ్రతికిన వాని చెంపలుచూడు, బ్రతికి చెడిన వాని బట్టలు చూడు.
చెడి స్నేహితునింటికి పోవచ్చును గాని, చుట్టాలింటికి (చెల్లెలింటికి) [పోరాదు.
చెడుకాలానికి చెడు బుద్ధులు.
చెడుకాలమైన ఎవ్వరిదెస నే వికారము వచ్చునో!
చెడుచెడు అనగానే, చెడేవారు లేరు.
చెడుచెడు మనేవారేగాని, చేతిలో పెట్టేవారు లేరు.
చెడేవాడు అబ్బ డున్నాడు, మరీ పిడికెడు తేరా దానం చేస్తాం.
చెడేవాడు చెన్నిగాడు చెడుతాడు, ఇంకా చారెడు ఎగెయ్యవమ్మా!
(తా) చెడ్డవాడు వెనకయ్య (వారసు) చేతికి వెస లిచ్చినట్లు (=పాత్ర)
చెడ్డచేనుకు ఇన్ని మంచెలా?
చెడ్డచేనుకు ఇంట్లో పొంగళ్లా?
చెడ్డసొమ్ము చెరి సగం.
చెడ్డాపడ్డా చేబ్రోలే గతి.
చెడ్డాపడ్డా (శ్రీ)కాకుళమే గతి.
చెదలు కాళ్ళవాడు క్షణ మొకచోట నిలుపడు.

1 చెదలు కాళ్ళవాడు=నిలిచిన చెదలుబట్టునో అన్నట్లు ఊరక తిరుగాడువాడు.

చెన్నంపల్లి పంచాయతీ చెరిసగం.

చెప్పంత పొలము చెప్పినట్లు కొనాలి.

చెప్పక పోయినా చప్పికొమ్ముల ఎద్దునే కొను.

చెప్పటం తేలిక, చేయడం కష్టం.

చెప్పనేర్చిన మాట సెబాస్ మాట.

చెప్పింది చేయబోకురా! చేసేది చెప్పబోకురా!

చెప్పిచెప్పి చెప్పుతో తన్నించుకో, మళ్ళీవచ్చి మాతో తన్నించుకో.

చెప్పితే పాపంగాని, తిరగేసి పొడిస్తే చస్తుంది-అన్నట్లు.

చెప్పితే సిగ్గు, దాస్తే దుఃఖం.

చెప్పినంత చేసేవారు శివునికన్న వేరే లేరు.

చెప్పినకొద్దీ చెవుడు పడిపోతారు.

చెప్పిన బుద్ధీ, కట్టిన సద్దీ ఎంత కాలం నిలుచును.

చెప్పినమాట విని వచ్చేవాడిని చెవు బట్టుకొని లాక్కొని వచ్చి,
ఎదురు తిరిగిన వాడికి సాక్ష్యం బెట్టివచ్చినా.

చెప్పు కాలు నెత్తినబెట్టి శఠగోపుర మంటాడు.

చెప్పుకింద తేలు వలె.

చెప్పు కొరికినామని సిద్ధి కొరుకుతామా ?

చెప్పుటకంటె చేయటం మేలు.

చెప్పుడు మాటలకన్నా, తప్పుడు మాటలు నయం.

చెప్పుతో కొట్టి, శఠగోపం పెట్టినట్లు.

చెప్పు దినెడికుక్క చెఱకు తీపెరుగునా.

చెప్పు, పట్టుగుడ్డలో చుట్టి కొట్టినట్లు.

చెప్పులవానికి చేనంతా తోలుతో కప్పినట్లుంటుంది.

చెప్పులు ఉన్నవాడితోను, అప్పులున్న వాడితోను పోరాదు.

చెప్పులు చిన్నవని కాలు తెగకోసుకొంటారా ?

చెప్పులు ఉన్నా, చెప్పులు తెగినా చుట్ట(ట్టి)రికం తప్పదు.

చెప్పులోని రాయి–చెవిలోని జోరీగ–ఇంటిలోని పోరు.

చెప్పుడు మాటలు చేటు.

చెప్పేది చెవిదగ్గర, వినేది రోటిదగ్గర.

చెప్పేవానికి చేదస్తమయితే, వినేవానికి వివేకం వద్దా!

చెప్పేవానికి చేసేవాడు లోకువ.

చెప్పేవి నీతులు, చేసేవి గోతులు.

చెప్పేవి శ్రీరంగనీతులు, దూరేవి దొమ్మరి గుడిసెలు.

చెయ్యగానని వారికి మాటలు మెండు, చెల్లని రూపాయకు గీతలు మెండు.

చెయ్యా పెట్టాలేనాతడికి దిశ పన్నెండామడ.

చెయ్యి అలసినవేళ తెప్ప దొరకు రీతి. (ఈది అలసినప్పుడు)

చెయ్యి కాలినప్పుడల్లా కుండ వదలిపెడతామా!

చెయ్యిచూపి అవలక్షణ మనిపించుకొన్నట్లు.

చెయ్యి దాచుకుంటాము గాని, కులం దాచుకుంటామా!

చెయ్యి పుచ్చుకొని లాగితే రాలేనుగాని, ఇంటికి చీటి వ్రాశాడట!

చెరు(ఱ)కా! బెల్లం (పెట్టు) అంటే పెడుతుందా?

చెరుకు అని వేళ్ళతో పెరకకూడదు.

చెరుకు ఉండే చోటికి చీమలు తామే వస్తవి.

చెరుకుకు చెఱుపు సూలంగి.

చెరుకు కొనఏమి మొదలేమి?

చెరుకు తియ్యనని వేళ్ళతోగూడ తిన్నట్లు.

చెరుకుతోటలో ఏనుగు పడినట్లు.

చెరుకు నమలడానికి కూలి అడిగినట్లు.

చెరుకు పిప్పికి ఈగలు మూగినట్లు.

చెరుకు వంకరపోతే, తీపి చెడుతుందా?

చెఱుకుతోటలోన చెత్తకుప్పుండిన కొంచమైన దాని గుణముచెడదు.

చెఱుకుదిన్న నోరు చేదారగించునా.

చెఱుకురసముకన్న చెలిమాట తీపురా.

చెఱుకువిల్తుడు విరహిణుల పాలిటి పచ్చితురక.

చెఱపకురా చెడేవు, ఉరకకురా పడేవు.

చెఱపడానికి చేటపెయ్యా చాలును.

చెఱపడానికి చేతులు వస్తాయిగాని, నిలపడానికి మతులు రావు.

చెఱువు ఎండితే చేపలు బయటపడతాయి.

చెఱువు ఎండిపోయి చేను బీడైతే, కరణం పెండ్లానికి కాసులదండట.

చెఱువు ఓడు, ఊరు పాడు.

చెఱువుకు చేరువగాను, చుట్టాలకు దూరముగాను ఉండవలె.

చెఱువుకు నీటి ఆశ, నీటికి చెఱువు ఆశ.

చెఱువు తెగగొట్టి చేపలు వండిపెట్టగానే మాన్యుడగునా.

చెఱువు నిండితే కప్పలు చేరవా?

చెఱువును చూడబోయిన తూటితీగ (తూడు) తిరిగివచ్చునా.

చెఱువును మూకుడుతో మూయనగునా?

చెఱువును విడిచి, కాలువను పొగిడినట్లు.

చెఱువును విడిచి వరవను పొగిడినట్లు.

చెఱువుమీద అలిగి, ముడ్డి కడుక్కోకుండా పోయినట్లు.

చెఱువుమీద కొంగ అలిగినట్లు.

చెఱువుముందు చలివేంద్రయా?

చెఱువులు తెంచి, చేపలు పంచినట్లు.

చెఱువులో వున్న బట్టెను, కొమ్ములు జూచి బేరం చేసినట్లు.

చెలమకు పిట్టలు చేరినట్లు.

చెలిమాట చెఱకు ఊట.

చెలిమిని చేదు తినిపించవచ్చుగాని, బలిమిని పాలు త్రాగించలేము.

చల్లని కాసుకు గరుకులు (గీతలు) మెండు.

చల్లని కాసు-వ(ఒ)ల్లని మొగుడు.

చల్లనిదాన్ని చేనుకాడ బెడితే, అయిన కంకులన్నీ అమ్మగారింటికి పంపింది.

చల్లీ చెల్లడములకు (పుట్టచాటున) సెట్టిగా రున్నారు. (దారిదోపుడు గాండ్రతో)

చెల్లెలిమగని చూచుకొని చేయివిఱుగ బడ్డదట.

చెల్లెలి వరుస చెడి చేసుకోవాలి, తల్లివరుస తప్పి చేసుకోవాలి.

చెవి గోసిన మేక, కరింపాకు గోసే ఎరుకలవాడు ఊరకుండరు.

చెవి గోసిన మేకవలె అరుస్తాడు.

చెవిటి చెన్నప్పా! అంటే, సెనగల మల్లప్పా! అన్నాడట!

చెవిటి చెన్నారమా! అంటే, చెనిగలు పదకొండు అందిట!

చెవిటిదానా, సేసలు పట్టమంటే-బియ్యంతినిఉంటే అశుద్ధం దిన్నట్లే అన్నదట.

చెవిటిపెద్దమ్మా! చేంతాడు తేవే అంటే, చెవుల పోగులు నాజన్మలో ఎఱుగనన్నదట!

చెవిటివానికి శంఖమూదినట్లు, మూగవానికి ముక్కు గీరుకున్నట్లు.

చెవిటివాని ఎదుట శంఖం ఊదితే, అది కొరకడానికి నీ తండ్రి తాతల తరము కాదన్నాడట!

చెవిలో చెప్పిన మాటగాని, అరచి చెప్పిన మాటగాని వినదగి యుండవు.

చెవిటివానికి వినిపించాలంటే శంఖచక్రాలవాడు దిగిరావాలి.

చెవిదగ్గఱ కందురీగ (కంతిరీగ) వలె.

చెవుడు, చెవుడూ అంటే, తవుడు తవుడూ అన్నట్లు.

చెవులు కోసుక పోతూంటే, కుట్లు కాడలకు ఏడ్చినట్లు.

చెవులపిల్లి ఎదురైతే చేటు వస్తుంది.

చెవులో గుమి(బి)లికి ఏపుల్ల ఐతేనేమి గెలుకోను.

[1]చెవ్వాకు పోయినమ్మకు దుఃఖమూ లేదు, దొరికినమ్మకు సంతోషమూ లేదు.

1 చెవ్వాకు రంగుబూసిన తాటిఆకు చుట్ట. పేదలలో మునలివారు చెవులలో కమ్మలకు బదులు దీనిని పెట్టుకొందురు.

## చే

చేటనుకొట్టి పిల్లిని బెదరించినట్లు.

చేటభారతము-[1]కంపరామాయణము (పెద్దది అనుట. పూర్వం పెద్ద డెమ్మీసైజులో 1/4 లో పుస్తకాలు అచ్చువేసేవారు)

చేటలో వెలగకాయలవలె.

చేటు ఎరుగని చేడె మొగుడికి పెళ్ళిచేసిందట.

చేటుకాలమైన చెరుప నల్పుడే చాలు.

చేటుకాలానికి చెడ్డ బుద్ధులు.

చేటు మూడినప్పుడు మాటలు దోపవు.

చేటూపాటూ ఎరుగనమ్మ ఇల్లెక్కి పిండి కొట్టిందట.

చేటూపాటూ ఎరుగనమ్మ మగని పెళ్ళి కెళ్ళిందట.

చేటుకు తిని చెడితి, వాకిలి దాటి పడితి.

చేతకానమ్మకు చేష్టలు మెండు, చెల్లని రూకకు గీతలు మెండు.

చేతకానమ్మకు శౌర్య మెక్కువ.

1 కంప = తమిళకవి కంబనిది. తొడుగు అనుట.

చేతనైన మగోడు (మగవాడు) చాలాపొద్దున లేచి ఊడ్చుకొని, చల్లుకొని, ఇంకొకచోట పండుకొన్నాడట!

చేత వెన్నయుండ నేతి కేడ్చెడివారె.

చేతికలుపు-వైద్యునిచేతి తళుకు.

చేతికి అందినది వాతి కందదు.

చేతికి దొరకిన రత్నం నాచుక పోయినట్లు.

చేతికిబట్టిన జిడ్డు లెక్కకు రాదు.

చేతిచమురు భాగవతం చెప్పుకొన్నట్లు.

చేతిమల్లెపూవు గుండ్రాతికి ఓర్వజాలునా

చేతిలో ఉంటే అర్థం, చేరువలో ఉంటే పెళ్ళాం.

చేతిలో కఱ్ఱ చేదోడు, వాదోడు.

చేతిలోది లేత, చేలోది ముదురు.

చేతిలోని అన్నం చెరువులోనికివిసరి, చేయినాకి చెరువునీళ్లు తాగినట్లు.

చేతిలో లేనిది చేలోకి ఎలా వస్తుంది.

చేతిలో వెన్న పెట్టుకొని, నేతికోసం ఊరంతా వెదకినట్లు.

చేతివేళ్లు అయిదు ఒకరీతిగా ఉంటాయా?

చేతిసొమ్ము ఇచ్చి చెప్పుతో కొట్టించుకొన్నట్లు. (తిరుపతిలో వలె)

చేతులు కాలినతరువాత ఆకులు పట్టుకొన్నట్లు.

చేతులు చేయవు, నోరు తినదు.

చేతులు పొడుగని మాతులు పొడుస్తారా?

చేదతాడు (చేంతాడు) కురుచైతే బావి పూడ్చుకొంటారా?

చేదు తింటారా? చెట్టు కొడతారా!

చేనికి ఎరువు, [1]మడికి మంద.

చేనికి గట్టు, ఊరికి కట్టు ఉండాలి.

---

1 చేను = మాగాణి } రాయలసీమలో చేను అంటే మెట్ట. మడి అంటే మాగాణి.
మడి = మెట్ట. } వీరికి మాగాణిపేద్యము ఇంతవరకూ నచ్చలేదు.

చేనికి వాక రేనికి మూక.
చేనికుదురు ఆలికుదురు ఉండాల.
చేనిపంటను [1]కొయ్యగానే చెప్పుతుంది.
చేనిపంట చెయ్యగానే తెలుస్తుంది.
చేనిపంట చేరెడైనా చాలు.
చేనిలో చేను కలిసినా, స్థలంలో స్థలం కలిసినా, పోనియ్యరాదు.
చేను ఇద్దుము, పిట్టలు నల్తుము.
చేనుచేసి చెడినవాడు, మడిచేసి మనినవాడు లేడు.
చేనుచేసి చెడలేదు, చెడ్డచేసి బ్రతకలేదు.
చేను పండినా చేటఅప్పే, మొగుడుండినా మొండిమెడే!
చేను పండాలి, ఇల్లు నిండాలి.
చేను [2]బొందుపోయినా కూలి బొందుపోదు.
చేనూ, కొడవలీ నీచేత ఇచ్చినాను.
చేప అని ముసలినోట్లో చేయి బెట్టినట్లయింది.
చేపపిండు పెద్దచేపల చంపు.
చేపపిల్లకు ఈతనేర్పాలా ?
చేయని చేతులు-కుడువని నోరు.
చేయని రెక్కలు చెదలు పడతాయి, చేసినరెక్కలు సేగలు వారుతాయి.
చేయని శృంగారం-మాయని మడత.
చేయమనేదానికి చేతులు రావుగాని, వద్దనేదాన్ని వదలమంటారు.
చేయలేనమ్మకు చేతినిండా పని.
చేయలేనమ్మకు చేష్టలు మెండు, వండలేనమ్మకు వగపులు మెండు.
చేయిచేసుకోనా, చేతులు దులుపుకోనా.

---

1 కొయ్యకాలు-కొయికాలు = వరిపైరు కోయగా నేలపైన విలచిపోయిన మొదళ్ళు.
2 బొందు = వెన్నువేయక కరర పండకుండుట.

చేరడేసి గుడ్డికన్నులు బాగుగ తెరచి ఏమి తెరువక ఏమి.
చేరువపగ, దూరపునేస్తము కార్యహాని.
చేరెడు విత్తులు గోనెడయినట్లు.
చేలో గుత్తాన్ని, ఇంట్లో పెళ్ళాన్ని నమ్మరాదు.
చేలో చెంచి (చ)లాకు లేదు, ఇంటికొస్తే ఇరసెడు అనుము లిస్తా నన్నట్టు.
చేలోపత్తి చేలో ఉండగానే, పోతికి మూడు మూరలు, నాకు నాలుగు మూరలు అన్నట్లు.
చేలో పుట్టిన బీడు ఎక్కడికి పోను.
చేలో పుట్టిన మొక్క చేలో చచ్చినట్లు.
చేలో పొత్తు కళ్ళంతో సరి.
చేలో మానెడు, ఇంట్లో పుట్టెడు.
చేలో లేనిది చేతిలోకి ఎలా వస్తుంది?
చేవ దూలంలో వెదురుబ్రమోత పుట్టునా?
చేవలేనిచేను లేవలేని ఆవు.
చేసిందిపోదు, చేయంది రాదు.
చేసినంత కుడుపురా మహాదేవ.
చేసినంతా అనుభవించాలి,
చేసినచేష్టలు ఎవరూ చూడరు కాని, కోసిన ముక్కు అందరూ చూచినారట!
చేసినది జపము, వేసినది గాలము. (చేసినయది జపము వేసినయది గాలము. (సన్న్యాసివేషమున నున్న అర్జునుడు)
చేసినపాపం గోసి(చి)లో పెట్టుకొని కాశికిపోయినా కర్మం తప్పదు.
చేసినపాపం గోచిలో పెట్టుకొని కాశికి పోయినా తీరదు, కాటికి పోయినా తీరదు.

చేసినపాపం గోచిలో పెట్టుకొని కాశికిపోయి, హరహరా అన్నాడుట.
చేసినపాపం చెబితే తీరుతుంది,
చేసినపాపం చెఱగున కట్టుకొని, కాశికిపోతే కడతేరుతుందా ?
చేసిన పాపాలకు పెట్టిన దీపాలకు సరి.
చేసినమ్మ చేవ, చేయనమ్మ చెదలు.
చేసినవాడు (చేసినోడు) చేసిపోగా, నిలుచున్నోడికి నీళ్లు కారి
పోయినట్లు.
చేసినివారికి చేసినంత మహాదేవ !
చేసిపోయిన కాపురం చూచిపోను వచ్చినట్లు.
చేసుకున్న కర్మమోయి శంభులింగమా ! అంటే, అనుభవించక తీర
దోయి అబ్బులింగమా ! అన్నాడట !
చేసుకున్న తరువాత వండిపెట్టక తప్పుతుందా ?
చేసుకున్నదానికి మూసుకోను లేదు, ఉంచుకున్న దానికి ఉభయ
రాగాల చీర !
చేసుకొన్న కడుపు దించుకోక తప్పదు.
చేసేది బీదకాపురం, వచ్చేవి రాజరోగాలు.
చేసేది శివపూజ, కుడిచేది మాలకూడు.
చేసేది శివపూజ, దూరేది దొమ్మరి గుడిసె.
చేసేపని వదలి, నేసేవాని వెంట పోయినట్లు.
చేసేవి నాయకాలు, అడిగేవి తిరిపాలు, పెట్టకుంటే కోపాలు.
చేసేవి మాఘస్నానాలు, దూరేవి దొమ్మరి గుడిసెలు.
చేసేవి లోపాలు, చెప్పితే కోపాలు.
చేసేవి శివపూజలు చెప్పేవి అబద్ధాలు.

## చై

చైత్ర వైశాఖలలో పెండ్లి కావిళ్లు (సారెకావిళ్లు) శ్రావణ భాద్రపదాలలో దినం [1]కావిళ్లు.



## చొ

చొప్ప [2]వామిలో నిప్పు దాచుకొన్నట్లు.
చొల్లంగి తీర్థానికి చొడిగింజలంతేసి (మామిడిపిందెలు)



## చో

చోటే లేదంటే, మూల ఎక్కడ వెదకదును అన్నాడట!
చోద్యం సొరకాయ గుడ్డు పెట్టిందట!
చోద్యాల సోమిదేవమ్మకు [3]వాద్యారి మొగుడు.
చోళ్లు చల్లితే జొన్నలు పండునా ?
చోళ్లు విసరే తిరగలి, జొన్నలు విసరునా!
చోళ్లు విసరే తిరుగలి [4]ఆళ్లు విసరునా?



1 కావిళ్ళు = కాపలా గాయుట.

2 వామి = మేట.

3 వాద్యారి = ఉపాధ్యాయుడు (తమిళం).

4 ఆళ్ళు = అరిగకు అరుపొరలు. తిరుగలిరాళ్ళకు మట్టిబూపి అరబెట్టి విసరవలెను.

## చౌ

చౌక దూబరతిండికి కారణం.
చౌటి నేలవల్ల జలమెల్ల చెడిపోయె.
చౌడోలు గాడిదపై గట్టినట్లు.
చౌదంతి నెక్కగానే చక్రవర్తి అగునా?

## ఛీ

ఛీ! కుక్కా! అంటే, ఏమక్కా! అన్నదట!
ఛీ! ఛీ! అనేది ఈ నోరే, శివశివా అనేది ఈ నోరే!

## జ

జంగమైన వెనుక జాతినెంచగరాదు.
జంగానికి పిల్లలు పుడితే, ఊరివారిగోడు పోసుకున్నాడట.
జంగానికి బిడ్డలు ఊరికి ఉపాధి.
జంగాలపాలు దేవాంగుల విత్తము, కాపువిత్తం [1]పంజుగానిపాలు.
జంగాలో! దాసర్లో! ముందూరును బట్టి.
జగడమెట్లా వస్తాది లింగమయ్యా అంటే, బిచ్చంపెట్టవే బొచ్చుముండా అన్నాడట!
జగ బిరుదు, ముండమొప్పు!
జగమెఱిగిన బ్రాహ్మడికి జందె మెందుకు?
జడరాశిలో దాగని బడబానలమా?

1 పంజుగాడు = దివిటీలు పట్టేవాడు.

[1]జడ్డిగములోనే మిడత పోటు.

జన మర్లు జాతర మర్లు.

జనవాక్యం కర్తవ్యం.

జనుములో పాము పోతే పాతిక నష్టం.

జన్మానికంతా శివరాత్రి అన్నట్లు.

జన్నరోగికి బత్తెజొన్న పెట్టినట్లు, పిల్లి నెత్తిన వెన్న బెట్టినట్లు.

జపంవదలి, లొట్టల్లో పడ్డట్లు.

జబ్బుబలమిమీద బలాత్కార గానవినోదమన్నట్లు.

జమ్మిఆకుతో విస్తర కుట్టినట్లు.

జయ ముండేవలకు భయము లేదు.

జయాపజయంబు లెవరిసొమ్ము.

జరిగితే జల్లెడతో నీళ్ళుమోస్తారు.

జరిగేమట్టుకు జయభేరి, జరక్కపోతే రణభేరి.

జరుగుబాటుంటే, జ్వరమంత సుఖంలేదు.

జరుగుబాటు తక్కువ, అదరి(రు)పాటు ఎక్కువ.

జలుబు (రొంప, పడిశము) మందుతింటే వారం దినాలుంటుంది,
తినకపోతే ఏడుదినా లుంటుంది.

జలుబు [2]విచారణలేని జబ్బు.

జవ్వాది పూసుకొని చంక లెత్తినట్లు.

జ్వర జిహ్వకు పంచదార చేదు.



1 జడ్డిగము=విత్తులు వేయుటకు గొర్రుపై కట్టిన చట్టముపై పెట్టు రంధ్రాల కొయ్యపిడత.

2 విచారణ=పరామర్శ; మందలింపు.

## జా

[1]జాణకు మూడుతావు లంటును. [మేమి?

జాణలకు పురాణాగమశాస్త్రవేదజప ప్రసంగ[2]త్రాణకల్గి ప్రయోజన

జాతికొద్దీ బుద్ధి, కులంకొద్దీ ఆచారం.

జాతినాగుల చంపుతూ, ప్రతిమనాగులకు పాలుపోసినట్లు.

జాబు వ్రాసిపెట్టమంటే, కాళ్ళు నొప్పులంటే; వాటితో పనేమంటే, నేనురాసింది నేనే చదవాలన్నాడట.

జామాతా దశమోగ్రహః.

జారతోడి పొందు చావునకే యగు.

జారితే పడమన్నారు, జరిగితే (సాగితే) పడమన్నారు.

## జి

జింకకన్నీరు వేటగానికి ముద్దా.

జింకకు కొమ్ములు బరువా?

జిలిబిలి పలుకుల వెలది [3]నకారగుళ్ల పాలైనట్లు.

జిల్లేడు పూలకు తుమ్మెద లాశించినట్లు.

జిల్లేళ్ళకు మల్లెలు పూయునా?

జివ తక్కువ జీత మెక్కువ.

జిహ్వ కొకరుచి, పుర్రె కొకబుద్ధి.

జిహ్వచేత నరులు చిక్కినొచ్చిరిగదా.

---

1 జాణ = నాజూకు గాడు.

2 త్రాణ = శక్తి.

3 నకారగుళ్ల = 'వి'-వియోగులు.

## జీ

జీతంబత్తెం లేకుండా తోడేలు గొఱ్ఱెలను కాస్తానన్నదట!
జీతంలేని నౌకరు, కోపంలేని దొర.
జీతగాడికి, నేతగాడికి చావులేదు.
జీతగాడు అతగాడైనట్లు.
జీలకఱ్ఱ సింగినాదం.
జీలకఱ్ఱలో కఱ్ఱలేదు, నేతిబీరలో నేయిలేదు.
[1]జీలుగు (జీలగ) పెరిగిన [2]మాలెకు కంబము కాదు.
జీలుగు బెండ్లు చెవుల పెంచుతాయి గాని, కుండలాలిస్తాయా?
జీవరత్నాన్ని ఇత్తడిలో పొదగితే రత్నానికేమి లోటు.
జీవితమొక వ్యాధి, నిద్రావస్థ ఉపశమనము, మరణమే ఆరోగ్యము.

## జు

జుట్టుంటే ఎన్ని జడలైనా వేయవచ్చును.
జుట్టుకాలి ఏడుస్తుంటే, చుట్ట నిప్పడిగినట్లు.
జుట్టువున్న అమ్మ ఏ కొప్పయినా పెట్టవచ్చు.
జొన్న రుచి వెన్న కబ్బునా.

1 జీలుగ = బెండుచెట్టు. మెత్తనిది.
2 మాలె = మిద్దె.

## జె

జెముడుకు కాయలూ లేవు, నిలువ నీడా లేదు.
జేముడు కంచెకు శ్రేష్ఠం, రేగడ చేనికి శ్రేష్ఠం.

## జే

జేనెడు ఇంట్లో మూరెడు కఱ్ఱ.
జేనెడు దొరకు మూరెడు బంటు.
జేనెడు పిట్టకు మూరెడు తోక.
జ్యేష్ఠ చెడకురియును, మూల మురుగ కురియును.

## జై

జైనవాని చేతి పేనువలె. (చంపడనుట)

## జొ

జొన్న పెరిగితే జాడు, వరి పెరిగితే వడ్లు.

## జో

జోగీ జోగీ రాసుకుంటే, బూడిద రాలిందట!
జోడులేని బ్రతుకు - త్రాడులేని బొంగరము.
జోరీగల గొడ్డుకు, గోరోజనం మెండు.
జోలి పల్కులు తీసేలోగా బిక్షపువేళ తీరిపోయిందట!

## ట

టంకం పెట్టిన గుడిసె దెబ్బకొడితే వడిసె.

టంగుటూరు పెద్దమాలను తగవు తీర్చమంటే, తనకు ఇద్దరున్నారన్నాడట!



## టా

టాటోటుగాడికి దధ్యన్నం, విశ్వాసపాత్రుడికి సద్దెన్నం.



## టెం

టెంకాయచెట్టెందుకు ఎక్కినావురా? అంటే, దూడగడ్డి కన్నాడట, గడ్డి చెట్టుపైన ఉంటుందా? అంటే, లేదు కాబట్టే దిగి వస్తున్నా నన్నాడట కాయలదొంగ.

టెంకాయచెట్టుకు మడిగుడ్డ కట్టగానే దొంగకడ్డమా ?



## డ

డంబము ఎప్పుడూ పూవులు పూయుచుండునే గాని కాయలు కాయదు.

డబ్బిచ్చి చెప్పుతో కొట్టించుకొన్నట్లు. (తిరుపతి)

డబ్బు ఇచ్చి తేలు కుట్టించుకొన్నట్లు.

డబ్బు ఇవ్వనివాడు పడవ ముందర ఎక్కును.

డబ్బు ఉంటే, కొండమీద కోతిగూడా దిగివస్తుంది.

డబ్బుకు ప్రాణానికి లంకె.
డబ్బుకు వచ్చినచెయ్యే వరహాకు వస్తుంది.
డబ్బు (దస్తు) దస్కం లేదు గాని, డవాలు బంట్రోతు.
డబ్బు పాపిష్టిది.
డబ్బు ముడ్డిలో దేవుడున్నాడు.
డబ్బురాని విద్య దరిద్రానికే.
డబ్బు లేనివాడు డబ్బుకు కొరగాడు.
డబ్బు లేనివాడికి బోగముది తల్లివరుస.
డబ్బు సభ కట్టును, ముద్ద నోరు కట్టును.
డబ్బుబుట్టు డాలుకత్తి, చూరులోన చూరుకత్తి.

## డా

డాగుపడిన పండు బాగులేదందురు. (అందనిపండు పులుసు)
డాబుసరి బావా! అంటే, డబ్బులేదు మరదలా అన్నాటట.

## డి

డిందుపడినవాని సెంమును లెక్కింపరు.

## డూ

డూడూ బసవన్నా అంటే, తలూపినట్లు.

## డొం

డొంకలో దాగితే, పిడుగుపాటు తప్పుతుందా ?

డొంకలో షరాబున్నాడు, నాణెము చూపుకోవచ్చును అన్నాడట,
దొంగలచే జిక్కినవాడు.



## డౌ

[1]డౌలు దస్తు, పెండ్లాము పస్తు (గ్రామాధికారి స్థితి)

[2]డౌలు చూపితే, దరిద్రం పోతుందా ?



## ఢి

ఢిల్లీకి ఢిల్లే, పల్లెకు పల్లే.

ఢిల్లీపాచ్ఛా కూతురైనా పెండ్లికొడుకుకు లోకువే.

ఢిల్లీకిపోయి ఉల్లిగడ్డ తెచ్చినట్లు.

ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే.



---

1 డౌలు = ఒక గ్రామానికి నిర్ణయమైన భూమిసిస్తు.
దస్తు = వసూలు చేసిన పైకము ఖజానాకు చెల్లించుట.

2 డౌలు = డంభము, డాబు.

## త

తంగేటి [1]జుంటిని దాప ఎందుకు. (దాచుకొందుకు?)
తంగేడు పూచినట్లు.
తంటాలమారి గుఱ్ఱానికి తాటిపట్ట [2]గొఱపము.
తండ్రి ఓర్వని బిడ్డను తల్లి ఓరుస్తుంది.
తండ్రిగదా! అని తలాటి కీడ్చినట్లు.
తండ్రిచస్తే పెత్తనం తెలుస్తుంది, తల్లిచస్తే కాపురం తెలుస్తుంది.
తండ్రి తవ్వించిన నుయ్యి అని, దానిలో దూకవచ్చునా?
తండ్రిని చంపబోయిన పాపం, అత్తవారింటికి పోయి, అంబటికట్ట తెగేవఱకు ఉంటే పోవును.
తండ్రి వంకవారు దాయాదివర్గమే.
తండ్రిసేద్యం, కొడుకువైద్యం కూడు మధ్యం.
తంతే దూదిపరుపుమీద పడ్డట్లు.
తంతే బూర్ల (గారెల) గంపలో పడ్డట్లు.
తంబళి అనుమానం తలతిక్కతో సరి.
తంబళి తన లోటలోటేగాని, ఎదుటి లోటలోట ఎఱుగడు.
తంబళ్ళఅక్కయ్య మోసుమూడి వెళ్లనూవెళ్ళాడు, తిరిగిరానూ వచ్చాడు.
తక్కువజాతికి (వానికి) ఎక్కువ కూడైతే తిక్కతెగులు.
తక్కువనోములు నోచి, ఎక్కువ ఫలం రమ్మంటే వస్తుందా?
తక్కువవాడికి నిక్కెక్కువ, తవ్వెడు బియ్యానికి పొంగెక్కువ.
తక్కువవానికి నిక్కులు లావు.

---

1 జున్ను = తేనెతుట్టె.

2 గొఱపము = కోసుడు దువ్వెన.

తగపండిన పండు తనంతతానే పడుతుంది.

తగవుచెప్పు ధర్మరాజా! అంటే, దూడా బర్రె నాదే అన్నాడట!

తగవు ఎట్లావస్తుంది జంగందేవరా అంటే, బిచ్చంపెట్టవే బొచ్చు ముండా అన్నాడట.

తగవున ఓడినా, ముదిమిని చచ్చినా బంది లేదు.

తగినట్లు కూర్చెరా తాకట్లమారి బ్రహ్మ.

తగిలించుకోవడం సులభం, వదలించుకోవడం కష్టం.

తగిలినకాలికే తగులును, నొగిలినకొంపే (ఇల్లే) నొగులును.

తగుదాసరికీ, మెడపూసలకీ, అమ్మకన్న కాన్పుకూ, అయ్యఇచ్చిన మనవుకూ సరి.

తగునే కలికుట్లును జంక పాత్రమున్!

తగులుకొన్న మొగుడు, తాటిచెట్టునీడ నిలుకడ లేనివి.

తట్టలో కాపురం బుట్టలోకివచ్చె, బుట్టలో కాపురం బూడిదలో కలిసె.

[1]తట్టుకు [2]తగాడినట్లు.

తట్టెడు గుల్లల కొక దుడ్డుపెట్టు.

తడిక కుక్కకు అడ్డంగాని మనిషికి అడ్డమా?

తడ(డి)క కొంపలో దీపాలు వెలుగవా?

తడ(డి)కగట్టి గోడను తన్నరాదు.

తడక తీసినవాడిదే తప్పు.

తడపకుండా తెంచే అచ్చనకంటె తడిపి తెంచే బుచ్చన కొంత మేలు.

తడిక దాసరివలె. తడి(డ)క-చిత్తూరుజిల్లాలో ఒకగ్రామము. ఇందు పూర్వ మొకయోగి ఉండి మహిమజూపినాడట. వ్యంగ్యార్థంలో గూడ ఉపయోగింతురు; డస్సుకోటస్ అన్నట్లు.

1 తట్టుకు=నడుస్తున్నప్పుడు కాలికి తగిలే చిన్నదెబ్బ.

2 తగాడు=తగవుచెప్పు. (న్యాయం తీర్పుచేయు)

తడిక [1]దొబ్బింది ఎవరంటే ఆలులేనివాడు అన్నట్లు.

తడికలేని ఇంట్లో కుక్క దూరినట్లు.

తడిగుడ్డలతో గొంతు కోసినట్లు.

తడిగుడ్డలో పేలాలు వేయించినట్లు.

తడిసిగాని గుడిసెకట్టడు, (కప్పడు) తాగి(కి)గాని మొగ్గడు.

తడిసిగాని గుడిసె వేయడు, తగిలికాని ఎత్తుచేయడు.

తడిసిన తక్కెడ, ఎండిన ధడా.

తడిసిన (మంచపు) కుక్క బిగిసినట్లు.

తడిసి ముప్పందుము మోసినట్లు.

తడిసి ముప్పందుము మోసేకంటే, తడవక పందుం మోసేది మేలు.

తణుకుపోయి మాచారం వెళ్ళినట్లు. (చుట్టుదారిన పోవుటకు)

తత్కళచాతురి తాళఫల ప్రమాణముల్.

తత్సమయానికి తడియుసుకే సరి-అని, పలుదోమినట్లు.

తద్దినం కొని తెచ్చుకొన్నట్లు.

తద్దినంనాటి జందెం వలె.

తద్దినం పెట్టేవాని తమ్మునివలె.

తద్దినానికి తక్కువ, మాసికానికి ఎక్కువ.

తద్దినానికి భోజనానికి పిలిస్తే, రోజూ మీఇంట ఇట్లాగే జరగాలని దీవించాడట!

తనఅన్నం తాను తింటూ, తనగుడ్డ తాను కటుతూ ఊరికి భయపడవలెనా?

తన కంట్లో దూలం బెట్టుకొని, పరులకంట్లో నలుసు లెంచినట్లు.

తనకంపు తనకింపు, ఒకరికంపు ఓకరింపు.

తనకంపు తనకింపు, పెఱకంపు తను జంపు.

1 దొబ్బింది=తీసింది, నెట్టినదనుట.

తన కలిమి ఇంద్రభోగం, తన లేమి స్వర్గలోక దారిద్ర్యం, తనచావు జలప్రళయం-అనుకొన్నట్లు.

తనకాళ్లకు తానే మొక్కుకొన్నట్లు.

తనకు అని తవ్వెడు ఉంటే, ఆకటివేళకు ఆరగించవచ్చు.

తనకుకానిది గూదలంజ. (బోడిముండ)

తనకు కాని రాజ్యం పండితేనేమి ? మండితే (ఎండితే) నేమి ?

తనకు గాని ఆలు దానవురాలురా.

తనకుచెప్ప తడికల చాటు, ఒకరికిచెప్ప ఒప్పులకుప్ప.

తనకు తోచకున్న మోకాటుతోనైనా ఆలోచించమన్నారు.

తనకు పాసినవెంట్రుకలు ఏరేవులో పోతేనేమి ?

తనకు బుట్టినిల్లు తనరు కైలాసంబు.

తనకుమాలిన ధర్మం మొదలు చెడ్డబేరం.

తనకు ముక్తిలేదు తలపులు మెండైన

తనకు రొట్టె, ఇతరులకు ముక్క.

తనకులేక తంటాలు పడుతూంటే, తొంటికాళ్ల పిల్లి వెంటపడ్డట్లు.

తనకులేదని ఏడ్చి ఒకకన్నుపోతే, ఎదుటివారికున్నదని ఏడ్చి ఇంకొక కన్ను పోయిందట!

తన కొంగున కట్టినరూక, తన కడుపున పుట్టినబిడ్డ.

తనకోపమే తన శత్రువు.

తన గుణము మంచిదయితే, సానివాడలోగూడ కాపురం చేయ వచ్చును.

తన గుద్దకింది నలుపు గురిగింజ కేమి తెలుసు ?

తనగుద్దకు కాకుంటే, కాశిదాకా దేకమన్నారు.

తనగుద్ద గాయంకాకుంటే తాటియీసెలకు ఎదురుదేకమన్నారు.

తనచల్ల పుల్లనిదని తానే జెప్పుకుంటాడా?

తనచావు జలప్రళయము. (After me the deluge)
తనచేయి కాలుతుందని, సవతిబిడ్డ చేతితో కలియబెట్టిందట.
తనతనయ ప్రసవవేదనకోర్వలేకుంటే, తనయల్లునిపై అహంకార
తనతప్పు తప్పుకాదు, తనబిడ్డ దుడుకుకాదు. [పడనేల.
తన తలుపుతీసి పొరుగింటికి పెట్టి, రాత్రంతా కుక్కలను తోలుతూ
కూర్చున్నట్లు.
తనదని తవ్వేడు తవుడున్నా ఆకటివేళ తినవచ్చు.
తనదాకా వస్తేకాని, తలనొప్పి బాధ తెలియదు.
తనదూడ పొదుగుకుమ్మి, పాలుదాగితే ఊరుకుంటుంది గాని,
పరాయిదూడ పాలుదాగితే ఊరుకుంటుందా?
తనదాకావస్తే తగవే లేదు.
తనది తాటాకు, ఇవతలవాళ్ళది ఈతాకు.
తన దీపమని ముద్దుపెట్టుకొంటే మూతిమీసాలన్ని కాలినాయట.
తనదుకాలిగోయ తనతమ్ముడేడ్చునా.
తనదు మేలుకీడు తనతోడ నుండురా.
తననీడ తప్పితే, తరుగునొకవన్నె.
తననీడ తనవెంటనే ఉంటుంది.
తననీడ తానే తొక్కుకున్నట్లు.
తనకట్ట త్రాళ్లు తానే తెచ్చుకొన్నట్లు.
తననోటికి తవుడులేదు, లంజనోటికి పంచదారట!
తనపిల్ల గంజికేడిస్తే, లంజపిల్ల దాని [1]రేక కేడ్చిందట.
తనపుట్టి [2]పిచ్చగా ఉంటే, పొరుగుపందుంతో [3]అపరాలు కొలిచి
నాడట.

---

1 రేక = తాటిఆకుతో కట్టిన పెద్దదొప్ప.
2 పిచ్చ = తక్కువకొలతగలిగిన కొలపాత్ర.
3 అపరాలు = కాయధాన్యాలు.

తన పెరటిచెట్టు మందుకు పనికిరానట్లు.

తన బలిమికన్న స్థానబలిమి మిన్న.

తనబుద్ధి మంచిదయితే, [1]లంజగేరిలో ఇల్లు కడితేనేమి?

తనభార్య విరహావేదన జారు డెరుగునా.

తనలో తప్పు లేకపోతే, గురువుతో గుద్దులాడవచ్చును.

తనముడ్డి కాకపోతే గంగదాక దేకమన్నట్లు.

తనముడ్డి(కి) కాకపోతే తాటిపట్టుకు ఎదురు దేకమన్నట్లు.

తనయుని పుట్టుక తల్లి యెఱుగును.

తనవారి కెంతగలిగిన తనభాగ్యమే తనది.

తనవారిని ఎఱుగని మొట్టి తెడ్డున్నదా?

తనవారు లోతుకు తీతురు, కానివారు కడకు (గట్టుకు) తీతురు.

తన వాసి తప్పితే తన వన్నె తరుగుతుంది.

తన సొమ్ము అయినా దాపుగా తినవలె.

తన సొమ్ము అల్లం, పెరవారి సొమ్ము బెల్లం.

తనసొమ్ము కాసుబెట్టడుగాని పరులసొమ్ము హరింప (కాజేయ) బ్రహ్మకాయ.

తన సొమ్ము తను దిని, తన బట్ట తను కట్టి, సావట్లో వానితో చావు దెబ్బలు తిందట!

తన సొమ్ము సోమవారం, మందిసొమ్ము మంగళవారం.

తను గాక తన కొకపిల్లట!

తనువు తాను కాదనువానికి తపసుచేయనేల.

తనువులు నిత్యంకావు మావారిని ఓలిపైకం ఖర్చుపెట్టవద్దని చెప్ప మన్నట్లు.

తనువు వెళ్ళినా దినము వెళ్ళదు.

---

1 లంజగేరు = నాగవాసం. బోగమువాడ.

తన్ని తల్లే గుంజుకుపోతే, చెప్పున కొట్టి చిప్ప తెచ్చుకోవాలి.
తన్ని తే తల బగులుతుందంటే, కొడితే కొప్పెర పగలాలి అంటాడు.
తన్నితే పోయి బూరెల గంపలో పడినట్లు.
తన్ను గట్ట తాళ్లు తానే దెచ్చుకొన్నట్లు.
తన్ను తప్పించి, ఆకాశమంత పిడుగు పడమన్నట్లు.
తన్నుదాపాగడుకొంటే, తన్నుకొని చచ్చినట్లుంటిది.
తన్నే కాలికి రోలు అడ్డమైనట్లు.
తపము పండినమీాద జడలు తాల్చడ మెందుకు?
తప్పతాగి కులము మఱచినట్లు.
తప్పించబోయి తగిలించుకొన్నట్లు.
తప్పుచేసినవానికి, అప్పుచేసినవానికి ముఖం చెల్లదు.
తప్పుడు దండుగకు తలో యింత.
తప్పులు వెదకేవాడు, తండ్రి ఒప్పులు వెదకేవాడు, ఓర్వలేనివాడు.
తప్పులెన్నువారు తండోపతండాలు.
తప్పులెన్నువారు తమ తప్పు లెరుగరు.
తప్పు లేనివానిని ఉప్పులో వేయమన్నట్లు.
తప్పు లేనివారు ధరణిలో లేరు.
తప్పూ ఒప్పూ దైవ మెఱుగును, పప్పూ కూడూ బాపడెఱుగును.
తప్పెట కొట్టినవాడు దాసరి, శంఖ మూదినవాడు జంగము.
తప్పెట కొట్టినా పెండ్లే, చప్పెట కొట్టినా పెండ్లే!
తమ తమ నెలవులు దప్పిన తమ మిత్రులె శత్రులగుట.
తమలంలో సున్నమంతటివాడు-తక్కువైనా ఎక్కువైనా బెడదే!
తమ వంశగౌరవాన్ని గుర్తించుకొననవి గాడిదలు మాత్రమే.
తమాం లేకున్నది తల్లిపిల్లలే పరిహాస మాడుకుంటారు.
తమాం లేదంటే, తవ్వోడైనా ఇవ్వమన్నట్లు.

తము(మ)లపాకుతో తా నిట్లంటే, తలుపు చెక్కతో నే నిట్లంటి.
తము(మ)లము వేయని నోరు, కమలము లేని కోనేరు.
తమ్ముడు తనవాడైనా, ధర్మం సరిగా చెప్పవలె.
[1]తరవాణి తల్లి.
[2]తరి ఉంటే, వరి అంటారు.
తరి పట్టినకఱ్ఱ, చెరపట్టిన కుఱ్ఱ.
తరి మెడకు ఉరి.
తఱిమి చల్లితే తవ్వెడే.
తలంత బలగమే గాని, తలలో పెట్టువారు లేరు.
తల ఊపినందుకు తంబూరబుఱ్ఱ యిచ్చిపొమ్మన్నట్లు. (పాటకునితో)
తలకాయ లోపలికి దూర్చిన తాబేలు వలె.
తలకింది కొఱవి వలె.
తలకు చెప్పు లడిగినట్లు.
తలకు దాకకున్న తనకేమి తెలియదు.
తలకు దారి లేదు, బుడ్డకు అటకలి!
తలకు మించిన శిక్ష, గోచికి మించిన దారిద్ర్యం లేవు.
తలకు వచ్చిన బాధను తలపాగ మోసినట్లు.
తలకోసి ఇచ్చినా పుచ్చకాయ అనేవాడు.
తల కోసి ముందర పెట్టినా, గారడివిద్యే అన్నట్లు.
తల కోసుకుపోగా తమ్మపోగుల కేడ్చినట్లు.
తలగడ కింద త్రాచుపాము వలె.
తలగడ తిరుగ వేస్తే, తలనొప్పి తీరునా?
తల గొట్టేవానికైనా మూడు మనవు లుంటాయి.

---

1 తరవాణి = పుల్లనీళ్లు, కలికుండ.

2 తరి = మాగాణి, మబ్బు.

తల గొరిగించు కొన్నతర్వాత తిథి నక్షత్రం చూచినట్లు.
తలగోసి ముల వేసినట్లు.
తలచినప్పుడే తాత పెళ్ళి.
తల చుట్టం, తోక పగ.
తలతడవి బాసచేసినా వెలయాలిని నమ్మరాదు.
తల తడిపినమట్టుకు గొరికి తీరవలె.
తల తిరిగి ముద్ద నోటికి వచ్చినట్లు.
తల దన్నేవాడు పోతే, తాడి దన్నేవాడు వస్తాడు.
తలదాచుకొన చోటిచ్చిన వానికే తావు లేకుండా చేసినట్లు.
తల నరకడంలో, ముల నరకడంలో తారతమ్యమేమిటి?
తల నరుకువానికి [1]తలవా రిచ్చినట్లు.
తలనొప్పి తగిలిందని తలగడ మార్చినట్లు.
తల పడేచోటికి కాళ్లు యీడ్చుకు పోవును.
తలపాగా చుట్టలేక తల వంకర అన్నట్లు.
తలప్రాణం తోకకు వచ్చినట్లు.
తలబ్రాలకు తద్దినాలకు ఒకే మంత్రమా?
తలబ్రాలనాటి త్రాడు తాను పోయిననాడే పోతుంది.
తల మాసిన వాడెవడంటే, అలి(లు) చచ్చినవాడు అన్నట్లు.
తలరాత (వ్రాత) తప్పించుకో రానిది.
తలరా తేగాని, తనరాత ఎక్కదు.
తలలు బోడులైన తలపులు బోడులా?
తలలు బోడులైన దక్కునా తత్త్వంబు.
తలలో నాలుక, పూసలలో దారము వలె.
తల వంచుకొంటే, ఏడు గోడలచాటు.

---

1 తలవారు = పెద్దకత్తి. (తల్వార్-హింది)

తలవరిదగు పోందు తలతోడ తీరురా.

తల విడిచి మోకాలికి బాసికం కట్టినట్లు.

తల వెంట్రుకలంత బలగమున్నా తలకొరివి పెట్టే దిక్కు లేదు.

తల వెంట్రుక లున్నమ్మ ఏకొప్పు అయినా పెట్టవచ్చు.

తలా తోక లేనికత, ముక్కూ మొగము లేని పిల్ల.

తలారి దుప్పటి రెడ్డి బహుమానం చేసినట్లు.

తలారి పగ తలతో తీరును.

తలారి రుమాలు రెడ్డి [1]చదివించినట్లు.

[2]తలుగు తెంచుకొన్న బఱ్ఱె, తాడు తెంచుకున్న గుఱ్ఱం.

తలుగు దొఱికిందని ఎనుమును కొన్నట్లు.

తలుగుపెట్టి తంతూ ఉంటే, కొలువుపెట్టి కొలచినట్లు.

తలుచుకొన్నపుడే తలంబ్రాలు కావాలంటే ఏలాగు?

తలుపుపెట్టి చెబుతుంటే [3]కొలుపుపెట్టి అడుగుతారు.

తలుపులు మింగేవానికి అప్పడాలు లొటలొట.

తలుపోకరింటికి దీసిపెట్టి తా కుక్కలు దోలినట్లు.

తలుపేల చాప గుడిసెకు?

[4]తలుము-తక్కువవాడు పనికిముందు వంగి, పని కాగానే నిగుడు కొంటాడు.

తల్లి అయినా ఏడవందే పాలివ్వదు.

తల్లి ఓర్చనిది దాది ఓర్చునా?

తల్లి కడుపు చూచును, పెళ్ళాం వీపు (జేబు) చూచును.

1 చదివించుట = శుభకార్యములలో కానుకలర్పించుట.

2 తలుగు = పలుపు.

3 కొలుపు = పశుబలిలేని జాతర; గలబా.

4 తలుము = ఏతము.

తల్లి కడుపులో చొరకముందు దయ్యాల దేవత, భూమిలో పుట్టిన
　　తరువాత యమదేవత.
తల్లికి కాకపోతే [1]తిల్లికకు దణ్ణం పెట్టమన్నారు.
తల్లికి కానివాడు దాదికవునా?
తల్లికి కూడుపెట్టనివాడు తగుదునని తగవు తీర్చ వచ్చాడట!
తల్లికి కూడుపెట్టనివాడు తగవు చెప్పేడు, (చెప్పును) పెళ్లానికి
　　చాలనివాడు పెత్తనం చేసేడు (చేయును.)
తల్లికి కూడుపెట్టనివాడు, పినతల్లికి చీరపెట్టేడట.
తల్లికి కొట్టరా వసంతం అన్నట్లు.
తల్లికి తగినబిడ్డ, ఇంటికి తగిన పందిరి.
తల్లికి తప్పినవానికి పినతల్లి తప్పుఫమానం. (తప్పుమర్యాద)
తల్లికి బొల్లి ఉంటే, పిల్లకు చుక్కయినా ఉంటుంది.
తల్లికి లేని ముద్దు దాదికి కలుగునా?
తల్లికి వంచ గలిగిన, పిల్లకు [2]బొక్క కలుగుతుంది.
తల్లికొద్ది బొల్లి కోడె.
తల్లి గండము పిల్లగండం ఉన్నది కాని, మధ్యన మంత్రసానికి గండ
　　మున్నదా?
తల్లిగల లంజను తగులుకొనుటే తప్పయా.
తల్లిగారింటినుంచి వచ్చిందని కుక్కమూతికి సద్దికట్టిపంపుతారా?
తల్లి గూనిదైతే తల్లిప్రేమ గూనిదౌతుందా.
తల్లిగుణము కూతురే బయటపెట్టుతుంది.
తల్లిచచ్చినా మేనమామఉంటే చాలు.
తల్లి చనిపోతే తండ్రి పినతండ్రితో సమానము.
తల్లి చస్తే కడుపు పెద్ద, తలలు మాస్తే కొప్పు పెద్ద.

---

1 తిల్లిక = దీపము.

2 బొక్క = మూలగ ఎముక.

తల్లి చస్తే తీరంబాసె, తండ్రి జడిస్తే ఋణంబాసె.

తల్లి చస్తే నాలుక చచ్చినట్లు, తండ్రి చస్తే కళ్లు పోయినట్లు.

తల్లి చాలు పిల్లకు తప్పుతుందా?

తల్లి చెవులో మద్దికాయలు దండుగలకు, భార్య మెడలో పూసలు బందుగులకు (భోగాలకు)

తల్లి చెవులు తెంపినవానికి, పినతల్లి చెవులు బీరపువ్వులు.

తల్లి చేను మేస్తే, పిల్ల మేర మేస్తుందా?

తల్లి చేలో మేస్తుంటే, దూడ గట్టున మేస్తుందా?

తల్లి తర్పణానికే తక్కువైతే, పినతల్లికి పిండప్రదానమట!

తల్లిదండ్రి లేనిబాల తననాథునే కోరును.

తల్లిదండ్రులు అన్నదమ్ములున్నా పొలతికి పురుషుడు కొరవే.

తల్లిదే వలపక్షం, ధరణిదే వలపక్షం.

తల్లి దైవము, తండ్రి ధనము.

తల్లిని చూచి పిల్లను, పల్లును చూచి పశువును కొనవలె.

తల్లిని చూచి పిల్లను [1]తరిని జూచి బర్రెను.

తల్లిని చూచి పిల్లను, పాడిని (పొదుగును) చూచి బర్రెను.

తల్లిని తిట్టకురా నీయమ్మానాయాల అన్నట్లు.

తల్లిని నమ్మినవాడు, ధరణిని నమ్మినవాడు చెడడు.

తల్లిని బట్టి పిల్ల, విత్తును బట్టి పంట.

తల్లినిబట్టి బిడ్డ, నూలునుబట్టి గుడ్డ.

తల్లి పాలు దూడ చెప్పును.

తల్లి పిత్తి, పిల్లమీద బెట్టిందట.

తల్లి పిల్ల వన్నెకాదు, వండిపెట్ట దిక్కులేదు.

తల్లి పుట్టిల్లు మేనమామ వద్ద పొగడినట్లు.

---

1 తరి = వెన్న ఎక్కువగా కలిగినపాలు. (అది తరిగల్ల పసరము.)

తల్లి పుస్తి బంగారమైనా, అగసాలి దొంగిలించకుండ లేదు.

తల్లి పెంచవలె, ధరణి పెంచవలెగాని, పెరవారు పెంచుతారా!

తల్లి పైచేయిజాచు తగు [1]పంటలల్లూరు.

తల్లి మాటలేగాని పెట్టుమాత్రం పినతల్లిది. (సవతితల్లిది)

తల్లి ముఖం చూడని బిడ్డ వానముఖం చూడని పైరు.

తల్లిమీాది కోపం పిల్లమీాద పోతుంది.

తల్లిలేక పెరిగి ధాత్రి నేల్లేలెరా.

తల్లిలేని పిల్ల—ఉల్లిలేని కూర.

తల్లిలేని పిల్లలు, అల్లులేని తీగలు.

తల్లిలేని పుట్టిల్లు, ఉల్లిలేని కూర.

తల్లి విషం, పెండ్లాం బెల్లం.

తల్లి వెనుక మేనమామ అన్నారు.

తల్లి సారం పిల్ల, దాకసారం సక్కు.

తల్లిలేని పిల్ల దయ్యాల పాలు.

తల్లీ బిడ్డా ఒకటయినా, నోరు కడుపు వేరు.

తల్లె కొట్టినా పెండ్లే, తప్పెట కొట్టినా పెండ్లే.

తల్లే రోసిన, దాది రోయదా?

తవిటికి ఎచ్చిన చెయ్యి ధనానికి వస్తుంది.

తవుటికి అంకాడబోగా కూటితపిలె కోతిగొంపోయినట్లు.

తవుడు తాతా! అంటే, నూకలా ముసలమ్మా? అన్నట్లు.

తవుడు తింటూ ఒయ్యారమా?

తవుడు తిని చచ్చేవానికి విషం పెట్టేవాడు వెట్టి.

తవుడు నోముపట్టిన అమ్మకు తరగని ఐదవతనము.

---

1 పంటలల్లూరు=నెల్లూరు కోవూరు తాలూకాలో చాలపెద్దగ్రామము. మాగాణి హెరాళము.

తవుడు బొక్క తహసీల్దారుడు, మీసా లెగబట్ట [1]మాసూలు దారుడు.
తవుడు బొక్కినంతవరకే దక్కినట్లు.
తవ్వగా తవ్వగా తథ్యం తేలుతుంది.
తవ్వి మీద తోసుకున్నట్లు.

1 మాసూలుదారు=రైతులదగ్గర ధాన్యరూపకంగా శిస్తు వసూలుచేయు ఉద్యోగి. మహసూల్‌పదము పారసీకము. ఇప్పుడు మహసూలు అంటే-కుప్పలు నురిపి, ధాన్యము ఇంటికి చేర్చుకొనుట అని వ్యవహరింపబడుచున్నది.

## తా

తాకట్ల మొగుడా! తంటాల మొగుడా! నీ తనువుండగానే నన్ను
మనువిచ్చి పోరా!
తాకబోతే తగులుకొన్నట్లు.
తాకినకాలికే [1]బుడుసు(పు), తెగిన తాటికే [2]ముడుసు.
తాకిన వ్రేలుకే తట్టు తగులుతుంది.
తాకితే తగరు, ఈనితే గొర్రె.
తాకి నేలకు తడిబ(బొ)ట్టు కానీదు, వంగి నేలకు ఇంగువ కానీదు.
[3]తాకి మొగ్గి తడిసి గుడిసె కప్పు.
తాకి మ్రొగ్గిన తనువంత ఒకటి, దీపము నులిపిన [4]దినుసంత ఒకటి.
తాగటానికి దప్పిక (గంజి) లేదుగాని, గుంటడికి గుండుజోడు.
తాగనేరని పిల్లి బోర్ల పోసుకున్నట్లు.

1 బుడుసు=బొబ్బ.
2 ముడుసు=ముడి.
3 తాకి=అనుభవంగలిగి.
4 దినుసు=పదార్థము.

తాగబోతే దప్పికకు లేదు, తలకు [1]ఆటకలి.

తాగబోతే మజ్జిగ లేదంటే, పెరుగుకు చీటి వ్రాయమన్నాడట!

తాగితేగాని మొగ్గడు, తడిస్తేగాని కప్పడు.

[2]తాగినదుక్కి తప్పక పండును.

తాగినవాడి తప్పుకు తగవు లేదు.

తాగినవాడు తప్పినవాడు ఒకటే!

తాగిన వానిదే పాట, సాగిన వానిదే ఆట.

తాగినవాని మాట దబ్బర గాదు.

తాగిన రొమ్మే గుద్దినట్లు.

తాగుటకు ముందు, వ్రాతకు వెనుక చూడవలె.

తాగుబోతు తోడు కోరుతాడు.

తాగేది దమ్మిడి గంజాయి, ఇల్లంతా చెడ ఉమ్ములు.

తాగేవాడే తాళ్ళపన్ను కట్టుతాడు.

తాగేది గంజైనా స్నానమాడి తాగు; కట్టేది చింపైనా ఉతికికట్టు.

తాచుపాము తామసము, జెట్టిపోతు పిరికితనము గలవాడు.

తాజెడ్డకోతి వనమెల్ల చెఱచె.

తాజెడ్డ ధర్మం, మొదలు చెడ్డ బేరం.

తాటంత వానిని తలదన్ను వా డుంటాడు.

తాటాకు చప్పుళ్ళకు కుందేళ్లు బెదరునా?

తాటికాయ తింటావా? తలకొట్లు పడతావా?

తాటికాయ వన్నె తప్పుడిది. (శరీరవర్ణము)

తాటిచెట్టు ఎక్కాలేవు, తాటిగాల కొయ్యాలేవు, తాతా నీ కెందు కోయ్ పెండ్లాము.

---

1 ఆటకలి=తలస్నానానికి మేలైన చమురు.

2 తాగిన=నీరు బాగా పీల్చిన.

తాటిచెట్టుకింద పాలుతాగినా కల్లే అంటారు.
తాటిచెట్టు నీడ నీడగాదు, తగులుకొన్న ముండ పెండ్లాముకాదు.
తాటిచెట్టు నీడ నీడకాదు, తగులుకున్నవాడు మొగుడుకాదు.
తాటిచెట్లకు గంధం పూసినట్లు.
తాటోటుగాడికి దధ్యన్నం, విశ్వాసపాత్రుడికి గంజన్నము (గంజి కూడు).
తాటిఎత్తు ఎగిరినా నంటే, తాటాకు(చు)ప్పెత్తు ఎగురు అన్నట్లు.
తాడి ఎక్కేవాడిని ఎంతదాక ఎగసనదోస్తారు.
తాడికి తలబంటి అయితే, (వె)ఎంపలికి ఎంతబంటి? అన్నట్లు.
తాడి తన్నువానిని తలతన్నే వాడుకూడ ఉంటాడు.
తాడు అని ఎత్తి పారేయకూడదు, పాము అని దాటనూ కూడదు.
తాడుకు పట్టలేదు, తలుగుకు పట్టలేదు, గుంజ కెందుకమ్మా గుంజ లాట?
తాడు తెంచను ముహూర్త మెందుకు?
తాడుతో దబ్బనము.
తాడూ లేదు, బొంగరమూ లేదు.
తాడు లేకుండా బొంగరం తిప్పేవారు.
తాత కట్టిన చెరువని దూకుతారా?
తాతకు దగ్గులు నేర్పినట్లు.
తాతతాత! తంగేడుపుల్ల, ధు(ద)సినీ యుక్క, కుందేలు పిల్ల.
తాత దిన్న బొచ్చె తరతరా లుంటురా.
తాత పోతే బొంత నాది.
తాడు తెగిన గాలిపటం (ఇష్టం వచ్చినట్లు తిరుగును).
తాడు లేకుండా, బొంగరం ఆడించేవాడు.
తాతను చూపుతావా? తద్దినం పెడతావా?
తాతలనాటి బొచ్చె తరతరాలకు.
తాతలనాటి మూకుడు తరతరాలు మనాల అన్నట్లు.
తాతలనాడు నేతులు తాగాం, మూతులు వాసన చూడు.

తాతాచార్ల తద్దినానికి, పీర్ల పండుగకు ఏమి సంబంధం?

తాతాచార్యులవారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు.

తాతాచార్యు లేం చేస్తున్నారంటే, తప్పులు (వ్రాసి) చేసి దిద్దుకొంటున్నారు.

తాతా! పెండ్లాడుతావా? అంటే, నా కెవ రిస్తారురా అబ్బాయి అన్నాడట!

తాతా! సంక్రాంతిపట్టు పట్టు.

తాతా! సంధ్య వచ్చునా? అంటే, ఇప్పుడు చదువుకొన్న నీకే రాక పోతే, అరవై ఏళ్ళక్రింద చదువుకొన్న నాకు వచ్చునా? అన్నాడట.

తా త్రవ్విన గోతిలో తానే పడతాడు.

తా దిన తవుడు లేదు. వారాంగనకు వడియాలట.

తా దూర సందు లేదు. మెడ కొక డోలు అన్నట్లు.

తా నడ్డైదె కూడ [1]నానబాల కేడ్చిందట.

తాను ఆడుదై నానబ్రాలు కేడ్వావలెనా?

తాను ఉండేది దాలిగుంట పట్టు, తలచేవి మేడమాళిగలు.

తాను ఎఱుగని కల్ల లేదు, తల్లి ఎఱుగని కులం లేదు.

తాను ఒకటి తలిస్తే, దైవ మింకొకటి తలచినట్లు.

తాను గాక పిల్లి కూడానా?

తాను చావడం జగం క్రుంగడ మనుకొన్నదట ఒకనక్క.

తాను చేసిన పాపం తనువుతో, తల్లి చేసిన పాపం ధరణితో.

తాను చొక్కమైనట్లు, తడక భద్రమైనట్లు.

తాను దూరనే కంత లేదు. మెడ కొక డోలా?

తాను దొంగై, ఇంటిపై అనుమాన పడినట్లు.

1. నానబాలు=బియ్యం నానబెట్టి బెల్లం కొబ్బెర కలిపితిను తినుబండారము.

తాను దొంగై తే, ఇరుగు పొరుగును నమ్మడు.

తాను దొంగై తే, పరులను నమ్మడు,

తాను పతివ్రత అయితే, సానిఇంట కాపురముంటే మాత్ర మేమి?

తాను పెంచిన పొట్టేలు తనచేతనే చచ్చినట్లు.

తాను పెంచిన పొట్టేలు తన్నే తఱిమి పొడిచినట్లు.

తాను బట్టిన కుందేటికి మూడే కాళ్లు.

తాను మింగేదాన్ని, తన్ను మింగేదాన్ని చూచుకోవలె.

తాను మెచ్చ తినాలి, ఒకరు మెచ్చ నడవాలి.

తాను మెచ్చింది రంభ. తాను మునిగింది గంగ.

తానే తుమ్మి, తానే దీవించుకొన్నట్లు.

తానే తుమ్మి, తానే శతాయుస్సు అనుకొన్నట్లు!

తానే సెట్టి అంటే, మూడే గిద్దలంటాడు.

తానె సెట్టి అంటే, మూడే సోలలు అమ్మినాడట!

తానై మాగని కాయ, తంతే మాగునా?

తానొకటి తలచిన దైవ మొకటి తలచు.

తాపుల గొడ్డుకు గోడ్డమా?

తా బెట్టుకోనిది భిక్షమా!

తా బోతూ [1]బొల్లెద్దుకు ఈడితి అన్నట్లు.

తా బోతే తౌడు దొరకదు కాని, రాయరా సన్నాలకు చీటి అన్నాడట!

తా బోతే మజ్జిగ చుక్కకు గతిలేదు, చీటివస్తే పెరుగు పంపుతారన్నట్లు.

తామరాకుపై నీటిబొట్టు వలె.

తామసంబు నెంచు ధరలోన నధముండు.

---

1 బొల్లెద్దు = తెల్లమచ్చల ఎద్దు.

తాయితులకే పిల్లలు పుడితే, తా నెందుకు ?

తార్చినదానికి టంకము, వెళ్ళినదానికి ఏగాని.

తాలిమి తన్నూ కాచును, ఎదరినీ కాచును.

[1]తాలుకంకి గింజలోయి దాసరీ! అంటే, రాలినవటికే గోవిందా! అన్నాడట!

తాలువడ్లకు నీళ్ల కల్లుకు సరి.

తాళపుచెవి లేక తలుపెట్టు లూడురా.

తాళము నీవద్ద, చెవి నావద్ద.

తాళ(చెవి)ము పోయినంతమాత్రాన పెట్టె తెరువలేమా.

తాళి తెంచను శుభలగ్నం కావాలనా ?

తాళిబొట్టు బలంవల్ల తలంబ్రాలు వరకు బ్రతికినాడు.

తాళ్లకు తలబంటి అంటే వెంపలికి ఎంతబంటి అన్నట్లు.

తాళ్లకు తలను చండ్లు, మేకలకు మెడను చండ్లు.

తాళ్ళపాక [2]చిన్నన్న రోమములు కాగానే తంబురా దండెకు తంతు లగునా.

తాళ్ళపాకవారి కవిత్వం కొంత, తన పైత్యం కొంత.



1 తాలు = నీళ్లులేక ఎండిపోయిన పరి కర; అదివేయు తరకగింజల వెన్ను.

2 తాళ్ళపాక అన్నమాచార్యుల బంధువు.

తి

తింటే ఆయాసం, తినకుంటే నీరసం.

తింటే కదలలేను, తినకపోతే మెదలలేను.

తింటేగాని రుచి తెలియదు, దిగితే గాని లోతు తెలియదు.

తింటే గారెలు తినవలె, వింటే భారతం వినవలె.

తింటే బఠాణ, వింటే అఠాణ (రాగం).

తింటే భుక్తాయాసం, నడిస్తే మార్గాయాసం.

తింటే నారసం, తినకపోతే నీరసం.

తింటే మీగడ తినాల, వింటే బేగడ వినాల (రాగం).

తిండికి ఏనుగు, పనికి పీనుగ.

తిండికి చేటు, నేలకు బరువు.

తిండికి తిరాణా లేదు, ముండకు బులాకీ అట.

తిండికి తిమ్మరాజు, పనికి పోతురాజు.

తిండికి తీటకు మేర లేదు.

తిండికి పిడుగు, పనికి బడుగు.

తిండికి ముందు [1]కోపు, పనికి వెనుక కోపు.

తిండికి ముందు, దండుకు వెనుక.

తిండికి ముందెత్తు, పనికి వెనకెత్తు.

తిండికి లేకపోయినా తిక్క కేమిలోటు.

తిండికి వచ్చినట్టా ? తీర్థానికి వచ్చినట్టా ?

తిండి చింత, దండి చింత.

తిండిబోతు సంగతి పెండ్ల మెరుగు.

తింత్రిణీక మహిమ తినువా డెరుంగును.

---

1 కోపు = పార్శ్వము, ప్రవేశము.

తిండిలేనమ్మ తిరునాళ్లకు పోతే, ఎక్కడిగా సరిపోయింది.
తిక్కపిల్ల తీర్థంపోతూ, అక్కమగని వెంటబెట్టుకు పోయిందట!
తిక్కపిల్లా! తిక్కపిల్లా! మా అక్కపిల్లను చూస్తివా అంటే, చూస్తి-
శుక్రవారమని కావలించుకొంటి, మాటలాడుదామంటే
మఱచిపోతి అన్నదట!
తిక్కలవాడు తిరునాళ్లకు పోతే, ఎక్కడిగా ఏడునాళ్లు పట్టిందట.
తిట్టకురా తొత్తుకొడుకా! అన్నట్లు.
తిట్టబోతే అక్కబిడ్డ, కొట్టబోతే [1]వేకటి మనిషి.
తిట్టితే చచ్చినవాడు లేడు, దీవించితే బ్రతికినవాడూ లేడు.
తిట్టితే కోపం, కొట్టితే నొప్పి.
తిట్టితే గాలికి పోతవి, తింటే లోనికి పోతవి.
తిట్టు కొక శృంగారమా!
తిట్టే నోరు కొ(కు)ట్టినా ఊరకుండదు.
తిట్టే నోరు, తినే నోరు, తిరిగే కాలు ఊరకుండవు.
తిత్తికాసులు జెల్లె, తిరునాళ్ల జెల్లె.
తినక చవి, చొరక లోతు తెలియవు.
తినకుండ రుచులు, దిగకుండ లోతులు తెలియవు.
తిన కూటికి దారిలేదు గాని, తనవారికి తద్దినాలట.
తినగతినగ వేము తియ్యనై యుండు.
తినగలఅమ్మ తిండి తీర్థాలలో బయట పడుతుంది.
తినగా తినగా గారెలు చేదు.
తినబెట్ట మంటే, వినబెట్ట మన్నట్లు.
తినబోతూ రుచు లడిగినట్లు.
తిన నేర్చినమ్మ పెట్ట నేరుస్తుంది.

---

1 వేకటిమనిషి = గర్భిణి.

తినమంటే పులివల్లదు.

తిన మరిగిన కుక్క రేవు కాసిందట!

తిన మరిగిన కుక్క అలమరిగి చచ్చిందట!

తిన మరిగిన కోడి [1]అలమరిగిన దట!

తినమరిగిన కోడి ఇల్లెక్కి కూసిందట!

తిన మరిగిన ప్రాణం అల్లాడి చచ్చిందట.

తిన మరిగినమ్మ వరిమడి దోవ పట్టినట్లు.

తినా కుడువా తీర్థం పోవాలి, తిండికి మాడ పెండ్లికి పోవాలి.

తినా లేదు పట్టా లేదు బొట్టన్నా పెట్టుకో.

తిని ఉండలేను, తీసి బొంత వెట్టు

తిని ఉండలేక, తాగి బొందను పడినట్లు.

తిని కుడవ వలె, ఋణాలు పోవలె, పని జేయ పెండ్లికి పోవలె.

తినేకూటిలో మన్ను పోసుకొన్నట్లు.

తినేది కుడిచేది తిమ్మక్క, మోసుకు తిరిగేది ముత్తక్క.

తినేది కుడిచేది (పెట్టేది) రెడ్డిసాని, (కనేది) [2]కట్టేది గుడ్డిపోలి.

తినేది గొడుమాంసం, చేసేది దేవతార్చన.

తినేవరకు ఆకలి కుటు, తిన్నతర్వాత దండికట్టు

తినేవి తిప్పకాయలు, వెళ్ళగక్కేవి వెలగకాయలు.

తిన్న ఇంటి వాసాలు (లెక్కపెట్టు) ఎంచుతావేమిరా? అంటే, పొరుగింటి సంగతి నాకేమి తెలుసు అన్నాడట.

తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టినట్లు.

తిన్న ఇల్లు గుద్దలించావేమిరా? అంటే, తినని ఇంట్లోకి రానిస్తారా అన్నాడట.

---

1 అలమరగు = అలమటించు

2 కట్టుట = పశువుల గర్భధారణ.

తిన్న కుక్క తినిపోతే, కన్నకుక్కను కట్టేసినారంట.

తిన్న కుక్క తినిపోతే, కన్నకుక్కకు కాలు విరుగ గొట్టినట్లు.

తిన్నవాడే మన్నవాడు, మన్నవాడే మహారాజు.

తిన్నోడికి తిండిపెట్టడం, బోడిగుండోడికి తలకు బోయడం సులభం.

తిప్పులాడీ! మా అవ్వను చూచినావా? అంటే, తీర్థంలో మా బావను చూచినావా? అన్నదట!

[1]తిమ్మన్న బంతికి తియ్యని చారు-అన్నము.

తిమ్మన్న బంతికి ధమ్మంటారు కాబోలు.

తిమ్మన్నా! తిమ్మన్నా! నమస్కారమంటే, నాపేరు నీకెలా తెలిసింది అంటే, నీముఖం చూడగానే తెలిసింది అన్నాడట!

తిమ్మిని బ్రహ్మి, బ్రహ్మిని తిమ్మి చేసినట్లు.

తియ్యగా తియ్యగా రాగం, మూల్గగా మూల్గగా రోగం.

తియ్యటి తేనెనిండిన నోటితోనే తేనెటీగ కుట్టేది.

తిరిగి ఆడది, తిరుగక మగవాడు చెడుదురు.

తిరిగితే వరిపొలం, తిరుగకపోతే అడవిపొలం.

తిరిగి రైతు, తిరుగక బైరాగి చెడుతారు.

తిరిగివచ్చిన భార్య, [2]తిరుగబోత (తిరుగమాత) వేసినకూర బహు రుచి.

తిరిగే కాలు, తిట్టే నోరు ఊరుకోవు.

తిరిపం పెట్టే అమ్మను మగనితోపాటు పెట్టమన్నట్లు.

తిరిపపుకూడు [3]బర్కతులేదు, తిన్నవలుకు నమ్మికలేదు.

తిరిపపు మజ్జిగకు వచ్చి, పాడిగేదెను బేరమాడినట్లు.

తిరిప మొత్తేపానికి పెరుగన్నం కరవా?

1 తిమ్మన్న = తిరుమలఅన్న-వేంకటేశ్వరుడు; కోతి.

2 తిరుగుబోత-తిరుగమాత = పోపు.

3 బర్కతు = కలిసివచ్చుట.

తిరిపెపు అనుభవం తమి దీరదు.

తిరిపెపు తిండి తింటే, మిట్టచేనుకు ఒడ్డు వేసినట్లుండాల. (ఎగదన్ని ఉండును)

తిరిపెమున లేమి తీరుతుందా.

తిరునాళ్ళకు (తీర్థం) పోతూ తీసి పొమ్మన్నారు. పెండ్లికి పోతూ పెట్టుకో పొమ్మన్నారు.

తిరుగనేర్చినవాడు ధీరుడై యుండురా.

తిరుగ మరిగిన కాలు, తిన మరిగిన నోరు ఊరుకోవు.

తిరునాళ్ళకు పోయివచ్చిన మొగంమాదిరి (అలసి సొలసి వచ్చును)

తిరుపతికి పోగానే, తురక దాసరికాడు.

తిరుపతిలో పుట్టగానే దున్న గోవింద అంటుందా?

తిరుమణి పెట్ట నేరిస్తే తీర్థాలు గడచినట్లు.

తిరుమలయ్య సలహా, తిరుపతి వెంకన్న మ్రొక్కు.

తిలాపాపం తలా పిడికెడు.

---

## తీ

తీగంటి (తీగవంటి) బిడ్డంటే, తెగ తెమ్మని ఏడ్చినదట!

తీగ కదిలిస్తే, పొదంతా కదులుతుంది.

తీగకు కాయ బరువా?

తీగ పెట్టినమ్మ మాట తీయగా, కమ్మ పెట్టినమ్మ మాట కమ్మగా, విచ్చుటాకులున్నమ్మా! నీమాట విన సహించదు అన్నదట.

తీగై వంగంది, మానై వంగుతుందా?

తీటగలవానికి, తోటగలవానికి తీరిక ఉండదు.

తీటబట్టినవాడే గోక్కుంటాడు.

తీటమ్మా! తీటమ్మా! నీ నోస లేమయ్యింది అంటే, తిరుమణి పెడితే పొక్కింది అందిట!

తీట సిగ్గెరుగదు.

తీతువపిట్ట కాళ్లు తలక్రిందులుగ పెట్టి, ఆకాశం పడకుండా చూస్తూన్నా నందట! (పట్టుకోనున్నా నందట.)

తీతువపిట్ట రాయబారం. (దుశ్శకునం.)

తీపి ఏదంటే-ప్రాణం!

తీపునంటి ఈగ తెగువతో సీల్గును.

తీపుల మాటలకు వీపులు గుంజుతవి.

తీయగా తీయగా రాగము, మూల్గగా మూల్గగా రోగము.

తీయడం పెట్టడం తీపులచేటు కనటం కూచోవటం నొప్పులచేటు.

తీయనినోర చేదు మేసినట్లు.

తీరుతీరు గుడ్డలు కట్టుకొని, తిరునాళ్ళకు బోతే, ఊరికొక గుడ్డ ఊసిపోయిందట.

తీరోటి (తీరైన) మొగమని తిరిపానికి బోతే, తడవిచూశాడట.

తీర్థము స్వార్థము కలసివచ్చినట్లు.

తీర్థయాత్రతోడ దివ్యుండు కాడయా.

తీసినవారు బాగానే ఉంటారు, తీయించుకున్నవారు బాగానే ఉంటారు, ఎదురైనవారికి తగులుతుంది ఎదురుమిత్తి.



## తు

తుంగభద్రలో మునుగను తాతం భట్టాక్షా!

తుంగలో పిత్తితేమి? తూటాకులో పిత్తితేమి!

తుంటిమీద కొడితే నోటిపళ్లు రాలాయట!

తుప్పరల పసేగాని, మంత్రాల పసలేదు.

తుట్టెపురుగుకు రెక్కలు వచ్చినా, ముసలివాడికి ప్రాయం వచ్చినా పట్ట పగ్గాలుండవు.

[1]తుడుము కాడి(డ)నుంచి దేవతార్చనదాకా ఒకటే మాట.

తుడుము మొదలు దేవతార్చనదాకా ఒకేమాట (మంత్రం).

తునను దండుగనిడి మొదలు చెడు నరుండు.

తుద దాకొన లోక విరుద్ధ వృత్తముల్.

తుపాకీ కడుపున ఫిరంగి పుట్టినట్లు.

తుమ్మ ఉన్నచోటనే కమ్మ ఉండును. (ఈ చెట్టుకు రేగడి చాల అనువైన నేల, అట్లే కమ్మవారు రేగడ పొలమును కోరుదురని. రెడ్లు ఎఱ్ఱనేలను కోరుదురట.)

తుమ్మగుంటలో యిచ్చి పోగొట్టుకొన్నవాడు, దండిగుంటలో యిచ్చి గొట్టుకొన్నవాడు లేడు. (నెల్లూరు జిల్లాలో ద్రావిడ బ్రాహ్మణులుండే గ్రామాలు)

తుమ్మ తోపుల్లో కొత్తకోలాటం,

తుమ్మ దుద్దువలె, కాపు కదురువలె.

తుమ్మితే ఊడిపోయే ముక్కు ఎన్నాళ్లుంటుంది?

తుమ్ముకు తమ్ముడు లేడుగాని, ఆవలింతకు అన్న ఉన్నాడు.

తుమ్ము తమ్ముడై చెప్పు.

తుమ్మెద లాడితే వాన తప్పదు.

తురక ఎంత గొప్పవాడైనా, ఇంటికి పేరు లేదు, తలకు జుట్టు లేదు, మొలకు తాడు లేదు

---

1 తుడుము - ఒకపాటి నగారా, తోలునద్దితో మ్రోగింతురు

తురక కరక భేదికారులే కాని, మొదటిది దగ్గరకు వస్తేనే చాలు, రెండోది లోపలికి పోవాల.

తురక కొట్టవస్తే [1]చుక్కెదురని కదలకుంటారా!

తురకదయ్యము మంత్రించినట్లు.

తురక దాసరికి ఈత మజ్జిగ.

[2]తురక మెచ్చు, గాడిదతన్ను సంకటమే.

తురకలలో మంచి ఎవరంటే, తల్లి కడుపులో ఉన్నవాడు, గోరీలో ఉన్నవాడు.

తురకల సేద్యం. [3]పెరికల పాలు.

తురకలు (తప్పించుకొనిన) [4]ఈదులలో, మేకలు తప్పించుకొంటే తుమ్మలలో.

తురకలేని ఊళ్ళో దూదేకలవాడే ముల్లా.

తురకవాడకు గంగెద్దుపోతే, కోసుకొని తిన్నారట.

తురకవీధిని సన్యాసి భిక్షవలె.

తురకవీధిలో విప్రునికి పాదపూజ చేసియేమి చేయకేమి?

తురకా దూదేకుల పొత్తులో మురిగీ మర్దార్.

తురకా (బ) మరకా తిరగేసి నరకా.

తురాయి పెట్టినవాడి కొలువు, పరాయివాడి పాన్పు.

తులము నాలుకకు తొంభై రుచులు.

---

1 చుక్కెదురు=శుక్రుడు. పొడిచివున్న దిక్కున పయనము కారాదు.

2 తురక=ఒక నవాబు ఒక బ్రాహ్మణుని విద్యకు మెచ్చుకొని తలకు పూలదండ చుట్టమన్నాడు. ఆయన బోడితలలో దండ నిలువనందున తలలో మేకు దిగగొట్టి దండ తగిలించమని. అట్లే చేయగా ఆనందించినాడట.

3 పెరికెల=విశాఖపట్టణ ప్రాంతాన ఒకజాతి.

4 ఈదులు=ఈతచెట్ల బీడు.

తులసి కడుపున దురదగొండి పుట్టినిల్లు.
తులసికోటలో ఉమ్మేసినావేమిరా! అంటే, యజ్ఞవేదిక అనుకున్నాను అన్నాడట!
తులసివనములో గంజాయి మొక్కవలె.
తులువ నోటికి ఉలవపప్పు.
[1]తువ్వాన వేసిన ఎరువు, బాపనికి పోసిన నెయ్యి.
తుళ్ళే ఎద్దే గోనె మోసేది.

## తూ

'తూ' అంటే, బలా అన్నదంట.
తూగి ముందుకు పడదు, తాగి వెనకకు పడదు.
తూట్లు మూసి, తూములు తెరచినట్లు.
తూనీగలాడితే తూమెడు వర్షం. (వాన)
తూమెడు వడ్లు తూర్వార (న) బట్టేటప్పటికి ఏదుమువడ్లు ఎలుకలు తినిపోయినవి.
తూర సందు లేదు, తోడ నొకడోలు.
[2]తూరిన డేగేటు (వేటు), విడిచిన కోలేటు (కోల) తప్పవు.
తూరిన గద్ద దెబ్బ, నీటిపట్టు పులి దెబ్బ తప్పవు.
తూరుపు తలాపి (తలదాపి) దున్నపోతు గూడా పెట్టదు.
తూరుపు తొమ్మిది, పడమట పది.
తూర్పున ఇంద్రధనుస్సు, దూరాన వర్షం.

---

1 తువ్వ=చాల సన్నటిమట్టి.

2 తూరుట=ఆకాశంనుండి భూమికి మహా వేగంతో దిగి, హఠాత్తుగా పైబడి మరల ఎగిరిపోవుట.

తూర్పున ఇంద్రధనుస్సు వేస్తే తుంగమడిలోను, పడమర ఇంద్ర ధనుస్సు వేస్తే బండమీదను పశువులను కట్టాలి.
తూర్పున [1]కొఱ్ఱువేస్తే, దుక్కిటెద్దు అంకె వేస్తుంది.
తూర్పున [2]తెరవేసింది, తుంగఛత్రలో దొడ్డికట్టరా గొల్లడా.
తూర్పున ధనుస్సువేస్తే, తుంగగడ్డకూడ తడవదు, పడమట వేస్తే, పల్లాలన్నీ (పెంటగుంటలన్నీ) నిండుతవి.
తూర్పున వరదగూడు వేస్తే తుంగపోచయినా తడవదు.

## తృ

తృణము మేరువు, మేరువు తృణము.

## తె

తెంపులతాళ్లు, చిల్లుల కడవ.
తెగబలిసిన ఆబోతెద్దు తా నెక్కడు, ఇంకొక దానిని ఎక్కనీయదు.
తెగించి దానం చేస్తాను తేరా పిడికెడు వడ్లు అన్నట్లు.
తెగించినదానికి సగుడు మోకాలిబంటి.
తెగించినవాడికి తెడ్డేలింగం, విడిచినదానికి వీరేశలింగం.
తెగితే లింగడు తాయి. (శివలింగముస్థానభ్రష్టమైతే రాయితో సమానమనుట)
తెగిన చేను తేమ నోర్చును.

1 కొఱ్ఱు = ఇంద్రధనుస్సు. 2 తెర = వరదగూడు.

తెగినప్రేలికి సున్నంగూడా పెట్టడు.
తెగువవారికి తేలు కుట్టితే తెల్లవార్లు కోడికూసిందట!
తెగువ దేవేంద్ర పదవి.
తెగేదాకా బిగించకూడదు (లాగరాదు.)
తెచ్చుకుంటే భోంచెయ్యి జగన్నాయకా! లేకుంటే ఊరకుండు లోకనాయకా!
తెచ్చుకొన్నచద్ది, తెచ్చుకొన్నవాడిని తినని స్తే మన కమ్మతన మెందుకు కాల్పనా.
తెడ్డుండగా చేయి కాల్చుకున్నట్లు.
తెడ్డు ఉండగా చేతితో తాకనేల.
తెడ్డు ఏదీ? అంటే, కొయ్య ఏదీ అన్నట్లు.
తెడ్డుకేమి తెలుసు కూరల రుచి?
తెడ్డునాకి, వ్రతం చెడగొట్టు కొనినట్లు.
తెనుగు తేట, అరవం అధ్వాన్నం.
తెరవాటుగాడు కట్టినబట్టలాగిన మానభంగమని మానునా.
తెర్లు వదలిన జీడలు వదులుతాయి.
తెలకపిండి తిన్నా కుక్క తోకాడించక మానదు.
తెలగాణ్యపు టెక్కు, నియోగపునిక్కు (నియోగినిక్కు)
తెలికవానికి నువ్వు పండినట్లు.
తెలియని దయ్యముకన్న, తెలిసినదయ్యం మేలు.
తెలిసినవారెదురైతే మనిషి పండ్లికిలిస్తాడు, గుఱ్ఱం సకిలిస్తుంది.
తెలివి ఒకరిఅబ్బ సొమ్మా తోట సుబ్బమ్మా?
తెలివి ఒకరిసొమ్మా గొల్ల గురవమ్మా?
తెలివికి తలలేకపోయినా, భోజనానికి పొట్టఉంది.
తెలివి మూలం, తెచ్చెర ఘోరం.

తెలివిగలిగిన పెండ్లాం తెల్లవారినతర్వాత వేడ్చిందట.

తెలివిగలిగినవాళ్ళను తెలివిగలవాళ్ళదగ్గరకు పంపి నన్ను నీదగ్గరకు [పంపినారు.

తెలివితక్కువ, ఆకలి ఎక్కువ.

తెలివిలేని పట్టుదల పొయ్యిలో ఇమడని నిప్పు, కళ్లెంలేని గుఱ్ఱం.

తెలిసి తెలిసి బొందను పడ్డట్టు.

తెలిసినవానికి తెలికపిండి, తెలియనివానికి గానుగపిండి.

తెలిసినవారికి ముందరనే ఉన్నది మోక్షం.

తెలిసేవఱకు బ్రహ్మవిద్య, తెలిసినతర్వాత కూసువిద్య.

తెల్లగుఱ్ఱపు [1]శాదవ, నగిరికొలువు కష్టము.

తెల్లగుఱ్ఱాన్ని [2]పల్లనం చేసినట్లు.

తెల్లనివన్నీ పాలా? నల్లనివన్నీ నీళ్లా?

తెల్లబియ్యము, పాటి మానిక.

తెల్లవారితే ఎల్లవారమ్మల బ్రతుకు ఒకటే.

తెల్లవారిన సంగతి నీకెట్లా తెలిసింది అని, ఒక రసికుడడిగితే-బయటికి పోవాల్సివచ్చింది-అన్నదట పల్నాటిసీమ పడుచు; దీపం వెలవెల బారింది-అన్నదట పాకనాటిసీమ వెలయాలు; తాంబూలం అరుచి అయింది-అన్నదట నెల్లూరు నెఱజాణ.

తెల్లవారి లేచినందుకు దోవ తప్పినందుకూ సరి.

తెల్లవార్లు (తెల్లవార్రులు) సరసాలాడి తేరకంటే, నా మొగుడను కొంటానుపో అన్నదట. (జంకుటాలు)

తెల్లవార్లు సరసాలాడినా గొల్లవాడే పుట్టె.

తెల్లారితే చూడు ఎల్లాయి బతుకు.

---

1 శాదవ = (చాదవ) చాకిరి.

2 పల్లనం = జీనువేసి సిద్ధపరచుట; (మాలీసుచేయుట)

## తే

[1]తేభ్య మెక్కడ తెత్తునయ్యా! తెల్లవారింది.
తేన అంతా ఒకచోట తెట్టెఅంతా ఇంకొకచోట.
తేనె ఉన్నచోట ఈగ లుంటాయి.
తేనెగూర్చియీగ తెరువరులకు నీడ.
తేనటీగ తేన తెరవరి పాలు.
తేనెటీగలకు తీరుబడి లేనిపని.
తేనె తీసినవాడు చేయి నాకకపోవునా?
తేనెతుట్టె పున్నానికి పూజ, అమావాస్యకు ఆరగింపు.
తేనె తెట్టెను రేపి తియ్యని తేనెను వదలిపోదురా?
తేనెబోసి పెంచినా ముష్టిచెట్టుకు విషము పోదు.
తేనెబోసి పెంచినా వేపకు చేదుపోదు.
తేనెలో బద్ద ఈగవలె.
తేరకు దొబ్బరా బూరగబుచ్చన్నా.
తేరగాడి కేమి తెలుసు తెల్లజొన్న నూగు.
తేరగాడి కేమి తెలుసు లంజ ముడ్డినొప్పి.
తేరగా వచ్చింది తినితిని, మాతమ్ముడూ ఒక డున్నాడు అన్నట్లు.
తేర గుట్టం, తంగెడు బతికె.
తేరకు వచ్చింది ఊరకే పోతుంది.
తేరసొమ్ము బీరపీచు.
తేరుండేదాకానే తిరునాళ్లు.
తేరుతీసిననాటి తీర్థంవలె.
తేలుకు ఎవరు అపకారం చేసినారు?
తేలుకుట్టిన దొంగవలె.

1 తేభ్యం = తిండి.

తేలుకు పెత్తనంఇస్తే, తెల్లవార్లు తెగకుట్టిందట!
తేలుకు వెరచి పరుగెత్తి, పాముపై బడినట్లు.
తేలుగా పుట్టి చలిపురుగయినట్లు.
తేలు చూడుమోసి, (పిల్లలగని) చచ్చినట్లు.
తేలు తేలండీ! అని అరస్తే, ముగవాళ్లను పిలవ్వే అన్నాడట;
మీరారు ముగవారు కారా? అని పెండ్లామంటే, సమయానికి
జ్ఞాపకం చేశావు, కట్టె తెమ్మన్నాడట.
తేలుమంత్రమైనా రాకున్నా, పాము పడగపై చెయి పెట్టినట్లు.
తేలువలె కుట్టి పోయినాడు. (కొండెములు చెప్పి)
తేలేనమ్మకు తీపులు మెండు.
తేళ్లలో కొండి, పాములలో పడగ. (విషం)



## త్రై

త్రైమాసం (రేయి) తెగబారెడు.



## త్రో

త్రొంగున్న సుంకరీ! తలమూట దింపుమన్నట్లు.
త్రొండకు [1]వెలుగుసాక్షి.
త్రొండ పరుగు కంప దాకానే.
త్రొండ ముదిరితే ఊసరవెల్లి, గొల్ల ముదిరితే పిళ్ళ.
త్రొందరకు ఆలస్యం మొగుడు.
త్రొందరగా రమ్మంటే, తిరుగమాత వేసి వస్తానన్నట్లు.

1 వెలుగు=కంచె.

తొంభైతొమ్మండుగురు పోగై తోలు తెగగోసినారట.
తొక్కలేనమ్మ తొక్కులో నీళ్లు పోసిందట !
తొక్కినా కఱవకపోతే, బురదతొస్సురా అన్నట్లు. (పామును)
తొడ పలుచనదానికి. తూటు పెద్ద.
తొట్టిలో ఊచినట్లు, తొడ గిల్లినట్లు.
తొట్ల అర్భకుల నూతువు, మరి తోచినట్లు గిల్లుదువు.
తొడ పలుచనగు నింతికి నడిగండిగలు పెద్ద.
తొడబలం ఉంటే తొంబైమంది ఉన్నట్లు.
తొడ గిల్లి తొట్ల నూచినట్లు.
తొడిమ ఊడినపండు పడకుండా ఉంటుందా ?
తొత్తు కింద తొత్తు, దొప్పకింద దొప్ప.
తొత్తు కింద బిడితొత్తు.
తొత్తుకు సివమెత్తిన మ్రొక్కక తీరుతుందా ?
తొత్తుకో మాటుతొత్తంట.
తొత్తుక్క బొల్లి మేక. (తొత్తుకొక బొల్లి మేకా ?)
తొత్తుది నగ లెన్నిఇడిన దొరసా నగునా ?
తొత్తును ఇంటబెట్టి దొరసానిని చెరగొందురా ?
తొత్తువలె పాటుపడి, దొరవలె తిరుగవలె. (తినవలె)
తొడరి యాలినమ్మి తొత్తును గొన్నట్లు.
తొట్రి మెచ్చేది ఉప్పుపిండి.
తొట్రోడు మెచ్చేది [1]ఊరిబిండి.
తొలకరిలో చెరువునిండినా, తొలిచూలు కొడుకుపుట్టినా మేలు.
తొలకరి వానలు మొలకలకు తల్లి.
తొలి ఏకాదశికి తొలి తాటిపండు.

1 ఊరిబిండి = పచ్చడి; ఊరుబిండి.

తొలిగండం తప్పితే, తొంభై ఏళ్ళ ఆయుస్సు.
తొలిచేసిందానికి తల ఎత్తుకోలేకుంటే, వావిలిచెట్టుక్రింద వాడెవడమ్మా!
తొలిపెండ్లాం తోటకూర, మలిపెండ్లాం మామిడిపండు, మూడో పెండ్లాం [1]ముంతమామిడిపండు.
తొలిపిల్లకు తొంభై అంగీలు, మలిపిల్లకు మారుదొడగ లేదు.
తొలి సమర్తకే గూద దిగినట్లు.

## తో

తోకకు తొంభై, నాకు నలభై అన్నట్లు.
తోక తెగిన నక్కవలె. (నక్క హితోపదేశం)
తోక ముడుచుకొన్నట్లు. (భయంతో కుక్క మొదలగునవి చేసేపని)
తోకలేదుగాని, హనుమంతునంత బంటు.
తోకలేని గాలిపటంవలె.
[2]తోకవడ్లు పంటకు వెన్నుకోత నేస్తం.
తోకవెంట పెరుమాళ్లు అన్నట్లు.
తోకవెంబడి నారాయణా అన్నట్లు.
తోచీ తోచనమ్మ తోడికోడలు చెల్లెలి పెండ్లికి పోయిందట.
తోచీ తోచనమ్మ తోడికోడలు పుట్టింటికెడితే, అదీ తోచనమ్మ ఆడబిడ్డ అత్తగారింటికి వెళ్ళిందట!
తోచీ తోచనమ్మ తోడికోడలి పుట్టినింటికి పెడితే చూచీ చూడనట్లు చూశారట!
తోటకూరకు చంద్రహారము పెత్తురా?
తోటకూర నాడైనా చెప్పవైతివిరా కొడుకా! అన్నట్లు.

1 ముంతమామిడి = జీడిపండు. (బీజముఖము)

2 తోకవడ్లు = నెమలివడ్లు; గుంటలలో దొరువులలో పండే అడవిపంట. దీనికి వెన్నులమాత్రమే కోయుదురు.

తోట మూడుబారలు, కాయ ఆరుబారలు.

తోటలమీద వారికి, పే(పీ)టలమీద వారికి మొగమాట ముండదు.

తోడంగ తోడంగ తోడెంగ దొరికె.

తోడిపిల్లను తోడేలు వేసుకపోతే, అమడపిల్ల కచ్చివచ్చినదట.

తోడున్న తొంబదితడవలు.

తోడేలును గొఱ్ఱెలను కాయబెట్టినట్లు.

[1]తోడులేక వెళ్ళదు రాచపీనుగ. (రాచపీనుగ తోడులేనిదే పోదు)

తోరణం కట్టగానే పెండ్లి పూర్తి అయినట్లా?

తోరణములేని వీరణములేని పెండ్లి బాజాలు.

తోలు తీయకుండానే తొనలుమింగినట్లు.

తోలు తొంబక దిని, కుక్క పెద్దపులైందట.

తోలు కొరికేవాడు పోతే, బొమికలు నమిలేవాడు వస్తాడు.

## తౌ

తౌడు తింటూ ఒయ్యారమా?

తౌడుతిన్నా మూతి తుడుచుకున్నట్లుండాలి.

తౌడు తినేవానికి మీసా లెగబట్టే వాడొకడు.

---

1 రాజు రణమరణంతోబాటు చాలమంది చస్తారనేది కావచ్చును, లేదా రాజు ఎదిరిని చంపి తామూ చావచ్చు అవి అయినా ఉండవచ్చును. ఇదిగాక ఏదైనా కథగూడ దీనికి సంబంధించి ఉండవచ్చు. ఈజిప్టులో రాజు చావగానే అతని పరిచారకులను, రాణిని గూడ చంపి 'మమ్మీ'లుగా (ఓషధులతో కుళ్ళకుండాచేసిన పీనుగలు) చేసి సమాధులలో (పిరమిడ్సులో) పెట్టేవారు. అతడు వాడుకొనుచుండిన సామగ్రినిగూడ ఇందు పెట్టి మూసి వేసేవాళ్లు. ఇట్టి అలవాటు మనదేశంలోగూడ ఉండినదేమో, తక్కువకులాల వాళ్ళు పీనుగును కాటికి తీసుకొనిపోతూ. పాడెకు ఒక కోడిపిల్లను కట్టి తీసుకొని పోయి, దహనానికి ముందు కోడిని చంపి గావు (బలి) ఇత్తురు.

## త్రా

త్రాగనేరని పిల్ల ఒలకబోసుకొన్నదట.
త్రాగును గంజిలేదు తలకు అటికలి.
త్రాడు చాలదని బావి పూడ్చుకొంటారా ?

## త్రో

త్రోయనేర్చుకుక్క దొంతులు చేర్చునా (పేర్చునా)
త్రోవ దొరతన మెఱుగదు, నిద్ర సుఖమెఱుగదు.
త్రోవలో పెట్టి తొక్కేవురా జాణా అన్నట్లు.

## త్యా

త్యాగి గానివాని ధర్మ మడుగ చచ్చు.

## ద

దంచలేనమ్మ ఊదూది చూచిందట.
దంచినమ్మకు బొక్కిందే కూలి.
దంచినమ్మకు బొక్కిందే దక్కినట్లు.
దంచేదొకరు, పక్కలెగరేసే దొకరు.
దండమయ్యా బాపనయ్యా! అంటే, మీతండ్రినాటి పాతబాకీ ఇచ్చి పొమ్మన్నాడట!

దండి అమావాస్యకు వాన తాడు తెంపుకొనిపోతుంది.

దండించే దాత లేకుంటే, తమ్ముడు చండప్రచండుడు.

దండిపైరు పంటకురాదు.

దండుకుపోయినవాడి పెళ్లాం ఎక్కడ ఉన్నాముండే! (ఏనాటికైనా ముండే)

దండుకు మంచాలు వాల్చగలమా?

దండుగకు ఒప్పుదురు గాని, పండుగ కొప్పరు.

దండుగకు గూనాయులు, తద్దినానికి కూరలూ దొరకకుండాపోవు.

దండుగలో పండుగ.

దండుగైనపెట్టు (ఈవి) ధర్మానికోర్వదు.

దండులో గుండు పడితే, ఎవనాలి ముండ మోస్తుందో!

దండులోనికి పోతే రెంటిలో ఒకటి. (చావో, బ్రతుకో)

దండువెడదాము అంటే, పండుకతిని వెడదాము అన్నట్టు.

దంపుళ్ళ పాటకు దరిద్రం లేదు.

దంభోళిహానికి తిరువాక మొకురా?

దగ్గఱకు పిలిచి దాసరీ! నీకన్ను లొట్ట అన్నట్టు.

దగ్గఱకుపోతే [1]దొగ్గలకూరకైనా కొరకాదు.

దగ్గఱకు వస్తే ఎగ్గు లెంచినట్లు.

దగ్గఱవాళ్ళకే దగ్గు లెక్కువ.

దగ్గితే నిలువనిముక్కు, తుమ్మితే నిలుస్తుందా?

దగ్గుతూ పోతే శొంఠిగూడ ప్రియము.

దగ్గు, సిగ్గు దాచినా దాగవు.

దగ్గేవానివగ్గర డొక్కలు ఎగురవేసినట్లు.

దత్తతమీంది ప్రేమ-దాయాదిమీంది ప్రేమ.

---

1 దొగ్గలి(లి)కూర = ముండ్లతోటకూర వంటిది.

దప్పికి నేయి త్రాగినట్లు.

దప్పిగొన్నప్పుడు బావి త్రవ్వినట్లు.

దప్పికి నీళ్లీక తరిమి నాతడు ఇష్టాన్నమివ్వగలడా?

దబ్బర పాటకు తలత్రిప్పాటలు మెండు.

దమ్మన్న దాడి పొమ్మన్న పోదు.

దమ్మిడీ ఆదా లేదు, క్షణం తీరిక లేదు.

దమ్మిడీ కల్లుకు (తాగి) ఊరంతా గంతులు.

దమ్మిడీ పెళ్ళికి ఏగాని బోగం మేళం.

దమ్మిడీ పెళ్ళికి రూపాయి బాణసంచా.

దమ్మిడీ ముండకు ఏగాని క్షవరం.

దయగల దేవరా! నామగని వెదకి, వానిని పట్టు, నన్ను పట్టకు.

దయగల మొగుడు దండుకు పోతూ రోలుతీసి రొమ్మున వేలాడవేసి పోయాడట!

దయ తలచి దాహ మిస్తే, ఊళ్ళోకెళ్ళి ఉడుకు అన్నట్లు.

దయ తుట్టుమంటే, నెత్తి చుట్టుమంటుంది.

దయతో దండాలు పెడితే, పడవేసి బందాలు పెట్టినట్లు.

దయ దండిది, గుణం మొండిది.

దయ లేని అత్తకు దండం పెట్టినా తప్పే, ఊరకున్నా తప్పే.

దయ్యం బెదిరికి వరమిచ్చు.

దయ్యపు కంటికి పేలగింజ పెద్ద.

దయ్యము కొట్టనూ, బిడ్డ బ్రతకనూనా?

దయ్యము పట్టినప్పుడే చెప్పుతో కొట్టాలి.

దయ్యాలతో నెయ్యాలు చేసినట్లు.

దయ్యాల ముందర బిడ్డలు బ్రతుకుతారా?

దరిద్రాన్నయినా ఏడేండ్లు దాచిపెట్టితే అక్కరకురావచ్చు,

దరిద్రానికి దైవ కొండాటకం.

దరిద్రానికి మాట లెచ్చు, తద్దినానికి కూర లెచ్చు.

దరిద్రుడికి ఏ రేవు వెళ్ళినా ముళ్ళపరిగే.

దరిద్రుడికి పిల్ల లెక్కువ.

దరిద్రుడికి సద్ది కట్టియిస్తే, ఊరివెలుపల కుంటకాడనే భోంచేసి పోయినాడట.

దరిద్రుడి చేనికి వడగండ్ల వాన.

దరిద్రుడి సంగీతానికి భూమ్యాకాశాలే తాళపుచిప్పలు.

దరిద్రుడు తల గడుగబోతే వడగండ్లవాన వచ్చిందట! (కురిసిందట)

దరిద్రునికి దైవమే తోడు.

దరిలేని బావి, దాపులేని కొంప.

దరిలేని బావి, వితరణలేని ఈవి.

దర్శనంబు లారు దైవంబు ఒకటి.

దర్శనంబులు వేరు దైవమొక్కటి.

దర్జీవానిని చూస్తే సాలెవానికి కోపం.

దలారికి దండుగ భయం-మలీదుకు దొంగభయం లేదు.

[1]దలాలుకోరు వాడు [2]కందూరు చేస్తే, తిన్నవరకు నమ్మకంవుండదు.

దశకొద్దీ దొరికాడు దిసమొల మొగుడు.

దశకొద్దీ దొరికాడు పుసికళ్ళ మొగుడు!

దశకొద్దీ పురుషుడు, దానంకొద్దీ బిడ్డలు.

దశ దానాలకు తోటకూర కట్ట. (మట్ట)

దశవస్తే దిశకుదురుతుంది. (వాస్తు)

దశా! దశా! రావే అంటే, దరిద్రాన్ని పిలవమన్నదట!

1 దలాలుకోరు = మాట నమ్మిక లేనివాడు.

2 కందూరు = ఉరుసు.

దవడ రేగినా, దబ్బర రేగినా నిలువవు.

దవడ రేగినా ద-రేగినా ఆపేదికష్టం.

దక్షిణపు కొమ్ము హెచ్చుఅయితే ధాన్యపుధర హెచ్చు. ఉత్తరపు కొమ్ము హెచ్చుఅయితే ఉప్పుధర హెచ్చు. (నెలవంకకు)



## దా

దాగబోయి, తలారి ఇంట్లో దూరినట్లు.

దాకబోయి తలారి ఎదుట దాగినట్లు.

దాగబోయిన చోట దయ్యాలు పట్టుకొన్నట్లు.

దాచినాను మగడా! వేరుండ మన్నట్లు.

దాడిగుఱ్ఱం మాదిరి దౌడు తీసి, దడిలో దూరినాడట!

దాణాకు నోరు తెరిచి, కళ్లానికి (కళ్లెమునకు) నోరు మూసినట్లు.

దాణా కొద్ది లద్ది.

దాణా దండుగే గాని, దమ్మిడీ పనికాదు.

దాత లిచ్చిన పాలుకంటె ధరణి (ధారుణి) ఇచ్చిన పాలు మేలు.

దాతలు లేక గాదు, మాకు వ్రాత లేక.

దాత లేని యూరు దయ్యాల పేటరా.

దాది ఒమ్ము దూది పాన్పుగ.

దానం చేయకున్నా దక్షిణం తలజేసి పండాలి.

దానం చేయని చేయి - కాయలు గాయని చెట్టు.

దానము చేసిన ఆవుకు దవడ పళ్లు ఎంచబోకు.

దాన మీనివాడు ధన్యుండు కాడయా.

దానములేని విత్తము, సంతానములేని స్త్రీవంటిది, కలుజు (తూము) లేని చెరువు వంటిది.
దానాలలో కెల్ల గర్భాదా(ధా)నం పుణ్యాం.
దానాలలో కెల్ల నిదానం శ్రేష్ఠం.
దాన్ని నమ్ముకొని ధర్మవరం పోతే, అది పోయి బుక్కపట్టణం చేరిందట.
దాపున [1]గుడి కట్టితే దూరాన వర్షం.
[2]దాయ కట్టని ఆవు తన్నక మానదు.
దాయాది ఉంటే, నిప్పెందుకు?
దారికి సుంకం చెల్లించ మన్నట్లు.
దారిద్ర్యము ఆరవ యింద్రియము.
దారిద్ర్యము ఐశ్వర్యము తరతమ భేదములు గల కలుషములు.
దారిద్ర్యము నాగరకత సృష్టించినదే.
దారిద్ర్యమునందునుండి తన పూర్వ సంపద లూరక తలచువాడు త్త విధవ.
దారిద్ర్యానికి సాను పంట.
దారినపోయే తగులాటాన్ని దాపుకు కొని తెచ్చుకొన్నట్లు.
దారినపోయే తద్దినమా! (దరిద్రమా) మాయింటికి రా అన్నట్లు.
దారినపోయే మారెమ్మా! మా ఇంటిదాకా వచ్చిపో అన్నట్లు.
దారినపోయ్యే కనిని నా నెత్తిమీదుగా పొమ్మన్నట్లు.
దారినపోయ్యే కనేశ్వరాన్ని కొనక్కొచ్చుకొన్నట్లు.
దారిలో దొరకింది, ధర్మానికి పోయింది.
దాలిగుంట వారు తామర గుంటకు, తామరగుంట వారు దాలి గుంటకు వచ్చినట్లు.

1 గుడి = చంద్రునిచుట్టు వేసినవలయం.
2 దాయ = ఉట్లుతాడు.

[1]దాలిగుంటలో కుక్కమాదిరి.

దాష్టీకపు ముష్టి (నియోగిది).

దాష్టీకానికి ధర్మం లేదు, కాయకంటికి చూపు లేదు.

దాసరికి తగిన పూసలు.

దాసరయ్య తప్పు దండంతో సరి.

దాసరి తిప్పలు పెరుమాళ్ళ కెరుక.

దాసరి పాటకు ముష్టి ముద(జ)రా.

దాసరి పాట్లు దైవాని కెరుక.

దాసరివా జంగానివా అంటే, ముందూరునుబట్టి అన్నాడట.

దాసి కొడుకైనా, కాసులు కలవాడే రాజచంద్రుడు.

దాసికి శిక్ష తలగొరిగింపు, భార్యకు దండన పడక వెలివేత.

దాస్యం ప్రతి ఆత్మలో పెరిగే కలుపుమొక్క.

దాసుని తప్పు దండముతో సరి.

దాక్షారామం భీమన్నలా ఎంతపొడుగు ? (భీమేశ్వరాలయమున లింగము పొడవైనది. రెండు అంతస్తుల ఆలయము.)



1 దాలిగుంట = నీళ్లు మొదలగునవి కాచుకొనుటకు గుంటలో దానబెట్టి దుట్టు గడ్డి చెత్తవేసి తగులబెట్టునది. పొంతగూడ పిడకలదాలి వేయుదురు.

# ది

దింపుడు కళ్ళ మాశ (పీనుగు మరల బ్రతుకునేమో అని శ్మశానానికి దగ్గఱ ఒక చోట దింపి, మరల ఎత్తుకొందురు; కడపటి ఆశ అని.)

దిక్కులన్నీ ఒక్క దిక్కుకు తెచ్చినట్లు.

దిక్కులేని ఇంట్లో దయ్యాల కాపురం.

దిక్కులేని నాడు ఊరికి నక్క పోతురాజు.

దిక్కులేని వారికి దేవుడే దిక్కు.

దిగంబర సన్యాసికి చాకలితో అవసరమేమి ?

దిగితే గాని లోతు తెలియదు.

దిగుదిగు మనే నాసవితే గాని, దిగే నాసవితే లేదు. (ఒక సవతి లేదు)

దినదినగండం నూరేండ్లాయుస్సు.

దినము మంచిదని తెల్లవార్లు దోచినట్లు.

దినమూ చచ్చేవాడికి ఏడ్చే దెవరు !

దినమూ ప్రయాణం చద్దన్నం చేటు. (తినుటేగాని ప్రయాణం సాగుట లేదు)

దినవెచ్చం దివిటీ వెలుగు - పూటబత్తెం పుల్ల వెలుగు.

దిబ్బాలమ్మకి దీపం పెడితే, పందిమగడు వచ్చి పడదోసిపోయె.

దిమాకి ఎక్కినవాడు దిక్కులుచూస్తే, పలాకి ఎక్కినవాడు ప్రక్క చూచినాడట !

దివాణంలో దిక్కు లేదు, అంబటిలో ఉప్పు లేదు.

దివిటీ ముందు దీపం పెట్టినట్లు.

దివ్వె తీసిన గూడు వలె.

దిసమొలవాడా! కాళ్ళకట్టువాని కప్పు మన్నట్లు.

దిసమొల వానికి దిగంబరుడు బట్ట కట్టినట్లు.

దిసమొలవాణ్ణి గోచిపాతగాడు బట్టఅడిగినట్లు.

---

# దీ

దీపము ఆరిన తరువాత దినుసంతా ఒకటే.

దీప ముండగానే ఇల్లు చక్కబెట్టుకోవలె.

దీప ముండగా నిప్పుకు దేవు లాడినట్లు.

దీపం పేరు చెబితే చీకటి పోతుందా?

దీపం ముడ్డి కిందనే చీకటి.

దీవాన వెలిగించిన దివిటీ పెద్దదైనట్లు.

దీపావళికి దీపమంత చలి.

దీపావళి వర్షాలు ద్వీపాంతరాలు దాటుతాయి.

దీప్తభానుని గని తిమిరంబు నిలుచునా.

దీవించువారు పండ్లేల ఇస్తారు?

# దు

దుంగ దించి బండ నెత్తుకొన్నట్లు.

దుక్కం (దుఃఖం) లేనోడు దూడను [1]గడిచ్చుకొన్నాడట.

దుక్కంగ పోయి [2]దులుపంగ వచ్చు.

దుక్కి ఉంటే దిక్కు ఉంది.

దుక్కి కొద్దీ పంట - బుద్ధి కొద్దీ సుఖం.

దుక్కిగల భూమి, దిక్కుగల మనుజుడు చెడడు.

దుక్కి చలువే [3]చలువ - తల్లి పాలే పాలు.

దుక్కిటెద్దుకు పంచదార అటుకులు కావాలనా.

దుక్కిటెద్దు చావు, పక్కలో పెళ్లాంచావు వంటిది.

దుక్కిటెద్దు దేశాంతరం పోయినట్లు.

దుక్కిటెద్దు బుట్టమేపువేళ గాటికి లాగినట్లు.

దుక్కిటెద్దు దేశాంతరం వెళ్ళితే పట్టిదున్నించారట.

దుక్కిటెద్దు పోట్లాడి, దూడల కాళ్లు విరిచినట్లు!

దుడ్డుకట్టా, దుడ్డుకట్టా ఎవరిమాట వింటావే, అంటే - ఎవరిచేతిలో ఉంటే వారిమాట అన్నదట. (ఎత్తువారి చేతిబిడ్డవలె)

దుక్కి నాగలి చెక్కే వడ్రంగికి మేడలుకట్టు నేర్పిందునా.

దుడ్డుకట్టు అనగానే బుట్ట బద్ద లవుతుందా ?

దుడ్డుకు ఒక్కడైనా దూరదేశలవాణ్ణి జీతాని కుంచుకోకు.

దుడ్డు దగ్గాని లేని నాబట్ట దువ్వింది దువ్వించే.

దుత్తకు పాలరుచి తెలుసునా.

1 గడిచ్చు = సంపాదించు.

2 దులుపుట = ధాన్యం రాల్చుట; కుప్ప నురిపిళ్ళ నమయము.

3 చలువ = ఎక్కువాళ్ళు దున్ననచో నేలకు బెట్టపోయి, చలిమిరి ఏర్పడును.

దున్నంగ పోయి దులపంగ వచ్చు.
దున్న ఈనిన దంటే, దూడను గాట కట్టివేయమన్నట్లు.
దున్నక చల్లితే కొయ్యక పండును.
దున్ననివానికి గుడ్డ ఎందుకు? ఏలనివానికి పెళ్లా మెందుకు!
దున్నక వేసిన ఆముదాలు, ఆసాది కిచ్చిన అప్పు తిరిగిరావు.
దున్న తలిగితే మన్ను ముట్టవలెను.
దున్న దగ్గఱ వీణ వాయించినట్లు.
దున్నపోతు తనవీపు తోముకోలేదు, వాడు తోముకోగలడు-అంతే భేదం.
దున్నపోతు యీనిందంటే, చెంబు తేరా పాలుపితుకుదా మన్నట్లు.
దున్నపోతు మీద వాన కురిసినట్లు.
దున్నపోతు లాగున్నావు, తేలుమంత్రం తెలియదా! అన్నాడట.
దున్నబోతే దూడలలోను, మేయబోతే పోతులలోను.
దున్నలా కష్టపడి, దొరలాగున తినవలె.
దున్నిన పొలానికి, తాగిన గంజికి సరి.
దున్నే అదనులో దూరదేశం పోయి, కోతలకాలంలో కొడవలి పట్టవచ్చి నాడట!
దున్నే ఎద్దునే పొడిచేది. (ములుకర్రతో)
దున్నేవాడు లెక్కచూస్తే, నాగలికూడా మిగులదు.
దున్నేవాళ్ళకు వేళ్లు (లేళ్లు) చూపించినట్లు.
దుప్పి కాలంగాక చిక్కును గాని, కాళ్లు లేక గాదు.
దురదృష్టము ననుభవించలేనివాడు అదృష్టమును అనుభవించలేడు.
దురదృష్టం పసనువాదరగల కత్తివంటిది, పిడిని పట్టుకొనిన ఉపయోగపడును, వాదరను పట్టుకొనిన తెగును.
దుర్గంధ కుసుమాని కంటె, నిర్గంధ కుసుమం మేలు.

[1]దుప్పును చూచి, నక్క వాతలు బెట్టుకొన్నట్లు.
దుష్టుడు కలహించడమంతా శిష్టులకే మేలు.
దుష్టునిచూచి దూరంగా ఉండమన్నారు.
దుఃఖమును అణచుకోగలిగినవానికంటె సంతోషాన్ని అణచుకో గలిగినవాడే ఘనుడు.
దుఃఖము సుఖమును వెన్నుదన్నే వెన్నాడుచుండును.

## దూ

దూకదూకు మనేవాళ్లేగాని, దూకే నాలంజకొడుకు ఒక్కడూ లేడు.
దూడ అంత దుఃఖము, పాడి అంత సుఖము లేదు.
దూడ కుడిచినట్టా? దుత్తలో పడ్డట్టా?
దూడ కుడిస్తేగాని ఆవు చేపదు.
దూడ కుడిస్తేనేగాని దుత్త నానదు. (తడవదు)
దూడ-తల్లి ఉండగా గుంజ అరచిందన్నట్లు.
దూడపాలు దుత్తకే సరిపోయె.
దూడ పొదుగును కుమ్మితేగాని ఆవు చేపదు.
దూడ మేసి గంటసేపైనా, దురిసెండ్ల నడత మాత్రం పోలేదు.
దూడలేని పాడి దుఃఖపు పాడి.
దూడ వగచునె భువి తోడేలు సచ్చిన.
దూదేకుల వాడికి [2]తుంబ తెగులు.

1 దుప్పు = పులి.
2 తుంబతెగులు=దూది ఏకేటప్పుడు కలిగే చప్పుడు.

[1]దూదేకుల సిద్దప్పకు దూదేకను రాదంటే లోటా?
దూబరతిండికి తూమెడు. మానవతికి మానెడు.
దూబరతిండికి దూండ్లు బతకవు, ఆణి మొద్దుకు ఆండ్లు బతకవు.
దూరం గుడికట్టితే (చంద్రునిచుట్టు) దగ్గరవాన, దగ్గర కడితే దూరపువాన.
దూరదర్శినితో చూచినకొండ చిన్నదిగా కన్పించును. భూతద్దముతో చూచిన పెద్దదిగా కన్పించును; మానినది దృష్టిగాని కొండ గాదు.
దూరపు కొండలు నునుపు.
దూరపు దండం కోటి లాభం.
దూల పెట్టేచోట దుడ్డుకోల పెట్టినట్లు.
దూస్తే దోసెడు, ఊడితే పాలుశక్కి.



# దె

దెప్పె ఎక్కినట్లు. దేవుడికి మొక్కినట్లు.
దెబ్బకు దయ్యం వెరుస్తుంది.
దెబ్బకు దేవేంద్రలోకం కనపడుతుంది.
దెస[2]బత్తలవానికి బరిబత్తలవాడు బావమరిది.



1 దూదేకులపిద్దప్ప = బ్రహ్మంగారి శిష్యులలో మహాజ్ఞాని.
2 బత్తలు = దిసమొల.

దే

దేవతలకు దుమ్ము, రాక్షసులకు మన్ను.
దేవతలు నాశంచేయాలనుకొన్నవానికి ముందుపిచ్చి పట్టిస్తారు.
దేవర చిత్తం, దాసుడి భాగ్యం.
దేవరచిత్తం దీనుడి భాగ్యం.
దేవర సవాశేరు, లింగం శేరు.
దేవళం మింగేవాడికి ధ్వజస్తంభం లొటలొట.
దేవాంగులలో వాదించరాదు ('వా' అనే అక్షరం కొట్టివేయరాదని)
దేవియున్నగృహము దేవార్చనగృహంబు.
దేవుడని మొక్కితే, దయ్యమై పట్టుకొన్నట్లు.
దేవుడికి ముడుపు, దెయ్యానికి మంత్రం.
దేవుడి పట్టుకంటె దయ్యపుపట్టు ఎక్కువ.
దేవుడి పెళ్ళి కండలూ పెత్తనగాండ్లే. (పెద్దలే)
దేవు డిస్తాడుగాని, వండి వార్చి వాత కొడతాడా ?
దేవుడు కాయగూరలిస్తే దయ్యం వంటవాని నిచ్చింది.
దేవుడు చెఱుపని ఇల్లు దేవాంగి చెరుపుతాడు.
దేవుడు తలిస్తే దెబ్బలకు కొదువా ?
దేవుడు లేనిఊళ్లో మంచపుకోడె పోతురాజు.
దేవుడు వర మిచ్చినా, పూజారి వర మీయడు.
దేవునికి చూపులు, మనకు మేపులు.
దేవుని తేరు యీడ్వలేకున్న ధర్మకర్త-నంబినాయాలు బరువైనాడు
గాని దేవుడే అయితే నా వెంట్రుకకు గట్టిలాగనా అన్నాడట.
దేశమెవరు ఏలుతున్నా, ధాన్యం దంచితేనే బియ్య మవుతాయి.
[1] దేసూరురెడ్లపొందు (పొత్తు) దయ్యపుపొందు. (పొత్తు)
దేహము గొడవల కాపురము.

---

1 దేసూరురెడ్లు = రెడ్లలో ఒకశాఖ.

## దై

దైవబలము కలుగని వేళ కలహించి గొంతెత్తరాదు.

## దొ

దొంగ అండీ అంటే, ముక్కు కరుస్తాడేమో జాగ్రత్త అన్నట్లు.
(ఈ మాటతో కరచే తప్పించుకొని పోయినాడట)
దొంగ కందరిమీద అనుమానము.
దొంగకుక్కను పుట్టించిననాడే [1]యతిమతం ముండను పుట్టించినాడు.
దొంగకు చేను పచ్చి అయితేమాత్ర మేమి?
దొంగకు తలుపు తీసి, దొరను లేపినట్లు.
దొంగకు తేలు కుట్టినట్లు.
దొంగకు తోడు, దొరకు సాక్షి.
దొంగకు దొంగ తోడు.
దొంగకు దొంగబుద్ధి, దొరకు దొరబుద్ధి.
దొంగకు దొరికిందే చాలు.
దొంగకు భయము, లంజకు సిగ్గు పనికిరావు.
దొంగగొడ్డుకు గుడి కట్టినట్లు.
దొంగ గొడ్డు మెడను దుడ్డుకట్టినయట్లు.
దొంగగొడ్లకు గుదికఱ్ఱలు (కట్లు) కట్టినట్లు.
దొంగచేతికి తాళమిచ్చినట్లు. (తాళం చెవి)
దొంగచేయి దోపను బెడితే, అమావాస్యనాడు అల్లల లాడినట్లు.

1 యతిమతి = యతివలె వెఱ్ఱిపోగులుగా నుండునది; యతామతము; ఏమరిపోవునది.

దొంగతనానికి పోతూ, డోలు చంకన బెట్టుకొని పోయినట్లు.
దొంగ (వాని)తల్లికి ఏడువ భయం.
దొంగతో కూడ దయ్యం వెంబడే వచ్చును.
దొంగను దోస్తే దాదులేదు, ఫిర్యాదు లేదు.
దొంగపోటుకంటే లింగపోటు ఎక్కువ. (ఒక జంగమదేవరను దొంగ తరుమగా పరుగెత్తునప్పుడు మెడలో ఉండే లింగకాయ పోటు అనుట)
దొంగపోయి తలారివానిఎదుట దాగినట్లు.
దొంగ మగని భక్తిమీర భజించగానే మంచిత్రోవ చూపగలడా
దొంగల సొమ్ము దొరల పాలు.
దొంగలు తోలినగొడ్డు ఏరేవున దాటినా ఒకటే.
దొంగలు పడ్డ ఆరునెలలకు కుక్కలు మొరిగినవట.
దొంగలూ దొంగలూ కలసి ఊళ్లు పంచుకొన్నట్లు.
దొంగ వస్తాడని ముందు చెప్పిఉంటే, సాక్షులను సంపాదించికొందునే అన్నాడట!
దొంగవాకిట మంచం వేసినట్లు.
దొంగవాడి దృష్టి మూట మీదనే.
దొంగవాడి పెండ్లాం ఏనాటికైనా ముండమోపే.
దొంగ సంగతి దొంగ ఎఱుగును.
దొంగిలబోతే మంగలం దొరికిందట.
దొంగిలించేటంత దొరతన ముండగా, అడుక్కుతినే టంత అదవతన మేల?
దొంతుల కోపని గుదియలుందునా?
దొంతులజేరి [1]నాయి [2]దోర్చుగాని కూర్చునా?

1 నాయి = కుక్క; 2 దోర్చు = త్రోయు.

దొడ్డికిపోయే వానికొఱకై ఒడ్డుకు పడవ పట్టించినట్లు.

దొడ్డినిండా గొడ్లు, ఇంటినిండా బిడ్డలు! ఇంకేమి కావలె ఇరకటానికి?

దొడ్డిలో కామధేను వుంటే, గొడ్డును పితుకను కుండను గొంపోయి
నట్లు.

దొడ్డివాకిట దయ్యాన్ని తరిమివేస్తే, తలవాకిట వచ్చి నిలబడిందట!

దొడ్డెడు గొడ్లను దొంగలు తోలుకపోతే, గొడ్డు గేదే శ్రీమహాలక్ష్మి.

దొబ్బను దేవుడంతటివాడు (దేవుడే).

దొబ్బనేర్చుకొక్క దుత్తలు మోచునా

[1]దొమ్మ లన్నిటిలో మిడిదొమ్మ మిండడు.

దొమ్మదగిలి మనపశువులు రెండు చచ్చిన వంటే, మనవాళ్ళవి
ఎన్ని చచ్చినవని అడినాడట!

దొరకని పూలు దేవుని కర్పణం.

దొరకు పండుకొనే మంచం లేకపోతే దాసి దానికి పట్టుపరుపా.

దొరసానికి వల్లే దొరకకపోతే తొత్తుకు తొగరు చీరా.

దొరికితే దొంగ, దొరకకపోతే దొర.

దొరికిన సొమ్ముకు దొంగవుతాడా?

దొరకు తొంగోను మంచం లేదు, బంటుకు పట్టుపరుపట.

దొరను పేద అనరాదు. ఎద్దును సాధువు అనరాదు.

దొరబిడ్డ అయినా ఒకని ఆలే.

దొరల చిత్తం, చెట్ల నీడ నిలకడ లేనివి.

దొరలు ఇచ్చిన పాలుకన్నా, ధరణి ఇచ్చిన పాలు మేలు.

దొరసానికి దుప్పటి లేదు, తొత్తుకు తొగరు చీరట.

---

1 దొమ్మ = పశురోగము; కుత్తుకలో ఎదురుకుతికబుట్టి ఊపిరాడక పసరము చచ్చును.

దొరాల తగులుకొంటున్నావు, ఏమిస్తావో దొరా, అంటే– నీమనసు మెప్పించి తల కేదో పాత (పాతగుడ్డ) సంపాదించుకోవాలను కొన్నానమ్మా అన్నాడట అతడు.
దొరికితే దొంగ, దొరకకపోతే దొర.
[1]దొరువులో ఉన్న బత్తెను, కొమ్ములు జూచి బేరమాడినట్లు.
దొరే దొంగయితే బంట్రోతు కన్నగాడగును.
[2]దొలుపుడు ముద్దకు నలుపుడు కారం.



## దో

దోచపండు నెట్టుబ్రోచు ఇనుపకట్టు.
దోచుకొనిపోయినవాడు దొర, దొరకినవాడు దొంగ.
దోత్రం పెద్దదయితే గోత్రం పెద్దదగునా ?
దోనె చేయబోయి సోల చేశాడట!
దోమలు తగ్గితే చేమలు ఊరును.
దోర కజ్జం, రామానుజం పొడి.
దోవను పోయే దెవరయ్యా? అంటే, దొబ్బులుతినే నేనయ్యా అన్నట్లు.
దోవను పోయే దొకడు, దొబ్బులు (దొబ్బలు) తినే దొకడు.
దోవలో కూర్చుండి దొబ్బులు తిన్నట్లు.
దోసకాయలు తిన్న కడుపు, దొంగలు పడ్డ ఇల్లు ఒకటే.



1 దొరువు = త్రవ్విన నీటిగుంట.
2 దొలుపుడు=దొర్లు (గుండ్రని)

## దౌ

[1]దౌలత్తున దిరిగినా గులాము గులామే.
దౌర్భాగ్య దామోదరుడు. (నిర్భాగ్య దామోదరుడు)



## ద్ర

ద్రవ్యం దాచినవాడికి తెలుసు లెక్క వ్రాసినవాడికి తెలుసు.
ద్రావిడ ప్రాణాయామం.
ద్వారపూడి పచ్చపువాడు.



## ద్వి

ద్విపదకావ్యంబు ముదిలంజె దిడ్డికంత.



## ధ

ధనం మాట్లాడుతుంటే సత్యం ఊరకుండిపోవును.
ధనము లెచటికేగు, దానేగు నెచటికి.
ధనపతి సఖుడైనా శివుడు భిక్షమెత్తవలసివచ్చింది.
ధనానికి దాపరికము (గుట్టు) సేద్యానికి వెల్లడి. (రట్టు)

1 దౌలత్ = సంపద.

ధనికునికి చెఱుకు పంట, దరిద్రునికి నువ్వుపంట.

ధనియాల జాతి (చెప్పుతో రాసి బద్దలుచేస్తేనేగాని, మొలవవు; భయానగాని పనిచేయనివారు-అని.)

ధరకు దొర ఎవడు?

ధర తక్కువ బంగారానికి దాటి ఎక్కువ.

ధరించేదే శాటి వరించేదే బోటి.

ధర్మం దరిచేసి నడిగితే ఇచ్చునా తన్నక చచ్చుగాని.

ధర్మపురిలో దొంగిలించబోతూ, ధార్వాడనుండి వంగుని పోయాడట!

ధర్మానికి దండుగ లేదు, పెట్టెకి పైనా లేదు.

ధర్మానికి దట్టీఇస్తే, ఇంటి వెనకలకు పోయి, మూరవేసిందట!

ధర్మానికి బోతే, కర్మం చుట్టుకొన్నదట.

ధర్మోదకాలలో రాని పితరుడు తర్పణాలలో వచ్చినట్లు.



## ధా

ధారలేని తిండి దయ్యపు తిండిరా.

ధారోష్ణం, అమృతోత్తమం, దాచినానేమగడా! వేసుండుమన్నట్లు.



## ధీ

ధీరుడయినా కావాలి, దీనుడయినా కావాలి.

## ధూ

ధూపం వేస్తే, పాపం పోతుంది.

## ధై

ధైర్యలక్ష్మి - ధనలక్ష్మి.

ధైర్యం లేనిరాజు, యోచనలేని మంత్రి.

## ధ్వ

ధ్వంసం నారాయణుడు కమతం చేస్తే, పాలికి పందుం - పల్లేరు కాయలు.

ధ్వంస పారాయణం దంటు మంట.

## న

నంగతుంగ నీళ్ళకు పోతే, నీళ్ళన్నీ ఒక రేవుకు వచ్చాయట!

[1]నంగనాచి చీర నడివీదిలో ఊడిందట!

నంగనాచి - తుంగబుట్ట. (తుంగకు బుట్ట ఏర్పడదు. అనగా ఏమీ తెలియనట్లు నటించుట అనుట.)

---

1 నంగనాచి = కంచిలో ఉండిన ఏలేశ్వరోపాధ్యాయుల కూతురు; అతిపమర్థురాలు; నంగ.

నంగనాచి – వంగముల్లు.

నంగనాచులు శరణనగానే అనంగుడు జ్ఞానోపదేశం చేయునా.

[1]నంగి వంగలు మేస్తుంటే, నారికేళాలు దూడలు మేసినవట.

[2]నంగీ! నమలక మింగవే అంటే, ఉడికిన చేపలు కరుస్తవి అన్నదట.

నందనవనములో కుందుగడ్డి పెరుగవచ్చు.

నందనవనములో నాగుబాముండటం మృగనాభికి పిప్పితగిలినట్లు.

నందరాయని భాగ్యము నక్కలకూ, కుక్కలకూ.

నందానమ్మలు బాగా పడితే, నారాయణుని చూచినట్లే.

నంది అంటే నందే, పంది అంటే పందే! (పట్టుదల)

నందిని చెయ్యబోయి పందిని చేసినట్లు.

నందిని పంది, పందిని నందిని చేయ గలిగినవాడు.

నంది వంగలు మేస్తే, నారికేళాలు దూడలు మేయవా?

నంద్యాలవారి కవిత్వం కొంత, నా పైత్యం కొంత.

నంబి కవిత్వం, తంబళి జోస్యం.

నంబి పెట్టినదే ప్రసాదం.

నంబి లింగయ్యా, జంగం రంగయ్యా ఉండరు.

నంబివాడు ఎదురైనా, నాగుబాము ఎదురైనా కలిసిరాదు.

నంబి వారికి, తంబళి వారికి ఒకటే కంచకోల అన్నట్లు.

నంబీ! నంబీ! నాపెండ్లి కేమి సహాయం చేస్తావంటే, నిపెండ్లికి నేను ఎదురు రానుపో అన్నాడట.

నంబీ, నంబీ, నిపుణ్యాన పెండ్లయిందంటే, నేనేమి చేసినా ననగా, తరలిపొయ్యేవేళ, తమరు ఎదురుపడక పోవడమే అన్నాడట.

---

1 నంగి = దూడ గలిగిన ఆవు.

2 నంగి = ఏమీ తెలియనట్లు నటించే ఆడువి; నంగనాచి. మాటలు వచ్చీరానట్లు ముక్కుతో మాట్లాడేవాడు.

నక్క ఎక్కడ ! నాగ(క)లోక మెక్కడ !

నక్క ఒకచోట ఊలవేసి, ఇంకొకచోట గౌరీకల్యాణము పాడునా !

నక్క కడుపున సింగము పుట్టునా ?

నక్కకు నవ్వు - ఎండ్రకాయకు గండం.

నక్కకూత నాకలోకం ముట్టునా !

నక్కకూసి, నాశం దెచ్చు.

నక్కకూసి పిల్లలకు దోవచూపు.

నక్కకొమ్ము తొక్కి వచ్చినాడు. (అదృష్టవంతు డనుట)

నక్క చావ గొఱ్ఱె లేడ్చునా.

నక్కజిత్తులన్నీ (తంతులన్నీ) నావద్ద ఉండగా తప్పించుకు(క) పోయెరా తాబేటిబుఱ్ఱ అన్నదట.

నక్కజిత్తులు నారాయణు డెఱుగు.

నక్కతోక పట్టుకొని నాకలోక మెక్కినట్లు.

నక్క నడుము తొక్కి వచ్చినాడు. (అదృష్టమనుట)

నక్క నారాయణునికైనా నామం పెట్టుతుంది.

నక్క నారాయణు డక్కడనో, తోకనారాయణు డక్కడనే.

నక్కను చూచిన వాడెల్లా వేటకాడే.

నక్క పీనుగును పీకునుగాని బ్రతికిన జంతువు పైకి పోదు.

నక్క పుట్టి నాలుగు వారాలు కా లేదు, ఇంత గాలివాన ఎన్నడూ చూడలేదు అన్నదట.

నక్క పోయినవెనుక బొక్క కొట్టుకొన్నట్లు.

నక్క ముదిరితే వఱడు, తొండ ముదిరితే ఊసరవెల్లి.

నక్క రేలకాయ తినినట్లు.

నక్కలలో నక్కగా నటించవలె.

నక్కలు బొక్కలు వెదకును, తక్కిన నాలంజకొడుకు తప్పె వెదకున్.

నక్కలు మరవలు పాతితే, కుక్కలు కూటికొల్లవు.

నక్క లెరుగని బొక్కలు, నాగులెరుగని [1]కోవ(మ)లు (పుట్టలు) గలవా?

నక్కవచ్చి కుక్కతోక సవరించినట్లు.

నక్కవాత మన్ను గొట్టినాడు. (చావక బ్రతికినా డనుట)

నక్క వినయము, కొంగ జపము.

నక్కా! నక్కా! నా నామం చూడు, తిరిగిచూస్తే తిరుమణి చూడు.

నగ(గి)రి పేదా? ఉప్పు చేదా!

నక్షత్రాలు శాశ్వత జ్యోతులైనా చీకటిపడినప్పుడే వెలిగేది.

నగిరికి ఎంతైనా పెడతాడు గాని, పెదకోడలికి కూడు బెట్టను ఏడుస్తాడు,

నగుబాట్ల పెండ్లికి నాడే నాగవల్లి.

నగులు ముదిరితే తెగులు.

నట్టింట ఉండి నాభాగ్య మంటే, ఉట్టిమీాదు నుంచి ఊడిపడుతుందా?

నట్టేట [2]పుట్టిముంచినట్లు. (మునిగినట్లు)

నట్టేటిలో చేయి విడిచినట్లు.

నట్టేటిలో పడ్డ సొమ్ము నట్టింటికి వచ్చినట్లు.

నడచే కొద్దీ డొంక, పెట్టేకొద్దీ కుదురు.

నడచే దారిలో గడ్డి మొలవదు.

నడచేవాడే పడేది.

నడమంత్రపు దాసరి పొద్దుమూాడ మేలుకొను.

నడమంత్రపు వైష్ణవానికి నామాలు మెండు.

నడమంత్రపు సిరికి నెత్తిమీాద కండ్లు.

---

1 కొవలు - పుట్టల శిఖరాలు.

2 పుట్టి - పేళ్ళతో చేసిన గుండ్రని బుట్టవంటి చిన్నపడవ; పైన తోలు కప్పుదురు.

నడమంత్రపు సిరి, నరంమీది పుండు భరింపరానివి.

నడమంత్రాన సిరివస్తే, నడిరేయి గొడుగు పట్టమన్నాడట.

నడవంగా నడవంగా పైగుడ్డ బరువైనట్లు.

నడవడికలు చక్కబెట్టేది నాటకము.

నడవలేనమ్మకు నాలుగు పక్కలా సవారి.

నడిస్తే మార్గాయాసం, తింటే భుక్తాయాసం-తిమ్మావధానికి.

నడుమ దిరిగే కుంటెనగాడికి చెన్నపట్నం రైలుబండి.

నడుమ దిరిగే కుంటెనగాడికి కంమూరు, కషాయి (కైపు) సారా.

నడుము మునిగేదాకానే చలి-వలుగురు వినేదాకానే సిగ్గు.

నత్తగుల్లలన్నీ ఒక రేవున, ముత్యపు చిప్పలన్నీ ఒక రేవున (చేరును)

నత్తగుల్లలో ముత్యాలు పుట్టునా ?

నత్తి నాలిగింటి కర్థం.

నది నాల్గామడ ఉండగా. చీరవిప్పి చేతపట్టుకున్నదట.

నదకూడి నార మొలకెక్కినట్లు.

నన్ను ఎఱిగినవాడు లేకపోతే, నా బడాయి చూడమన్నట్లు.

నన్ను కొడితే కొట్టావుగాని, మా బావను కొట్టు చూస్తాం అన్నట్లు.

నన్ను చూస్తే, నిన్ను కాస్తా. (ఎనుము అనేమాట)

నన్ను నేనే ఎఱుగను, నిన్ను నేనేమి ఎఱుగుదును ?

నన్ను పెంచితే నిన్ను ముంచుతా.

నన్ను ముట్టుకోకు నా మాల కాకి.

నపుంసకుని చెంతనా నవలా సరసం!

నపుంసకుని చేతికి రంభ దొరికినట్లు.

నమలక, మింగక నానవేసినట్లు.

నమాజు చేయబోతే మసీదుమీద పడ్డట్లు.

నమిలే వాడికన్న మింగేవాడే ఘనుడు.

నమ్మించి గొంతు కోసినట్లు.

నమ్మితి రామన్నా! అంటే, నట్టేట ముంచుతాను లక్ష్మన్నా! అన్నట్లు.

నమ్మితి రామన్నా! అంటే, నా అంతవాణ్ణి చేస్తానన్నట్లు.

నమ్మిన ఇమ్మ, నమ్మకున్న అమ్మ.

నమ్మిన ఎనుము పోతు అయ్యిందట.

నమ్మి నడివీధిలో వేసిన వారెవరు?

నమ్మి నానబోస్తే, పులిసి బూరటిల్లిందట.

నమ్మి నానవాలు (నానబియ్యం) పోస్తే, పుచ్చి బుఱ్ఱలైనవంట.

నయ ముంటే భయ మేమి?

నయము నష్టకారి, భయము భాగ్యకారి.

నయాన పాలు తాగరు, భయాన విషమైన తాగుతారు.

నయాన కానిపని, భయాన అవుతుంది.

నరం వంటి వాడికి జ్వరం వస్తే, చేయి చూచినవాడు బ్రతుకడు.

నరకములో కరుణ లేదు, నాకంలో మరణం లేదు.

నరకములో నారాయణు డుండునా?

నరకానికి నవద్వారాలు, నాకానికి ఒకటే!

నరాలు లేని నాలుక నానావిధాల పలుకుతుంది.

నరుక లేని బంటు, కత్తి చుఱుకు లేదన్నట్లు.

నరునకు నరుడు, తరువుకు వేరు సహాయం. (అండ)

నరునికి నాలు గంశలు.

నరునికి సుద్దంబద్దం లేదు, గుంజుగుంజు నడేటిలోనికి-అన్నదట మొసలి.

నర్మదలో మునిగినా కర్మం తప్పదు.

నలపాకము, భీమపాకము, (మగవాడు చేసేవంట)

నలసారము, సంసారము.

నలిగి ఉండినప్పుడు, తొలిగి ఉండమన్నారు.

నలుగురితో చావు పెండ్లితో సమానం.

నలుగురితోపాటు నారాయణా! కులముతోపాటు గోవిందా!

నలుగురు చేతులువేస్తే, గొడ్రాలికికూడా బిడ్డలు పుడుతారు.

నలుగురి తర్వాత పుట్టితే నట్టిల్లు బంగార మవుతుంది; ముగ్గురి తర్వాత పుట్టితే ముయ్యి మూకు దుండదు.

నలుగురు నడచేదారిన నాచుగూడ మొలవదు.

నలుగురు నడిచిందే బాట, పలువురు పలికిందే మాట.

నలుగురు నవ్వినట్లే ఉంది. నామాట కుదిరినట్లే ఉంది.

నలుపు నాలుగు వంకరలు తెలుపుతుంది, ఎఱుపు ఏడు వంకరలు దాస్తుంది. (మెఱుచాయ)

నలుపు నారాయణమూర్తి.

నలుపు సరుకులో (రంగులో) నాణ్యము లేదా?

[1]నల్లంబి [2]దురాయి పెట్టితే నిలుస్తుందా.

నల్లావు పాలైనా తెల్లనే.

నల్లకోడికైనా తెల్లగుడ్డే.

నల్లచీరకట్టిన వాళ్ళంతా నాపెళ్ళాలే అన్నట్లు.

నల్లనివన్నీ నీళ్లు, తెల్లనివన్నీ పాలు. (అనుకోనేటంత అమాయకుడు)

నల్లనేలకు నువ్వులు, ఎఱ్ఱనేలకు కందులు.

నల్లబాపడు నాభికంటె విషము.

నల్లబాపనయ్యను ఎఱ్ఱమాదిగను నమ్మరాదు.

నల్లనివాడికి నాభిలో విషం.

నల్లరేగడలో చల్లినా తెల్లజొన్నలే పండేది.

---

1 నల్లంబి - ఒక చిన్న నల్లపిట్ట.

2 దురాయి - ఆంక్ష; ఆన.

నల్లి కాటు, నారిపోటు.

నల్లినిగూర్చి మంచానికి పెట్లు. (కించిత్తు నల్లిగరచిన మంచమునకు పెట్లువచ్చు)

నల్లులకు వెఱచి ఇల్లు విడిచినట్లు.

నల్లేరుమీాద బండి పోయినట్లు. (సులభమని)

నవరత్నములున్నా, నరరత్న (నారీరత్నము) ముండవలె.

నవరత్నాలన్నీ ఒకచోట, నల్లగుత్తలన్నీ ఒకచోట.

నవాబు తలబోడి అయితే, నా తలగూడ బోడి అని, వితంతు విత్తు వీగినదట !

నవాబు పొట్టా, తమలపాకుల కట్టా తడుపుతూ ఉండవలె.

నవా బెంత దరిద్రుడో, పులి అంత సాధువు.

నవ్వ లేనివారిని నమ్మరాదు.

నవ్వితే ఊడే ముక్కు తుమ్మితే ఉంటుందా ?

నవ్విన ఊళ్ళే నగరా లౌతాయి.

నవ్విన [1]నాపచేనే పండుతుంది.

నవ్వుతూ కోసిన ముక్కు ఏడ్చినా రాదు.

నవ్వు నాలుగందాల (నానందాల) చెరుపు.

నవ్వుల తోటలో నాగులు తిరుగును.

నవ్వే ఆడుదాన్ని, ఏడ్చే మగవాణ్ణి నమ్మరాదు.

నవ్వేవారిముందు జారిపడ్డట్లు.

నష్టపడినా భ్రష్టు కారాదు.



1 నాపచేను = నాము అనగా, పైరు కోసిన తర్వాత కొయ్యకాలునుండి ఎదిగిన కరలు. నాము ఎదిగిన చేను నాపచేను.

## నా

నాంచారమ్మ వంట, నక్షత్రదర్శనము ఒక్కమారే. (ఆలస్యమగునని)
నా ఇంటికి నేను పెద్దను, పిల్లికి పెట్టరా పంగనామాలు అన్నట్టు.
నా కిన్ని గంజిమెతుకులు పోయి, నీ కాకలి కాకుండా మందిస్తా నన్నాడట. (మంత్రం చెపుతాను అన్నట్లు.)
నాకు ఆయుష్యమస్తు, నాకు ఆరోగ్యమస్తు అని దీవించుకొన్నట్లు.
నాకు తెలియకుండా నంబికిష్టయ్యకు కనికెదు (కమికెదు) జుట్టా.
నాకు పరీక్షా, నా రాగిచెంబుకు పరీక్షా ?
నాకు బెబ్బెబ్బే అంటే, నీకు బెబ్బెబ్బే, నీ అబ్బకు బెబ్బెబ్బే అన్నాడట!
నాకులకు లోక భయమేల ?
నాకు లేక నాకుతుంటే, నీకు నైవేద్యమా ?
నాకు లేక నాకుతుంటే, నీ కెక్కడ దెత్తునే దేకులాడి.
నాకు లేక నాకుతుంటే, మూతులు నాకను వచ్చావా ?
నాకూడు నా [1]కల్యాట్లు నాకు తప్పవు.
నాకూ, నా పిల్లకూ నూరేండ్లాయుస్సు, నా పెనిమిటికి లోకంతో పాటు.
నాకూ లేదు, నీకూ లేదు, ఊరుకో దేవరా!
నాకూ సిగ్గులేదు, రేపు వచ్చే అమావాస్యకూ సిగ్గు(ఎగ్గు)లేదు.
నాకే కుక్కకు లింగమేమి ? పానవట్టమేమి ?
నా కోడి కుంపటీ లేకపోతే, ఎట్లా తెల్లవారుతుందో – ఎట్లా నిప్పు దొరుకుతుందో చూస్తాను అందిట ఒక అవ్వ.
నాగరికం లేని మాట, నాలుకపై తీట.
నాగలిఉన్న ఊళ్ళో, ఆకలి చేరదు.

---

1 కల్యాట్లు = అగసాట్లు; కష్టాలు.

నాగలి మంచిది కాకపోతే, ఎడ్లేమి చేస్తాయి!
నా గర్భాధానం నేనున్నట్టే జరపండి, నాకు రాను తీరిక లేదన్నాడట.
నాగసముద్రం పిల్ల, నగారుమీద పుల్ల.
నాగుబాము చిన్నదనవద్దు, పాలివాడు సన్న మనవద్దు.
నాచెయ్యి నొస్తున్నది, నీచేతితో మొత్తుకో అన్నట్లు.
నా చెవులూ కంసాలే కుట్టాడు.
నా చేతిమాత్ర వైకుంఠయాత్ర అన్నాడట వైద్యుడు. (చేయి వాసి లేని వైద్యునిమాట)
నాజూకు నక్కలు దేకితే, నెరసిన గడ్డం కుక్కలు పీకినవి.
నాట్యం త్రొక్కిన కాలు, రోసి రోటిక్రింద పెట్టినా ఊరుకోదట.
నాడు ఉంటే నవాబుసాహెబు, అన్నముంటే అమీరుసాహెబు, చస్తే పీరుసాహెబు.
నాడు కట్టాలేదు, నేడు చించాలేదు.
నాడు నిలువబడా లేదు, నేడు ఎత్తుబడా లేదు.
నాడుపోయి, నేడొస్తివే మగడా! నా తప్పేమి చెప్పు?
నాడు తెంచేవారేగాని, గోడు చూచేవారు లేరు.
నాడు వ్రాసినవాడు నేడు చెఱిపి మళ్ళీవ్రాస్తాడా? (నుదుటివ్రాత)
నాతి బలము నాలుకపైన.
నాథుడులేని రాజ్యం నానాదారులు.
నా దగ్గర ధనమున్నంతవరకు నన్ను అందరూ 'అన్నా' అని పిలిచినారు.
నాదముంటే గంట, వాదముంటే తంట.
నాదయలో నీగంజి త్రాగు అన్నట్లు.
నాదికాదు, నాఅత్త సొమ్ము అన్నట్లు.
నాది, నారెడ్డివి (మారెడ్డోరివి) కలిసి నూటొక్క ఎద్దన్నట్లు. (ఇతనిది ఒక్కటే)

నాదెంత గడ్డం! ఉమ్మిపూసి గొరగమన్నాడట!
నాదెబ్బ, గోలకొండ అబ్బా అన్నట్లు.
నానబాలు పట్టమ్మా అంటే, ఏచేని సజ్జలు? అన్నదట.
నానాకూళ్ళవాళ్లు నాయుళ్లు అయినట్లు.
[1]నానాటికి తీసికట్టు నాగంభొట్లు.
నానారుచులు పారితే నాలుకమీద కొఱివి పెట్టుకొన్నట్లుంటుంది.
నానిన భూమి నవధాన్యాలు పండును.
నా నోట్లో (నీవు) వేలుపెట్టు, నీకంట్లో (నేను) వేలు పెడతానన్నట్లు.
నాన్చినాన్చి వేస్తివో, నాకొంప తీస్తివో.
నాన్పుడుగాడు నాపెండ్లికి నేనూ వెళ్లాలా? అన్నట్టు.
నాపప్పు కలిసిందంతా నేనే తింటాను.
నా పాతివ్రత్యం నా మొదటిపెనిమిటికి తెలుసు.
నాపాపము నాతోనుంటే శ్రీపతిబిరుదమున కేమి బ్రతుకు.
నా పెండ్లాన్ని లేవదీసుకొని పోతే పోయినాడుగాని, పదిమందిలో ఉసే అంటాడేమో అని భయంగా వున్నదన్నాడట!
నా పెండ్లి సగమైన దంటే, ఎట్లనయ్యా అంటే, నేను పెండ్లికొడుకుగా సిద్ధంగా ఉన్నాను; మిగత సగానికి పెండ్లికూతురే కావాలన్నాడట.
నాభిలో పుట్టిన పురుగు నాభిలోనే పెరుగును.
నామము నియమము చేటు.
నామనుము నమ్మకంలేదు మా అమ్మను రాట్నం అమ్మబోకె (వద్దు) మను.

1 ఆనాటి అగ్రహారము
ఏనాడో కంచ్రిగాయ, ఏమని చెపుదుఁ
ఈనా డీనామాయెను;
నానాటికి తీసికట్టు నాగంభట్లూ.

నామము హెచ్చిన కామము తగ్గునా?

నామాట నమ్మింది నల్లకుక్క, ఏమాటిపోయింది ఎఱ్ఱి(ఱ్ఱ)కుక్క.

నామాట నమ్మకోకు, నాలుగెడ్ల మ్మకోకు.

నామాల వారేగాని (నీమాల) నియమాలవారు గారు.

నాముందఱ బానెదు గంజా?

నామొగనికి నాపైని ప్రాణం, నాకు తెచ్చెర మెడకు ఊనం. (ఉరి)

నా మొగుడికి నిలకడలేదంటే, మాయమ్మ ఏకులరాట్నం, అమ్మ వద్దని చెప్పిపంపింది-అన్నది.

నాయనకు పెండ్లి సంబరము, అమ్మకు సవతి సంకటము.

నాయనమ్మ ఏంజేస్తుంది? అంటే, ఒలుకబోసి ఎత్తుకొంటోంది అన్నట్లు.

నా యారాలంటే, ఏకులోడికి పోషిస్తాను అన్నదట.

నారతడప అని పారవేస్తే, నాగుబాము కఱచిందట!

నారికి రెండెల్లలు, తల్లికి రెండుపిల్లలు.

నారి తెగినా [1]నారి తెగినా అతకడం కష్టం.

నారు, నీరు, నోరు, ఉంటే ఏ రాజ్యంలో ఉన్నా ఒకటే.

నారు పోసినవాడు నీరు పోయక మానడు.

నారే నరునకు రత్నము.

నాలిముచ్చు వాణ్ణి, నీళ్ళునమిలేవాణ్ణి నమ్మరాదు.

నాలుక ఉన్నవాడు నాలుగు దిక్కులు తిరుగగలడు.

నాలుక కటువు, ఎద మెత్తన.

నాలుక తీపి, లోన (అంగిట) విషము.

నాలుక తేనె, మనస్సు విషము.

---

1 నారి = వింటి అల్లెత్రాడు; నారెకురుపులోని తీగవంటి కుసుమము. ఇదే నడుమ దెగిన ప్రమాదము-నారి- స్త్రీ అనిగూడ అర్థం కాబట్టి. స్త్రీ విచ్చలవిడి అయినను-అవి.

నాలుక దాటితే నరకము.

నాలుకలో నారాయణ, చంకలో చురకత్తి.

నాలుకా! నాలుకా! (నా) వీపుకు దెబ్బలు తేకే.

నాలుగు ఈతలు ఈనేసరికి నక్క [1]నాంచారిఅయింది.

నాలుగు ఈతల పీత పాతాళగంగ అయింది.

నాలుగువర్లు, కుక్కకు తడుపుతడుపే! (గతుకునీళ్లే)

నాలుగుకాళ్ళ జీవాలలో మేకమెత్తన, రెండుకాళ్ల జీవాలలో కోమటి మెత్తన.

నాలుగు వర్షాలు కురిస్తే, నత్తకాయ (గుల్ల) నాయకురాలు.

నాలుగేళ్లు నంజుకొని, నడిమేలు గుంజుకో.

నాళ్లలో కెల్లా చిన్ననాడే మేలు.

నావీపు నీవుగీరు, నీవీపు నేను గీరుతా నన్నట్లు. (ఒకరినొకరు పొగడికొనుట.)

నా వ్రేలుతో నాకన్నే పొడిచినాడు.

నాశనం-నల్ల బొగ్గులు.

నా సద్ది తెచ్చి, నీ [2]ఇడుపున పెట్టుకొని తినటమెందుకు?



## ని

నిండా మునిగిన వానికి చలేమి? గాలేమి?

నిండి దరిజేర నీయదు గుండ్లకమ్మ, కలిగి తిననీయదు గంపకమ్మ.

నిండిన కడుపుకు అన్నం, బట్టతలకు నూనె.

నిండిన కడుపు నిక్కి మాట్లాడును.

1 నాంచారి = వైష్ణవదేవి-ఏడుకొండలదేవుని తురకపెండ్లాము-బీబీనాంచారు.

2 ఇడుపు = పనివడుమ పేదదీర్చుకొనుచోటు.

నిండిన కడుపు నీతి వినదు. (ఎరుగదు)
నిండుకుండ తొణకదు.
నిండు చేరు నిలచి పాఱును.
నిండుబండికి (పేడ) చేటగూడ బరువే.
నింద లేనిదే బొందెపోదు.
నిక్కు నీలపల్లెలో, బ్రతుకు మాలపల్లెలో
నిగాదారుని పెళ్ళాం నీళ్లకొస్తుంది, సావిట్లోవాళ్లు చాటుకు జరగండి అన్నదట!
నిజ మాడితే ఉండూరు అచ్చిరాదు.
నిజ మాడితే నిష్ఠూరం.
నిజము కుఱుచ, బొంకు పొడవు.
నిజము చెప్పేది పసిబిడ్డలు, తప్పతాగినవాళ్లు.
నిజము దేవు డెఱుగు, నీరు పల్ల మెఱుగు.
నిజమునకు నింద వచ్చునుగాని, అవమానము రాదు.
నిజము నిలుకడమీద తెలుస్తుంది.
నిజమైన బంగారు నిప్పుకు వెరువదు.
నిజమైన అంకులాడికి నిష్ఠలు బహుమెండు.
నిట్టలు ద్రొక్కకు పిల్లా! అంటే, నా మగనికి నేను రెండో సంబంధం అన్నదట.
నిట్రాళ్ళ యిల్లయినా [1]నిర్వంశంగా ఉండరాదు.
నిడదవోలు తీర్పు. (రామాయపట్నం మధ్యస్థం)
నిత్య కల్యాణం, పచ్చతోరణ మన్నట్లు.
నిత్య దరిద్రుడు – నిశ్చింత పురుషుడు.
నిత్యదుఃఖికి నిమిత్తా లుండవు.

---

1 నిర్వంశం = వెదురులేకుండా; నిస్సంతుగా నని పైకి అర్థం.

నిత్యము లేనిమగడు నిత్యము వాస చేశాడట !

నిత్యమూ చచ్చేవాడికి ఏడ్చే దెవరు ?

నిద్ర చెడుతుందని నల్లి కుట్టకుండునా ?

నిద్రపోయేవాడి గోచి పెట్టుకొంటే, వాడు లేచినంతవరకే దక్కినట్లు.

నిద్రపోయిన వానిని లేపవచ్చును గాని, మేలుకొన్న వానిని ఎవడు లేపగలడు ?

నిద్రపొయ్యేవాడిది (బ-) కుడిచినంత వఱకే దక్కుట.

నిద్ర సుఖ మెఱుగదు, ఆకలి రుచి ఎఱుగదు.

నిధి అబద్ధం, బుడ్డ నిబద్ధం.

నిధి సుఖమా, రాముని సన్నిధి సుఖమా.

నిన్న ఉన్నవాడు నేడు లేడు.

నిన్న కుప్ప, నేడు ఆళ్ళు, రేపు కూడు.

నిన్న చస్తే రేపటికి మూడు, నేడుచస్తే రేపటికి రెండు.

నిన్నటి పరమమిత్రుడే నేటి పరమశత్రువు.

నిన్నా మొన్నా వచ్చిన అల్లుని (మగని) తల పగిలినందుకు కాదు, నాళ్ళనాళ్ళ రోకలి విరిగినందుకు ఏడుస్తున్నాను-అన్నదట.

నిన్ను శ్రీవైష్ణవుడు నమిలితినా.

నిప్పుకు నిప్పుకు ఉన్నంత స్నేహం.

నిప్పుకు చెదలంటునా ?

నిప్పుకూ, నీళ్ళకూ ఉన్నంత స్నేహం. (వాళ్ళిద్దరికి)

నిప్పు త్రొక్కిన కోతివలె.

నిప్పుకోడి తల ఇసుకలో దాచి వేటకానికి తాను కనబడ ననుకొన్నట్లు.

నిప్పు నడుమ బెట్టిన పూరి కాలకుండునా ?

నిప్పును కొడితే రెండగునుగాని, నీరును కొడితే రెండగునా ?

నిప్పుపై నీరుజల్లి, పాయి రాజజేసినట్లు.

నిప్పు ముట్టనిదే చేయికాలదు.
నిప్పు బంగారును పరీక్షించును, దౌర్భాగ్యము ధీరచిత్తుల పరీక్షించును.
నిప్పు రగిలించి నీళ్లకు వెదకినట్లు.
నిప్పు రాజినా, మొగము రాజినా మండక మానవు.
నిప్పుల బుట్టకు నీళ్ల బుట్ట.
నిప్పు లేనిదే పొగ రాజదు. (ఉండదు)
నిప్పులో ఉప్పు వేసినట్లు. (నిప్పుకు ఉప్పు)
నిప్పులో నెయ్యి పోసినట్లు.
నిప్పులో మొలచింది ఎండకు చస్తుందా!
నిమ్మకు నీరెత్తినట్లు. (ఎప్పుడూ మొదలంటా నెమ్ము ఆరరాదు)
నియోగిజాతి నిమ్మకాయ్య జాతి.
నియోగి నిక్కులు.
నియోగి నీళ్లకు వస్తే, బావినీళ్లు ఎండిపోయినవట.
నియోగపు ముష్టికి బనారసు సంచి.
[1]నియ్యతెంతో [2]బర్కతంత.
నియ్యోగిలేని చావడి దయ్యాల కిరవుగాక దాతలకిరవా?
నిరక్షరకుక్షి విరూపాక్ష దీక్షితులవారికి, ఇరువదియొక్క భక్ష్య మొక లక్ష్యమా!
నిర్ధనుడు మనుపీనుగ.
నిర్భాగ్య దామోదరుడికి, అభాగ్యపు అల్లుడు.
నిర్భాగ్యునకు నిద్ర, అభాగ్యునకు ఆకలి ఎక్కువ.
నిర్వాహకానికి నిమిషాలు చాలవుగాని, చెర్వాకమునకు క్షణం పట్టదు.
నిలబడ్డమ్మా! నీకేమమ్మ, కుందనపుబొమ్మా! కూర్చోవమ్మా.

1 నియ్యతి = నడవడి.
2 బర్కతు = కలిసివచ్చుట.

నిలుకడ నీళ్లకే నాచుబట్టేది.
నిలుకడలేని మాట నీళ్ల మూట.
నిలుకడలేని లింగారెడ్డి పెళ్ళాం, కొప్పులో నిప్పుబెట్టుకొని, కొరివి పెల్లి అంగడి వెళ్ళిందట!
నిలువడానికి చోటుదొరికితే కూర్చోను దొరకినట్లే.
నిలువదగనిచోట నిలువ నిందలు వచ్చు.
నిలువ నీడలేదు, పట్ట కొమ్మా లేదు.
నివాళిపళ్లాలు పట్టేవాళ్లంతా నిషేక ముహూర్తపు పెండ్లికూతుళ్లవుతారా?
నివురుకప్పిన నిప్పువలె. (నీఱు గప్పిన నిప్పువలె)
నిశ్చితార్థము నాడే నీల్లవలసింది, నాగవల్లిదాకా ఉండడం నా అదృష్టం కాదా? అన్నదట. (నా మహిమ అన్నదట)
నిష్ఠ నీళ్లపాలు, మంత్రం మాలపాలు.



# నీ

నీ ఎడమచెయ్యి తియ్యి, నా పుర్రచెయ్యి పెడతాను అన్నట్లు.
నీ కంటనుండే దూలంమరచి ఎదుటివానికంట నలుసు ఎన్నకు.
నీకత్తికి రెండుప్రక్కలా పదును (రెండువాధరులు)
నీకు ఆయన ఏమికావలె? అని అడిగితే, త్రోవలోపోతే "వారు" కావలె అన్నదట.
నీకెక్కడ అనుమానమో నాకూ అక్కడనే సందేహం.
నీకు ఎక్కడ సంశయమో, నాకు అక్కడే సందేహం.
నీకు ఒకదండం, నీబువ్వ కొకదండం.
నీకు ఓపిక ఉండాలగాని, నేను కనలేకపోతానా-అన్నదట.
నీకు నాకు పడదు గోలెక్కి తలంబ్రాలుపోయి.

నీకు బెబ్బెబ్బే నీయబ్బకూ బెబ్బెబ్బే.

నీకు మూతికి మీసాలుంటే నాకు ముంజేతికి వెంట్రుకలున్నవన్నదట-
పల్నాటినాయకురాలు నాగమ్మ బ్రహ్మనాయకునితో.

నీకు రానిది, నేను విననిది, లోకములో లేనిది చెప్పమన్నట్లు.

నీకు సిగ్గూ లేదు, నాకు ఎగ్గూ లేదు. ఎప్పటిమాదిరే వచ్చిపోతుండ
మన్నదట (మిండని)

నీ కూడుతిని, నీ గుడ్డకట్టి, నాకు కాపురం చేయమన్నాడట.

నీచంక నేమిటోయీ? అంటే, నాచంక నాకయ్యా (చంకన-ఆకు)
అన్నాడట.

నీకులానికి సొడ్డంటే, చిన్నప్పుడే వదలివేసినా అన్నదట.

నీచెవులకు రాగిపోగులే అంటే, అవీ నీకు లేవే అన్నట్లు.

నీకేమి తేరగాడవు! [1]నూకేవేగాని, కడుపు నొప్పెరుగవు.

నీచుకాడ చూడరా పాచుగాడి గుణం. (మాంసము, చేపలపంపక
ములో పట్టింపులు ఎక్కువ)

నీటకాకి మీనుమునుగ నిరతము దయ స్నానమగునా.

నీటికి కలువ, మాటకు చలువ.

నీటికి నాచు తెగులు, నాతికి రంకు తెగులు.

నీటికి (నాచు) పాచి తెవు(గు)లు, మాటకు మాట తెవులు. కులానికి
కులం తెగులు.

నీటికొలది తామరతూడు. (తామరలకు)

నీటిపైన గుండు నిలుచునా మునుగక.

నీటిలో జాడలు వెదకినట్లు.

నీటిలో కప్ప నీరు త్రాగకుంటుందా?

---

1 నూకుట = దొబ్బుట అనుట; నూకులు = ఎత్తుడు ప్రయత్నాలు. పీకెలు అనిగూడ.

నీ తలమీద తేలు ఉన్నదంటే, నీ చేతితోనే కాస్త తీసివేయమన్నాడట.

నీతిలేనివాడు కోతికంటె బీడు.

నీతివర్తనమును, కీర్తి దాని క్రీనీడవలె వెన్నాడుచుండును.

నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు.

నీదుండే తీరుకు చూపాలనా, బట్ట బాగేసుకో.

నీ దున్నడంలో ఏముంది? ఉండేదంతా నా చల్లడంలో ఉంది.

నీ [1]పత్తుపణం పాడుగాను, నా [2]ఒరుపణం కుప్పలు పెట్టు.

నీ పప్పూ, నా పొట్టూ కలిపి ఊదుకతిందాం అన్నట్లు.

నీ పీకెలు సాగవు.

నీ పెండ్లాం ముండమోస్తే, నీకు ఎవరు అన్నం వండిపెడతారు అని అడిగినాడట.

నీ పెండ్లి పాడాలవుంది, నా పెండ్లికివచ్చి కాగడా ([3]మషాల్జీ) వెయ్యి అన్నట్లు.

నీ పెండ్లిపాడైంది నా పెండ్లికి తాంబూలానికి రమ్మన్నాడట!

నీ పెండ్లి [4]పాసుగాల, నాతద్దినం చూడ మన్నట్టు.

నీ పెండ్లి పాసుగాలిందిలే, నా పెండ్లికి దివిటీలు పట్టమన్నాడట.

నీ పేరంటమే అక్కఱలేదంటే, కరకంచుచీరకట్టుకొని వస్తానందట!

నీపై ఎసలేదు, నాపై ఎసలేదు, ఏడుసేర్ల తప్పేల కెసరుపెట్టమను.

నీ బత్తెగొడ్డును ఎవరు కాస్తారు? చూస్తాము అంటే, నాతిత్తిలోని డబ్బే కాస్తుంది అన్నాడట!

---

1 పత్తు = పది. (తమిళం) 2 ఒరు = ఒకటి (తమిళము.)

3 మషాల్జి = చాకలి (దివిటీలుపట్టేవాడు)

4 పాసు = ఏపు; దుంపతెగ-అన్నట్లు.

నీ బిచ్చానికి ఒకదండము కాని, నీ[1] బేపిని కట్టెయ్యి.

నీ బిచ్చానికితోడు ఏడుజోలెలా.

నీమంకోసం నామంపెడితే, నామం నాకొంప తీసింది. (నామంచూచి, భోజనం చేసినాడనుకొని, అన్నానికిపోతూ పిలువలేదట)

నీ మగనికి రాగిపోగులే అంటే, నీమగనికి అవీ లేవే అందట!

నీమాలకత్తె నిమ్మతో మడిగుడ్డ ఆరవేయబోతే, మడత వీడి మాదిగవాడ (మాదిగాడ) కుక్కమీద పడిందట.

నీ ముక్కున చీమిడేమమ్మా! అంటే, నీచేతితోనే అటు తుడిచిపొమ్మనదట!

నీ మొగాన పొద్దుపొడిచినట్లు నిక్కుతావు.

నీర మోటికుండ నిలువని చందాన.

నీరధికి నీరు మోసినట్లు.

నీరుండేదాకా మీను మిట్టిపడుతుంది.

నీరు ఉంటే ఊరు లేదు, ఊరు ఉంటే నీరు లేదు.

నీరు ఉంటే నారు ఉండవలె.

నీరు ఉంటే పల్లె, నారిఉంటే ఇల్లు.

నీరు ఉన్నచోటనే బురద.

నీరుకట్టువా(గా)డు తన మడి ఎండబెట్టుకోడు.

నీరు, నీరు వంకకే పాఱునుగాని మిట్టలకెక్కను.

నీరు నూనె కలుస్తాయా?

నీరు పల్లమెఱుగు, నిజము దేవుడెఱుగు.

నీరులేని తావున మెట్టఅని, ఇల్లు కట్టుకున్నట్లు.

నీరులేని పైరు, నూనెలేని ఒత్తి. (జుట్టు)

---

1 బేపి = కుక్క. (వేవే)

నీరుల్లి నీటిలో కడిగితే కంపేడ పోతుంది?

నీరు విడిచిన మొసలి–నీరు విడిచిన చేప.

నీరు సొరక లోతు నికరము తెలియదు.

నీరెంతపోసి పెంచినా నేలవేము కూరకాదు.

[1]నీఱు గప్పిన నిప్పు.

నీలి నీళ్ళకు పోతే, నీరు లోతుకు పోయింది.

[2]నీలి మాటలు, గాలి మూటలు.

నీళ్ల పట్టున నేయి మందా?

నీళ్లమూట వంచకుడి మాట ఒక్కరీతి.

నీళ్ళలో నిప్పు పెట్టి, కాలకుంటే కడుపు కొట్టుకొన్నట్లు.

నీళ్లలో నిమ్మలు బ్రతికినవి, అడవిలో తుమ్మలు బ్రతికినవి.

నీళ్లలో మునిగిఉన్న వానికి నిప్పు భయం లేదు.

నీళ్లాటని చేతికి నిధానా [3]లాటవు.

నీళ్లాటని ఇంట నిధానాలాటవు.

[4]నీళ్లు తాగే వానికి (వానిమాటకు) నిలుకడలేదు.

నీ వగలమాటలకు నామగని చంపుకుంటి.

నీవు ఒకందుకు పోస్తే, నేను మరొకందుకు తాగుతున్నాను.

నీవు కాదు, నీతల్లో పేనుగూడ మాటవింటుంది.

నీవు క్షుద్రకీటకమువలె ప్రవర్తిస్తూ ఇతరులు కాళ్ళక్రింద తొక్కనా
రనుట ఎందుకు?

నీవు చస్తే లోకమంతా ఎముకలా?

నీవు దంచు, నేను పక్క (రెక్కలు) లెగుర వేస్తాను.

---

1 నీఱు = బూడిద; మసి.

2 నీలిమాట = నిందలు.

3 ఆటు = ఆగు; మను.

4 నీళ్లు = కల్లు.

నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష!

నీవు పాడినదానికి, నేను విన్నదానికి సరిపోయింది; తలూపినదానికి తంబూరా బెట్టిపో.

నీవు పెట్టకపోయినా, పెట్టే ఇల్లు చూపు.

నీవు వచ్చేవాలకం చూస్తే తిట్టేటట్లున్నది, నీవే మాదిగ లంజా కొడుకవి.

నీవు వెడితే బూతులు తిట్టివస్తావు. నేను వెడితే అమ్మను ఆలిని తిట్టివస్తాను.

నీవెక్కు-నీవెక్కు అన్న మర్యాదలు జరిగే లోపలే బండి వెళ్లిపోయిందట. (హైదరాబాదు మర్యాదల తీరు)

నీసరి వేల్పులు లేరు, నాసరి దాసులు లేరు.

నీ [1]సాకు చట్టుబండలు కాను, నాలుగు [2]బేకులు బేక మన్నాడట! (అన్నం వడ్డనలో).

నీ సోకే సొంతాకు, నీ ముఖమే బీరాకు, నావంక చూడబోకు, నా కసలే చిరాకు.



1 సాకు = చాలు.

2 బేకు = చాలదు (వలదు అనుట. ఇవి కన్నడపదములు).

## ను

[1]నుచ్చు గట్టిన రొమ్ము-కంపలో గాచిన గాయ ఒకటే. (ఉపయోగ పడవు)
నుదుట వ్రాయనిదే నోట పలుకదు.
నుదురు బత్తుడు, నోరు తోడేలు.
నుయ్యి తియ్యబోతే, దయ్యం బయట పడినట్లు.
నుయ్యి దాటేవానికి చింతాకంత ఎడమైనా ఎడమైనట్లే.
నువ్వుకు నూరు రోగాలు. (తెగుళ్లు)
నువ్వు చస్తే బొబ్బర్లు.
నువ్వులకు ఏడు దుక్కులు, ఉలవలకు ఒకే దుక్కి.
నువ్వులకు తగిన నూనె.
నువ్వులూ నూనె ఒకటి, నూనె (గాండ్ల) గమళ్లవాడే వేఱు.
నువ్వులు వేసి, ఆవాలు పండమన్నట్లు.



## నూ

నూకల కేడ్చి యేడ్చి, తవుడు కేడ్చినాడట!
నూకల సంకటికి నూనెధార!
నూటికి నూలుపోగు, కోటికి గోవుతోక.
నూటికి పెట్టి, కోటికి గొరగించినట్లు.

---

1 నుచ్చు (పాత) = గొఱ్ఱెల మేకల పాలు పొలాలలో పిల్లలు త్రాగకుండా చన్ను లకు కట్టు గుడ్డపేలిక. దీనిని ఉచ్చలో తడిపి, ఆరబెట్టి, నెమ్మజేసి, రొమ్ముల చుట్టు చుట్టినచో అది గట్టిగా అతుకు కొనిపోవును. వాసనకు పిల్లలు పాలు ద్రాగవు. దీనివల్ల పొదుగు నిండా పాలు ఉండును. దీనిని నుచ్చుగట్టుట లేక, పెట్టుట అందురు.

నూటిని పొడిచి [1]సెలగ అనినట్లు.
నూటివరకు నన్ను కాపాడితే, ఆతరువాత నిన్ను కాపాడుతా.
నూత పడెదవా? పాతర పడెదవా?
నూతి కప్పల విధానం (కూపస్థ మండూకం).
నూతి కప్పకు సముద్రం సంగతేమి తెలుసును?
నూతి దరిచేరి, నోట గొణిగితే ఈత వస్తుందా?
నూతిలో నీరు తోడుకోవాలిగాని, తనంతటతానే పైకివస్తుందా?
నూతిలో పడబోయి [2]తాప వెదకినట్లు.
నూనె అన్నం తిని, నూతికి కాళ్లు జాపిందట!
నూనె కొలిచిన గిద్దకు జిడ్డు కాదా?
నూనెతో మండే దీపం నువ్వులతో మండునా?
నూనెలేని వత్తి ఎగదోస్తే నేమి? దిగదోస్తే నేమి?
నూరి భరించలేనమ్మ, తాగి భరిస్తుందా?
నూరు అప్పడాలకు ఒకటే సొడ్డు.
నూరు ఆవులలో ఒక ఆవు [3]ఈచుకపోతే లెక్కేమిటి?
నూరు కల్లలాడి అయినా, ఒక ఇల్లు నిలుపమన్నారు.
నూరు కాకులలో ఒక కోకిల.
నూరు కొరడా దెబ్బలైనా ఒక బొబ్బట్టుకు సరిరావు,
నూరుగుడ్లు తిన్న రాబందుకైనా ఒకటే గాలిపెట్టు.
నూరు గుత్తాలకు అధికారి, ఇంటభార్యకు ఎండుపూరి.

---

1 సెలగ=కొలుచుటలో గాని, లెక్కించుటలో గాని, ఒక సంఖ్యను నిర్ణయించుకొని (20, 50, 100) ఆ సంఖ్య వచ్చినప్పుడు అంకెకు బదులు సెలగ అని అందురు. (పందొమ్మిది-సెలగ).

2 తాప=తెప్ప.

3 ఈచుకపోవుట=చచ్చినదూడను వేయుట.

నూరు గోవిందలు పెట్టవచ్చు కాని, ఒక్క దాసరికి పెట్టడం కష్టం.
నూరుతిట్టినా ఒక గుమ్మడికాయ (బద్ద) ఇస్తే సరి.
నూరు నోములు ఒక అంకుతో సరి (వ్యర్థమైపోవును).
నూరు పూసలకు ఒకే కొలికి!
నూరు భక్షణము లున్నా నోటి కబ్బినంతే.
నూరు మంది గుడ్డివాళ్లు నూతిన బడితే, కన్నున్న వాడొకడు గడ్డకు ఎత్తును.
నూరుమంది మొండిచేతులవాళ్లు పోగై, గొడ్డుగేదె పాలు పితికినట్లు.
నూరుమందిలో నూనెబిడ్డ ముద్దు.
నూరుమాటలు ఒక వ్రాతకు ఈడుకావు.
నూరు వరహాలకు నూలుపోగన్నట్లు.
నూరేండ్లు చింతించినా నొసటి వ్రాలేగతి.
నూలుబట్ట నూరేండ్లు కడతామా?

# నె

నెగడాశే[1] గాని, మొగుడాశ లేదు.
నెత్తి కాలనిదే జోలె నిండదు.
నెత్తిన నోరుంటే పెత్తనం సాగుతుంది.
నెత్తిన మాటకు సుంక మడిగినట్లు.
నెప్పరగత్తి పప్పు లొండితే, వడిగలమ్మ ఒళ్లో బెట్టుకోని పోయిందట.
నెమలి కంటినీరు వేటకానికి ముద్దా?
నెమలి కూసినట్లు పికిలి కూయబోయి పిత్తుక చచ్చిందట.
నెమలిని చూచి, నక్క నాట్యమాడినట్లు.

---

1 నెగడు = చలిగాచుకొనుటకు పెద్దమొద్దులు వేసిన మంట. ఇది ఆరిపోదు.

నెయ్యానికైనా, కయ్యానికైనా సమత ఉండాల.
నెయ్యి అని అరచి, నూనె అమ్మినట్లు.
నెరిధనమును దాయల (దాయాదుల) కిచ్చితే నెనరు మాటలు
కలుగునా?
నెఱజాణ నేరననును, నేర్తు ననువాడు నింద పాలగును.
నెల అంకులాడికి నిష్ఠ మెండు.
నెల తక్కువైనా రాజుఇంట పుట్టమన్నారు. (కాపింట; కోమటింట)
నెల తక్కువైనా మగపిల్లవాడే మేలు.
నెల బాలుడికి నూలుపోగు.
నెలవు దొంగ ప్రాణం చుట్టు.

# నే

నేటి కవులు సిరాలో ఎక్కువ నీళ్లు కలిపి వ్రాస్తున్నారు.
నేటి బిడ్డే రేపటి తండ్రి.
నేటి విత్తే రేపటి చెట్టు.
నేడు గంత వేసి, రేపు ఎక్కినట్లు.
నేడు నవ్వు, రేపు (మఱునాడు) ఏడ్పు.
నేడు నిప్పు, రేపు [1]నీఱు.
నేతికుండ నేలబెట్టి, ఉత్తకుండను ఉట్టిమీద పెట్టినట్లు.
నేతిగూన (గిన్నె) చేతబూని, నిచ్చెన ఎక్కినట్లు.
నేతిబీరకాయ; విభూతిపండు; జీలకర్ర. (సామ్యము; బీరలో
నేయి లేనట్లు)
నే నాడేదే బండిసిడి ఆట మా పెదబావ చూస్తాడంటే ఎలా!
నేను పుట్టకపోతే నీకు పెండ్లామే లేకపోవునే అంటే, నీవు పుట్టక
పోతే నీ తల్లినే పెళ్ళాడి ఉందు నన్నాడట!

1 నీఱు = విపురు; బూడిద.

నేను పోతే మజ్జిగ నీళ్లకు దోవలేదుగాని, నాపేర చీటిపోతే పెరుగు పంపుతారు అన్నాడట.

నేను మందు తింటా, నీవు పథ్యము ముందు అన్నట్లు.

నేను లేకపోతే ఎవణ్ణి పెళ్లాడుదు వంటే, నీ అబ్బంటోడు ఇంకొకడు పుట్టి వుంటాడన్నదట.

నేనూ ఒక్కపొద్దే, నా మగడూ ఒక్కపొద్దే, పిండీ బియ్యం లేక పిల్లలూ ఒక్కపొద్దే.

నేనూ బండెద్దు నని గుద్దకు పేడ రాసుకొన్నట్లు.

నేములు కాచిన భూములు పండును.

నేయిచెడి నూనెచెడి పొగమాత్రం మిగిలింది (హోమం)

నేరక నేరక నేరేళ్లు తినబోతే, నేరాలు ఒడిగట్టినట్లు.

నేరము కలిగిన చోటనే కారుణ్యము.

నేరేళ్లు నగ్గేది, మారేళ్లు (మామిళ్లు) మగ్గేది – మంచి కాలానికి లక్షణం.

నేరేళ్లు పండితే నేలలు పండును.

నేర్చి చెప్పిన మాట నెరవాది మాట.

నేర్చినమ్మ ఏడ్చినా బాగుంటుంది.

నేర్చిన బుద్ధి ఏర్చినా పోదు.

నేర్చి బ్రతికినవాడు, నేర్వక చెడ్డవాడు లేదు.

నేర్పుగలమ్మ నేతితో అతిరసాలు కాలిస్తే, ఓర్పుగలమ్మ ఒడిలో గట్టుకొని పోయిందట !

నేర్చుబో చంకల బిడ్డలాడిపడ సారసలోచన మాటలాడగన్.

నేర్పులేనివాని నెరయోధు డందురా ?

నేలది తీసి, నెత్తికి రుద్దుకొన్నట్లు.

నేలమీద యీత నేర్చుకొన్నట్లు.

నేలమీద వ్రాసిన బూరెను ఇంత తింటావా ? అంత తింటావా ? [అన్నట్లు.

నేలమునగకు నిచ్చెన వేసేవాడు.
నేల మెత్తనిదని మోచేత త్రవ్వినట్లు.
నేల విడిచిన సాము - తాళం విడిచిన పాట.
నేల విడచిన సాము - నీరు విడిచి ఈత.
నేల విడిచిన సాము, మతి విడిచిన మాట.
నేసేవాణ్ణి నమ్ముకొని పొలిమేర జగడం ఒప్పుకొన్నట్లు.

## నై

నైజ గుణానికి, గుడ్డికంటికి మందు లేదు.

## నొ

నొచ్చినవాడా నువ్వులు చల్లుమన్నట్లు.
నొచ్చి నొసట పలుకదు, వచ్చినవాని విడువదు.
నొప్పించక తానొవ్వక తప్పించుక తిరుగువాడె ధన్యుడు.
నొప్పు లెత్తుకున్నప్పుడే మంత్రసానికి దెప్ప సందు.
నొయ్యకుండా చేస్తే కొయ్యకుండా పండును.
నొసట పళ్లు లేవు, నోట్లో కళ్లు లేవు.
నొసట నామాలు, నోట బండబూతులు.
నొసటిమీది వ్రాత నులిమిన బోవునా?
నొసట వ్రాసిన వ్రాత నులిమితే చెడదు.
నొసట వ్రాసిన వ్రాలు (వ్రాత) చెరిపే దెవరు?
నొసటన్ వ్రాసిన వ్రాలుకన్న కలదా వేయేండ్లు చింతించినన్.
నొసలు భక్తుడు నోరు తోడేలయా.

## నో

నోచిన వారి సొమ్ములు నో(య)మని వారికి వచ్చునా?

నోటిఆయి రొమ్ముకు తగులుతుంది.

నోటికి తీపి, పొట్టకు చేటు.

నోటికి చేతికి చీకటి లేదు.

నోటికి తీపు, ముడ్డికి చేటు.

నోటికె మీారిన కడి మింగరాదు.

నోటికీ చేతికి ఎంగిలి లేదు.

నోటి జిగటే గాని, చేతి జిగట లేదు.

నోటితో లేదనేది చేతితో లేదంటే సరి.

నోటిమీాద కొడితే పెడతల వాసిందట.

నోటి వక్రం గంజి పెడమూాట.

నోటి వట్టం, గంజి పెడపూాట.

నోట్లో (టిలో)చక్కెర, కడుపులో కత్తెర.

నోట్లో నూావుగింజ (అయినా) నానదు.

నోట్లో ముద్ద గూాట్లో దీపం (జైనులు దీపాలు పెట్టేదానికి ముందే భోజనం చేస్తారనుట)

నోట్లో వేలుబెట్టితే కరవనేరని నంగనాచి

నోరంతా పళ్లు, ఊరంతా అప్పులు.

నోరు అంబాలపు (అప్పాలపు) పండు, చెయ్యి(బ)బులుసు ముల్లు.

నోరు ఉంటే, ఊరు ఉంటుంది.

నోరు ఉంటే, పోరు గెలుస్తుంది.

నోరు ఉన్న, తల గాచును.

నోరు ఉన్నవాడిదే రాజ్యం (ఊరు).

నోరు కల్లలపుట్ట, పేరు హరిశ్చంద్రుడు.
నోరు చేసే ఆఘాయిత్యానికి ముడ్డి ఉందిగనుక భరిస్తున్నది.
నోరు నవ్వడం, నొసలు వెక్కిరించడం.
నోరు పెట్టుకొని గెలవవే ఊర గంగానమ్మా!
నోరు మంచిదయితే, ఊరు మంచి దవుతుంది.
నోరు మాట్లాడుతుంటే, నొసలు వెక్కిరించినట్లు.
నోరు మూస్తే మూగ, నోరు తెఱిస్తే [1]తాగ.
నోరు మూస్తే నొసలు మాట్లాడినటు. (వాగినట్లు)
నోరు మూస్తే పెడతల మాట్లాడినట్లు.
నోరులేని దయ్యం ఊరు ఆర్చిందట.



## న్యా

న్యాయ మమ్మువాడు, దోవలు దోచువాడు ఒకటి.
న్యాయము చెప్పు నాగిరెడ్డీ! అంటే, నాకూ ఇద్దఱు పెళ్లాలే అన్నాడట!
న్యాయము తప్పినవానికి ఆచార్య కటాక్ష మెందుకు?



1 తాగ = గయ్యాళి.

## ప

పంచపాండవు లంటే నాకు తెలియదా? మంచపుకోళ్ళవలె ముగ్గురు
అని రెండు వ్రేళ్లు చూపించాడట!
పంచమినాడు పల్లకి ఎక్కనూ లేదు, అష్టమినాడు జోలి పట్టనూ లేదు.
పంచశుభం పంచాశుభం.
పంచాంగం పోగానే నక్షత్రాలు ఊడిపోతాయా!
పంచాగ్ని మధ్య మందున్నట్లు.
పంచినవాళ్ళకు పళ్లు నోరు.
పంచె కేలరా పత్తిధర?
పంజకు ధైర్యము, కల్లుముంతకు ఎంగిలి లేవు.
పంజరం అందంగా వుంటే, పక్షికి సంతోషమా?
పంజరంలో కాకిని పెట్టగానే పంచమస్వర మాలపిస్తుందా?
పంటకురాని చేలు, పరిభావ మెరుంగగ లేని ఆలు.
పంటకు పెంట, వంటకు మంట.
పంటచేను విడిచి పరిగ ఏరినయట్లు.
పంట పెంటలో ఉన్నది, పాడి పూరిలో ఉన్నది.
పంటి పాచి పోయిన, యింటిహీనం పోతుంది.
పండని ఏడు పాటు ఎక్కువ.
పండని కోర్కెలే బొంకులు.
పండని నేల పందుం కంటే, పండేనేల కుంచెడే చాలు.
పండని నేల పుట్టెడు కంటే, పండేనేల పందుం చాలు.
పండాకును చూచి పసరాకు (పచ్చాకు) నవ్వినట్లు.
పండాకు రాలుతుంటే, కొత్తాకు నన వేస్తుంటుంది.
పండాకు రాలుతుంటే, పసరాకు నల్లబడుతుంది.

పండించేవాడు పస్తుంటే, పరమాత్మకూ పస్తే!
పండిత పుత్రుడు శుంఠ.
పండితమ్మన్యునకు పాదుకాపట్టాభిషేకం!
పండిన దినమే పండుగ.
పండినా, ఎండినా పని తప్పదు.
పండియు పొల్లు బోయిన పంట.
పండు కాయుండగా, కసుగాయ తెంచినట్లు. (కోసినట్లు)
పండుగ తొలినాడు గుడ్డల కఱవు, పండుగనాడు కూటికఱవు, పండుగ మఱునాడు మజ్జిగ కఱువు.
పండుగనాడు కూడ పాత మొగుడేనా? అన్నదట.
పండుగనాడు కూడ పాత పెళ్లామేనా?
పండుగ పైన దండుగ.
పండు జారి పాలలో పడ్డట్టు.
పండు (పండుకొను) పడకకు చెప్పకుండా పోయినాడు.
పండుపడిన చెట్టు పట్టంగ నేర్చునా.
పండేపంట పైరులోనే తెలుస్తుంది.
పండ్ల చెట్టు కింద ముండ్లకంప ఉన్నట్టు.
పండ్లు ఉన్నవానికి పప్పులు లేవు, పప్పులున్నవానికి పండ్లు లేవు.
పండ్లు చెట్లకు భారమా?
పండ్లూడ గొట్టుకోను ఏరామైతే నేమి?
పండ్లూడిన కుక్క పసరాన్ని కరువదా.
పండ్లూడిన కుక్కను పసరమైన కరచును.
పంతులకు కట్నాలు, మాకు పట్నాలు.
పంతులు గింతులు, పావుశేరు మెంతులు, ఎగరేసి కొడితే ఏడు గంతులు.

పంతులు పెండ్లాము మొంతులు లేక, గంతులు వేసిందట.

పంది ఎంత బలిసినా నంది కాదు.

పందికి పారు లేదు, తవిదకు తప్పు లేదు.

పంది కేమి తెలుసురా పన్నీరు వాసన?

పంది కేలరా పన్నీరు బుడ్డి?

పందికొక్కును పాతరలో పెడితే ఊరుకుంటుందా?

పందికొక్కుమీాద బండికల్లు (చక్రం) పడ్డట్టు.

పందిగా పదేండ్లు బ్రతికేకన్నా, నందిగా నాలుగేండ్లు (బతికేది మేలు) బతికితే చాలు.

[1]పందిని పొడిచిననాడే బంటు (తవిలిచను పందినేయని వివిధాయుధ కౌశలంబు వృథరా)

పంది పందిగూడి పడుగదా రొంపిలో.

పంది పాతఅప్పులు తీరుస్తుంది, కోడి కొత్తఅప్పులు తీరుస్తుంది.

పందిపై ఎక్కి పీతికి రోస్తే ఎట్లా?

పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా?

పందిమాాదిరి కుక్కను మేపి, దొంగలొస్తే ఆలుమగలే అరచినారట.

పందిరి ఇల్లు కాదు, పరదేశి మొగుడు కాదు.

పందిరి పడి చచ్చినవారు, ఇల్లుపడి బతికినవారు లేరు.

పందిరే పర్వతము, ఇల్లే ఇంద్రలోకము!

పందిలాగ కని, పరగళ్ళమ్మ పాలు చేసినట్లు.

పందిళ్లు పైన పరువు లెత్తనా.

పండులు తినేవాని పక్కనే ఏనుగులు గుటకేసేవా డుంటాడు.

పందుము తిన్నా పరగడుపే, ఏదుం తిన్నా ఏకాదశే!

పకపక నవ్వేవాడు, గబగబ అరచేవాడు కపట మొటుగరు.

1 అడవిపంది వేట చాల కష్టము, అపాయకరము.

పక్షిర్లను కొట్టి, పఠానులకు పెట్టినట్లు.

పక్క-ఇంటి పోరు పండుగంత వేడుక.

పక్క-వాటుగా నడచే ఎండ్రకాయను చక్క-గా నడిచేటట్లు ఎవరు చేయగలరు.

పక్క-లో బల్లెము.

పగ గలిగి బ్రతకటం, పామున్న ఇంట్లో బ్రతకడం ఒకటే.

పగటి మాటలు పనికిచేటు, రాత్రిమాటలు నిద్రకు చేటు.

పగటి [1]మాషాజికి (మషాల్జి) అనుమతి ఎవరిచ్చారు? అంటే, నా ఆముదపుచేను ఇచ్చిందన్నాడట!

పగడము లేని ఇల్లు, జగడము లేని ఇల్లు ఉండవు.

పగతో పొరుగిల్లు కాల్చవచ్చునుగాని, తనయిల్లు కాపాడ తరము గాదు.

పగబట్టిన త్రాచు కాటువేయక మానుతుందా?

పగలు ఎండ, రేయి చీకటి ఎప్పుడు దున్నుతావే దున్నపోతా?

పగలు కొంగులాగితే ఛీ! అంటే, రాత్రి చీకటిలో కన్ను గీటాడట!

పగలుచస్తే [2]వాతికి లేదు. (వాతబియ్యం లేవు) రాత్రి చస్తే దీపానికి లేదు.

పగలు చెయ్యూపితే రానిది (ఆడుది) రాత్రి కన్ను గీటితే వస్తుందా.

పగలుచూస్తే రాత్రి కలలో వస్తుంది అన్నట్లు.

పగలు, దాని గుణం చూచి, రాత్రి దాని వెంట వెళ్లాలి.

పగలు నిద్ర పనిచేటు, మాపు జాగరణ పైచేటు.

---

1 మాషాజ = దీపములుపట్టువాడు. మషాజీచూడు-పగటిదివిటీ = పూర్వం పగలు దివిటీ వేయుట పెద్దవారికి రాజులకు లాంఛనంగా ఉండేది. ఇప్పటి దేవాలయోత్సవాలలోవలె.

2 శవానికి నోట కొన్ని బియ్యపుగింజలపెట్టడం, తలమాటికాడ దీపం వెలిగించి పెట్టడం ఆచారము.

పగలు పక్క చూచి మాట్లాడు, రాత్రి అదీ మాట్లాడవద్దు.
పగలు పప్పేసిన [1]పయ్యేందుకు పగులు పెండ్లామా? నిత్య బూరెలు చేస్తే నిన్నెందుకు కొడుదు పెండ్లామా!
[2]పగలు పాతర లుండవు.
పగలు ఉపస్థ వెడల్పు, రాత్రి నీళ్లు వెడల్పు.
పగలు బట్టలే కన్పించకున్న, మాపు గొట్టెలు కన్పిస్తాయా?
పగలు చత్వారి, రాత్రి రేజీకటి.
పగలెల్లా బారెడు నేసినాను, దివ్వె తేవే దిగనేస్తాను అన్నదట.
పగవాణ్ణి పంచాంగ మడిగితే, మధ్యాహ్ననికి మరణ మన్నాడట.
పగవానియింట పదిబిచ్చాలు పోయినా పోయినవేను!
పగవారిని చెరబట్టక ముద్దాడ వత్తురా?
పచ్చగా ఉంటే పదిమంది చుట్టాలు.
పచ్చగా ఉంటే పారాడేది. వెచ్చగా ఉంటే వెళ్లిపోయేది.
పచ్చగా ఉన్నవాళ్లకు ఎదుటివాళ్ల వెచ్చన తెలియదు.
పచ్చగా ఉన్నదగ్గఱ మేసి, వెచ్చగా ఉన్నదగ్గఱ పండు.
పచ్చడ మున్నంత కాళ్ళు చాచు.
పచ్చని పందిట్లో పట్టుకున్న పిశాచి ఎక్కడికీ పోదు.
పచ్చని పైకము గుఱ్ఱం చచ్చినదాకానే.
పచ్చని వరహాకంటే పుచ్చిన గింజ మేలు.
పచ్చికంపులే దాసరీ! అంటే, రాలినకాడికే గోవిందా అన్నాట్ట!
పచ్చికంపులోయీ దాసరీ అంటే, రాలినవరకే రామార్పణం అన్నాడట.
పచ్చికాయ తుంచిన పండవుతుందా!

1 పై = దేహము పై భాగము. (వీపు)
2 పగలు = స్పర్థలు-విరోధాలు

పచ్చికుండలో నీళ్లుపోయి, నీ పాతివ్రత్యం తెలుస్తుంది అన్నట్లు.
పచ్చిపేడను తంతే, పదహారు వక్కలయ్యే ప్రాయం.
పచ్చివెలగకాయ గొంతులో పడ్డట్లు.
పటేలువారి వడ్ల పుణ్యాన, మా యత్త ముడ్డిపుణ్యాన తింటినమ్మా పులటికూర మెతుకులు.

పట్టణానికి పోయిన గాడిద, పల్లెకు పోయిన గాడిదను కఱచిందట!
పట్టపగలు కన్నంవేస్తా వేమిరా అంటే, నా కడుపు కక్కుర్తి నీకేమి తెలుసును? అన్నాడట!

పట్టపురాజు చేపట్టగానే [1]గుడిసేటి ముండకు గుణము రాదు.
పట్టినదెల్లా బంగారం, ముట్టినదెల్లా ముత్యం.
పట్టినవాడు (పట్టుకొన్నవాడు) తాబేలు అంటే, గట్టున నున్నవాడు కుందేలు అన్నట్లు.
పట్టినవాడు [2]పక్కి అంటే. గట్టునున్నవాడు [3]జెల్ల అన్నట్లు.
పట్టినవాడు పరిగపిల్ల అంటే, పట్టనివాడు మట్టపిల్ల అన్నాడట.
పట్టినవాడు [4]మట్టగుడిసె అంటే, ఒడ్డున నున్నవాడు జెల్లపిల్ల అన్నట్లు.
పట్టిపట్టి పంగనామం పెడితే, గోడచాటుకెళ్లి గోకేసుకున్నాడట!
పట్టివిడిచిన ముండకు పటాటోపం జాస్తి.
పట్టివిడిచిన ముండ, (మగడు విడిచినముండ) మబ్బువిడచిన ఎండ.
పట్టి విడుచుటకంటె, ప్రాణం విడుచుట మేలు.
పట్టిసం తీర్థానికి పత్తిగింజలంత - మామిడిపిండెలు.

---

1 గుడిసేటి = గుడికి చేటి-దేవదాసిఅని మొదట; ఇప్పుడు విడిచినది, వ్యభిచారిణి అని.
2 పక్కి = చిన్న పెడల్పు చేప.
3 జెల్ల = తేలువలెకుట్టే చిన్నచేప: తేలుకన్న కాటు ఇంకా బాధ ఎక్కువ.
4 మట్టగుడిసె = నల్లటి చిన్నచేప.

పట్టు క త్తిరించినట్లు మాట్లాడినా మనసేమో పలుగురాయి.
పట్టుకొమ్మను నరుకుకొన్నట్లు.
పట్టుగుడ్డకు, భ్రష్టముండకు అంటు లేదు.
పట్టుచీర ఎరవిచ్చి, పీటపట్టుక వెంట తిరిగినట్లు.
పట్టు పట్టరాదు, పట్టి విడువరాదు.
పట్టుపట్టు మనేవాళ్లుగాని. పట్టేవాళ్లు ఒక్కరూ లేరు. (పట్టే ఒక్కనాయాలూ లేదు).
పట్టుపట్లమీదకు బావ పిలిస్తే, మరచి మామపక్కన పడినట్లు.
పట్టుపుట్టము తొత్తుకు కట్టబెట్టిన పేడమరకలతో పాడు చేయు.
పట్టెడు బొట్టుంటే పదిలక్షలు. (సుమంగలిగా నుండె ననుట)
పట్నం దగ్గరకు వచ్చి, పల్లెలో రత్నపరీక్ష చేయించినట్లు.
పట్నంపోయి పుట్నంగింజ తెచ్చాడన్నట్లు.
పఠానులకు నేను బాకీ, ఫక్కీరులు నాకు బాకీ.
పడచువాని పెండ్లాము ప్రణయిని, నడిప్రాయం వానిభార్య సహధర్మచారిణి, ముసలివాని ఇల్లాలు దాసి.
పడతులకు బుద్ధి, పెడతల నుండు.
పడతుక వంకాయ సమూల మధురములు.
పడబోయి పూపాన్పుపై బడినట్లు.
పడమట క్రుంకిన ప్రొద్దు తూర్పున లేవదా ?
పడమట [1]కొఱదువేస్తే, పాడుగుంటలన్నీ నిండును; తూర్పున వేస్తే తుంగగడ్డ కూడా తడవదు. (ఎక్కడ గుడివేస్తే అక్కడ వాన ఉన్నట్లు, తూర్పున వాన సముద్రంపాలు.)
పడమట కొట్టుబడ్డితే (వేస్తే) పందిళ్లమీద రాజనాలు పండుతాయి.
పడమట కొట్టువేస్తే పాడిఆవు అంకెవేస్తుంది.

పడమట పావురాపిట్టంత (పూరేడుపిట్టంత) మబ్బు నడిస్తే, పాతాళం దాకా వాన.

పడమట మెరిస్తే, పందిఅయినా నీళ్లకు దిగదు.

పడమటివీధి అమ్మ సరిగ పెట్టుకుంటే, ఉత్తరవీధి అమ్మ ఉరిపెట్టు కుందట.

పడవ ఒడ్డు చేరితే, పడవ వానిమీద ఒక సొడ్డు.

పడిన గోడలు పడ్డట్లుండవు, చెడినకాపురం చెడి నట్లుండదు.

పడితేస్తే పాతరలోతు తెలుస్తుంది.

పడిశము పదిరోగాల పెట్టు.

పడుకోవడం పాతగోడలలో, కలవరింతలు మిద్దెటిండ్లలో.

పడుగు పేకా కలిస్తే గుడ్డ, ఆలు మగడు కలిస్తే ఇల్లు.

పడుగు పేకా గుడ్డకు, మంచి చెడ్డా మనిషికి.

[2]పడుచుకొన్న ఇల్లు తుడుచుక పోతుంది.

పడుచుగుంట, కడుపుమంట.

పడుచు(తో) పశువులు ఉంటేనే సేద్యం.

పడుచుతో సయ్యాట, పాముతో చెలగాట. (చెర్లాట)

పడుచు పొందు ఫలం లేదు.

పడుచుల కాపురం – చిదుగుల మంట.

పడుచుసేద్యం పాకానికి రాదు.

పడ్డకు పడుచుకు పలుపు కడితే వెంట పడుతారు. (పడుచుకు పలుపు మంగళసూత్ర మనుట.)

పడ్డవారు చెడ్డవారు కారు.

1 కొఱడు. కొఱ్ఱు = (ఇంద్ర) ధనస్సు.

2 పడుచుకొనుట = అంతుచేయుట.

[1]పణ్యారం పట్టు దాసప్పా! అంటే, ఏ చేని సజ్జలు? అన్నాడట.
పతికి మోహములేని సతి జవ్వనము, పరిమళించని సుమము.
పతిభక్తి చూపిస్తాను మగడా చెప్పులు తే, నిప్పులు తొక్కుతాను.
పత్తికి పదిచాళ్లు, ఆముదాలకు ఆరుచాళ్లు.
పత్తికి పదిచాళ్లు, జొన్నకు ఏడు.
పత్తిగింజల గంత కట్టనా బసవన్నా? అంటే, ఊహు అన్నాడట! (అన్నదట).
పత్తిగింజలు తింటావా? బసవన్నా అంటే, ఆహా అన్నాడట!
ప్రతి దేవునిమీద, భక్తి చెప్పుల మీద.
ప్రతిలేని పూజ, ప్రతం లేని అప్పు.
పథ్యం చెడరాదు, సత్యం తప్పరాదు.
పద(దు)ను తప్పినా, అద(దు)ను తప్పినా పన్ను దండుగే.
పద(దు)ను పోయిన కత్తి, అదును పోయిన సేద్యం.
పదము తప్పినా ప్రాస తప్పరాదు.
పద మొకబానిస, రాగ మొక రంభ.
పదలం నూలుపోగాలేనిది పంతులుకాదు.
పది ఆమడల వర్షంతో పరగడ గుర్రం పరుగెత్తలేదు.
పది పణాల కన్న పది ఎకరాలు మేలు.
పది భక్ష్యాలు తినే లక్ష్మయ్యకు ఒకభక్ష్యము లక్ష్యమా?
పదిమంది కలవాడు పందఅయినా సేద్యం చేస్తాడు.
పదిమంది కలవానిదే పాటు.
పదిమంది చేరిన పని పాడు.
పదిమందితో చావు పెండ్లితో సమానం.
పదిమంది నడచింది బాట, పదిమంది పలికింది మాట.

1 పణ్యారం=పండేరం (దేవాలయాలలో పంచిపెట్టు ప్రసాదం).

పదిమందిలో పడ్డ పాము చావక పోతుందా!
పదియవనాటి ముత్తైదు వలె. (పసుపు కుంకుమ తీసినతర్వాత)
పదిరాళ్లు వేస్తే ఒకరాయైనా తగులదా?
పది వేస్తే పచ్చిపులుసు, లేకపోతే పాడుపులుసు.
పదుగు రాడుమాట పాటియై ధర చెల్లు, ఒక్కడాడుమాట ఎక్క
దెందు.
పదును తప్పినా అదను తప్పినా పన్నుదండుగ.
పద్మరాగాల గనిలో గాజుపెంకు లుంటాయా? (లున్నట్లు)
పద్మాసనం వేసి కూర్చుండగానే పరమాన్నం వడ్డిస్తారా!
పద్మినిరతివేడ్క పాంచాలుడుగాక షండుడు తెలియగలడా?
పనసకాయ దొరికినప్పుడే తద్దినం పెట్టమన్నట్లు.
పనసపండు తెచ్చి పళ్లెంలో పెడితే, తినలేని బ్రాహ్మణుడు దిక్కు
దిక్కులు చూశాడట.
పనస పండ్లలలో మామిడిపండ్ల రస ముండునా?
పనాపాటా, పండుకో మొగుడా అన్నదట.
పనాపాటా పెండ్లమా అంటే, పండుకొందాం రమ్మన్నదట.
పని అంటే నాఒళ్లు భారకిస్తుంది, బువ్వ అంటే నాఒళ్లు పొంగి
వస్తుంది.
పనికి పరాకు, తిండికి హుషారు.
పనికి పీనుగు, తిండికి ఏనుగు.
పనికిమాలు లొత్తు బత్తెంబు చేటయా.
పనికి బడుగు, తిండికి పిడుగు.
పని గలవాడు పందిరివేస్తే, కుక్కతోక తగిలి కూలిపోయిందట!
పని గలవారింట్లో పైసల ఏట్లాట, పని లేనివా రింట్లో పాపోసుల
ఏట్లాట.
పని చేయనివాడు ఇంటికి దొంగ, పన్నివ్వనివాడు దివానానికి దొంగ.

పని చేయనివానికి ప్రగల్భా లెక్కువ.
పని తక్కువ, ప్రాకులాట ఎక్కువ.
పని పాతరబెట్టి, గంప జాతరకు పోయినట్టు.
పని ముద్దా? పాటు ముద్దా?
పని లేక పటేలు ఇంటికి పోతే, పాతగోడకు పూత పెట్టమన్నాడట!
పని లేకుంటే [1]పంటకాపింటికి (పంటోళ్ళింటికి) పో, పందిటి గుంజకు కూడ పని చెప్పుతారు.
పని లేకుంటే పంటోళ్ళయింటికి పోతే, పందిటిగుంజలుకూడ పని చెప్పుతవి.
పనీలేదు పాటలేదు, ఇట్లన్నా మళ్లు నీ వెంట్రుకలు సరదీస్తా నన్నట్లు.
పనీలేదు, పాటాలేదు, పట్టత్తా! నీ కాళ్ళకైనా మొక్కుతాను అన్నట్లు.
పని లేని పాపరాజు ఏంచేస్తున్నాడంటే, కుందేటికొమ్ముకు రేకలు తీస్తున్నాడు అన్నట్లు.
పని లేని మంగలి పిలచి తల గొరిగినాడట!
పని లేని మంగలి పిల్లితల గొరిగినాడట!
పని లేని మాచకమ్మ పిల్లిపాలు పితికిందట!
పనివాడు పందిరి వేస్తే, పిచ్చుకలు వచ్చి పడతోసిన వట!
పన్నీరుపువ్వును ఏపేరబిలిచినా సువాసనలనే వెదజల్లుచుండును.
పన్నులు (పండ్లు) లేక [2]బెన్నులు పెట్టినారు, పన్ను లుంటే పందుం తిననా అన్నట్లు.
పన్నెండు ఆమడల మధ్య బ్రాహ్మణుడు లేకపోతే యజ్ఞం చేయిస్తా నన్నాడట!

1 పంటకాపు = పంటరెడ్డి.
2 బెన్నులు = కృత్రిమదంతములు.

పన్నెండూండ్ల [1]పారుపత్తెంగాడికి పనితీరికే ఉండదు.
పప్పుకూటికి పది ఆమడలైనా వెళ్ళమన్నారు.
పప్పుకూటికి ముందు, వెట్టి మాటకు (చాకిరికి) వెనుక వెళ్లమన్నారు.
పప్పుచారు అడుగడుగుది-పరమాన్నం పైపైది రుచి.
పప్పుతో పది కబళాలు తింటే, పులుసెందుకు బుగ్గిలోకా!
పప్పు దప్పళానికి నీవు, పాపోసు దెబ్బలకు నేనా?
పప్పు పైత్యం, చారు శైత్యం.
పప్పుబానలమీది బడబాగ్నులారా, పిండివంటలమీది పిడుగులార,
ఏలబుట్టిరి వెలనాటి స్వాములార.
పప్పులుపెట్టి పోరు మాన్పినట్లు.
పప్పు లేని పులగం, ఉప్పు లేని దప్పళం.
పప్పు లేని పెండ్లి, ఉప్పు లేని కూర.
పప్పులో ఉప్పు వేసేటప్పుడు చెప్పేయమంటే, చెప్పువేసి తీసి,
అత్తకు అంచుకు పెట్టిందట!
పప్పు వంటకత్తెను బండిమీద తెస్తే, ఎసు(స)రుకు ఎన్ని ముంతలు
పెట్టేది అన్నదట.
పప్పుశబ్దంబునకు ఘృతశబ్దంబు పరంబగునప్పుడు అపాన వాయువు
ఆదేశం బగు.
పప్పే పస బాపలకును, ఉప్పే పస రుచులకెల్ల, ఉవిదలకెల్లన్
కొప్పేపస.
పయి బడ్డ మాట, మడి బడ్డ నీళ్లుపోవు.
పయిసా యిచ్చి, పాపం కొనుక్కొన్నట్లు.
పయోముఖ విషకుంభము.
పరకాంత లెందరైనను కులకాంతకు సాటిరారు.
పరచుగట్టుపు తోకబట్టి యీడ్వగ వచ్చు గాని తప్పించుకోరాదు
దాని తన్ను.

---

1 పారుపత్తెంగాడు = పెత్తనం చేసేవాడు.

పరనింద గృహాక్షయం, యతినింద కులక్షయం.

పరమవంధ్యకు పాలు పెరుగు పోయగానే చంటిపాలు కలుగనేర్చునా.

పరసతి గమనంబు ప్రత్యక్ష నరకంబు.

పరమానందయ్యగారి శిష్యుడు.

పరాయిపిల్ల గాజులు పెడితే పైకానికి చేటు.

[1]పరాశికాల బాపనయ్యకు పాము గరిస్తే, మందు లేక మరణమైనాడు.

[2]పరిగేరుకొనేవానికి [3]ఓదె దొరికినట్లు.

పరిగనేరిన పాతట్లోకి అగునా?

పరిగేరిన గింజలు కరువు కడ్డం రావు.

పరిచయానికి ప్రథమ చుంబనానికి మధ్య నున్న కాలాన్ని ఆదర్శ ప్రేమ అంటారు.

పరిహాసం పైన వేసుకొని, జాణతనం చేతపట్టుకొని జాతరకు పోయినాడడ.

పరుగెత్తి పాలు తాగేకన్న, నిలబడి (నిలుచుండి) నీళ్లు తాగేది మేలు.

పరుగెత్తి పసులుకాస్తే, పొద్దు కూకుతుందా? (కునుకుతుందా?)

పరుగెత్తు పందకు కాంతలతోడి చింతయా?

పరుగెత్తే పాముకు పాదములు కల్పించుట, అల్లనేరేడుపండ్లను తెల్ల చేయుట వంటిది.

పరుగెత్తే ఎద్దునే తరిమేది.

పరుగెత్తే వాణ్ణి చూస్తే, తరిమే వాడికి లోకువ.

పరుల సొమ్ము పాపిష్టి సొమ్ము.

1 పరాశికాల=పరిహాసాల; పరాస్కెపు.

2 పరిగ=పైరుకోసిన చేలో జారిపడిన వెన్నులు ఏరుకొనుట.

3 ఓదె = పైరుకోసి ఎండుటకు వాళ్లవాళ్లుగా వేసినది; దీనిని పన అనిగూడ అంటారు

పరుల సొమ్ము పేలపిండి, తన సొమ్ము దేవుడిసొమ్ము.
పరు విచ్చి, పరువు తెచ్చుకో.
పరువుకీ, కరువుకీ డబ్బు.
పరువు దప్పిన బ్రతుకు రోత, సతికి చాలని పురుషుని బ్రతుకు రోత.
పరువులేని నడపీనుగకు ఊరేమి? పాడేమి?
[1]పలకమ్మ పున్నానికి పడమటి కొమ్మ పూస్తుంది.
పలకమ్మ పున్నానికి పడుగులు పడతాయి.
పలుకని వాళ్ళతో పదిఊళ్ల వాళ్లయినా గెలవలేరు.
పలుకు తేనెపట్టు, పిడకలి కోతిపట్టు.
పలుకులేమో పంచదార, నిలువెల్లా బొంకుల పుట్ట.
పలుకులు బంగారము, గుణము పాలకన్నా పలుచదనము.
పలుగాకులకు తల్లి [2]పార్లపల్లి.
పలుగాకులకు మేలులేదు, [3]పంజగొడ్డుకు పాలులేవు.
పలుగులు కాల్చి పక్కలో వేసినట్లు.
పలుచన పంట వేడుక, ఒత్తు చూపుల వేడుక.
పలుచన పాతళ్లు కోరు, ఒత్తు వాములు గోరు.
పలుచని గొడ్డు పాలెక్కువ, పిండని ఆవుకు పొదుగెక్కువ.
పలుచని పైరు పాతరలు నింపు.
పలుపు దీసుకొని కొట్టరా మొగుడా, పదాలు పాడుతా నన్నదట.
పలువతో సరసము ప్రాణహాని.
పలువురు నడిచిన తెరువే పదిలమైనది.
పలువురు నడచిన తెరువున పులు మొలువదు, మొలచినేని పొదలదు.

1 పలకమ్మ=పున్నమ-మార్గశిర పూర్ణిమ.
2 పార్లపల్లి = నెల్లూరుజిల్లా కోవూరు తాలూకాలో ఒక గ్రామం.
3 పంజ=గొడ్డుబోతు. (పిరికి)

పల్నాటిలో పోకకు పుట్టెడు దొరికితే, ఆ పోక దొరకక పొర్లి పొర్లి ఏడ్చిందట.

పల్లంవైపుకే నీళ్లు పారేది.

పల్లము దున్నినవాడు పల్లకి ఎక్కుతాడు.

పల్లమునకు ఏడు దుక్కులు, మెఱకకు నాలుగు దుక్కులు.

పల్లాన పోయినా ఏనుగే, మిట్టన పోయినా ఏనుగే.

పల్లికమ్మ (పలకమ్మ) గడిస్తే, తల్లితో కలుస్తాను.

పల్లెటూరికి పదిదారులు. (డొంకలు)

పల్లె తిరిగినా ఏడేచీరలు, పట్నం తిరిగినా ఏడేచీరలు.

పల్లెదాని దగ్గర పొలుసుకంపు అన్నట్లు (చేపలకంపు)

పశువుల పాలు మేపును బట్టి.

పశువుల రొచ్చు గుంత, పంటకాపు గుచ్చు పాతర.

పశువులు కాచేవాడు పనిబాట కక్కఱకు రాడు.

పశువులు జస్తే [1]బోరగలు వాలినట్లు.

పశువులు శిశువులు గానరసం ఎరిగినట్లు.

పశువు వచ్చిన వేళ, పడుచు వచ్చిన వేళ.

పస చెడి అత్తింట పడియుండుట రోత.

పసరం ఒంటిపూట పడ్డా, బ్రాహ్మణుడు ఒంటిపూట పడ్డా మానెడు.

పసరం పంజైతే పసులకాపరి తప్పు.

పసిపిల్లలు, త్రాగుబోతులు నిజం చెబుతారు.

పసిమిరోగపు తొత్తుకు మిసిమి మెండు

పసరం లేత, పైరు ముదురు.

పసిపిల్లకు పాలకుండకు దృష్టి తగలకుండా చూడాలి.

[2]పసిరికలవాని కండ్లకు లోకమంతా పచ్చనే.

1 బోరగలు=రాబందులు. 2 పసిరికలు=కామెర్లు.

పసుపు ఇదిగో! అంటే, ముసుగు ఇదిగో! అన్నట్లు.

పసుపు కుంకుమ కోసం పదామడైనా పరుగెత్తాల.

పసుపుకొమ్ము పెట్టని కోమటి పట్టణ మంతా [1]చూరవదిలాడట!
(²వసారమంతా కొల్ల లిచ్చాడట.)

పసుపూ బొట్టూ పెట్టి పెళ్ళికి పిలిస్తే వెళ్ళక, పెంకు పట్టుకొని పులుసుకు వెళ్ళిందట!

పసు పేమే? అంటే పెండ్లి; ముసు గేమే? అంటే ముండ అన్నట్లు.

పక్షిమీద గురిపెట్టి పందిని ఏసినట్లు. (కొట్టినట్లు)



## పా

పాండవులవారి సంపాదన దుర్యోధనులవారి పిండాకూళ్ళకు సరి.

పాండిత్యానికి తనకంతా తెలుసునన్న అహంకారమున్నది, వివేకానికి తన కేమీ తెలియదన్న వినమ్రత ఉన్నది.

పాకనాటి పతివ్రత లాగ.

పాకలపాటివారి రణకొమ్మువలె.

పాతాల చెరువును జూచి. ఆ నీళ్ళన్నీ తానే దున్నాలని దున్నబోతు గుండె పగిలి చచ్చిందట.

పాకీదానితో సరసం కంటె, అత్తరుసాహెబుతో కలహం మేలు.

పాగా, పంచకట్టు చూచి, భద్రిరాజు వనుకున్నానే! వీర్రాజువటోయి పేర్రాజా!

పాచి కూట్లో కలిపోస్తే పదునుకు వచ్చునా?

పాంచిపండ్ల దాసరికి కూటిమీదనే ఆలాపన.

---

1 చూర = కొల్ల. 2 వసార = పాక.

పాచిపండ్లు వాడు పేర్చిపెడితే, బంగారుపండ్లు వాడు బరుక్క తిన్నాడట!

పాచిపెత్తనం పల్లెలో పది గడియలు. (పలుదోముకోకుండానే పెత్తనాలు చేస్తారు)

పాచిముండ పర్వతం బోతే (శ్రీశైలం) ఎక్కనూ దిగనూ దప్ప ఏమీ మిగలలేదట.

పాచిముఖాన ఎప్పుడైతేనేం భూపాళాలు చదవటానికి.

పాచ్చాసాహెబు కూతురైనా, పెండ్లికొడుక్కి పెండ్లామే!

పాటిమీద గంగానమ్మకు కూటిమీదే లోకం.

పాటిమీద దేవరకు కూటిమీదనే ఆలాపన.

పాటిమీది వ్యవసాయం కూటికైనా రాదు.

పాటు కలిగితే కూటికి కొదువా?

[1]పాటుకు కోడెదూడ, కూటికి పాడిదూడ.

పాటు చేతకాని వాడు మాటలకు మొనగాడు.

పాట్లెల్లా పట్టెడు కూటికే.

పాడగా పాడగా పాట, మూల్గగా మూల్గగా రోగం.

పాడిందే పాడరా పాచిపండ్ల దాసరీ.

పాడి ఆవును దానంచేసి, పాలు తాను పితుకుకొన్నట్లు.

పాడికి పంట తమ్ముడు.

పాడికి పసిబిడ్డలకు దిష్టి (దృష్టిదోషం) లేదు.

పాడికుండ పగులగొట్టు కొనినట్లు.

పాడి గుట్టు – పంట రట్టు.

పాడితో పంట ఓపదు.

పాడి దాచవలె, పంట పొగడ వలె.

---

1 పాటుకు = పనికి.

పాడి పసరము, పసిబిడ్డ ఒకటి.

పాడి లేని ఇల్లు, పాడుబడ్డ బీడు.

పాడి లేని ఇల్లు, పేడలేని చేను.

పాడి లేని గొడ్డు, బిడ్డలేని ఆలు.

పాడు ఊరిలో పొగడే వారు లేరు, నాకు నేనే పొగడుకుంటానని అనుకున్నట్లు.

పాడు ఊరికి మంచపుగోడే పోతురాజు.

పాడు గోడకైన పూత చక్కన, కోతి ముండకైనా రాత చక్కన.

పాడుబడిన ఊరికి నక్క తలారి.

పాడుబడిన ఇంట్లో [1]పంజులు ఎత్తినట్లు.

పాణి యాహార కబళంబు పారవైచి, కర్పూరము నాకు పిన వెదికూన.

పాత ఒకరోత, కొత్త ఒక వింత.

పాతగుడ్డ కట్టు నూలు చేటు.

పాతగోడకు పూత చక్కన, పాతముండకు కోక చక్కన.

పాత చుట్టం - పాత చింతకాయ పచ్చడి.

పాత చేటకు [2]పూత అందం.

పాతతంగేడు పూవు పండుగనాటికైనా పనికివస్తుంది.

పాతది పనికిరాదు, కొత్తది కొరగాదు.

పాతపని పట్టకురా! పల్లెకు దొంగవు కాకురా!

పాతబావి నీరు, మేకలపాడి రోత. (ప్రాక్కొన్న నూతి ఉదకము, [3]మేకలపాడియును రోత.

పాత ముండ కలవరిస్తే, కొత్తముండకు దయ్యం పట్టినట్లు.

---

1 పంజులు = దివిటీలు. (గడ్డిపుల్లలతో కట్టినవి)

2 పూత = అలుకుట.

3 మేకలపాడి = మేకపాలు వెనుకనుండి (ఆవుకు ప్రక్కనుండి) పితుకవలెను. అప్పుడు పెంటికలు వేయుటగూడ కలదు; దీనితో బొచ్చుకూడ కలియుటచే రోత.

పాతముండ లండబూ పోగ్గా, కొత్తముండ తాడు తెంపినట్లు.

పాతరలో పడ్డ కుక్క తీయబోతే కరవ వచ్చినట్లు.

పాత రోత, కొత్త వింత.

పాత లంజ కెప్పుడు భయము లేదు.

పాత లంజ వీరమాత అయినట్లు.

పాతిక కోతి ముప్పాతిక బెల్లం తిన్నదట.

[1]పాతిక గల అమ్మకు పాతిపెట్ట-లేవదీయ.

పాతిక [2]వట్టం, పరక లాభం.

పాతూరు బుల్లి వెంకమ్మ మొగుడు అన్నట్లు.

పాత్ర మెఱిగి దానము, గోత్ర మెఱిగి బిడ్డను ఇవ్వవలె.

పాత్ర మెఱిగి దానము క్షేత్ర మెఱిగి విత్తనము.

పాదపానికి పండ్లు బరువా.

పానకంలో పుడక వలె.

పానకంలో పుడక, పంచదారలో కట్టె.

[3]పానెం పాడైపోయినా, ప్రాణం కుదుట బడదు.

[4]పాన్పుచూచి పసరాన్ని కట్టు.

పాన్పు సెబ్బరైతే, పసరానికీ సెబ్బరే.

[5]పాపట(ఱ)ం పది సేద్యాల పట్టు.

[6]పాపటకాయ కొఱక నెంత? యాకపెట్ట నెంత!

---

1 పాతిక=పావు.

2 వట్టం=అడితి; కమీషను.

3 పానెం=భూస్థితి.

4 పాన్పు=పడకవాసినేల.

5 పాపట(ఱ)ము - మెట్టపైరులో పాళ్ళనడుమ కలుపు పోవుటకు తోలు సాధనము. దీనికి చిన్న పారలవంటి అలుగులు అమర్చబడి యుండును.

6 పాపటకాయ - వెఱ్ఱిపుచ్చకాయ.

పాపటలో వెంట్రుక నెరి స్తే ప త్తిత్తు.

పాపదోషానికి పోతే, పట్టి చూచినట్లు.

పాపభీతికంటె ప్రజాభీతికే వెరుస్తారు.

పాపమని పక్కెటముక ఇస్తే, పీక్కో లేక ఫిర్యాదు చేసినట్లు.

పాపమని పట్టెడంబలి పోస్తే, ఉప్పు లేదని అలిగి పోయినాడట.

పాపమని పాతచీర ఇస్తే, గోడచాటుకు పోయి మూర వేసిందట!

పాపమని పాలుపోస్తే, ఉడుకని ఉఱుకులాడినాడట!

పాపమని పాలుపోస్తే, పలుచనని పారబోసి నాడట.

పాపమని పాలుపోస్తే, వద్దని వలకబోసినాడట.

పాప లేని ఇంట్లో, తాత తడివెళ్లాడి నట్లు.

పాపాలకు భైరవుడు పాపన్న.

పాపజాతి నరుడు పరసతి గోరు.

పాపికి చిరాయువు, సుకృతికి గతాయువు.

పాపి పర్వతం బోతే, దీపాలన్ని పెద్దవైన వట.

పాపి సముద్రానికి పోతే, అరికాలు తేమ కాలేదట.

పాపిసొమ్ము పరులపాలు, ద్రోహిసొమ్ము దొరలపాలు.

పామనగ వేరె పర దేశమున లేదు.

పామరజనానికి ఎన్నో తలలున్నవిగాని, ఒక మెదడైనా లేదు.

పాముకన్న లేదు పాపిష్టిదగుజీవి.

పాము కరచును, అరవ చెరచును.

పాముకాటు చీరతో తుడిచిన పోవునా!

పాముకాళ్లు పాముకే ఎఱుక.

పాముకు బదనిక చూపినట్లు.

పాముకు విషం పండ్లలో, జ్ఞాతికి విషం కండ్లలో.

పాము చుట్టము, పడగ పగ.

పాము చెలిమి, రాజు చెలిమి ఒకటే.

పాముతో చెలిమి కత్తితో సామువంటిది.

పాము పగ, తోక చుట్టము.

పాము పడగక్రింద కప్పవున్నట్లు. (సర్పంబు పడగనీడను కప్పవసించి నట్లు)

పాము ముదిరి కడకు గామైనట్లు.

పాములలో మెలగవచ్చునుగాని సాములలో మెలగడం కష్టం.

పాములు లేనివాడు, వానపామును పట్టుకొన్నట్లు.

పామువంటిదానికే విరుగుడుంటే, పంతుల కుండదా?

పాము వరటకపోతే, దానివిషం వరటకపోతుందా?

పామూ చావకుండు, బడితే విరుగకుండా.

పాయసంలో నెయ్యి ఒలికినట్లు.

పారవేసిన పుల్లాకు బండి కట్టినట్లు.

పారిజాతముతో ప్రబ్బిళ్లు సరితూగునా?

పారినవాని పౌరుషం ఎన్నాలనా?

పారుబోతు గొడ్డుకు పగ్గం చాలైతే చాలు.

పారేనీటికి పాటినలేదు.

పారేబండ్లకు కాళ్లు చాచిన నిలుచునా?

పాలకంకు లోయి దాసరీ! అంటే, రాలినమటుకే గోవింద అన్నాడు.

పాలకోసరం పొదుగు కోసినట్లు.

పాలకు కాపలా, పిల్లికి తోడు.

పాలకడలి లంకలో బుట్టినా కొంగకు తిండి నత్తగుల్లలే.

పాలతోగూడ విషము పెట్టినట్లు.

పాలను చూడనా? భాండాన్ని చూడనా?

పాలపొంగు-పడుచు పొంగు.

పాలపొంగు-మీలపొంగు.

పాలలో పంచదార ఒలికినట్లు.

పాలలో పడ్డ బల్లివలె.

పాలసముద్రంలోని హంస పడియనీటి కాసపడుతుందా?

పాలికివచ్చింది పంచామృతము.

పాలివాడు చస్తే పారెడు మన్నెక్కువ.

పాలివానికిచేసిన మేలు-పీనుగకుచేసిన శృంగారము.

పాలివానితో, మాలదానితో సావాసం చేయరాదు.

పాలివారిని చెఱచితివో, పాడైతివో!

పాలుఇచ్చే బర్రెను అమ్మి, పైన ఎక్కేదున్నను తెచ్చుకొన్నట్లు.

పాలు ఒల్లని పిల్లి ఉన్నదా?

పాలు కుడిచి రొమ్ము గ్రుద్దినట్లు.

పాలు చిక్కనైతే వెన్న వెక్కసము.

పాలు పిండగలముగాని, తిరిగి చంటిలోకి ఎక్కించగలమా.

పాలు పిండని గొడ్డు బర్రెల కడుపులు మొందు.

పాలు పిండని బర్రె పలు మేతలకు పెద్ద.

పాలు పొంగడమంతా పొయ్యి పాలుకే.

పాలు పోసి పెంచినా పాము కఱవక మానదు.

పాలు పోసి పెంచినా పాముకు విషము పోదు.

పాలు పోసి పెంచినా ముష్టిచెట్టుకు విషము పోదు.

పాలు పోసి పెంచినా వేపకు చేదుపోదు. (తీపిరాదు)

పాలుమాలితివో, ఆర్చుకొంటివో!

పాలేరు దున్నిననాడు అప్పులపాలు.

పాలేరువానికి పశువు పోయినా, మారుతల్లికి బిడ్డపోయినా దిగులు లేదు.

పాళ్లు పన్నెండు, దెబ్బలు చెరిసగం.
పావలాకు పడుకుంటే, పందుం బియ్యం బేపి తినిపోయిందట.
పావు సంపాదనగాడికి వరహా లంజ వరుస గాదు.
పాసిన కూడు పక్వానికి వస్తుందా?
పాసిన కూట్లో కలిపోస్తే పదునుకు వస్తుందా?
పాసిన గుమ్మడికాయ బాపనయ్యకు దానం ఇమ్మన్నట్లు.
పాసు ముండా! అంటే, పట్టుతల్లీ అన్నట్లు.



## పి

పింగు తెరచిన ఈగల దాడి.
పింజారి మందు, లంజ పొందు.
[1]పింజారి పీకులాట, [2]కురువ గుద్దులాట.
పిండానికి గతిలేక పోయినా, పెగ్గెలకు లోటులేదు.
పిండికి తగ్గ పిడచ.
పిండికొద్దీ [3]నిప్పటి.
పిండికొద్ది రొట్టె, తిండికొద్ది పసరం.
పిండి గొన్నవానివద్ద రొట్టె గొన్నట్టు.
పిండి బెల్లంఇచ్చి, పిన్నమా నీప్రసాదమన్నట్లు.
పిండి బొమ్మను చేసి పీటమీద కూర్చుండ బెడితే, ఆడబిడ్డతనావ అదిరదిరి పడ్డదట!

1 పింజారి = దూదేకుల.
2 కురువ = గొఱ్ఱెలమేకల పెంచు ఒకజాతి.
3 నిప్పటి = అరిసె.

పిండీ, [1]ప్రోలు లేనిదే పెండ్లవునా?
పిండేవాడు పిండితే, పిటుకురాయైనా పాలిస్తుంది.
పిందెలో పండిన పండు.
పిక్కలెగయబలిసిన దున్న ఏనుగు కాదు.
పిచ్చి కుదిరింది, రోకలి తలకు చుట్టమన్నాడట!
పిచ్చి కుదిరితేగాని పెళ్ళికాదు, పెళ్ళి అయితేగాని పిచ్చికుదరదు.
పిచ్చివాడికి లోకమంతా పిచ్చే!
పిచ్చివానికి పింగుమీదనే ఆలాపన.
పిచ్చివాని చేతి రాయి తగిల్తే తగులుతుంది, తప్పితే తప్పుతుంది.
పిచ్చివానికి పిల్లనిస్తే, వేలు బెట్టి ఎడం జేసినాడట.
పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం.
పిచ్చుకకుంటుమీద భాగీరథి వచ్చినట్లు.
పిచ్చుగుంటలవాని పెండ్లి ఎంత? వైభవమెంత? ([2]పెడాకు లెంత?)
పిట్టకు పట్టే దెంత?
పిట్ట కొంచము, కూత ఘనము.
పిట్టపిడుగున మీయింటిలో విందుకు చస్తావు, బిల్లపిడుగున మాయింటిలో చావకు.

1 పిండిప్రోలు లక్ష్మణకవి తెనుగులో మంచి కవి. రావణ దమ్మీయమనే ద్వ్యర్థి కావ్యం చెప్పినాడు, తిట్టు కవిత్వమునగూడ దిట్ట. పెండ్లిండ్లలో కడపట నాకప్రోలు అవి పిండితో ముగ్గులు పెట్టుదురు. లక్ష్మణకవి పెండ్లి సంభావనలకు ఎక్కువగా పొయ్యే వాడు కాబట్టి. పిండిప్రోలు - కవిగాని, (ప్రోలు) ముగ్గుగాని లేనిదే పెండ్లి జరుగదన్న యీ శ్లేషాత్మకమైన నానుడి పుట్టింది.

గోదావరి కృష్ణ పెన్నల ఆనకట్టలు కట్టించిన సర్ ఆర్థర్ కాటన్ దాయాది ఒకరు దక్షిణదేశంలో జిల్లా జడ్జిగా పనిచేసినాడు. ఇతడు చాలా వ్యభిచారి. కోయంబత్తూరులో ఒకమాట బుట్టింది—There is no bed in Coimbatore without cotton—అని. cotton అంటే దూది; దూదిలేని పరుపు ఉండదని పైకి అర్థం.

2. పెడాకులు = విడాకులు.

[1]పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చినట్లు.
పిఠాపురం వెళ్ళి, పిడతెడు నీళ్లు తెచ్చినట్లు.
పిడక పొగకే సిగమెక్కితే, గుగ్గిలం పొగ కెట్లాగవలె.
పిడకలు తీసుకరారా సివ్వా అంటే, నా పిక్కలు నొచ్చె అవ్వా!
పిడతలో నూనె పిడతలోనే ఉండాలి. బిడ్డలు బీరగింజల్లా ఉండాలి.
పిడికెడు బిచ్చం పెట్టలేే నాతడు అడిగినదంతా యిచ్చునా?
పిడుగుకు గోడు గడ్డమా?
పిడుగుకు, బియ్యానికి ఒకటే మంత్రమా?
పిడుగుకు బుడ్డకు ఒకే మంత్రమా!
పిడుగు దాకిన పిదప కొరవి చూడినట్లు. (కాల్చినట్లు)
పిడుగుకు వారశూలా?
పిడుగు పడినవాని కొఱవిని చూడినట్లు.
పిడుగుపాటుకు టొప్పి (టోపి) యాగునా?
పిడుగు బాటిన డొంకవలె పెంపడగి.
పిడుగు మొత్తిన తాయివలె.
పిడుగు పడితే తలనొప్పి యాగునే?
పిత్త సత్తవలేదు, పొసనాలకు మందట.
పిత్తి కంచం (నేల) గోకినట్లు.
పిత్తి, పిల్ల నెందుకు కొడతావమ్మా! మళ్ళీ వచ్చి నానెత్తి కొట్టగలవు.
పిత్తిన ముత్తయిదు వలె.
పిత్తి పీట నేలకు రాసినట్లు.
పిత్తు పిత్తు మంటే బియ్యానికి సరిసరి అన్నదట.
పిత్తులకు దడిసి పప్పు వండడం మానివేసినట్లు.

---

1 ఇది ఈసపుకథ. వెన్నదొంగిలించిన రెండు పక్షుల పోరుకు ఒక కోతి తీర్పరియై. వరికి సరిగా తూచుచు, తగ్గుమొగ్గులను సరిచేయను వెన్నతింటూ, చివరకు ఏమీలేకుండా కోతే వెన్ననంతా కాజేసినది.

పినతండ్రి పెండ్లాము పినతల్లి కాదు, మేనమామ పెండ్లాము మేనత్త కాదు.

పిన్నచేతదివ్వె పెద్దగా వెలుగదా.

పిన్నమ్మ పెట్టకపోయినా, పోయకపోయినా నామీద బలేప్రాణం.

పినతల్లి పెట్టు-పిచ్చిదాని ఒట్టు.

పిటికి బంటుకు తుమ్మాస్త.

పిటికి వాని బింకం పిసరులో ఇంకు.

పిటికి వారికే పిడికెడంత మీసాలు.

పిట్టమీద కొడితే ఫిర్యాదు లేదు.

పిట్టల చప్పుడే గాని, దారి జరుగ లేదు.

పిట్టలు చూచి పీట వేసినట్లు.

పిట్టలు జూచి పీటవేయి, ముఖం చూచి బొట్టు పెట్టు.

పిల(లు)వకుండా పోయినప్పుడు గెంటకుండా పొమ్మనడమే కట్నం.

పిలవని పేరంటము, చెప్పని ఒక్కపొద్దు.

పిలవని పేరంటానికి వెళ్ళితే పీటకోళ్ళ దెబ్బ.

పిలిచి పిల్లనిస్తా మంటే, కులం (తక్కువ) లేత అన్నట్లు.

పిలిచి పిల్లనిస్తా మంటే, మెల్ల అన్నాడట.

పిలిచి పెద్దపులికి పేరంటం పెట్టినట్లు.

పిలిచేవారుంటే బిగిశేవారు శానామంది.

పిని స్తే పలుకుతుంది కరవు - రాయలసీమలో, పిలవకుండానే పలుకుతుంది అనంతపురంలో.

పిలి స్తే బిగి స్తే సరికాని, వ స్తే వాడి అబ్బతరమా!

పిలువని పేరంటము, వలవని చెలిమి వంటిది.

పిల్ల ఉన్నమ్మకు పిడికెడు చోటెక్కువ.

పిల్లకాకి కేమి తెలుసును ఉండేలుదబ్బ దెబ్బ,

పిల్లకాకి కేమి తెలుసు [1]వుండేలుదెబ్బ యేటు.

పిల్ల కాయలకూ, పీటకోళ్ళకు చలి లేదు.

పిల్లకు ఏమిపెట్టి పంపినారు శాస్త్రిగారు. (కోటరికానికి పంపేటప్పుడు) అంటే—పేదవాళ్లము ఏమి పెట్టగలము, మీబోటి మహా రాజులైతే వేలుబెట్టి పంపుతారు అన్నాడట.

పిల్ల కుదిరినా కుదరక పోయినా, వచ్చేనెలలో పెండ్లి నిజమన్నాడట.

పిల్లకు పాముపెట్టిచూడు, గోడకు సున్నము కొట్టిచూడు.

పిల్లగలవాడు పిల్ల కేడిస్తే, కాటివాడు కాసు కేడ్చాడట.

పిల్ల చచ్చినా పురుటికంపు (పీతికంపు) పోలేదు.

పిల్ల నిచ్చిన చోటికీ, పీతిరిదొడ్డికీ పోక తప్పుతుందా?

పిల్ల నిచ్చినవాడు ఈగ, పుచ్చుకున్నవాడు పులి.

పిల్ల పిడికెడు, కూను గంపెడు.

పిల్ల పుట్టకముందే కుల్లకుట్టినట్లు.

పిల్ల పుట్టగానే పాలు పడ్డట్లు.

పిల్ల పెత్తనం, పల్లెటూరి సావాసం.

పిల్ల బావిలో పడ్డదిరా అంటే, ఉండు! అంబలి తాగి వస్తానన్నట్టు.

పిల్లను గిల్లి పైన తప్పరగొట్టినట్లు.

పిల్ల పిచ్చుకంత, పింగు మద్దెలంత.

పిల్ల ముడ్డి గిల్లి ఉయ్యాల ఊచినట్లు.

పిల్ల ముద్దుగాని, పియ్యిముద్దా?

పిల్ల లున్నవాడికి, పసు లున్నవాడికి సిగ్గుండరాదు.

పిల్లలు లేనిఇంట్లో తాత తదుము లాడినట్లు.

పిల్లలు లేనియింట్లో ముసలోడు [2]దొగ్గాడిండట. (దోగాడట)

1 వుండేలుదెబ్బ = ఉండేలు దెబ్బ.

2 దొగ్గాడుట = దోగాడుట.

పిల్లలు లేనిది ఇల్లు కాదు, పిట్టలు లేనిది తోపు కాదు.

పిల్లవాడని పక్కలో వేసుకొంటే, పెద్దోడు (పెద్దవాడు) కొట్టినట్లు కొట్టినాడని (మేనత్తమాట).

[1]పిల్లవాడు మూలానక్షత్రంలో పుడితే, మూల పీకివేసుకపోతాడట!

పిల్లవానికి పీటవేసి పిల్లకు చేట వేసినట్లు.

పిల్లా పిలగాడికి పెళ్ళి చేస్తే, ఎలేసి (వెలివేసి) ఎడం చేశాడట!

పిల్లా! పిల్లా! నువ్వులచెట్టుకు నూనె ఎక్కడిదంటే, మా అమ్మ తొలి సమర్తకీ, మలి సమర్తకీ ఎక్కడున్నావు అందిట.

పిల్లా! పిల్లా! [2]పెట్టనిస్తావా? అని రావూరు రసికుడడిగితే, అమ్మ నయ్యా అన్నదట నెల్లూరు నెఱజాణ!

పిల్లా! నీదేమి పోతుంది? మా యమ్మకు కాసేపు కోడలు కాలేవా? అన్నాడట.

పిల్లి ఉట్టిచేరులు తెంచగలదు గాని, పాలకుండ పడకుండా (పట్ట) చేయగలదా?

పిల్లి కండ్లు పోగోరును, కుక్క పిల్లలు రాగోరును.

పిల్లి కండ్లుమూసుకొని పాలుతాగుతూ, ఎవరూ తన్ను చూడలేదని ఎంచుకొన్నదట.

పిల్లికి ఎలుక సాక్షి.

పిల్లికిగూడ భిక్షం పెట్టదు.

పిల్లికి చెలగాటం (చెర్లాటం), ఎలుకకు ప్రాణసంకట.

పిల్లి నెత్తిన వెన్న (పేరిననేయి) పెట్టినట్లు.

పిల్లికి రొయ్యలమొలతాడు కట్టినట్లు.

పిల్లికి మెడలో రొయ్యలు గట్టినట్లు. (అందక వదలలేక బాధపడుట)

---

1 మూలానక్షత్రజన్మ మొదటి మూడుపాదాలు తల్లితండ్రి మేనమామలకు గండములు.

2 కోడిపెట్ట అని.

పిల్లి గుడ్డిది అని, ఎలుక ముడ్డి చూపిందట!

పిల్లితిన్న కోడి పిలిచినా పలుకదు.

పిల్లితోక ఎద్దు మట్టితే, ఎలుక దిక్కు ఎత్తగించి చూచిందట.

పిల్లితోక (కాలు) బత్తె తొక్కితే, ఎలుకమీద మీసాలు దువ్విందట!

పిల్లిని చంకలో పెట్టుకొని పెళ్ళికి వెళ్ళినట్లు.

పిల్లిని చంపిన పాపం నీది, బెల్లంతిన్న పాపం నాది.

పిల్లిని చంపిన పాపం నీకు, బెల్లమీయని పాపం నాకు.

పిల్లి పట్టిన [2]ఈరువు వలె.

పిల్లి బ్రాహ్మణుడు, పీట ముత్తైదువ.

పిల్లి ముడ్డిలో మల్లెపందిలి.

పిల్లి లేనప్పుడే కలుగులోనుండి ఎలుకలు బయటికి వచ్చి గంతులేసేది.

పిల్లి లేని పిసిని, వాన లేని వరద.

[3]పిల్లి వలస త్రిప్పినట్లు. (పిల్లలను)

పిల్లి శాపాలకు ఉట్లు తెగుతాయా!



1 పిల్లిని చంపిన పాపం, బెల్లంతో పిల్లిని చేసి దానం యిస్తే పరిహార మగు నని నమ్మకం.

2 ఈరువు=మాంసం.

3 పిల్లి కండ్లు తెరవని పిల్లలను నోట కరచుకొని ఎత్తుకొనిపోయి ఉనికి పదేపదే మార్చుచుండును.

# పీ

పీకుడుగానికి బియ్యపు రొట్టె, మూతి కడుగ నేతిబొట్టు.
పీకులాట పెండ్లికిపోయి, పిల్లా నేను సగమై వచ్చినా మన్నదట.
పీటకు పిఱ్ఱకు వైరం.
పీటకోడుకు పసిపిల్లలకు చలిలేదు.
పీట పగిలేటట్లు, మొలతాడు తెగేటట్లు తింటేనే ప్రీతైన తిండి.
పీతాంబరము కట్టినమ్మ పీట చంకనే పెట్టాలి.
పీనుగ ఎక్కడో గద్దలూ అక్కడే!
పీనుగకుచేసిన జాగారం - గొడ్డావుకు వేసిన ఆహారం.
పీనుగకు చేసిన శృంగారం - నగిరికి చేసిన కొలువు.
పీనుగను పొడిచిన బల్లెముగాడు.
పీనుగమీద పిండాకూడు అన్నట్లు.
పీయి తినెడి కాకి పితరుండు ఎట్లాను?
పీయి తినేవాడింటికి చుట్టంపోతే, వరిగినదాకా తన్నినాడట!
పీరుసాహెబు పింగు నాకుతుంటే అల్లీసాహెబుకు బెల్లమట!
పీర్ల పండుగకు గోకులాష్టమికి ఏమి సంబంధము?
పీర్లు బిచ్చానికేడిస్తే, ముల్లా పంచదార కేడ్చినాడట!



# పు

[1]పుంగనూరు సంస్థానం (వెట్టిబోగలది-అని).
పుంజం పెట్టితే బట్ట, లంచం పెట్టితే పని.
పుంజు కూతనుండి ప్రొద్దెరింగిన యట్లు.
పుంజులూరు శ్రోత్రియందారు (యతిమతం).
పుంటికూర తిన్నా పుట్టిల్లు, పాయసంతిన్నా పరాయిగడ్డ.
పుంటికూరలో పుడక రుచి, మాంసములో ([2]చిగిరెపు) ఎముక రుచి.
పుండంత మానింది, చేటంత ఉంది.
పుండు ఒకచోట, మందు ఇంకొక చోట.
పుండుకు పుల్ల మొగుడు.
పుండున్న వ్రేలికే పుల్ల తగులుతుంది.
పుండు పొడిచే కాకికి ఎద్దునొప్పి తెలుస్తుందా?
పుండు మానినా [3]బెండు మానదు.
పుండుమీద కారం చల్లినట్లు.
పుండుమీద కొరవి బెట్టినట్లు.
పుండుమీదికి నూనెలేదంటే, బూరెలొండే పెళ్లామా అన్నట్లు.
పుక్కిటి పురాణాలతో ప్రొద్దుపుచ్చే (పొట్టిబోసికొనే) వాడు పురాణాలు చెప్పగలడా?

---

1 పుంగనూరు, చిత్తూరుజిల్లాలో మదనపల్లి దగ్గర ఒక జమీందారీ పట్టణము. రాజా మంత్రి ప్రజలు అందరూ వెట్టి వెంగళప్ప చేష్టలకు పేర్గాంచినారు. బందరు దగ్గర నుండిన పల్లూరు జమీందారుని కుక్కలరాజా అనేవారు. ప్రతి ప్రాంతంలో ఒక్కొక్క ఊరికి ఇట్టి అవివేకపు ఖ్యాతి ఉంటున్నది. నెల్లూరు తాలూకాలో పుంజులూరుపాటి శ్రోత్రియూనికి ఇదే ఎగతాళి ఉండేది. పోరా పుంజలూరూ అంటే-వెధవ అని.

2 చిగిరెపు ఎముక=ప్రక్కటెముకలలో మెత్తటి భాగము.

3 బెండు=మచ్చ.

పుచ్చకాయల(గుమ్మడికాయల) దొంగా అంటే, భుజాలు తడుము
కున్నాట్ట.
పుచ్చిన మిరియాలకైనా జొన్నలు సరిరావు.
పుచ్చిన విత్తులు చచ్చినా మొలువవు.
పుచ్చుకున్నప్పుడు పుత్రుడు పుట్టినంత సంతోషం, ఇచ్చేటప్పుడు
ఇంటాయన పోయినంత దుఃఖం.
పుచ్చు వంకాయలు, బాపని బయ్యాలు.
పుట్టంగ పురుడు, పెరగంగ పెళ్ళి.
పుట్టకు ధ్వనెత్తితే పుట్టెడు, మొగుడికి ధ్యాసెత్తితే పుట్టెడు.
పుట్టని బిడ్డకు (పిల్లకు) పూసలు కుట్టినట్లు.
పుట్టపై బాదిన పాము చస్తుందా?
పుట్టనివాడు గిట్టనివాడు, గోడబొమ్మలో ఉన్నవాడే ద్రావిడులలో
మహాత్ముడు.
పుట్టపై గొట్ట నరగంబు గిట్టబోదు.
పుట్టమన్ను ఎరువైతే పుట్లకొద్దీ పంట.
పుట్టమీద తేలుకుట్టినా నాగుబాము కరచినట్లే.
పుట్టమీద గొట్ట భుజగంబు చచ్చునా.
పుట్టలో చేయిపెట్టితే కుట్టక మానుతుందా!
పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా?
పుట్టల్లో తారికాడేది ఎవరంటే! [1]అంజీకివచ్చిన అంకడు అన్నాడట.
పుట్టించినవాడు పూరి మేపునా?
పుట్టిచచ్చినా పుత్రుడే మేలు.
పుట్టినదానికి పెట్టిందే సాక్షి. (పూర్వజన్మలో దానంచేసింది)
పుట్టిననాటి (పుట్టుకతో వచ్చిన) గుణం పుడకలతోగాని పోదు.

1 అంజి=గ్రామసాముదాయక కార్యములకు గ్రామస్థులందరు వంతుల్రపకారం వంపినవారు చేసే ఉమ్మడిపని.

పుట్టిననాటిగుణం పులిఆకులలో వేసినా పోదు.
పుట్టిననాటినుంచి పుల్లిగాడే మొగుడా ?
పుట్టినప్పుడే గిట్టేవ్రాత వ్రాసినాడు.
పుట్టిన పిల్లలు బువ్వ కేడిస్తే, అవ్వ మొగుడి కేడ్చిందట.
పుట్టిన బిడ్డ బువ్వ కేడుస్తుంటే కడుపులో బిడ్డ కనగలు కావాలన్నదట.
పుట్టినబిడ్డల్లా చచ్చేదానికంటే మగడే చచ్చేది మేలు.
పుట్టినవాడు గిట్టకపోడు.
పుట్టినవానికి తమ్ముడు, పుట్టేవానికి అన్న.
పుట్టిని చిట్టితో గొలిచినట్లు.
పుట్టినిల్లు ఏకాదశి, మెట్టినిల్లు గోకులాష్టమి.
పుట్టినిల్లు పుణ్యలోకం, మెట్టినిల్లు ఆరళ్ళలోకం.
పుట్టుక కోగుణము, పుత్రికోబుద్ధి.
పుట్టుకచూస్తే గరుత్మంతుడు, గుణం చూస్తే పీతిరిగద్ద.
పుట్టుకతో వచ్చినబుద్ధి పుడకలతోగాని పోదు.
పుట్టు చాయేగాని, పెట్టుచాయ వచ్చునా ? (నిలుచునా ?)
పుట్టుట గిట్టుటకొఱకే, పెరుగుట విఱుగుటకొఱకే, ధరతగ్గుట ఎచ్చుటకొఱకే.
పుట్టునత్తా, పెట్టునత్తా (నత్తి)
పుట్టువాసనా ? పెట్టువాసనా ?
పుట్టు శాగలేనిది, పెట్టు [1]శాగ ఏం ప్రయోజనం ?
పుట్టుశాస్త్రులా ? పెట్టుశాస్త్రులా ? (పేరుపెట్టునశాస్త్రి అనుట)
పుట్టెడు అప్పు గడ్డపార మింగినట్లు.
పుట్టెడు అప్పయినా కాయవచ్చునుగాని, పుప్పి (పిప్పి) మాటలు ఎవరు పడతాడు ?

---

1 శాగ = చేవ.

పుట్టెడు ఆముదము రాసుకొని పొర్లాడినా, అంటేదే అంటుతుంది, అంటంది అంటదు.

పుట్టెడు నువ్వుల్లో పడ్డా అతికేవే అతుకుతవి.

పుడుతూ పుత్రులు, పెరుగుతూ శత్రులు.

పుడుతూ సోదరులు, పెరుగుతూ దాయాదులు.

పుణ్యం కగిలిన మగని చేసికొంటే, పూసలలోని కొక రుబ్బుడురాయి.

పుణ్యం కొద్దీ పురుషుడు, దానం కొద్దీ బిడ్డ.

పుణ్యం కొద్దీ పురుషుడు, విత్తం కొద్దీ వైభవము.

పుణ్యం పుట్టెడు, పురుగులు తట్టెడు.

పుణ్యానికంటే మాచిన్నాయనను తోలుకొస్తాను అన్నట్లు.

పుణ్యానికి పట్టెడి స్తే (పుట్టెడాళ్ళ స్తే) పిచ్చుకుంచమని పారబోసినాడట!

పుణ్యానికి పుట్టినదే సాక్షి, పాపికి నీళ్లే సాక్షి.

పుణ్యానికి పోతే, పాప మెదురు వచ్చిందట!

పుత పుతల మారెమ్మకు పొడి కూడేగాని, గడ్డకూడు రాదు.

పుత్తికి పురచేయి లోకువైనట్లు.

పుత్రసంతతిలేని పురుషుని కలిమి కలహంసలేని కొలను వంటిది.

పుత్రుడనై వేధింతునా? శత్రుడనై వేధింతునా? పేరులేని దయ్యమునై వేధింతునా?

పుదుచ్చేరిలో వీధులు సక్రమమే గాని, బుద్ధులు వక్రం.

పునర్వసు పుష్యాలకు [1]పూరేడు అడుగైనా తడవదు.

పునశ్చరణమే అపవాదానికి పెంపు.

పునుగు చట్టము పిండినట్లు.

పున్నమనాటి పురుషుడు, అమావాస్యనాటి ఆడబడుచు.

---

1 పూరేడు(లు) = కముజు జాతి అడవిపిట్ట.

పున్నమ్మ పెళ్ళికి చంద్రు డుదయించినట్లు.
పున్నానికి పూజ, అమావాస్య కారగింపు. (తేనెతెట్టె)
పున్నెపుచింతల పులుసు, పాగాకిత్తుల పాగుసు.
పుబ్బ ఉబ్బుబ్బి కురిసినా, గుబ్బచ్చి చెట్టు కింద నానదు.
పుబ్బ కెరలితే, భూతం కెరలినట్టు.
పుబ్బ రేగినా బూతు రేగినా నిలువవు.
పుబ్బలో చల్లేదానికంటే, దిబ్బలో చల్లేది మేలు.
పుబ్బలో చల్లేది మబ్బుతో మొత్తుకొనేది.
పుబ్బలో పుట్టి, మఖలో మాడినట్లు.
పుబ్బలో పుట్టెడుకంటె, మఖలో మానెడు మేలు.
[1]పుబ్బలో పుట్టెడు చల్లేకంటే, ఆశ్లేషలలో అడ్డెడు చల్లేది మేలు.
పురాణంలో ఏమి చెప్పినారే అంటే, అక్కడా నీమొగానవే
మొద్దులు బెట్ట (నిప్పులుబోయ) మన్నారన్నదట పెండ్లాము.
పురాణంలోని వంకాయలు పులుసులోకి రావు.
పురాణం విన్నప్పుడు పుట్టెడు బుద్ధులు, అవతల పోతే అదవ (అపర)
బుద్ధులు.
పురిటాలికి పుట్టెడైనా చాలదు. (ఆకలి ఎక్కువట)
పురిటిలోనే [2]కాలేరి సంధించినట్లు.
పురిటిపిల్లకు చమురులేదు, పూర్ణపుబూరెలు (కడుములు) వండు
కుందామా అన్నట్లు.
పురిటిలోనే సంధి కొట్టినట్లు.
పురుగుచేరిన పన్ను పలవింపజేయదా.

---

1 ఈ కార్తెల అదను ఆయాయా ప్రాంతాలనుబట్టి మారుచుండును. గోదావరికి మేనెల. కృష్ణకు జూను. పెన్నకు ఆగష్టు (ఆశ్లేష) సేద్యపు అదునులు.

2 కాలేరి = స్త్రీలు రక్తస్రావంవల్ల గుడ్డలు ఈడ్చే వ్యాధి.

పురుషుడు బలుపైన పుత్రుడు బలుడయా.
పురుషుని భాగ్యం అనుకూలమైన భార్య.
పురుషులందు పుణ్యపురుషులు వేరయా.
పురోగమనానికి అత్మతృప్తే ప్రథమ సోపానం.
పుల్లు కారుతూఉంటే, పోతరాజు సివమాడినట్లు.
పుర్రె కొకబుద్ధి, జిహ్వ కొకరుచి.
పులగము తిన్నవాడు పుణ్యాత్ముడు, పాయసం తాగినవాడు పాపాత్ముడు.
పులగము మీద పప్పు.
పులి ఆవును చంపడం నక్కను మేపనా?
పులి ఎత్తుబడితే, నలుగురు నాలుగురాళ్లు వేస్తారు.
పులి కడుపున పిల్లులు (చలిచీమలు) పుడతాయా?
పులి కడుపున మేక పుట్టుతుందా?
పులి కడుపున పుట్టి, మేకఅరుపు అరచినట్లు.
పులి కాకలయితే, పూరి తింటుందా?
పులికి ఏ అడవైతే నేమి?
పులికి తన [1]కాడని, పర కాడని లేదు.
పులికి పారణం పశువుకు మారణం.
పులిగాడికి గిలిగాడు మగడు.
పులిగాడుకంటె, గిలిగాడు గొప్ప.
పులిగొన్న మృగము పెట్టున పడుతుందా?
పులి గోకటమూ, అయ్య బతకటమూనా?
పులి చచ్చినా పొడలు మాయవు.
పులిచారలు వేశాయి అత్తయ్యా! అంటే, పుడిసెడు వెనక్కు తీయవే కోడలా! అన్నదట. (మబ్బు)
పులి దాసర్లకు పెట్టుతుందా?
పులి నాకి విడుచు దైవము గలవానిని.

1 కాడు = అడవి.

పులిని [illegible] చేసినట్లు.
పులిని చూచి, నక్క వాతలు పెట్టుకొన్నట్లు.
పులిని జూచి నక్క పూత బూసినయట్లు.
పులి [1]నలిబడితే, పులిచారలు నలిబడతవా!
పులి పేదపడిన, పసులవాండ్రు మొక్కుడిరను కథ.
పులి బక్కచిక్కితే, చారలు బక్కపడునా!
పులిబోను చుట్టూ ఉండే కమ్ములు దాని రక్షణకు కాదని అందరికీ తెలిసిందే.
పులి మలకు అండ, మల పులికి అండ.
పులిమీద పుట్ర.
పులిమీసల నుయ్యాల నూగవగునా!
పులి మీసాలు కుందేలు మేసినట్లు.
పులివాత పడ్డమేక, అప్పారావు కిచ్చిన అప్పు తిరిగి రావు.
పులుసు వచ్చి, పెంటుకును కొట్టుకపోయినట్లు.
[2]పుల్లనీళ్ళకే పుణ్యమనేవాడు.
పుల్లయ్య వేమారం వెళ్ళి వచ్చినట్లు.
పుల్లాకు లెత్తమంటే మందిని లెక్కడిగినాడట. (లెక్కబెట్టినట్లు)
[3]పుల్లావు పాలైనా తెల్లగానే వుంటవి.
పుల్లిశెట్టి పెండ్లి ఎల్లిశెట్టి చావుకు వచ్చినట్లు.
పుష్య మందిచిన పురవీధి భూమియందు కట్టె మోవగ వలసె.
పుష్య భమ్మిన అంగటే కట్టెలమ్మాట.
పుష్యం వగరే తేన అయ్యేది.
పుష్యాలు పేదుశైన గడిపోయిన వాల్లుడువంగ వచ్చునే!
[illegible] (పుష్యమికార్తె) పూరిపిట్ట తేడువదు.

---

1 నలి – వాడిపోవు [illegible].
2 [illegible]
3 [illegible]

పుష్యమాసంలో పూసలు గ్రుచ్చ పొద్దుండదు. (ఈ నెలలో పగటి కాలం తక్కువ)
పుష్యమాసానికి పూసంత వేసంగి.
పుష్యమి కురిస్తే పూరిపిట్టగూడా తడువదు.
[1]పుసుకుడా, పుసుకుడా పూవులు తెమ్మంటే, తటకు తటకున పోయి, తంగేడు పువ్వులు తెచ్చినాడంట.
పుస్తకములు చదువ పొందునా మోక్షంబు.
పుస్తె, పూసా, పసుపు పునిస్త్రీకి.

---

# పూ

పూచింది ఒక ఎత్తు, కాచింది మరో కెత్తు.
పూచింది పుడమంత, కాచింది గంపంత.
పూచిన తంగేడు వేసినా, కాచిన వెంపలి వేసినా, నేను పండుతా నన్నదట—వరి.
పూచిన పూలెల్లా కాయలైతే చెట్టు మనునా?
పూచిన వెన్నెలంటే పుప్పొడి వెదకమన్నట్లు.
పూచే పూతను బట్టి కాచే కాపుండును.
పూజ కన్నా బుద్ధి, మాటకన్నా మనసు ప్రధానం.
పూజకొద్ది పురుషుడు, దానం కొద్ది బిడ్డలు.
పూజ కొద్ది బిడ్డలు, అదృష్టం కొద్ది అలు.
పూజ పునస్కారాలు లేక బూజెక్కి ఉన్నాను గాని, నైవేద్యం పెట్టు నా మహిమ చూపిస్తాను.
పూజారి బలిసి పోలేరమ్మ చండ్లు పట్టుకొన్నాడట.
పూటకూళ్ళకు వచ్చిన వాళ్ళకు పుట్టుధర ఎందుకు?

---

1 [illegible]

పూటకూళ్ళమ్మ పుణ్య మెఱుగదు.

పూటకూళ్లింట పాత్రకు ఎంగిలి లేదు.

పూట గడుస్తుంది గాని, మాట నిలిచిపోతుంది.

పూట బత్తెము-పుల్ల వెలుగు.

పూటలు మూడు, భోజనం ఒకటి.

పూడ్చ లేనంత గొయ్యి, తీర్చ లేనంత అప్పు-చేయరాదు.

పూతకు ముందే పురుగు పట్టినట్లు.

పూబోడి అంటే, ఎవర్రా బోడి? నీ అమ్మ బోడి, నీ అక్క బోడి అన్నదట.

పూరణం లేని బూరె, వీరణం లేని పెండ్లి వ్యర్థము.

పూరిగుడిసెకు చాందినీ మంచం కావాలనా?

పూర్ణిమనాడు కొంగుపట్టుక పిలిస్తే రానిది, అమావాస్యనాడు కన్ను గీటితే వస్తుందా?

పూర్వజన్మ కృతములే కాబోలు యీ నెయ్యముల్.

పూర్వోత్తరమీమాంసలకు బాబూ అమ్మగారు వ్యాఖ్యానం వ్రాసినట్లు.

పూర్వోత్తరా లెరిగి పొత్తు చేసికోవలె.

పూల చేర త్రినట్లు,

పూలతో గూడ [1]నార తలకెక్కినట్లు.

పూల వాసన నారకు పట్టినట్లు.

పూలమ్మి బ్రతికిన వారిని పుల్లలమ్మ బిలువరాదు.

పూవు పుట్టగానే పరిమళం వెదజల్లుతుంది.

పూవు పుట్టగానే తావి!

పూలమ్మిన అంగడిలోనే కట్టెలమ్మినట్లు.

[1] నార — [illegible] దారము.

పూస, కోరు ఉంటే భూమి [illegible]!
పూసలలో దారమువలె.
పూసలు [illegible] అంటే, [illegible] వస్తావే [illegible]
అన్నట్లు.

---

# పె

పెంటకుప్ప పెరిగితే, పేదరైతు పెద్దవాడగును.
పెంట తినేబఱ్ఱె, కొమ్ములు కోస్తే మానుతుందా!
పెంటతినే బఱ్ఱెపాలు పనికిరాకుండా పోతున్నవా!
పెంటదినెడు కాకి పితరుండు ఎట్లాయె.
పెంటదినెడు కాకి పెద్ద యేలాగయ్యె.
పెంటమీద చెట్టు ప్రబలం, నీరుపోసిన చెట్టు నిర్మలం.
పెంటమీద పంట, మంటమీద వంట.
పెంటమీద రాయివేస్తే, తనపైనే పడుతుంది.
పెండ్లాన్ని కొట్టడం ఎప్పుడు మానినావు అని అడిగినట్లు.
పెండ్లాము కొట్టితే, చస్తామను కొంటే, చావడం అలవాటు లేక
పోయినే అని అఘోరించాడట.
పెండ్లాము (భార్య) పాలిండ్లు రిక్తకుంభములు, [1]రాయిశెలది చను
దోయి పూర్ణకుంభములు.
పెండ్లాము బెల్లము, తల్లి దయ్యము.
పెండ్లామే పెరుమాళ్ళు.
పెండ్లి అయిన ఇంటిలో ఆరునెలలు కఱవు.

---

1 రాయిశెలది = [illegible]

పెండ్లికి చేసినపప్పు, పేరంటాండ్రు చవిచూచిన [illegible]

పెండ్లికిముందు బాగా కండ్లు తెరచుకొని చూడు, పెండ్లైనాక కండ్లు సగం మూసుకొని చూచీ చూడనట్లుండాలి.

పెండ్లికి వచ్చినవాళ్ళంతా పెళ్ళాలేనా!

పెండ్లికి పోతూ పిల్లిని చంకను పెట్టుక వెళ్ళినట్లు.

పెండ్లికూతురు పిత్తినట్లు.

పెండ్లి కొచ్చినమ్మ పెదవు లెండినాయి అంటే, నీ కన్నడొచ్చి నావమ్మా! నిలువుకండ్లు పడినాయి అన్నదట. [కోకు.

పెండ్లి కొచ్చినవారు వారే చేస్తారు, పెండ్లామా! నీ ఒళ్ళు అలిపించు

పెండ్లికొడుకు కుంటి కుడికాలు చూచి, అత్త ఏడుస్తుంటే, ఏడుపులో ఏడుపు ఎడమకాలుగూడ చూపమన్నాడట – తోడిపెండ్లి కొడుకు.

పెండ్లికొడుకు మనవాడేగాని, చెవులపోగులు మాత్రం మనవిగావు.

పెండ్లినాటి పప్పుకూడు దినమూ రమ్మంటే వస్తుందా!

పెండ్లినాటి సౌఖ్యం లంఖణాలనాడు తలచుకున్నట్లు.

పెండ్లినాడే పరగడుపైతే, పైన పిల్లలు గూడానా!

పెండ్లిని చూస్తూ ఒకడుంటే, పెండ్లాన్ని చూస్తూ ఒకడున్నాడు.

పెండ్లిమర్నాడు పెండ్లికొడుకు ముఖాన పెద్దమ్మ వేలాడుతుంది.

పెండ్లివారికి పెండ్లి సందడి, అడుసుకాళ్ళ వాడికి దోమల సందడి.

పెండ్లిసందడిలో పుస్తె కట్టి మరచాడట!

పెండ్లాల కోసం పెళ్ళాడాను కాని, కూడు పెట్టడం మా కులాన లేదు.

[illegible] తీరాదు, నలసింపక ఇంటికి పంపరాదు. -

[illegible] పోయినా, పెట్టే ఇల్లు చూపమన్నారు.

[illegible] కూస్తుంది.

[illegible]

పెట్టగల [illegible]

పెట్టేది చిన్నాం, పోయేది చిన్నాం, చిన్నాలికి నాకు ప్రాణ[illegible]ప్రాణం.

పెట్టమన్న పెట్టనే పెట్టదు, పెట్టమంత తేమొచ్చింది-పెద్దరోగం!

పెట్టమన్నా! పెట్టే ఇల్లయినా చూపించు.

పెట్టనేరనిరండ పెత్తు- నీతులకు పెద్ద.

పెట్టనేరని విభుండు కోపింప పెద్ద.

పెట్టితే తింటారుగాని, తిడితే పడతారా! (పెట్టితే తినవారేగాని తిట్టితే పడేవారు లేరు).

పెట్టితే పెండ్లి, పెట్టకుంటే పెడాకులు. [1](తిరాలు)

పెట్టి దప్పితివో, పెద్దల తిడితివో.

పెట్టిన దంతా పైరు కాదు, కడుపులన్నీ కాన్పులుగావు.

పెట్టిన పెళ్ళి గోరు, పెట్టకున్న చావు గోరు.

పెట్టిన పైరంతా మట్టిపాలైతే, రైతు బ్రతుకు కట్టతెగిన చెఱువు.

పెట్టినమ్మకు ప్రాణహాని, పెట్టనమ్మకు జన్మహాని.

పెట్టినమ్మ పుణ్యానపోదు, పెట్టనమ్మ పాపాన పోదు.

పెట్టినవానికి తెలియును నిక్షేపము. (ఉన్నచోటు)

పెట్టినదానికి పుట్టిం దేసాక్షి.

పెట్టిపోయ్యావమ్మ కొట్ట వచ్చిందట!

పెట్టిపోయని పెద్దమ్మా! కుట్టుబొర గుద్దేవే.

పెట్టిపోయని మొగుడు కుట్లువిడలి పొడిచినాడట!

పెట్టిపోతు లేని వట్టి బీరము లేల.

పెట్టిపోసిననాడే చుట్టాల రాకడ, కఱిగలనాడే [illegible].

పెట్టుకు ఆయం లేదు, తిట్టుకు సింగారం లేదు.

పెట్టు చుట్టం, తిట్టు పగ.

పెట్టు చుట్టము, [illegible]

[illegible]

పెట్టుతా నంటే ఆశ, కొట్టుతా నంటే భయము.

పెట్టుపోతలు లేని వట్టికూతలు - పూవుపిందె లేని వట్టిచెట్టు.

పెట్టేఅమ్మ బుద్ధిలో ఉంటే, ఏబంతినైనా పెడుతుంది.

పెట్టేవి రెండు (చీవాట్లు) పెందలాడే పెట్టు, దూడ గడ్డికి పోవా లన్నాడట.

పెడతల దురద పేనుకేమి తెలుసు.

[1]పెడ్రదానికి, పెద్ద రోగానికి మందు లేదు.

పెడమోము బెట్టుట ప్రీతిలేక.

పెడితే శాపం, ఇస్తే వరం.

పెత్తనం చేసేవాడు, పెంటి సంతానం కలవాడు అందరికీ లోకువే.

పెత్తనానికి పోతే, దుత్త చేతికి వస్తుంది.

[2] పెత్తర అమావాశ్యకు పెద్దరొట్టె యిస్తా నన్నాడు.

పెదబావగారు ఆడంగులతో సమము.

పెదవికి మించిన పల్లు-ప్రమిదకు మించిన వత్తి.

[3]పెదవిదాటితే పెన్న దాటుతుంది, పెన్న దాటితే పృథివిదాటుతుంది.

పెదవిపై మందహాసం-ఎదలో చంద్రహాసం.

పెద్దఇంటి బొట్టె(ట్ట)-ఎద్దులున్న వ్యవసాయం.

పెద్దఇంటి [4]బొడ్డి(ట్టె)అయినా కావాల, పెద్దచెఱువు నీరైనా కావాల.

పెద్దయింటి అంకు, పెద్దచెఱువు కంపు తెలియవు.

పెద్దఇంటి అంకు, పెద్దమనిషి బొంకు తెలియవు.

---

1 పెడ్రదం = మూర్ఖపు పట్టుదల; పెద్దరోగము = కుష్ఠరోగము.

2 పెత్తర అమావాశ్య = మహాళయ అమావాస్య.

3 ఇది, పెన్న రెండు పాయలుగా నెల్లూరును అంతర్వేదిగా చేసియుండిననాటి మాటగావచ్చును. క్రీ. శ. 1410 నాటికిగూడ యీ పాయ లుండినవి.

4 బొడ్డి = స్త్రీ: ఇల్లాలు.

పెద్దకత్తి పెరుమాళ్లు, (మాటకు అడ్డులేనివా డనుట.)
పెద్దక్కఓలి [1]తెగితే, చిన్నక్కఓలి తెగుతుంది.
పెద్ద కోడలికి పెత్తన మిస్తే ముడ్డి కడుక్కోకుండా (పీతిగుద్దతో) ఇంట్లోకి వచ్చిందట.
పెద్ద చెట్టుకు సుడిగాలి పెనుభూతం వంటిది.
పెద్దతల లేకుంటే పెద్దరికం చాలదు.
పెద్దతల లేకపోతే పొట్టేలు (ఎద్దు) తలన్నా తెచ్చి పెట్టుకోమన్నారు.
పెద్దపులి ఎదుటయినా పడవచ్చునుగాని, నగరివారి ఎదుట పడరాదు.
పెద్దపులిచాటుకు చేరిన ఎలుకకు, నమిలే గండుపిల్లి నల్లితో సమానం.
పెద్దపులి తరుముకవచ్చినా కంసాలి అంగడిలోకి పోరాదు.(దూరరాదు)
పెద్దపులి తరిమినా, దేవిడిముందుకు పోరాదు.
పెద్దపులి పేరంటం పెట్టునా?
పెద్దపులిమీద స్వారిచేసేవాడు భూమిమీద నడవలేడు అన్నట్లు.
పెద్దమనిషిని పేరంటానికి పిలిస్తే, అర్ధసేరు పసుపు ముడ్డికే సరి పెట్టినాడంట.
పెద్దమనిషి, ప్రజాపతి పనికిముందు విజృంభించి, పని కాగానే శాంతిస్తారు.
పెద్దముత్తైదువు సద్దుచేయదు, చిన్నపిల్లే చిందులు తొక్కేది.
పెద్దమ్మా! నీ వెక్కడి? కంటే, చిన్నమ్మా నీవెనుకే వుంటానన్నదట.
పెద్దరికానికి పెద్దబావ చస్తే, ఇంటిలపాది ఈడ్వలేక చచ్చిందట.
పెద్ద రెడ్డి కొంగు పట్టుకుంటే, కాదనే దెట్లా అన్నదట.
పెద్దల ఉసురు పెనుబామై తగులును.
పెద్దలకు పెట్టరా పేచీల తలపాగ.
పెద్దలతో వాదు, పితరులతో పోరు.

---

1 తెగితే = నిర్ణయమైతే

పెద్దలమాట చద్దిమూట.

పెద్దలమాట పెన్నిదిమూట.

పెద్దలమాట పెఱుగుకూటి మూట.

పెద్దలులేని ఇల్లు, ఎద్దుల కొటిక.

పెద్దలులేని ఇల్లు, సిద్ధులులేని మఠము.

పెద్ద లేకపోతే గొత్తె (దున్నపోతు) తలనైనా తెచ్చుకొమ్మన్నారు.

పెద్ద లేని ఊరికి పోతురాజే పెద్ద.

పెద్దవాన పెళపెళా పడితే, చిన్నవాన నానుడు పడుతుంది.

పెద్దిభొట్లూ, పెద్దిభొట్లూ! సన్యాసం తీసుకొంటావా? అంటే, పెండ్లాము చెప్పుతో మాడునకొట్టితే తీసుకోక తప్పుతుందా? అన్నాడట.

పెనములో నుంచి పొయ్యిలో పడ్డట్లు.

పెన మే మెఱుగును పెసరట్టు రుచి?

పెనుగాలికి, కాచినమాను వెరచునుగాని పెనుమొద్దు వెరచునా.

పెనుగొండకు పిల్ల నివ్వరాదు, [1]రొద్దానికి ఎద్దు నివ్వరాదు.

పెను రంకుబోతు కూతురుతో బాటు దుందుడుకు కొడుకు బుట్టినట్లు.

పెన్న దాటితే [2]పెరుమాళ్ళ సేవ.

పెన్న రావడం వెన్న కరిగే లోపలనే.

పెన్నలో మాన్యం కాశిలో దానం చేసినట్లు.

పెన్నీరు జిల (గిల) కొట్టి వెన్న దీసినట్లు, ఆకాశాన్ని పిడికిట బట్టినట్లు.

1 రొద్దం = ఒక ఊరు.

2 పెరుమాళ్లు=విష్ణువు; పెన్న ఒడ్డుననే పళ్లికొండు పెరుమాళ్ళు (పండుకొన్న) రంగనాథుడు వెలసిఉన్నాడు. కష్టాలుదాటిన సుఖ మనుట గూడ. పూర్వము పెన్న రెండు పాయలుగా చీలి, ఇప్పటి దేవాలయాన్ని (తిరుప్పాల కడలి) రంగనాయకుల పేటను (చిత్తిరిమేల్ విణ్ణగర్ = శ్రీ వైకుంఠము) అంకర్వేదిగా (దో అప్) చేసి పారేది. కష్టంమీద ఇవి దాటిన గదా పెరుమాళ్ళసేవ అనుటగూడ ఇది సూచించును.

పెమ్మకట్లవారి మంత్రం దెబ్బ అంటే, కమ్మకట్ల పాముకాటైనా పోతుంది.

పెయ్యను కాపాడమని (కాచమని) పెద్దపులికి అప్పచెప్పినట్లు.

పెయ్యను పెంచితే పేదరికం లేదు.

పెరటికి పోయినవానిని తన్న లేక పెంటను తన్నినట్లు.

పెరటిచెట్టు మందుకురాదు.

పెరుగగా పెరుగగా పెదబావగారు కోతి అయినట్లు.

పెరుగగా పెరుగగా, పెదబావ గుఱ్ఱం గాడిదయినట్లు అయినాడట.

పెరుమాళ్లకైనా పెట్టువాడే చుట్టం.

పెరుగుట విఱుగుట కొఱకే, ధరదగ్గుట ఎచ్చుకొరకే.

పెఱుగుకు పులికడుగుకు పెనకువ అయినట్లు.

ప్రెఱుగు పెత్తనం చెఱచును.

ప్రెఱుగూ వడ్లు కలిపినటు.

పెళ్లాం పోతే, పెండ్లికొడుకు అయినట్లు.

పెళ్లాం బెల్లంముక్క, తల్లి మట్టిగ(బె)డ్డ.

పెళ్లి కెళ్లినయింటిన వలసవెళ్ల బుద్ధయినదట!

పెళ్లికిపోతూ పిల్లిని చంకలో బెట్టుకొని పోయినట్లు.

పెళ్లికి ముందు కండ్లు బాగా తెరచుకోని ఉండి, పెండ్లి కాగానే సగం మూసుకోవాల.

పెళ్లే బాగుంది, పప్పువండితే మరీ బాగుంటుంది.

పెసరకు [1]పైరుగాలి, పసరానికి [2]నోటిగాలి ప్రమాదం.

---

1 పైరు (ర) గాలి = దక్షిణపుగాలి.

2 నోటిగాలి = పశువులనోటికి తగులు (గాలికుంటు) పుండ్లవ్యాధి.

## పే

పేగు చుట్టమా? పెట్టు చుట్టమా?
పేచీకి పెదబాబు.
పేడకుప్పకు దిష్టి (దృష్టి) దీయాలనా?
పేడదిన్న పురుగు బెల్లమే మెరుగురా.
పేడలో పొదిగిన ఉల్లిగడ్డవలె.
పేడా, బెల్లం ఒకటి చేసినట్లు.
పేడు ముదిరి పెండ్లికొడుకగు.
పేద, కడుపు నింపను అన్నం వెదకును, మహారాజు అన్నం నింపను కడుపు వెదకును.
పేదకు తగిలె బ్రహ్మహత్య అన్నట్లు.
పేదకు పెన్నిధి దొరికినట్లు.
పేదపేద గూడి పెనగొనియుందురు.
పేద తెవులు అంగడి బెట్టుకున్న తీరదు.
పేదబడ్డ వెనుక పెండ్లము మతిచూడు.
పేదలకు చేతనైనది కలలు గనుటమాత్రమే.
పేదల కోపం పెదవికి చేటు.
పేదల బిగువు, సాధుల తగవు.
పేదయింటగాని రాచయింటగాని ఎద్దుతినేది గడ్డే.
పేదవాడు పెంట దింటే ఆకలికని, మారాజు (మహారాజు) తింటే మందుకని అన్నట్లు.
పేదవాణ్ణి చూస్తే పేలాలు త్రుళ్లుతాయి.
పేదవానికి పెండ్లామే ఆస్తి.
పేదవానిఇంట పెండ్లయిన ఎరుగరు.
పేదవానికి పెండ్లామే లంజ.

పేదవాని పెళ్లాం వాడకెల్ల వదిన.
పేదవానిపైనే పడెరా పెద్దపిడుగు.
పేదవానివెంట పడెనమ్మా జోరిగ.
పేదవాని స్నేహం, మహారాజువిరోధం సహింపరానివి.
పేను కుక్కమంటే చెవి కరచినట్లు.
పేనుకు పెత్తన మిస్తే, [1]యీపిని యిరవైచోట్ల యీనిందట.
పేనుకు పెత్తన మిస్తే, తలంతా తెగగొరికి పెట్టిందట
పేనేమెఱుగును పెడతల గండూతి?
పేరంటానికి వచ్చి, పెండ్లికొడుకు వరస ఏమన్నట్లు.
పేరంట్రాండ్లు పదిమందిచేరి పాకం చెడగొట్టినట్లు.
పేరితే పాలే పెరుగు.
పేరిశాస్త్రికి కలిగెరా పెదవిపాటు!
పేరు ఒకరిది, పెత్తనం ఇంకొకరిది.
పేరు ఒకరిది, నోరు ఇంకొకరిది.
పేరు కమలాక్షి, కండ్లేమో చీపురివి.
పేరు కమలాక్షి, చూపులు కాకిచూపులు.
పేరుకు [2]మోపూరు, పేను లోభులును వారు.
పేరు గంగాభవాని, తాగబోతే సిటిచుక్క లేదు.
పేరు గురులింగ మంటే, ఉండే మూడులింగాలు (పురుషాది) గాక ఇదెక్కడ దన్నాడట.
పేరు జీలకఱ్ఱ - చూడబోతే కఱ్ఱలేదు.
పేరు ధర్మరాజు, పెనువేప విత్తయా.
పేరు పెండ్లివాండ్లది, తిండి ఇంటివాండ్లది.
పేరు పెత్తనం చెఱచును.
పేరు పెద్ద, ఊరు దిబ్బ.

---

1 ఈపి = పేనుగుడ్డు.

2 మోపూరు = నెల్లూరు మండలంలో భాగ్యవంతమైన గ్రామము; నాగరకతకు ప్రసిద్ధి.

పేరు పెద్దతీకం, చెప్పులతోూత.
పేరు పెనిమిటిది, అనుభవం మామగారిది. (ఊరివారిది)
పేరు పెన్న మోసినది, ఒళ్లు నేల మోసినది.
పేరు పెరుమాళ్లది, నోరు తనది. (పేరంటాలిది)
పేరు పేరయ్యది, పిల్ల ఉమ్మడిది.
పేరు నేతిబీరకాయ, చీరిచూస్తే నేతిచుక్క లేదు.
పేరులేని వ్యాధికి పెన్నేరుగడ్డ మందు.
పేలాలుచల్లి దయ్యాల లేపినట్లు.
పేలికైనా పిండి కట్టమన్నారు.

---

## పై

పైఆకు రాలితే, కిందిఆకు, పైకొచ్చినట్లు.
పైకం భాగవతం వారికి, తిట్లు చాకలి మంగలివాళ్ళకు. (వీధిభాగవతాలలో వేషాలకు దివిటీలు పట్టే చాకలి మంగళ్ళనే హాస్యగాడు గేలి పట్టించేది)
పైచట్టంలో పరమాన్నం, పాపరా నన్ను లేపరా అన్నట్లు.
పైచాలు లేని పైరు, పగలి అంబలిలేని మనిషి.
పైడికొండలో బచ్చు (బొచ్చు) చేరాలా?
పైతళ్లుక్కయితే పడరానిపాట్లు పడవచ్చును గాని, మొగం ముడతలుపడితే చేసే దేమున్నది?
పైత్యం లేదు, శైత్యం లేదు, పచ్చడంబట్ట ఇటు పారవేయండి.
పైత్యరోగికి పంచదార చేదు.
పైన పండ్లు, లోపల పుచ్చుకొమ్మచెట్టు (దుష్టుడు)

పైన పటారం, లోన లొటారం.
పైన పడ్డ మాట, మడిని పడ్డ నీరు.
పైన పొత్యే పత్రియాకలు ఎన్ని అన్నట్లు.
పైన మంట, కింద మంట, కడుపులో మంట, కాలు నిలిపితే
ఖామందు తంట.
పైపై నెరిమించు కేసరికి [1]పక్కెర వేయవచ్చునా?
పైరుకు రాగులు, భాగ్యానికి మేకలు.
పైరుగాలి తగిలితే పంట ఊరవు (పైరుకు [2]కోపు)
పైరు పలుచనైతే పాతళ్లు నిండతవి, మెండైతే వాములు దండి.
(నిండు)
పైరు నిడినవాడు బహుసౌఖ్యవంతుడే.
పైరు మార్చిన పంట పెంపు.
పైరుకు ముదురు, పసరానికి లేతకావాల.
పైరుకు విత్తితే గాదం మొలచినట్లు.
పైసా! పైసా! ఏం జేస్తావంటే, ప్రాణంవంటి మిత్రుణ్ణి పగ చేస్తా
నందిట!
పైసా లేనివాడు పరస్త్రీ వర్జితుడు.
పైసాలో పరమాత్ముడున్నాడు.

---

1 పక్కెర = జీను.
2 కోపు = అదనుకు తగిన ఏపు.

## పొ

పొంకణాల పోతిరెడ్డికి ముప్పైమూడు దొడ్లు, మూడు ఎడ్లు.

పొంగినదంతా పొయ్యి పాలే.

పొంగిన పాలు పొయ్యిపాలు.

పొంగే కాలానికి బలుసు, మ్రగ్గే కాలానికి మామిడి.

పొంగే పాలు, వెలిగే దీపం ఆర్పరాదు.

పొక్కటి రాళ్ళకు పోట్లాడినట్లు.

పొగచుట్టకు సతిమోవికి ఎంగిలి లేదంటారు.

పొగడ్తకు పెరుగరాదు, తెగడ్తకు తరుగరాదు.

పొగతోటకు పాడి నేల. (పాటినేల)

పొగలోనుండి సెగలోకి వచ్చినట్లు. (సెగలో పడినట్లు)

పొగాకు అడుక్కోవాలి, అందలం బయట పెట్టరా అన్నట్లు.

పొట్టయినా (పొట్టుఅయినా) తిని, పుట్టింట కాపురం చేయాల.

పొట్ట[1]కరుకు(గు)లు తిన్నవారికి ఊచబియ్యాలు ఎట్లా వస్తాయి.

పొట్ట కిచ్చినా, బట్ట కిచ్చినా భూదేవే.

పొట్టకు పుట్టెడుతిని, అట్లకు ఆదివారం రమ్మన్నట్లు.

పొట్టతిప్పలకు జేరి పోతు లాడించాలి.

పొట్టనిండ చీరికలు–[2]వట్టికాళ్ళ కురుపులు.

పొట్ట పైరుకు పుట్టెడు నీరు.

పొట్టి గట్టి, పొడుగు లోడుగు.

పొట్టి తోకగల కోడె పొడిచినా నడవదు. (కదలదు)

---

1 కరుగు = వెన్న మొదట వేసి, పాలతో నున్న గింజలు. ఊచబియ్యం = ముదిరిన పచ్చిబియ్యము.

2 వట్టికాలు = పాదము. (మీగాలు)

పొట్టిదానిగట్టితనం పట్టెమంచం ఎక్కినప్పుడు చూడు.

పొట్టి పోతరాజు కొలువువలె.

పొట్టివానికి పుట్టెడు బుద్ధులు.

పొట్టివానికి మితిలేని పొలతి వాంఛ.

పొట్టివాని నెత్తి పొడుగువాడు కొట్టె, పొడుగువాని నెత్తి దేవుడు [కొట్టె.

పొట్లకాయకు రాయికడితే చక్కనగును గాని, కుక్కతోకకు కడితే ఫలమేమి ?

పొట్లపాదికి పొరుగు గిట్టదు.

పొడుగు, గాలికి (వల్ల) చేటు; పొట్టి నీటికి చేటు.

పొడు మెక్కించే ముక్కు, పొగ పీల్చే నోరు శుభ్రంగా ఉండవు.

పొడువలేనిబంటు చేతిది ఈటైతే నేమి తెడ్డయితే నేమి.

పొడవులకు (పరువుకు) రోకలి మింగితే, పొన్నొచ్చి (పన్ను) ముడ్డిన యిరుక్కొన్నదట.

పొత్తుకు మళయాళం, సంబంధానికి సాంబారు (=తమిళుడు ఆంధ్రుని గోంగూరన్నట్లు)

పొత్తుమాట పొసగని మాట.

పొత్తుల పనిలో పిత్తుక చచ్చినట్లు.

పొత్తులమగడు పుచ్చి చచ్చెను.

పొదుగు కోసి పాలు తాగినట్లు.

పొదుగు చింపిన పసరం పోతు నీనుతుందా ?

పొదుగు లేని ఆవు పాలిస్తుంటే, నాలిక లేని పిల్లి నాకేసిందట!

పొదుగులో ఉన్నా ఒకటే, దుత్తలో ఉన్నా ఒకటే (పాలు) అన్నట్లు.

పొదుగెంతజారినా కుక్క గోవు కాదు.

పొ(ప్రొ)దుకలుగ (ప్రొద్దుండగా) లేచినందుకు, బాట తప్పినందుకు సరిపోయింది.

పొదుగాని పొద్దులో పెద్దిగాని పెళ్ళి.

పొద్దుపోదు, నిద్రరాదు, పద్మాక్షీ! ఒక పాటయినా పాడవే అన్నట్లు.

పొద్దుట లేవని కాపుకి పొలం ఇచ్చేది గడ్డే.

పొద్దుటిది పొట్టకు, మాపటిది బట్టకు.

పొద్దు తిరుగుడు, డొంక తిరుగుడు.

పొద్దుతిరుగు పువ్వు బుద్ధికి-పొద్దుకు నిలకడ లేదు.

పొద్దుపొడుపున వచ్చిన వాన, పొద్దుగూకి వచ్చిన చుట్టం పోరు.

పొద్దేమో గడచిపోతుందిగాని, మాటమాత్రం నిలిచిపోతుంది.

పొమ్మనలేక పొగ బెట్టినట్లు.

పోయింది పోగా, పిడకల కుచ్చెల బట్టుకొని ఏడ్చినట్లు.

పొయ్యిలు చెడ్డదినంలో వేయాలి, పెండ్లిండ్లు మంచిదినంలో చేయాలి.

పొయి అరిస్తే బంధువులరాక-కుక్క అరిస్తే కఱవురాక.

పొయ్యి ఊదమంటే కుండ బద్దలు కొట్టాడట!

పొయ్యి ఊదలేనమ్మ ఏడుమనువులు పోయిందట!

పొయ్యి ఊదినమ్మకు బొక్కెడు...బూడిద!

పొయ్యిప్రక్క వెన్నముద్దవలె.

పొయ్యిలో పిల్లి ఇంకా లేవలేదు. (వంట ప్రారంభించను వసతి లేకుండుట)

పొయ్యి సెగ [1]పొంతకుండకు తగలక పోదు.

పొరుగమ్మ సరిపెట్టుకుంటే, ఇరుగమ్మ ఉరిపెట్టుకుందట!

పొరుగింట చూడరా నా పెద్ద చెయ్యి.

పొరుగింటి అట్లకు తిమ్మనం కాచుకుందట!

పొరుగింటి అట్లకు నెయ్యి కాచినట్లు.

---

1 పొంత = పొయ్యికి ఒకప్రక్క గడ్డ. ఇంకొక ప్రక్కన గడ్డగా పెట్టిన కుండ. దీనిలో నీరుబోసి కాచుకొందురు.

పొరుగింటి కలహం విన వేడుక.

పొరుగింటి నెయ్యి పెండ్లాము చెయ్యి. (వడ్డించేటప్పుడు)

పొరుగింటి పుల్లగూర రుచి.

పొరుగింటి పొయ్యి మండుచున్నదని తన పొయ్యిలో నీళ్లు పోసుకొన్నట్లు.

పొరుగింటి బాన (బానెడు) పాడి కంటె, తన ఇంట గిద్ద (గిద్దెడు) పాడి మేలు.

పొరుగింటి బిడ్డను దించి, నీటి లోతు జూచినట్లు.

పొరుగుది అట్లు పోసితే, యింటిది పోరెలు పోస్తుంది.

పొరుగూరును నమ్ముకోగాక(బాక) పొద్దు మునగా పండుకోబాక.

పొరుగూరికి పోతే పోతుందా పాపం?

పొరుగూరి చాకిరి, పొరుగూరి వ్యవసాయం తనను తినేవే కాని, తాను తినేవి కావు.

పొరుగూరు పోగానె పోవునా దుర్దశ.

పొర్లించి, పొర్లించి కొట్టినా, మీసాలకు మన్ను కాలేదు అన్నాడట!

పొల అలుకనాటి కూటమి వెల యింతని చెప్పలేము.

పొలములోని ఆబోతును పులి గొన్నట్లు.

[1]పొల్లుకట్ట దంచి పోగు చేసుకొన్నట్లు.

పొల్లున దంచిన బియ్యము, తెల్లని కాకి లేవు.



1 పొల్లు = తరకలు; గల్ల.

## పో

పోకముడి విప్పుతూ, కోక వెల అడిగినట్లు.

పోకల కుండ చట్రాతి మీద పగుల గొట్టినట్లు.

పోకలు నమలుచు ఆకులు చేబూని సున్న మడుగువాడు శుద్ధ విధవ.

పోకిరికి పోలీసు, చదువురానివాడికి సర్వే.

పోగాపోగా *పైమీదబట్ట బరువవుతుంది.

పోచమ్మకు, కందూరు పీర్లకు [1]బోనాలు.

పోట్లాడే కోళ్లు పాడిచినా పోవు.

[2]పోడిమగలనాడె పొరుగింటి పొందు.

పోతా, పోతా అన్నోళ్లకు పోకడలేదు, చస్తా, చస్తా అన్నోళ్లకు చావు లేదు.

పోతురాజు ఇష్టమా? పొట్టేలు ఇష్టమా? (కోయుటకు)

పోతూ పారవేస్తూ పోయి, వస్తూ ఏరకతినే (ఏరుకొని) రకం.

పోతున్నా! నంటే, నీయంత పోతుకు మే తేడ తెచ్చేది? అన్నాడట!

పోతేపల్లి వారికి పప్పే సంభావన.

పోయిన కంటికి మందు వేయబోతే, ఉన్న కన్ను ఊడ్చుక (ఊడి) పోయిందట!

పోయిన చోటెల్లా పొగాకే అడిగితే?

పోయినది ఒర, ఉండేది కత్తి.

పోయిన నీళ్ళకు కట్ట బెట్టినట్లు. (గత జలసేతబంధనము)

పోయిన మగడు పోయినా, పొన్నకాయలా గుండు కుదిరింది.

పోయే కాలానికి అపరబుద్ధి.

---

* పై = ఒళ్లు.

1 బోనము=అన్నము-పొంగలి అని.

2 పోడిమి = సంపద.

పోరాని చుట్టము వచ్చాడు, బొడ్డువంచి తమలపాకులు కోయమన్నట్లు.

పోరానిచోట్లకు పోతే, రారాని నిందలు రాకమానవు.

పోరిన పొరుగు, రాచిన కుండలు మనవు.

పోరు (డు) గాలితో దీపంబెట్టి నా పాతివ్రత్య మహిమ (దేవుడి మహిమ) అన్నట్లు.

పోరుచాలక పొయ్యిదగ్గఱ పండుకొంటే, బొంత కాలిపోయె నారాయణా!

పోరు నష్టం, పొందు లాభం.

పోరు లేనిగంజి పు(రి)డిసెడైనా చాలు.

పోలనాటిలో పోకకు పుట్టెడు అమ్మితే, ఆ పోకా దొరకక పొర్లి పొర్లి ఏడ్చిందట!

పోలికివచ్చిన భోగానికి, పోట్లేలుకు వచ్చిన రోగానికి తిరుగులేదు.

పోలీ! పోలీ! నీభోగ మెన్నాళ్ళే? అంటే, మాఅత్త మాలపల్లినుంచి (మాలాడ) వచ్చేదాకా అన్నదట!

పోలుగాడి చెయ్యి బొక్కలో పడ్డట్టు.

పోలేరమ్మకు పొయ్యేదీ లేదు, పోతురాజుకు వచ్చేదీ లేదు.

పోలేరమ్మ దిగివచ్చితే పొలంకాపు కేమిభయం?

పోలేరమ్మది చినగదు, పోతురాజుది విరుగదు.

పోలేరమ్మ పెండ్లిలో పోతురాజు పెత్తనం.



## పౌ

పౌరుషం (పురుషకారం) లేక దైవం అనుకూలించదు.

పౌరుషానికి (సనికలు) పాత్రం మెడకు కట్టుకొన్నట్లు.

పౌర్ణమికి పూజించి, అమావాస్యకు ఆరగిస్తవి. (తేనెటీగలు తేనె తెట్టెను)



# ప్ర

ప్రజల మాటే ప్రభువు కోట.

ప్రజ్ఞ లేని శౌర్యం-పదును లేని ఖడ్గం.

ప్రతిష్ఠకు పెద్దనాయుడు చస్తే, ఈడవలేక ఇంటిలపాది చచ్చారట!

ప్రథమ కబళంలోనే మక్షికాపాతం.

ప్రథమ చుంబనం-దంత భగ్నం. (మొదటి ముద్దుకే మూతిపండ్లు రాలినవి.)

ప్రదక్షిణాలు చేస్తే, బిడ్డలు పుడుతారంటే, చుట్టుచుట్టుకు కడుపు చూచుకొన్నదట.

ప్రపంచమంతా ధర్మపరాయణమైతే శౌర్యానికే తావుండదు.

ప్రభగిరిపట్నం తాటిచెట్టు వలె. (పొడవు)

ప్రయాణాల వారి హడావుడి కంటే, పెట్టెలు మోసేవారి హడావుడి ఎక్కువ.

ప్రయాణాలు అబద్ధం, ప్రసాదాలు నిబద్ధం.

ప్రసాదానికి బలిష్ఠం, పనికి మీా అదృష్టం.

ప్రసాదానికి ముందు, పనికి వెనుక.

ప్రసూతి వైరాగ్యం ఒంటిపచ్చి ఆరినదాకే.

ప్రసూతి వైరాగ్యం, పురాణ వైరాగ్యం, శ్మశాన వైరాగ్యం, అభావ వైరాగ్యం.



## ప్రా

ప్రాక్టీసులేని ప్లీడరు దేశాభిమాని అయినట్లు.

ప్రాణముంటే ఉప్పుగల్లమ్ముకొని బ్రతుకవచ్చు.

ప్రాణముంటే బలుసాకు తిని బ్రతుకవచ్చు.

ప్రాణ ముండేవరకు భయం లేదు.

ప్రాణం పోయినా మానం దక్కించుకోవలె.

ప్రాణం పోయేటప్పుడు కూడ త్రాచు పడగ వంచదు.

ప్రాణం మీదికి వచ్చినప్పుడు, పంచాంగం చూచి మందు పోస్తారా ? (త్రాగిస్తారా ?)

ప్రాణ మున్నప్పుడే పంతాలు నెరవేరుతాయి

ప్రాణములేని వానికి బంగారు తలపాగజుట్టిన ప్రయోజనమేమి, ఆణి వజ్రభూషణ మురమున బెట్టనేమి.

ప్రాతదొంగ పట్టుబడక పోడు.

ప్రాతబడ్డ బావినీరు, మేకల పాడి రోత (బొచ్చుపడునని, మేకను వెనుకనుండి పితుకుటచే పెంటికలు పడునని - రోత)

ప్రాయము వస్తే పందిపిల్ల కూడ బాగుంటుంది.

ప్రాయాన బెట్టిన పంట-ప్రాయాన కన్నకొడుకు.

ప్రాసకేడ్చానే కూసుముండా! అన్నట్లు.

## ప్రి

ప్రియం మహాలక్ష్మి, చౌక శనేశ్వరం.

ప్రియములేని కూడు పిండపు కూడురా.

## ప్రీ

ప్రీతితో పెట్టింది పిడికెడైనా చాలు.
ప్రీతిలేనికూడు పిండాకూడు.
ప్రీతిలేని లంజ ఘాతుకియై తోచు.



## ప్రే

ప్రేమ అమ్మేదికాదు కొనేదికాదు, ప్రేమవెల ప్రేమే.
ప్రేమ గుడ్డిది.
ప్రేమలేని మాట పెదవిపైనే ఉండును.



## ప్రో

ప్రోలులోనే లేకపోతే, పొడుగూనా ఉంటుందా!



## ఫ

ఫకీరువాణ్ణి తెచ్చి పరుపులో కూర్చుండబెడితే, లేచిలేచి మసీదు లోనికి పోయాడట!
ఫణివాతబడని ప్రభంజనమా!
ఫరవాలేని చుట్టం వచ్చింది, పాతచేట గొడుగు పట్టమన్నట్లు.
ఫలానికి తగిన బీజము, నేలకు తగిన నీరు.



# ఫా

ఫాల్గునమాసపు వాన పదిపనులకు చెఱుపు.

---

# బ

బంక చెక్కలు, జింక తోలు, పాయిల కూర.

బంగారం కొద్దీ సింగారం.

బంగారం పోయిన తర్వాత బట్ట చుట్టమా!

బంగారం పట్టితే మన్ను; మన్ను బట్టితే బంగారం అయినట్లు (దుర దృష్ట అదృష్టములస్థితి)

బంగారపు పళ్ళానికైనా గోడ చేర్పుండ వలెను.

బంగార ముంటే, సింగారానికి కేమి (కొదువ) తక్కువ!

బంగారమునకు తావి అబ్బినట్లు.

బంగారు కరగను వెలిగారం తప్పనట్లు.

బంగారుకే రంథ చిక్కుతుందా?

బంగారు గాలానికి బంగారు చేపలు పడవు.

బంగారు చెప్పులైనా (ముచ్చెలైనా) కాళ్ళకే తొడగాలి.

బంగారు పోల్లున్నది గాని, మనిషి పోల్లు లేదు.

బంగారు బాగుగా పది వన్నెగాకుంటె అంగలార్చుచు బచ్చు (కోమటి) వాడుకోనేల.

బంగారు మనిషి ఊరేగడానికి వడితే. ఇదే సందని భజంత్రీలు పారిపోయారట!

బంగారు వంటి కోమటి సంగీతముచేత బేరసారము లుడిగెగా.

బంగు తిన్న కోతివలె.

బండకొయ్యకు బుద్ధి చెప్పినట్లు.
బండ తీసి, గుండు పెట్టినట్లు.
బండన్న పెండ్లికి బడితే బాజా.
బండ్రవాండ్రు ముందు దండంబు లిడుదురు.
బండవానికి పిండి యోచన ఏమిటి?
బండారంలేని కోమటి బాటలు బద్దిచ్చుకున్నాడట!
బండివాటు బడ్డోడు పెట్టోడు. (బండిని తలక్రిందులు తోచుకోవడం అంతటి అవివేకపు పని అని)
బండెక్కి సివాలాడుతూ, బావగారు చూస్తారని భయపడ్డట్లు.
బండెడు ధనమిచ్చినా బావమరది లేని చుట్టరికం పనికిరాదు.
బంతికే రావద్దంటే, విస్తరాకు తెమ్మన్నట్లు.
బంతిలో చిక్కింది, భైరవబోకి.
బందరు నాయాళ్ళు బడాయేగాని, అడపంలో (సంచిలో) ఆకు వక్కా లేదు (పోక పొలుకే లేదు)
బందరు బండాయి, గుంటూరు లడాయి.
బందరుమూల మెరిస్తే, బక్కగొడ్డును అమ్మిస్తుంది. (వాన లెక్కువగును)
బందిపోటు తరిమినా, గొఱ్ఱెలమందలోనికి పోరాదు.
బందెపోటుదొంగ ప్రాణమునో ధనమునో హరిస్తే, పెండ్లి యీ రెంటినీ హరిస్తుంది.
బందెలో పాయసం కంటె బయట సజ్జరొట్టె మేలు.
[1]బందేడు పచ్చి, కోడలు కొత్తా లేదు.
బంధువయితే మాత్రం బంధాలు తొలగిస్తాడా!
బంధువుడవు సరేగాని, పైరులో చేయి పెట్టవద్దు.

1 బందేడు-బందారు=ఒక అడవి గుబురుచెట్టు; వాపులకు కట్టుదురు.

బంధువుతోనైనా పాలి వ్యవసాయం కూడదు.

బంధువులంతా ఒకదిక్కు, బావమరది ఇంకొకదిక్కు.

బంధువులకు దూరం–బావికి చేరువ.

బక్కనాగు పయనం బోతే, నక్కలన్ని గుసగుసలాడె.

బక్కప్రాణం కాస్తా బావచేతులో పోయిందట.

బక్కవానికి బలసినవాడు బావ, బలసినవాడికి బక్కవాడు బావ.

బగబగమను వాని పంచన నుండవచ్చును గాని, నాలిముచ్చునట్టింట నుండరాదు.

బగుళ్ళపనికి బరంతు లేదు.

బచ్చన కోలలు, రిచ్చన గిల్లలు. [అన్నట్లు.

బజారున పోయేవాడిని అబ్బా! అంటే, ఎవరికి పుట్టావురా కొడుకా!

బజారు బత్తెం, బావి నీళ్లు.

బజారులో కొట్లాడాలి, బంతిలో భుజించాలి.

బట్టకాలితే సెట్టి విడుస్తాడా?

బట్టచాటు పుండు, బావగారి వైద్యం.

బట్టతలకు పేలు పట్టిన వన్నట్లు.

బట్టతలకు మోకాళ్లకు ముడివేసినట్లు.

బట్టతలమ్మ పాపట తీయమన్నట్లు.

బట్టప్పు, పొట్టప్పు నిలువవు.

బట్టలో పేలాలు వేయించినట్లు. [నిల్చుందట!

బట్టవిప్పి నీళ్లు పోసుకొంటూ, బావగారు వచ్చారని నిటారున

బట్టా(పా)కాతా [1]డౌలేకాని, నా [2]బట్టదగ్గర బొట్టుకూడా లేదన్నట్లు.

బడాయిఏమి బాపనమ్మా అంటే–అమలుదారు నా అల్లుడాయగదా అన్నదట.

1 డౌలు = దంభము. 2 బట్ట = నా ముట్టుబట్ట అన్న తిట్టు.

బడాయి ఏమిర అన్నయ్యా? అంటే, పైసా లేదుర తమ్మయ్యా అన్నాడట.

బడాయికి బచ్చలికూర, తినకపోతే తోటకూర.

బడాయికి బయట పడుకుంటే, బక్కనరాలు యిక్కలాక్కు వచ్చాయంట.

బడాయికి బావగారు చస్తే, ఈడ్వలేక ఇంటివారందరు (ఇంటిల్లిపాది) చచ్చారు.

బడాయికోరు బచ్చె, కూటికి లేక చచ్చె.

బడాయి గాలికి పోతే, గుడ్డు నేలకు ఆనిందట!

బడాయి బండిమీద పోవడమేగాని, బత్తా (బత్తెమునకు) నికి నూకలు లేవు.

బడాయి బండెడు, బట్టలు సందెడు.

బడాయి బండెడు, బత్తెం గిద్దెడు.

బడాయి బచ్చన్న కూడులేక సచ్చెన్న.

బడాయి బచ్చలికూరకు ఢడాచింతపండు.

బడాయి బారెడు, పొగచుట్ట మూరెడు.

బడికి బెత్తం-మడికి [1]గత్తం.

బడితె కలవానిదే బర్రె.

బడిలేని చదువు-వెంబడిలేని సేద్యం.

బడివారపునక్క కుక్కల పాలానికి పోయిందట.

బడి(బరి) విడిచిన ముండ బజారుకు పెద్ద.

బడేసాయిబు గడ్డం బారెడైతేనేమి? మూరెడైతేనేమి!

బడేసాయిబును జోస్యులు, తొలి ఏకాశి ఎప్పుడు అని అడిగినట్లు.

బ(బ్ర)తకలేక బడిపంతులు.

---

1 గత్తం = ఎరువు.

బతకలేనమ్మ బావిలో పడి చచ్చిందట!

బతకలేనివాడు బావిలో పడితే, తియ్యబోయినవాడు కయ్యలో పడ్డాడట!

బతికి (బ్రతికి) ఉంటే గరిటెడు పాలు లేవుగాని, చస్తే సమాధిపై ఆవును కట్టేస్తా అన్నట్లు.

బతికిచెడిన వారితో బంధుత్వం చేయవచ్చును గాని, చెడిబ్రతికిన వారితో చేయరాదు.

బతికితే బలిజోడు, లేకపోతే బోగమోడు.

బతికిన (బ్రతికిన) బతుక్కి భగవద్గీత పారాయణమా?

బతికినబతుక్కు ఒకపంది సాకుడా?

బతికితే అతిసారం, చస్తే కలరా అన్నట్లు.

బతికితే భూదానం, చస్తే గోదానం.

బతికితే వైద్యుడు బ్రతుకుతాడు, చస్తే బ్రాహ్మణుడు బ్రతుకుతాడు. (రోగి అనుట)

బతికి పట్నం చూడాలి, చచ్చి స్వర్గం చూడాలి.

బతికే బిడ్డయితే పాసుకంపు కొడుతుందా?

బతుకంత (బ్రతుకంత) భాగ్యంలేదు.

బతుక నేరని బిడ్డ బారెడుండు.

బతుకలేక బోగాతం (భాగవతం).

బతుకలేనమ్మ నీళ్లులేని బావిలో నిచ్చెన వేసుకొని దూకిందట.

బతుకు తక్కువైనా బడాయి ఎక్కువ.

బతుకు లెన్నాళ్లు? భాగ్యా లెన్నాళ్లు?

బత్తె మున్నన్నినాళ్లు బ్రతుకులు.

బత్తెమెక్కడో సత్యమక్కడ.

బదులుమనిషి ఉంటే, పగలు తలనొప్పి.

బనగానపల్లి ఉరుసు, నా వెంట రావే నరసు.

బయట తన్ని, ఇంట్లో కాళ్లు పట్టుకున్నట్లు.

బయట పులి, ఇంట పిల్లి. (భార్యఎదుట)

బయటికి ఇంపు, లోపలికి కంపు.

బయిటికి పోయినచోట గుద్ద (ముడ్డి) మరచివచ్చినట్లు.

బయటి కొకటి. లోపలి కొకటి (మాట).

బయటివాడు చూడుగేదంటే, ఇంటివాడు గొడ్డుగేదె అంటాడు.

బయల చిత్రము వ్రాసినట్లు.

[1]బయిలున్నంత చదివె బయ్యన్న.

బయిలులో ఉన్నంత బయ్యన్న గీకె.

బరిగపంట-కడుపు మంట.

బఱక సేద్యం-తురక నేస్తం.

బఱ్ఱెపెంట దిన్నా పాలు కంపుగొట్టవు.

బఱ్ఱెకొమ్ము అంటే, ఇఱ్ఱి కొమ్మన్నట్లు.

బఱ్ఱెకో [2]బాంచె, గుఱ్ఱానికో [3]సైసు.

బఱ్ఱె చవలం, బండె ముచ్చవలం.

బఱ్ఱె చస్తే పాడి బయట పడుతుంది.

బఱ్ఱె-దూడ ఉండగా, [4]గుఱక గుంజకు వస్తుందా!

బఱ్ఱెదూడ వద్ద, పాత అప్పులవాడి వద్ద ఉండరాదు.

బఱ్ఱె పాతిక, బండె ముప్పాతిక.

బఱ్ఱె పిల్లి కాలు తొక్కితే, పిల్లి ఎలుకపై మీసాలు దువ్వినదట!
(కసిఱ్ఱజేసిందట)

బఱ్ఱె పిల్లకు బనారసు చీర!

బఱ్ఱెలు తినని కూరగాయలు బాపలకు దానమన్నట్లు.

1 బయలు=పుస్తకాలు. 2 బాంచె - బానిస.
3 సైసు = మాలీష్ చేసేవాడు. 4 గుఱక = పశురోగ విశేషం.

బలం ఉడిగినా, పంత ముడగదు.

బలవంతమైన సర్పము చలిచీమల చేతజిక్కి చచ్చినట్లు.

బలవంతాన పిల్ల నిస్తామంటే, కులమేమి? గోత్రమేమి? అని అడిగి నాడట!

బలవంతుడి సొమ్ము గాక బాపడి సొమ్మా? (సొత్తా?)

బలవంతునింట బానిసనైన చెరువ వెరతురు.

బలవంతుని చేయి పడితే, కావిలయినా చూచుకోవాలి, చంక అయినా చేరాలి.

బలవంతపు మాఘస్నానం.

బలవంతపు బ్రాహ్మణార్థం.

బలిజ చుట్టంకాదు, బడ్డు ఆయుధంకాదు.

బలిజపుట్టుక పుట్టవలె, బత్తాయిబుడ్డి కొట్టవలె.

బలిజవారి పెండ్లికి జట్టుతోసహా ఎరువు.

బలిజలవిత్తము పట్టెదాసరిపాలు, గొల్లవిత్తము [1]పిచ్చుగుంటపాలు.

బలిమిలేని వేళలో పంతం చెల్లదు.

బలిస్తే గోకి చంపుతారు, చిక్కితే నాకి చంపుతారు.

బలుసు పండితే గొలుసుల్లా కంకులు. (వరి)

[2]బలుసు లేని తద్దినమున్ను, బులుసు లేని యజ్ఞమున్ను లేవు.

బల్లి పలికిందని కావపక్కలో చేరిందట!

బసవదేవునికి బడితె పూజ!

బహుతిండి బహునాశనం అన్నారు.

బహు నాయకము, బాల నాయకము, స్త్రీ నాయకము. (చెడుపు)

1 పిచ్చుగుంట = బిచ్చమెత్తుకొనే బ్రమ్మరిజాతి.

2 బలుసు = ఒక ఆకుకూర, బులుసు-బులుసు పాపయ్య, బులుసు అచ్చయ్యశాస్త్రులు వేదవేదాంతవేత్తలు; విఖ్యాతులు.

## బా

బాంచెమ్మను వెంకటమ్మనాలి కాలం తప్పినప్పుడు.
బాగుపడదామని పోతే, బండచాకిరి తగులుకొన్నట్లు.
బాగైనసొమ్ము లెన్నిఉన్నా మంగళసూత్రమగునా.
బాజారు రంకుకు పంచాయితీ చెప్పి పాతలంజలు వీరమాతలైరి.
బాజాల సందడిలో మంగళ సూత్రాన్ని మరిచారట.
బాడి(డు)గ గుర్రానికి సుడులు పట్టిచూచినట్లు.
బాతా కానీ వానికి [1]బారనా, నాకూ బారనానేనా!
[2]బాదరాయణ సంబంధం.
బాదేపల్లి సేట్లు, లెక్కలు చూస్తే తూట్లు.
బాధకొక కాలము, భాగ్యానికొక కాలము.
బాపన కొలువు తెల్లగుడ్డపు కొలువు కష్టం.
బాపనవాడి కొలువు, తెల్లగుడ్డపు కొలువు కష్టం
బాపన వావి బండవావి.
బాపనసేద్యం బడుగులకష్టం.
బాపనసేద్యం బత్తెం చేటు, కాపుల చదువులు కాసులు చేటు.

---

1 బారనా = పన్నెండణాలు.

2 బాదరాయణ సంబంధం—ఒక బ్రాహ్మణుడు వచ్చి ఒకరి ఇంట ఆరునెలలు చుట్టపు కుదురుతో పొట్టపోసికొనుచుండినాడుగాని, అత డెవరి బంధువో తెలియదు. చివరకు ఒకరు ధైర్యంచేసి అతనిని 'నీ వెవరి బంధువు?' అని అడుగగా, అతడు "నాకూ మీకు ఎట్టి సంబంధంగాని లేదుగాని, అదిగో! ఆ బదరి (బదరి; రేగు) వృక్షమునకు, దానిక్రింద నిలిపియుండే నా బండికిమాత్రం సంబంధం ఉన్నది. దానిచక్రం బదరీదారువుతో చేయబడినది. అదే నాకు మీకు కలయిక-కాని మీరు మీరే, మేము మేమే" అని అంటూ, పైగుడ్డ విదుల్చుకొంటూ వెడలిపోయినాడట. అంతేగాని బ్రహ్మసూత్రములు వ్రాసిన బాదరాయణ ఋషికి యీ సామెతకు సంబంధంలేదు. ఆ శ్లోకమిది: అస్మాకం బదరీచక్రం, యుష్మాకం బదరీతరుః, బాదరాయణసంబంధః యూయం యూయం-వయం వయం.

బాపనసేద్యం బ్రతకటానికీ కాదు, బ్రతికించటానికీ కాదు.

బాపనసేద్యం-బాల వైద్యం.

బాపనోళ్ళ కోపం-వరిగడ్డి శాకం.

బాపలలో చిన్న, బెస్తలలో పెద్ద. (పనులు బెట్టుకురు).

బాపలు తప్పినా వేపలు తప్పవు, వేపలు తప్పినా ఏరువాక పున్నమ తప్పదు.

బాబుకు లేక బత్తాశో ఏడుస్తుంటే, కొడుకు వచ్చి పెళ్లో అని అఘోరించాడట.

బారకల్ల మీద బట్ట పడ్డట్టు. [బ్రమొక్కను?

బారకావడివలె పడ్డావు, నీవెవడురా, మాఇంటి దేవరకు

భారతకతలోన బాలరాజొక్కడు కుంబకర్ణునిబట్టి (కుత్తు) గుద్దసించిన వైనం తెలియదా? అన్నాడట.

బారు బంగారా, కొంప దివాళా.

బారెడు చుట్టు అయినా బాటన పొమ్మన్నారు.

బాల పొంగు-పాల పొంగు.

బాలల తుమ్ము, బాలెంత తుమ్ము మంచివి.

బాల వాక్యం బ్రహ్మ వాక్యం.

బాలుర దీవెనలు బ్రహ్మ దీవెనలు.

బావకు మరదలుపిల్లపై ఆశ.

బావమరదికంటే మించిన బంధువు లేడు.

బావమరది బ్రతుక గోరును, దాయాది చావ గోరును.

బావమరుదుల ప్రక్కన కూర్చోవడం ఎట్లా అని, దూరంగాపోయి, తురకోడి ప్రక్కన కూర్చున్నదట-కొత్తపెండ్లికూతురు.

బావలేని కోడలు బహుభాగ్యశాలి, మరి(ఆ)ది లేని కోడలు మరీ మంచిది.

బావా! అని చూడబోతే, రావా! అని కొంగు పట్టుకున్నాడట!
బావా! నీభార్య ముండమోసిన దంటే, మొఱ్ఱో అని ఏడ్చాడట!
బావా బావా అంటే పక్కలోకి రమ్మన్నాడట.
బావికింద దున్ని బ్రతికినవాడు, చెఱువుకింద దున్ని చెడినవాడు లేడు.
బావితప్పినవాడు, బడిం దిరిగినవాడు ఒకటే.
బావి త్రవ్వగా భూతం బయట పడినట్లు.
బావిలో ఏరిగేవాడికంటె బావిపక్కన (అంచున) ఏరిగేవాడు మేలు.
బావిలోతు చూడగలంగాని మనిషి మనసులోతు చూడగలమా?
బావిలోని కప్పకు, గానుగఎద్దుకు అవే లోకాలు.
బావురుపిల్లికి చిలుకపై మొగమాటమా!
బాషికం మొదలు భజంత్రీల వరకు బదులుతో పెండ్లి జరిపినట్లు.
బాస(బావి)బిస తప్పితే పట్టరా తంగేళ్ళు.
బాహ్య ధార్మికుడు ఆంతరంగిక పిశాచము.



## బి

బిగువులేని కచ్చ, బీగము లేని ఇల్లు.
బిగువైన ఎద్దుదే బిగువైన సేద్యం.
బిచ్చం బిడబిడ, కుండలు లొడలొడ.
బిచ్చగాణ్ణి పొమ్మన్నా అత్త చెప్పాలి, కోడలు పంపాలి.
బిచ్చగాని గుడిసె, మాఅక్క చూచి మురిసె.
బిచ్చపుకూటికి పేదరికమా?
బిచ్చపుకూటికి నవేశ్వరం అడ్డం పడ్డట్లు.
బిచ్చము వేయకున్న మానెగాని. కుక్కను కట్టివేయు మన్నట్లు.
బిచ్చానికి పోయినా బిగువు తప్పలేదు, దుప్పటి పోయినా వల్లెవాటు తప్పలేదు.

బిచ్చానికి వచ్చినవాడు, అచ్చంగా కాకపోయినా ఆ పూటకు చుట్టమే.

బిడుగుచెడ్డ ముండ చీటికి ముగ్గు పెట్టిందట!

బిడ్డఅయినా పడ్డఅయినా పుట్టాక విడిచి పెడతామా?

బిడ్డ ఎదిగితే కుండ ఎదుగుతుంది. (వంటకుండను పెద్దది చేయాలనుట)

బిడ్డ చచ్చినా తొట్లమర్లు ఉడుగు లేదు.

బిడ్డ చచ్చినా పీతికంపు (పురిటికంపు) పోలేదు.

బిడ్డ చచ్చినా బారసాల బాగా జరిగింది.

బిడ్డను దించి లోతు చూచినట్లు.

బిడ్డ, పాముకరచి చచ్చి పడుస్తుంటే, విషపురుగులము - మాజోలికి వస్తే కరవక మానుతామా-అన్నదట అప్పుడే బయటపడిన ఏలికపాము!

బిడ్డ బావిలో పట్టాడంటే చద్దికూడుతిని వస్తానన్నాడట.

బిడ్డ ముద్దయితే బిడ్డ పియ్యి ముద్దవుతుందా?

బిడ్డలను కన్నమ్మా, భిక్షము పెట్టినమ్మా చెడరు. [ముద్దు.

బిడ్డలేని ఇంటికి ఆవుదూడ ముద్దు, ఏమీలేని ఇంటికి ఎనుముదూడ

బిడ్డలేని ముద్దు-వానలేని వరద.

[1]బిడ్డ వచ్చినవేళ, గొడ్డు వచ్చినవేళ.

బిడ్డసంగతి మీగాళ్ళ వాపే తెలుపుతుంది.

బిడ్డలుగల తండ్రులు లెందరో ఉన్నారుగాని, తండ్రిగల బిడ్డలు చాల తక్కువ.

బిత్తరి బిడ్డను కంటే, ఎలుక ఎత్తుకపోయి వెన్నుకొప్పులో (వెన్నుగాడిలో) పెట్టిందట!

1 బిడ్డ = కోడలు.

బియ్యం దంచినదానికి బొక్కిందే దక్కుట.
బియ్యం దంచినమ్మకు బొక్కిందే కూలి.
బియ్యపు బస్తాలు పోతుంటే లేదుగాని, చవిటి చేటలకు వచ్చిందా.

## బీ

బీదున కురిసిన వాన-అడవిని కాచిన వెన్నెల.
బీదకూటికి బిక్క దేవుడు.
బీదల కేల [1]బోగుబడి పెద్దరికము, [2]పెట్టబీరము.
బీద బలిసి బందికా డయినట్లు.
బీదమొగంవాడా! నీబిడ్డ పెళ్ళి ఎప్పుడంటే, ముద్దుమొగంవాడా మొన్ననే అయింది అన్నాడట!
బీదవాడు బిచ్చపువాడికి లోకువ.
బీదవానికి మాట ఊరాదు, కలిగినవానికి చోటు ఊరాదు.

## బు

బుక్కెడు తిన్నమ్మ బూరుగు (బూరగ) మ్రాను, చేరెడు తిన్నమ్మ చెక్కపేడు.
బుగతో రింట్లో పెళ్ళి, బుగ్గలు తిప్పకు మల్లి!
బుచ్చిరెడ్డి అనే భూతానికి, రామిరెడ్డి అనే రక్షరేకు. (రేఖ)
బుట్టలో పామువలె. (కుండలో పామువలె)

1 బోగుబడి = వితరణలేని వ్యయంతో సంపారి తీరులేనివాడు.
2 పెట్టబీరము = స్త్రీల (పెంటి) పౌరుషము.

బుడ్డ ఎంత పెద్దదైనా ముక్కాలుపీట కాదు, బడ్డు ఆయుధం కాదు.

బుడ్డకు భూతానికి ఒకే మంత్రమా?

బుడ్డగోచి కన్న మించిన దారిద్ర్యం లేదు, చావుకన్న మించిన కష్టం లేదు.

[1]బుడ్డది చిక్కినా కష్టమే, బలిసినా కష్టమే.

బుడ్డను నమ్మి ఏటిలో దిగినట్లు.

బుడ్డోడి మంత్రము, బూడిదలో ఉచ్చ ఒకటి.

బుధవారం పుట్టిన దున్న భూమిని దున్నినా, తొక్కినా పొంగి పొంగి పండుతుంది.

బుధవారంనాడు పులికూడా బయలుదేరదు. (బయటికి తలబెట్టదు)

బుద్ధిగల (బుద్ధిమంతుల) జుట్టు భుజాలు దాటదట.

బుద్ధి చెప్పువాడు గుద్దిన మేలయా.

బుద్ధి భూము లేలా లంటే, కర్మ (రాత) గాడిదలను కాస్తానంటుంది.

బుద్ధి భూములేలుతుంటే అదృష్టం అడుక్కతింటున్నది.

బుద్ధిమంతుడని సద్ది కడితే, బొంగ్రాయి దగ్గఱనే భోంచేసినాడట!

బుద్ధి మరలకున్న రద్దెకెక్కను.

బురదగుంటలో పందివలె.

బురద మెచ్చేపంది పన్నీరు మెచ్చునా?

బురదలో దిగబడ్డ ఏనుగును బొంతకాకిఅయినా పొడుస్తుంది.

బులుపు తీరినగాని వలపు తీరదు.

[2]బుజ్జపిట్ట ఏడుగాండ్ల ఎద్దులను నిలిపేసినట్లు. (నిలవేసినట్లు)



1 బుడ్డది = మరుగుజ్జది. (బుడ్డెద్దు, బుడ్డోడు)

2 బుజ్జపిట్ట = చిన్నపిట్ట.

## బూ

బూకటికి బుద్ధిలేదు, వేకటికి సిగ్గు లేదు.
బూచీలకు బెదరునా బుగుడూరు సంత?
బూటకానికి బుడ్డ దిగితే, ఆవిలిస్తే అవిసి పోయిందట
బూటాలకం దాసరికి బుజ్జనిండా నామాలే. (మధ్యవైష్ణవునికి నామములు పెద్ద)
బూడిదలో చేసిన (పోసిన) హోమంవలె.
బూడిదలో పోసిన పన్నీరు బుడబుడ (వలె).
బూతు లేకున్న నీతి లేదు.
బూనాచి మాటలు బూడిదకు కూడా రావు.
బూబులు నాకుతుంటే నబాబుకు నాట్యాలా!
బూబులే నాకుతుంటే పీర్లకు మహానైవేద్యమా!
బూరుగచెట్టంత పొడవుగా ఎదిగినా చిలుకకు ఫలవృత్తి కలుగబోదు
బూరెదర్శనం బువ్వకోసరమే!
బూరు(ర)గ పండును నమ్ముకొనిన చిలుకకు దూదే దక్కినట్లు.
బూర్లెగంపకాడ పొర్లుదండాలు.

## బె

బెండ్లు మునిగి, గుండ్లు తేలినట్లు.
బెదసి ముందుకు పడదు, జడసి వెనక్కు పడదు.
బెత్తలకు బేడల బారు, మాయింటిలో చింతగుగ్గిళ్లు.
బెద(ది)రించి బెండకాయ పులుసు పోసినట్లు.
బెదరించి బెదరించి బెల్లపు కుండకు తూటు పొడిచిందట!
బెల్లం అని అరచేత వ్రాసి నాకిన తీపగునా?
బెల్లమున్న చోటే యీగలు ముసిరేది.
బెల్లపు పిళ్లారికి ముడ్డిగిల్లి నైవేద్యం పెట్టినట్లు.

బెల్లపు పొయ్యికి ఈగలే నిదర్శనము.
బెల్లపు వినాయకుని ముడ్డిగిల్లి నైవేద్యం పెట్టినట్లు.
బెల్లమని అరచేత వ్రాసి నాకితే నోటికి తీపి కలుగుతుందా!
బెల్లము ఉందని మోచేతిదాకా నాకినట్లు.
బెల్లము ఉందా అంటే? అల్లము ఉంది అన్నట్లు.
బెల్లము ఉన్నంత సేపే ఈగలు ముసిరేది.
బెల్లము కొట్టిన గుండ్రాయివలె.
బెల్లము పారవేసి చేయి నాకినట్లు.
బెల్లము వండినపొయ్యి-ఇంగువ కట్టిన గుడ్డ.
బెస్తపిగ్గెలు-ఊబమగని [1]విరదాళ్లు.

## బే

బేగడరాగం మీగడతో సమానం.

## బొ

బొంక నేర్చి, అంకు నేర్వాల. [అన్నాడట.
బొంకరా గురవా అంటే, గురజాల దోమలు గుర్రగింజ లంతేసి
బొంకరా, బొంకరా పోలుగా అంటే, ఎద్దు గిట్టలో ఏడు చావిడాలు [2](చవిడాలు) అన్నాడట!
బొంకరా, బొంకరా పోలుగా అంటే, ఎద్దు అడుగులో ఏడు [3]కొర మీనులు అన్నాడట.

1 విరదాళ్లు = వీరత్రాళ్లు.
2 చవిడాలు = ఈటిఆకు చేపలు అనే ఎండబెట్టిన (కరవాది) సముద్రపుచేపలు.
3 కొరమీను = చెరువుపీటి చేపజాతి.

బొంకరా బొంకరా పోలుగా అంటే, టంగుటూరి మిరియాలు తాటి కాయ లంతేసి.

బొంగలు తిన్ననోరు, ఆడిపోసుకున్న నోరు ఊరుకోవు.

బొంగు లొట్టయినా, క(గ)ణుపు గట్టి.

బొండు (బొద్దు) మల్లెలు బోడిముండ కెందుకు?

బొంత కట్టుకున్నవాడు కప్పుకో లేడా?

బొందల కుంటకు నల్లేరు మోసినట్లు.

బొక్కలో (బొరియలో) నిద్రబొయ్యే నక్క కలలో తన వాతబడే కోళ్ళను లెక్కబెట్టుకొన్నట్లు.

బొక్కలో పిల్ల, డొక్కలో పిల్ల.

బొక్కిసలో కొఱకంచు వలె.

బొగ్గు పాలగడుగ పోవునా నైల్యంబు.

బొగ్గులకై కల్పతరువు పొడిచినట్లు.

బొగ్గులలో మాణిక్యం వలె.

బొగ్గులలో రామచిలుక వలె.

బొచ్చు కాలిస్తే బొగ్గు లగునా? (బూడిద అగునా?)

బొటనవేలికి సున్నమైన దేమయా! అంటే, బొర్లపడినానులే అన్నాడట.

బొట్టు కట్టితే గాని ముండ మొయ్యదు.

బొట్టు పసేగాని, బోసం పస లేదు.

బొట్టబొట్లాకొండ, బోసీలకొండ, నెమిలమ్మ గ్రుడ్లయితే నే నెరుగ [నమ్మా.

బొడ్డాకు తింటే, బుద్ధి పెరుగునన్నట్లు.

బొమ్మకు మొక్కినా నమ్మక ముండవలె.



## బో

బోగంపిది [1]ఈటుబోయిందంటే కోమట్లంతా గోచులు సర్దుకొన్నారట.

బోగంపిది కొల్లబోయిందంటే, సన్యాసులు గోచులు విప్పుకొని బయలుదేరినారట.

బోగందాని చల్లకు, సంత సొరకాయకు గోటిగాట్లు ఎక్కువ.

బోగందాని తల్లి చస్తే అందరూ పరామర్శించేవాళ్లేగాని, బోగందే చస్తే తొంగిచూచే వాళ్లుండరు.

బోగముదాని వలపు, బొగ్గు తెలుపు లేదు.

బోటికి సీటు - కూటికి చాటు.

బోడితలకు బొండు (బొడ్డు) మల్లెలు ముడిచినట్లు.

బోడితలకు, బొటనవ్రేలికి ముడి పెట్టినట్లు.

బోడితలలకు ముడి వేసేవాడు.

బోడితలలకు మోకాళ్ళకు ముడి బెట్టినట్లు.

బోడిపెత్తనం - కోడి కునుకు. (ఎంతో కాలం సాగవనుట)

బోడిపెత్తనం - తంబళ్ళ దొరతనం.

బోడినెత్తిన టెంకాయ కొట్టినట్లు.

బోడిమాను గాలికి మిండడు.

బోడిముండకు తలసుళ్లు వెదకినట్లు.

బోడెద్దుకు పోట్లు మప్పినట్లు. (మరపినట్లు)

బోదసం కొట్టితే రాజసం పండును.

బోనులో పడ్డ సింహం వలె.

బోయవాడి కొడుకే ప్రభువా? బోగందానికి ఒకడే మగడా?

బోలెడు తిట్లయినా బొక్కెడు కొజ్జులు కావు.

బోసినోటివానికి పేలపిండి ప్రీతి.

బోసిపంటికి దోకడు నూనె, ఎట్లా తెత్తును ఏగాని?

---

1 ఈటుబోవు = తోటలో కాపునంతా కోసుకొనిన తర్వాత అందరికీ వదలివేయుట.

## బ్ర

బ్రతకని బిడ్డ బారెడు.
బ్రతికిఉంటే బలుసాకు ఏరుకోని తినవచ్చు.
బ్రతికి బావగారిని, చెడి స్నేహితుని చేరాలి.
బ్రతికిన బ్రతుకు చావులో తెలుస్తుంది.
బ్రతికిన బ్రతుకు చెప్పుకొందాము, బయట ఎవరు లేకుండా చూడమన్నాడట.
బ్రతికిన బ్రతుక్కు భగవద్గీత పారాయణమా?
బ్రతుకలేని వాడా బడి పెట్టుకోరా?
బ్రతుకలేని వాడు బడిపంతులైనట్లు,
బ్రతుకుటకు తినవలెను గాని తినుటకే బ్రతుకరాదు.
బ్రతుకు లెన్నాళ్లు భాగ్యాలెన్నాళ్లు.
బ్రమిసి బాపనయ్యను పోతే, శుక్రవారం చూపరాదన్నాడట.
బ్రహ్మంవంటి గురువుంటే సిద్దయ్యవంటి శిష్యుడు ఉండనే ఉంటాడు.
బ్రహ్మకైనను పుట్టు [1]రిమ్మ తెగులు.
బ్రహ్మచారి ముదరినా, బెండకాయ ముదిరినా, లంజ ముదిరినా పనికి రాదు.
బ్రహ్మచారీ శతమర్కటః.
బ్రహ్మజ్ఞానులవారు వచ్చారు, పట్టుబట్టలు భద్రం.
బ్రహ్మ తలిస్తే ఆయుస్సుకు కొదువా? మొగుడు తలిస్తే దెబ్బలకు కొదువా?
బ్రహ్మయాలితాడు పంది రేవున దెంచ.
బ్రహ్మ వ్రాసినవ్రాత చెరిపేవాడు లేడు (తప్పునా?)
బ్రహ్మ వ్రాసినవ్రాలుకు ఏడువనా? రాగుల సంకటికి ఏడువనా!



1. రిమ్మ = పిచ్చి.

## బ్రా

బ్రాహ్మడా! బ్రాహ్మడా! నీ ఆచార మెంత? అంటే నీటికొద్దీ అన్నాడట!

బ్రాహ్మడికీ, బత్తెగొడ్డుకీ చలేమిటి!

బ్రాహ్మణింటిలో పుట్టితి, భట్టింటిలో పెరిగితి, కోమటింటిలో చస్తి.

బ్రాహ్మణ పాలేరుతనం చేస్తావా? పల్లకీ ఎక్కుతావా? అంటే, పల్లకీ ఎక్కితే ఒళ్లు కదులుతుంది. బ్రాహ్మణ పాలేరుతనమే చేస్తాను అన్నాడట!

బ్రాహ్మణ సేద్యం - శూద్రతర్పణం. (సంతర్పణ)

బ్రాహ్మణుడు ఒంటిపూట పడ్డా, పసరము ఒంటి పూట పడ్డా మానెడు.

బ్రాహ్మణునిచేయి, (నోరు) ఏనుగు తొండము ఊరుకోవు.

బ్రాహ్మణుని మీద సంధ్య, కోమటిమీద అప్పు నిలువదు.

బ్రాహ్మణులలో చిన్నకు బెస్తలలో పెద్దకు అవస్థలు.



## భ

భంగు(గి) తాగేవానికి హంగుగాళ్లు పదిమంది.

భక్తి కలుగు కూడు పట్టెడైనను చాలు.

భక్తి లేనిపూజ పత్రిచేటు. (బత్తిలేని పూజ పత్తిచేటు)

భక్తి వచ్చినా పట్టలేరు, పగ వచ్చినా పట్టలేరు.

భగవంతా నాకేం చింత అంటే, ప్రొద్దున లేస్తే పొట్టదే చింత.

భగవద్గీత పుచ్చుకుంటారా అంటే, కడుపు నిండింది ఇంక తినలేను అన్నాడట.

భటుడు వెంట లేక ప్రభుడు శోభింపడు.

[1]భట్టాచార్యుల వట్టలు కాగానే, తిరుమార్గపు బుట్టలగునా!

భజన చేయువాడు భక్తుండు కాడయా.

భయంగల బల్లి, తావ చాటుకు పోయి బుజ్జగుంది.

భయంగల మరదలు తావముందు బుజ్జ మంచట!

భయపడి పరుగెత్తేవానికి వారసూల అడ్డమా?

భయమైనా ఉండాల, భక్తైనా ఉండాలి.

భయానికి తగినట్లు కోట కట్టుకోవలె.

భరణికార్తెలో చల్లిన కాయకు చిప్పెడు పంట.

భరణికార్తెలో చల్లిన నువ్వుచేను కాయకు బదిగెడు గింజలు.

భరణి కురిస్తే ధరణి పండును.

భరణిలో పుట్టితే ధరణి ఏలును.

భరణిలో (ఎండలకు) బండలు పగులును, రోహిణిలో రోళ్లు పగులును.

భరతుడికి పట్టాభిషేకం, రాముడికి రాజ్యము.

భరతుడు పట్నం—రాముడి రాజ్యము.

భర్తబడాయి భార్యమీాదనే!

భర్త లోకం తన లోకం, కొడుకు లోకం పరలోకం.

భర్తవర్తనంబె పతికి గ్రాహ్యంబు.



1 భట్టా(భట్టరా)చార్యులు = వైఖానస ఆగమపండితుడు.

## భా

భాంచేసు దేవుడికి మాదర్ చోద్ పత్రి.

భాగీరథి పిచ్చుగుంటమీద పారినట్లు.

భాగ్యముంటే, బంగారం తింటారా ?

భాగ్యవశముగాని బ్రతుకులు లేవయా !

భాగ్యహీనునకు ఫలము లభించునా ?

భానునరయ దివ్వెపట్టి వెదకురీతి.

భామలవలపు వేముల తియ్యదనము లేవు.

భారం లేని బావ చస్తే, దూలం పడ్డా దుఃఖం లేదు.

భారంపైన బడినప్పుడే బరువు తెలిసేది.

భార్య అనుకూలవతి అయితే సుఖి అగును లేకుంటే వేదాంతి అగును.

భార్యచేతి పంచభక్ష్య పరమాన్నం కన్న, తల్లి చేతి తవిటిరొట్టె మేలు.

భార్యమాట బ్రతుకు బాట.

భావాయ పున్నముకు పరగళ్లు పచ్చబడతాయి.

భాస్కరాచార్యుల ([1]భాష్యకారుల) వెంట్రుకలైతే మాత్రం, పేనుకు తంతు లవతవా?

భాషకు తగిన వేష ముండాలి.

భాషలెల్ల వేరు పరతత్త్వ మొక్కటే.

## భి

భిక్షం బిక్షబిడా అంటే, దొంతులు లోడాలోడా అన్నాయట.

భిక్షాధికారి అయినా కావాలి, లక్షాధికారి అయినా కావాలి.

1 భాష్యకారులు = శ్రీ రామానుజాచార్యులవారు-భాష్యములు వ్రాసినవారు అని.

## భూ

భూతాలకు బుద్ధిలేదు, నరునకు బద్ధంలేదు.

భూదేవి అల్పసంతోషి, కాస్త కట్టుతో గిలిగింత (చక్కలగిలి) పెట్టగానే నిండుపంటతో కలకలలాడుతుంది.

భూమి కొత్తఅయితే భోక్తలు కొత్తా?

భూమి కొత్తదైన భూమెలు కొత్తవా?

భూమిని మూర్ఖం చేస్తే, పట్టెడెరువే పుట్టెడు పండిస్తుంది.

భూమినీ రాజునీ కాచుకున్నవాడు చెడడు.

భూము లిచ్చినట్లు భూపతు లీయగలరా?

---

## భో

భోగములకెల్లను నెచ్చెలి జవ్వనంబు.

భోగాపురం బొల్లి మేఘాలూ! అక్షయపాత్ర కనుగ్రహామా?

భోజనం చేసిన వానికి అన్నం పెట్టవేడుక, బోడితలవానికి తలంట వేడుక.

భోజనానికి నేనూ, మాబొప్పడు, లెక్క చెప్పను నే నొక్కడనే అన్నాడట.

భోజనానికి వచ్చి, పొయ్యి త్రవ్వినట్లు.

భోజనానికి వద్దంటే, పట్టుచీర కట్టుకొని వస్తానన్నట్లు.

భోజునివంటి రాజుంటే, కాళిదాసువంటి కవి ఉండనే ఉంటాడు.

## భ్ర

భ్రమరంబు తనరూపు క్రిముల కిచ్చిన రీతి.



## మం

మంగలంబు చేయు మంగలి హీనుడా.

మంగలములోని పేలాల వలె.

మంగలికత్తికి మాకులు తెగునా?

మంగలికత్తి వాయిని (వాదరను) నాలుకతో నాకినట్లు.

మంగలి [1]కొండోజి మేలు మంత్రులకంటెన్.

మంగలి గోరిగి నేర్చుకొంటే, వైద్యుడు చంపి నేర్చుకొంటాడు.

మంగలిని చూచి ఎద్దు కాలు కుంటించవట. (పల్లెలలో కాలిముల్లు దీసేది మంగలి)

మంగలిపని అనుకున్నావా తడిపి దిగ గోరగడానికి? (ఎగ గోరగడానికి?)

మంగలి పాత, చాకలి కొత్త. (వాట మెరిగి గోరుగును, మెప్పించను మొదటి ఉతుకులో బాగా చలువ చేయును)

1 ఈ కొండోజి శ్రీకృష్ణదేవరాయలకు క్షౌరకర్మ జేయుచుండిన మంగలి. చల్లగా పనిచేసి రాయల మెప్పు అంది, ఆయన దండయాత్రలలో గూడ వెంట తరలేవాడు. రాయుడు అభిమాన అదరాలు ఇతనిపై కురిపించుటచే చాల మాట సాగిఉండి. చాల మందికి దొరతో చెప్పి సహాయం చేయించేవాడు. ఇతనికి రాయ లిచ్చిన మాన్యములు నెల్లూరు మండలంలో గూడూరు, ఉదయగిరి తాలూకాలలో ఉండినవి. దీనికి శాసనాధారములు గలవు.

మంగలివాని కత్తికి తన చేతిలోనూ విశ్రాంతి ఉండదు, ఇతరుల చేతి లోనూ విశ్రాంతి ఉండదు.

మంగలివాని దిబ్బ తవ్వేకొద్దీ బొచ్చే!

మంగలివాళ్ల పెళ్లికి మరొక దెబ్బ (డోలు)

మంగళోళ్ల ఇంటెనక బొచ్చుదిబ్బ కాక మరేముంటుంది?

మంగళగిరి మూల మాడంత మబ్బు ఏలితే ఈమని జంపనల్లో ఈతలు మోతలు.

మంగళవారంనాడు మండెలు వేయకూడదు.

మంచము అల్లలేని మగవాడు - మజ్జిగ చిలకలేని ఆడది.

మంచము కోళ్ళకు, మాతామహులకు ముడివేసినట్లు.

మంచ మున్నంత వరకు కాళ్ళు చాచుకోవాల.

మంచ మున్నదగ్గరే నీళ్ళాడ మన్నట్లు.

మంచముపై ముసుగులు. మనసులో విసుగులు.

మంచముమీద ఉన్నంతసేపు మగడు, కిందికి దిగితే యముడు.

మంచ మెక్కినమీదట మర్యాద లేల?

మంచమెక్కి వరుస లడిగి నట్లు.

మంచ మెక్కి వావి తడవినట్లు.

మంచి ఉల్లిగడ్డకు మంచి బొడ్డు.

మంచి కాలానికి మామిళ్లు. చెడుకాలానికి చింతలు (కాయుట).

మంచి పగడాలు చూపి, మాయ పగడాలు అమ్మినట్లు.

మంచికి పోతే చెడ్డ ఎదురయినట్లు.

మంచికి పోతే మంచినీళ్లు గూడా పుట్టవు.

మంచి కొంచెమైనా చాలు, విత్తనం చిన్నదైనా చాలు!

మంచిగా ఉంటే నేను చేశాననుకో, మంచిగా లేకుంటే మావాడు చేశాడనుకో.

మంచిగొడ్డు కొక దెబ్బ, మంచి మనిషి కొక మాట.

మంచిచెడ్డలు దేవుని కుడి ఎడమచేతులు.

మంచి చెడ్డలు పడుగు పేకలు.

[1]మంచి చేసిన ముంగికి ముప్పు వచ్చినట్లు.

మంచి దున్నపోతయినా మందకోడి ఎద్దుకు సరికాదు.

మంచినోరు చేదు మింగినట్లు.

మంచి పెంపు, చెడ్డ లోతు అన్ని దేశాలలో అన్ని జాతులలో సమానం.

మంచి ప్రాణానికి [2]మండలం వరకు భయం లేదు.

మంచి మంగలైనా, ఎగ గొరిగితే మంటే!

మంచిమంచి ముహూర్తాలు మీ ఇంట్లోనూనా? మాచకమ్మ సమర్తలు మా ఇంట్లోనూనా?

మంచిమంచి వారంతా మడుగులో మునిగితే, కోణంగిదాసరి కోనేటిలో మునిగెనట!

మంచిమాటకు మందిఅంతా మనవాళ్లే.

మంచివాడు మంచివాడంటే, మంచమంతా ఏరిగి పెట్టినాడట.

మంచివాడు మంచివాడంటే, మంచమంతా కంతలు చేసినాడట.

మంచివాడు మంచివాడంటే, మంచమెక్కి గంతులు వేశాడట!

మంచివాడు మంచివాడంటే, మసురెక్కి ఉచ్చ పోశాడట!

మంచివాడైనందుకు మరణమే సాక్షి.

మంచివాని కొకమాట, మొరకు కొక వ్రే(ఏ)టు.

---

1 ఇది కథనుబట్టి వచ్చినది. బిడ్డ దగ్గరకు పాము రాగా, ముంగిస దానిని చంపి బిడ్డను కాపాడినది. తండ్రి వచ్చి ముంగిస మూతిన నెత్తురు కరలు చూచి, తన బిడ్డను చంపినదని ముంగిసనే చంపివేసినాడు.

2 మండలం = నలభై దినాలు.

మంచివాని చావు మరణంలో తెలుస్తుంది. (పుణ్యాపాలకు సుఖ దుర్మరణాలని)

మంచివాని గుణం మాంసం దగ్గఱ, సత్యవంతుడి గుణం చావుదగ్గఱ తెలుస్తుంది.

మంచివానికి మాటే మందు.

మంచివారి దగ్గరకు మంచివారిని పంపినారు, నీగ్గరకు నన్ను పంపినారు.

మంచు కుంచాల కొలిచినట్లు.

మంచుకుపెట్టిన పందిళ్లు ముసారాకు ఆగునా ?

మంచుకు వేసిన పందిళ్లు వాన కాగునా ?

మంజులాలాపము లేని కావ్యము, విలాసములేని వధూటి.

మంటి ఎద్దయినా మా ఎద్దే గెలవాలి.

మంటిదేవునికి మజ్జనమే సాక్షి. (సైకతలింగాలైన ఏకామ్రేశ్వరుడు వంటివారికి అభిషేకా లుండవు.)

మంటిపనికైనా ఇంటివాడే వెళ్లాలి.

మంటిలో మానెడు, ఇంటిలో పుట్టెడు.

మంత్రం చెప్పను మల్లుభట్లు, తినేదానికి తిప్పంభట్లు.

మంత్రం లేని తీర్థం మరి బుక్కెడు.

మంత్రం లేని సంధ్యకు మరి చెంబుడు నీళ్లు.

మంత్రంలో పసలేకపోయినా తుంపర్లకు తక్కువ లేదు.

మంత్రజలముకంటె మంగలి జల మెచ్చు.

మంత్రసాని తనానికి ఒప్పుకున్న తర్వాత, ఏది వచ్చినా పట్టాలి.

మంత్రసాని దెప్పులు, అత్తగారి సాధింపులు.

మంత్రసాని పనికి ఒప్పుకున్నప్పుడు, బిడ్డ వచ్చినా పట్టాల, పియ్యి వచ్చినా పట్టాల.

మంత్రసాని ముందట మర్మం దాచినట్లు.

మంత్రాలబువ్వ కడుపులోనికి పోతే యంత్రాలు చేయిస్తుంది,
యంత్రాలబువ్వ కడుపులోనికి పోతే తంత్రాలు చేయిస్తుంది.
మంత్రాలకు మామిడికాయలు రాలుతాయా?
మంత్రాలు తక్కువ, తుంపరు లెక్కువ.
[1]మందగుడి ఎద్దు నడక, నత్తిమాటలు-మొదట సాగవు.
మందబలం చూచి కుక్క మొరుగుతుంది.
మందలింపు బెడిస్తే ముప్పు.
మందికి చెప్పాను కానీ, మనకు చెప్పానా?
మందిని ముంచి మసీదు కట్టినట్లు.
మంది పలుచనైతే, గంజి చిక్కన అవుతుంది.
మంది మాటవిని మనువు పోతే, మళ్ళి వచ్చేసరికి ఇల్లు గుల్లయింది.
మంది యెక్కువయితే (మోపయితే) మజ్జిగ పలుచన.
మంది యెక్కువయితే (లావైతే) మనానికి చేటు.
మందుకు పథ్యం, మాటకు సత్యం.
మందుకు పోయినవాడు మాసికానికి వచ్చినట్లు.
మందుగాని మాకు లేదు గాని, కూర్చువా డొక్కడే కొదువ.
మందుమాకిడి [2]గండమాల మాన్పగలేదు చక్కచేయగలడె నక్క
మోర.
మందూ లేదు, గుండూ లేదు, తుపాకి పట్టుక కాల్చుమన్నట్లు.
మంద్రైనా కావాలి, ముంద్రైనా కావాలి.
మకరందపానంబు మధుకరాళికిగాక జోరీగలు జుర్రగలవా.
మకరాంకు కేళికోర్చిన ముకురానన మల్లయుద్ధమున కెట్లు ఓపు.

---

1 మందగుడి = పరసము కట్టుమట్టునుండు లేచినదువగనే కాలులాగుట. ఇది నాలు గడుగులు తర్వాత సర్దుకొమను.

2 గండమాల = మెడచుట్టు మేహగ్రంథులు లేచు వ్యాధి.

మక్కాకుపోయి కుక్క (బొచ్చు) మలం తెచ్చినట్లు.

మక్కాకు పోయినా టక్కరితనం మానలేదు.

మక్కువపడి ముక్కాలిపీట చేయించుకుంటే, డోరియాకోక కత్తిరించుక పోయిందట.

మగడు విడిచిన ముండ, మబ్బువిడిచిన ఎండ.

మఘాపంచకము సదా వంచకము.

మగడు ఒల్లనమ్మను మారీ ఒల్లదు.

మగడు చచ్చిన తర్వాత ముండకు బుద్ధివచ్చినట్లు.

మగడు లేని మనువున్నదా.

మగడు చిన్నకాగానే ముండమోపితనం తప్పునా.

మగడు నవాబైనా బూబమ్మకు కట్టుపోగులే. (కాడలే)

మగడు శయ్యకు పిలిచిన రాని మగువ మిండడు [1]వలుకులమిట్ట కీడ్చినా పోవును.

మగని చుట్టాలు చెప్పులు ముంగిట విడిస్తే, ఆలిచుట్టాలు అరపరమటింట్లో విడుస్తారు.

మగని తిట్టినాపె, మరదిని మన్నించునా.

మగనిసొమ్ము తిని, మిండని పాట పాడినట్లు.

మగ బయిసి లేని మీసమెందుకంటే, ఎరువు సిగ్గు లేకుండా అట్టే ఎదిగే వాటికి నేనేమి చేసేది అన్నాడట.

మగవాడు తిరుగక చెడును, ఆడది తిరిగి చెడును.

మగవాని పెండ్లా? ఆడదాని పెండ్లా? అంటే, అదేమో నాకు తెలియదు, [2]గాడిపొయ్యిదగ్గర కాస్త వేస్తే గతికి వచ్చినాను అన్నాడట!

---

1 వలుకులమిట్ట = వల్లకాడు.

2 గాడిపొయ్యి = పొడవుగా గుంట త్రవ్వి, కార్యాలపట్టున ఎక్కువ వంట పాత్రలతో వండుదురు. గాడి అంటె పొడవుగుంట.

మగవాని బ్రతుకు చిప్పనిండ మెతుకు, ఆడదాని బ్రతుకు గంజిలోని మెతుకు.

మగాళ్ళ మెరుగులు మొగాలపైన్నే కన్పిస్తవి.

మగ్గం గుంతలో పాముంది, మగాళ్లుంటే పిలవ్వో అన్నాడట.

మగ్గాని కొకరాయి మరవకుండా పట్టండి.

మఘకు మానికంత చెట్టయితే, కార్తీకానికి కడవముంతంత గుమ్మడికాయ.

మఘ [1]తిరిమితే మదరుమీద కత్తైనా పండును.

మఘపుబ్బలు వరపయితే, మహత్తర క్షామం.

మఘపుబ్బలు వఱపయితే, మీఅన్న సేద్యం, నాసేద్యం మన్నే.

మఘలో చల్లిన విత్తనాలు మచ్చలు కనబడతాయి.

మఘలో పుట్టి, పుబ్బలో మాడినట్లు. (గిట్టినట్లు)

మఘలో మానెడు చల్లుటకంటె ఆశ్లేషలో అడ్డెడు చల్లుట మేలు.

మఘలో మానెడు, పుబ్బలో పుట్టెడు.

మచ్చనాలుక వానికి మాట నిలుకడలేదు.

మచ్చాలు (మత్స్యాలు)దినే నోట సొచ్చాలు ఎట్లా వస్తవి! అన్నాడట.

మజ్జిగకు వచ్చి, బత్తెడు బేర మాడినట్లు.

మజ్జిగకు వచ్చి, ముంత దాచినట్లు.

మట్టికుండలో ఉంటే మనోవ్యాధి, తోలుపొట్టలో ఉంటే తోచి ఉంటుంది.

మట్టిగడ్డలో కప్ప కూస్తే ఒక జాములో వాన.

మట్టిగుఱ్ఱాన్ని నమ్మి, ఏట్లో దిగినట్లు.

మట్టి గోడ కడిగితే రొంపే.

మట్టు మీరు మాటకు మారు లేదు.

---

1 తిమురు = ఉఱుమక మెఱయు.

మట్టెద్దయినా మా ఎద్దే మంచిది.

[1]మడతకుడుములు, శేషపాన్పులు.

మడికి గట్టు, ఇంటికి గుట్టు

మడికి గట్టు, మాటకు గుట్టు.

మడికి [2]మంద, చేనుకు ఎరువు.

[3]మడిచారు మీద మన్నుపోయ, [4]అటికెడు చారు బోర్ల పోయెనే.

[5]మడి దున్ని మనినవాడు, [6]చేను చేసి చెడినవాడు లేడు.

మడిదున్ని మహారాజయినవాడు చేను దున్ని చెడ్డవాడూ లేడు

మడిన పడ్డ నీరు, పైపడ్డ దెబ్బ పోవు.

మడిమల్లేసి [7]బిందాణం పీకేసి, [8]సరువ గోకేసి.

మడి బీద కాదు, రైతు పేదగాని.

[9]మడుగు చీరకు మసి తాకినట్లు.

మడ్డిముండకు మల్లె పూలిస్తే, మడిచి ముడ్డికింద పెట్టుకున్నదట!

మణిని మణితో కోయవలె. (వజ్రం వజ్రాన్ని భేదిస్తుంది)

మణుం గొట్టగా మాసం చిక్కినాడు.

మణుగు సగము, మైలా సగమే.

మణులు చెక్కిన సంకెళ్ళ (సంకెళ్ళ)వలె.

---

1 మడతకుడుము = ఉపవాసము.

2 మంద = చేలలోనే పశువులను కట్టివేసి. పేడ ఉచ్చతో సత్తువ ఎక్కించుట.

3 మడిచారు = చీరకట్టె విధానం.

4 అటికెడు = అటిక + ఎడు.

5 మడి = మాగాణి (రాయలసీమ).

6 చేను = మెట్ట.

7 బిందాణం = తులసికోట (బృందావనం).

8 సరువ = బిందె. (చెరవ-చేదుటకు ఉపయోగించునది)

9 మడుగు = చలువ చేసిన గుడ్డ.

మతి ఎంతో గతి అంత.

మతిమరుపులవాడు నీళ్ళచాయకు (చెంబట్లకు) పోయినచోట ముడ్డి మరచిపోయి వచ్చినాడట.

మతిమరుపుల వానికి మల్లికుపుల వాడు.

మతిమరుపులో నీళ్ళలో బడి, ఈదను మరచిపోయినాడట.

మతిలేని మన్ను పోతు, ఉప్పుకు పోయి నిప్పు తెత్తు.

మతి లేనమ్మకు గతిలేని మగడు.

మతిలేని మాట - శ్రుతిలేని పాట.

మతు లెన్ని చెప్పినా మంకు బుద్ధి మానదు.

మతు లెన్ని చెప్పినా, నామము పక్కనే గాని తొంగోనన్నదట (పండుకొంటా నన్నదట)

మదికాశ ఘటింపని మోహి, గుత్తలంజల పరమైన దీవి.

మదిలోన నొక్కటి, మాటాడు టొకటి.

మదురుమీద పిల్లి వాలము. (వలె, మాదిరి) (సమయాను కూలంగా అటో ఇటో దూకును)

మదురు [1]వార మడియైనా కావలె, మాటకారి మగడైనా కావలె.

మద్దులు మునిగిపార, పెంపల్లు తమకెంత బంటి యన్నట్లు.

మద్దికాయలు మాటిడ్డ మాడిక్క.

మద్దిమాను చేలో ఎద్దులు మేస్తే, నామముద్దలు మానునా!

మద్దెల తాళగతుల దెలియకనే మర్దించుట సుఖమా.

మద్దెల బోయి రోలుతో మొరబెట్టుకొన్నట్లు.

మద్దెలలోని ఎలుకవలె.

మద్యపానం చేయును మడిగుడ్డ కావాలనా?

మద్యపాయికి అనరాని మాట లేదు.

మధ్యవైష్ణవుడు నామములకు పెద్ద.

1 వార = ఎడము; ప్రక్కన.

మనకు పులి భయం, పులికి మన భయం.

మన గుమ్మడికాయలు మంచివైతే, బజార్లో ఎందుకు దొర్లుతుంటాయి!

మన చల్ల మనమే పలుచన చేసుకుంటామా? (అనుకొంటామా?)

మనది కాని పట్నం మహాపట్నం.

మన దీపమని ముద్దులాడితే మూతి కాలకుంటుందా!

మన నువ్వులలో నూనె లేకపోతే, గానుగవాణ్ణి అంటే ఏం లాభం!

మన బంగారం మంచిదయితే, కంసాలి ఏమిచేయగలడు!

మన మెఱుగని చెవులకు మద్దికాయలా!

మనసిచ్చి మనసివ్వక (మనసురాక) మనువుకుపోతే నిలుచున్నట్లే నిద్ర వచ్చిందట.

మనసుకు నచ్చినవాడు మగడుగాని మంగళసూత్రం కట్టగానే మగడు గాడు.

మనసు విరిగితే అతుక్కోవచ్చునుగాని కుండపగిలితే అతుకరాదు.

మనసుంటే మార్గ ముంటుంది.

మనసు కుదిరితే మల్లి, మనసు కుదరకుంటే ఎల్లి.

మనసు దిద్దరాదు మహిమీద నెవనికీ.

మనసు మండిగెలు చేసుకుంటే గోధుమ లెవరిస్తారు.

మనసు మహామేరువు దాటును. కాలు కందకం దాటదు. (కడప దాటలేదు)

మనసున నాటిన మాటల చెరపలేరు.

మనసునిల్ప శక్తిలేకపోతే మంచి విరుల పూజేమి చేయును.

మనసు లేని మనువు వలె.

మనసులేనివాని మంత్రంబు లేలయా.

మనసులోని వెతకు మందు లేదు.

మనసులోని మర్మం దాచుకొనే మానవుడు మాటలు నేర్చినాడు.

మనసులోని మర్మం నీళ్ళలోని లోతు ఎరుగలేరు.

మనసులోని మర్మం ముఖమే వెల్లడించును.

మనసు విరిగనేని మరియంటనేర్చునా.

మన సెలుగని కల్లా ఒళ్లెలుగని సివమూ! (ఉండవనుట)

మనసో, మామగారి తద్దినమో అన్నారు.

మనస్సుకు మనస్సే సాక్షి.

మనస్సులో ఎంత ఉంటే, సోదెలో అంతే వస్తుంది.

మనసు స్వాధీనమైన ఘనునికి మరి మంత్రతంత్రము లేల.

మనిఉన్న ప్రాణాన్ని మంట కలిపినట్లు.

మనిషి ఉన్ననాడు మజ్జిగ లేదు, [1]ఒలికమీద కట్టివేయను పాడిఆవు.

మనిషి కాటుకు మందు లేదు.

మనిషికోతి అయ్యో దెప్పుకంటే తానద్దం చూచుకొనేటప్పుడు.

మనిషి మంచి చెడ్డలు తెలుసుకోవాలంటే అతనిని అధికార పీఠంలో పెట్టాల.

మనిషికి ఉన్నది పుష్టి, పసరానికి తిన్నది పుష్టి.

మనిషికి ఒకమాట. పండు కొక రుచి. (పశువు కొక దెబ్బ)

మనిషికి రాక కష్టాలు మాకులకు వస్తవా?

మనిషికి మాటే అలంకారము.

మనిషి కొక తెగులు మహిలో వేమా అన్నారు.

మనిషి కొకమాట, గొడ్డుకొక దెబ్బ.

మనిషి గబ్బు మారుమారు, నాగబ్బు తీరుతీరు.

మనిషి చస్తే మాట మిగులుతుంది. ఎద్దు చస్తే ఎముక మిగులుతుంది.

మనిషి తిండి మోయన దున్నపోతు తిండి-దయ్యపు తిండి మధ్య.

మనిషి పేదయితే, మాటకు పేదా?

1 ఒలికి = శ్మశానం.

మనిషి [1]పోచికోలుకాడు.

మనిషి బొమ్మ వ్రాసి క్రింద మనిషి అని ఎందుకు వ్రాసినావంటే, లేకుంటే కోతి అనుకుంటా రన్నాడట.

మనిషి మంచిదే కాని, గుణం గుడిసేటిది.

మనిషి మర్మము, మాని చేవ బయటికి తెలియవు.

మనిషిమీద పీడ మహిమీద పోయింది.

[2]మనుగ(గు)డుపు పెండ్లికొడుకు వలె.

మనుగుడుపు నాటి మాటలు మనివిన నాడుండవు

మనుజుడొకటి తలంప దైవమొకటి తలంచు.

మనుమడు నేర్చుకున్నట్లు, అవ్వకు దురద (తుత్తర) తీరినట్లు.

మనువు చెడి, ముండ బుద్ధిమంతురా లయింది.

మనువు నిత్యంకాదు, ఏకులరాట్నం అమ్మబోకు అన్నట్లు.

మనువును నమ్ముకొని, బొంత బొర్ల (పొయ్యిలో) వేసుకున్నట్లు.

మను వొకచోట మనసు ఇంకొక చోట.

మనుషు లందరి తలసైనా మంగలి చేయి!

మనుష్యులు పోయినా మాటలు నిలుస్తాయి.

మనోవ్యాధికి మందు లేదు.

మన్నన లేని మహీపతికొలువు, లాలన లేని లంజ పొందు ఒకటి.

మన్ను తిని మంచినీళ్లు త్రాగినట్లు.

మన్ను తిన్న పాము వలె.

మన్నును నమ్మి దున్నినవాడే మన్నీడు.

మన్ను పట్టితే బంగారం, బంగారం పట్టితే మన్ను.

మన్ను, మిన్ను మెత్తనయితే మనుష్యులకు బ్రతుకు.

మన్ను వెళ్ళకుండా దున్నితే, వెన్ను వెళ్ళకుండా పండును

1 పాచికోలు = వ్యర్థుడు. 2 మనుగుడుపు = అల్లెము.

మన్మథ వేదనకు, మందబుద్ధికి మందు లేదు.

మన్మథుడే పురుషుడైనా మాయలాడి తన మంకుబుద్ధి మానదు.

మన్యం మఱిగిన మనిషి, మాదిగాడ (మాదిగపల్లి) మఱిగిన కుక్క వెనక్కి రావు.

మప్పడం (మరపడం) తేలికగాని, తిప్పడం కష్టం.

మబ్బును వెదకొంటూ పైరుపోదు, ఆవును వెదుకొంటూ దూడపోదు.

మబ్బులు చెదరిపోయినా వాననీరు నిలిచే ఉంటుంది.

మబ్బులో పొద్దు మాయమైపోతే, కోడళ్ళప్రాణాలు కొలికిళ్ళకొచ్చు.

మబ్బులో పొద్దు మగడాలిని చెఱచును.

మమత విడువకున్న మానునా మానంబు.

మరుగుజ్జు మహామేరు వెక్కినా మరుగుజ్జే.

మరుదండపు మిడిసిపాటు మననీయదు.

మరుదండమునకు విలసనములు మెండు.

మఱచిపోయి చచ్చినాను, ప్రాణమా! రమ్మంటే వస్తుందా?

మఱచిపోయి మజ్జిగలో చల్లపోశాను అన్నట్టు.

మఱచిపోయి మజ్జిగలో [1]చేమిరి వేసినట్లు.

మఱచిపోయి [2]మారుబొట్టులో మజ్జిగ పోసినానన్నట్లు.

మరుగుభాషపై మన్నుపొయ్యి, గంజిలో యింత ఉప్పెయ్యి.

మరులున్ననాడే మగడు.

మరువముతోనే పరిమళము.

మర్యాదకు పోతే మానం దక్కదు.

మర్యాద రామన్న మాట తప్పినా, నా వేటు తప్పదు.

మఱ్ఱిచెట్టుక్రింద మొక్కలు మొలవవు. అయ్యక్రింద ఎవరూ ముందుకు రారు.

1 చేమిరి = తోడుబెట్టుట. 2 మారుబొట్టు = మజ్జిగ.

మల నల్లబడితే వాన చన్ను నల్లబడితే బిడ్డ.
మలప గేదే మానెడు పాలు ఇచ్చును.
మలపసన్యాసికి మాచకమ్మరు జత.
మలబారులో చెవులు కుదుతారని మాయవరం నుంచి చెవులు మూసికొనిపోయినట్లు.
మలలు మింగే మహాదేవునికి తలుపాక అప్పడం.
[1]మలుగులు క్రుంగితే (గుంజితే) మాపటికి ఈనును. (చూడుపసరం)
[2]మల్లు తెచ్చుకో అయ్యా! అంటే, మజింత బుర్వోట్లు అన్నట్లు.
మల్లిని చేయబోతే, పిల్లి అయినట్లు. [దట.
మల్లీ! మల్లీ! మంచానికి కాళ్ళెన్ని? అంటే, మూడొన్నికటి అన్న
[3]మల్లె పట్టిన చేనువలె.
మసిపాతలో మాణిక్య మట్లు.
మసిపూసి మారేడును నేరేడు చేసినట్లు.
మసిబొగ్గు కస్తూరిమహిమ దీపించినా పరిమళానంద సౌభాగ్యమీదు.
మసి మొగమువాడు, చమురు కాళ్ళవాడు, పోగయినట్లు.
మసీదుకాలె మదార్ సాబ్ అంటే, సందెడు బొంతలు చంక నున్నాయి అన్నాడట!
మహంతమైన లొల్లి మానెడువడ్లు అలుకదు.
మహాభారంలో ఆదిపర్వాన మన్నట్లు. (ఇట్టి తబ్బిబ్బును సూవనరిజం అంటారు)
మహామమహావాళ్లు మడుగులో పడుతూంటే, కోణంగిదాసరి కో నీటిలో పడెనంట!

1 మలుగు = ముడ్డికీలుభాగము.
2 మల్లు = చిప్ప.
3 మల్లె = ఒక పీచవంటి కలుపు. ఎక్కువగా పొగాకు చేలలో ఎదుగును.

మహామహావాళ్లు మదుళ్ళకింద ఉంటే, పుల్లాకు నా గతేమి అన్నట్లు.

మహామహావాళ్లు మదుళ్ళకింద ఉంటే, గోడచాటువారికి శరణు శరణు.

మహామహావాళ్లు మన్ను మూకళ్లు అయితే, నీవొక జల్లిమూకుడివి.

మహారాజావారిని మనవి చేసుకుంటే, మరి రెండు వడ్డించమన్నాడట!

మహారాజుకైనా మన్ను నమ్మినవాడే అన్నం పెట్టాలి.

మహారాజు పెంటదింటే మందుకు, పేదవాడుతింటే కూడులేక అన్నట్లు.

మహారాజులమే కాని, పొయ్యి రాజదు.

మహాలక్ష్మి పండుగకు మాడెత్తు చలి.

మహావృక్షం క్రింద మొక్కలు పెరుగవు.



## మా

మాంసం తింటామని, ఎముకలు మెడను కట్టుకుంటామా!

మాంసం తింటాడని పేగులు మెడలో వేసుకొంటాడా?

మాంసం తినేవాడు పోతే, బొమికెలు తినేవాడు వస్తాడు.

మాంసం మాంసాన్ని పెంచుతుంది.

మాంసమంటే పైసయ్, పైసలంటే కైకయ్.

మా ఆయనఉంటే, మంగలివాణ్ణి అయినా పిలుచుకొచ్చేవారు గదా

మా ఇంటాయనకు మగతనముంటే, పొరుగింటాయన పొందెందుకు!

మా ఇంటికొస్తే మాకేం తెస్తావు? మీ ఇంటికొస్తే మాకేమి ఇస్తావు!

మా కాయుష్యమస్తు! మా కారోగ్యమస్తు! అని దీవించుకొన్నట్లు.

మాకు కుడుము, మీకు వక్క (మూకుడు).

మాగి చెడ్డగొడ్డు మాదిగింటికైనా తగదు.

మాగి పొద్దు మాటాడ దీరదు.

మాగిలి దున్నితే మరింత పంట.

మాగిలి దున్నితే మాలవానికైనా పైరగును.

మాఘ(ఖ) మాసపు చలి మంటలో పడ్డా తీరదు.

మాఘమాసపు వాన - మగడు లేని చాన.

మాఘమాసములో మ్రాకులు సైతం వణకును.

మాచకమ్మ సమర్త మఖయితే నేమి? పుబ్బయితే నేమి! మఱి పునర్వసైతే నేమి?

మాచకమ్మకు మరునింట నాచు మెండు; వంధ్యకు మైథునేచ్ఛ మెండు.

మాచకమ్మకు ముత్యాలసర మదేల?

మా చక్కెరతో మీ పొంగ లెందుకు వండాలి?

మాచెర్ల దొరలకు మీసాలు లేవు, పల్నాటి దొరలకు వాసాలు లేవు.

మాటంటే మహారాజుగూడ నిలబడతాడు.

మాటకారి నీటుకాడు.

మాటకు పడిచస్తాము కాని, మూటకు పడిచస్తామా?

మాటకు ప్రాణము సత్యము. కోటికి ప్రాణము మానము. చీటికి ప్రాణము వ్రాలు.

మాటకు మా ఇంటికి, కూటికి మీ ఇంటికి.

మాటకు మాట తెగులు, నీటికి నాచు (పాచి) తెగులు.

మాటకు మాట శృంగారం, పేటకు కోట శృంగారం.

మాటకు ముందు ఏడ్చే మగవాణ్ణి, నవ్వే ఆడదాన్ని నమ్మరాదు.

మాటకు సొంపు, పాటకు ఇంపు.

మాటగొప్ప చెప్ప మాటలు చాలవు.

మాట గొప్ప - మానిక పిచ్చ.

మాట చుట్టమే గాని, పూట చుట్టం కాదు.

మాట చూడనిదే మనసీయ రాదు.

మాట మాటకు తప్పు, జోడి నెత్తికి ముప్పు.

మాటలకు మల్లి, చేతలకు ఎల్లి.

మాటలకు మా యింట్లో, మాపటికి మీ యింట్లో.

మాటలకు అ-లకు పేదరికం లేదు.

మాటల తేటలు(తీపి) మా ఇంటికాడ, మాపటితిండి మీఇంటికాడ.

మాటలచేత భూపతులు మన్నన లిత్తురు.

మాటలచేత మన్ననలు పొందవచ్చు.

మాటలచేత మహాకాళిని నవ్వించవచ్చు.

మాటలచేత మహారాజు బిడ్డను మనువు తెచ్చుకోవచ్చు.

మాటలచేత మాన్యాలు సంపాదించవచ్చు

మాటలతో మూటలు కొనవచ్చు.

మాటల పసేగాని. చేతల పస లేదు.

మాటలలోనే మనుబోలువారు పిడూరు దాటినట్లు.

మాటలలో పడి మగనిని మఱచినట్లు.

మాటల సంతానికి నానొక [1]పల్లా (నానొక బస్తా).

మాటలు కోటలు. చేతలు పల్లు (కాయలు)

మాటలు ఎప్పుడు పలుకవాలనో తెలియనివాడే వదరుబోతు (వాయాడి).

మాటలు కోటలు దాటును, కాలు గడప దాటదు.

మాటలు చెప్పే మొనగాండ్లేగాని. పూట బత్తెమిచ్చే పుణ్యాత్ములు లేరు.

మాటలు తల్లిమాటలు. పెట్టు సవతితల్లి పెట్టు.

మాటలు నేరకున్న నవమానము న్యూనము మానభంగము.

1 పల్లా = ఒక కొలమానిక.

మాటలు నేర్చిన కుక్కను వేటకు తీసుకపోతే, ఇసుకో అంటే, ఇసుకో అన్నదట.

మాటలు నేర్చినమ్మ ఏడ్చినా ఒక సొంపే. (బాగుంటుంది)

మాటలు నేర్వలేక పోతే, పూటలు గడువవు.

మాటలు పోయినాక, మూటలు పనికిరావు.

మాటలు మంచి, చేతలు చెడ్డ.

మాటలేగాని చొరనీదు మాచకమ్మ.

మాటలే మంత్రాలు, మాపులే మందులు.

మాటలో నీటుంది, మాటలో పోటుంది, మాటలో సూటి ఉంది

మాట వెండి, మౌనం బంగారు,

మాటే లేకుంటే చోటే లేదు.

మాట్లాడ నేరిస్తే, పోట్లాడరాదు. (పోట్లాడ పనిలేదు)

మాట్లాడితే మరామేకు. (మరచీల)

మాట్లాడితే ముత్యాలు, కొట్లాడితే కంద(ది)రీగలు.

మాట్లాడుతుంటే వచ్చేవి మాటలు, గొరుగుతుంటే వచ్చేవి వెంట్రుకలు. (బొచ్చు)

మాట్లాడే వానికి వినేవానికి అర్థం కానిదే వేదాంతం.

మాడపన్ను కొరకు మహిమంబునమ్మితి. [1]మడమనూరి వృత్తి మాల వృత్తి.

[2]'మాణవా దీశర, మణువు నాలికవాడు'-అని, సెట్టిగారు పురాణం చదివితే, 'అబ్బో!' అంత పెద్ద నాలిక ఎవరికుంది? అని

---

1 మడమనూరు = నెల్లూరు తాలూకాలో ఒక పెద్ద పల్లెటూరు.

2 మానవాధీశ్వర, మనువు నాటవాడు. తామసుం డనగ .. అను భాగవత పద్యమును చదివిన విధము. వినుము విదర్భదేశమున, పీరుడు కుండిన కర్త - అన్నది ఈ ప్రత్యుత్తరము

ప్రశ్నించగా, 'యినుము యిదర్బ దేశమున యీరుడికుండెను' అన్నాడట ఇంకొక శ్రోత.

మాణిక్యం పోయి, మసిపాత దొరికినట్లు.

మాణిక్యానికి మసి పూసినట్లు.

[a]మాతకు గజ్జ లాడితే, మాదిగకు సివమెత్తుతుంది.

మాతాతలు నేతులు దాగారోయి, మా మూతులు వాసన చూకండోయ్.

మా దాకవళమమ్మా! అంటే, మా యింటాయన నీకు కనిపించ లేదా? అన్నదట.

మాదిగ మంచానికి కాళ్ళవైపూ ఒకటే, తలవైపూ ఒకటే.

మాదిగ [1]మంపు మాపటిదాక. కాపు మంపు [2]కపిలవేళ దాక.

మాదిగ [3]మల్లి, కంసాలి [4]ఎల్లి.

మాదిగవాని బ్రతుకు మడురుమీద గడ్డి ఒకటి.

మాదిగవాని ఆలయినా, మాడే కాలికి చెప్పులేదు.

మా దేవుని సత్యం మాకు తెలియదా?

మా దొబ్బి రెడ్డివచ్చాడు, కోళ్ళ గూటిలో మంచంవేయి, అన్నట్లు.

మాధవ భట్లకు పడిశము ఏటా రెండుమార్లు రావడమా, వచ్చినప్పుడల్లా ఆరేసి నెలలుండడము.

మాధుకరం వానింటికి ఉపాదానం వాడు పోయినట్లు.

మాధ్వులకు భుక్తి, వైష్ణవులకు భక్తి, అద్వైతులకు యుక్తి.

---

a మాత = పెండ్లి లేకుండా-జాతరలో పిందువేయు మాదిగ స్త్రీ. సంసారులలో బసివి వంటిది.

1 మంపు = మాంద్యము; మత్తు.

2 కపిల = మోట

3 మల్లి = మళ్ళి రమ్మనుట.

4 ఎల్లి = రేపు రమ్మనుట. తిప్పుకొంటా రనుట.

మానంది (మహానంది) తిరుణాళ్ళు మన్నామె గాని, వేట్లో పడుకుంటే నోట్లో చేసిపోయినారు.

మానం పోయిన వెనుక ప్రాణ మెందుకు?

మానవ సేవే మాధవ సేవ.

మానవ జీవితాన్ని పాలించేది విధేగాని విజ్ఞానం కాదు.

మానవుడు తాను చేసిన పనిముట్లుకే పనిముట్టయి పోతున్నాడు.

మానవు లుండరు గాక, మాటలు ఉండి (నిలచి) పోతవి.

మానికకు కరవు లేదు. కోమటికి పరువు లేదు.

మానిన పుండును మళ్ళీ రేపినట్లు

మానిన పుండు మళ్ళీ [1]సెలపోసినట్లు.

మానిన రోగానికి మందువద్దు, ఊనిన కుక్క ఇంట ఉన్నది వైద్యుడా! అన్నాడట!

మానిపండ్లు మాని కిందనే పడును. (రాలును)

మాన్పిందేమందు, మాన్పినవాడే వైద్యు.

మన్పిందే మందు, బ్రతికిందే ఊరు.

మానుకొద్దీ చెక్క తీయాలి.

మానుగొట్టి మీద ద్రోచుకొన్నట్లు.

మానుపిల్లి అయినా, మట్టిపిల్లి అయినా ఎలుకను పట్టిందే పిల్లి.

మానుమాను ఉరుగు మహాకోటికై వసి.

మానెడు గింజలకు పనికి బోతే తుంచెడు గింజలు దూడమేసి పోయిందట.

మానెడు పిండవచ్చును గాని, చిట్టెడు తిరిగి ఎక్కించ లేము.

మానెడు మంటిలో పోసుకుంటే. యిద్దుము యింటిలో పోసుకుంటారు.

మానేదానికి మందేలా? మనని దానికి మందేలా?

1 సెలపోయు = తిరిగి చీము పోయు.

మా పిల్లవానికి ముప్పైరెండు గుణాలున్నవిగాని, రెండుమాత్రం తక్కువ.

మా శావ వామహస్తానికి తోడు చాదస్తం.

మాబత్తైచస్తే చచ్చిందిగాని, మాపెదనాయన బత్తై పాలివ్వకపోతే చాలు

మాబూసాహెబ్ పెండ్లామైతేనేమి? జాబూసాహెబ్ పెండ్లామైతే నేమి? మన యింట్లో పాచిపని మతకం లేకుండా చేస్తే చాలు.

మామతో కూడా మంచమల్లి. తాతతో కూడ తడక కట్టడానికి వచ్చిందట!

మామతో కూడ వేడన్నంతిని, అక్కతో కూడ [1]పైటన్నంతిని, అమ్మతో కూడ అంబలి తాగేవాడు.

1 పైటన్నం = పొద్దుతిరిగిన తర్వాత (పైటివేళ) సంసారులు తిను రెండోపూట అన్నం.

మామబంతికి కూర్చోని, అత్తబంతికి లేస్తాడు.

మామా ఒకయింటి అల్లుడే! అత్తా ఒకయింటి కోడలే!

మామా! మామా! గోచి ఊడిందేమి? అని వదినెమరదళ్లు అంటే, మిమ్మలచూచే లేండి, ఊరుకోండి-అన్నాడట.

మామిడికాయలు తరిగితే, కత్తిపీటవాదర పులుస్తుందా?

మామిడిచెట్టుకు మడిగుడ్డ కట్టి, దొంగలు ఎక్కరులే అన్నట్లు.

మామిడి మగ్గితే సజ్జలు పండును.

మామిళ్ళ కాజ్ఞగాని, గుక్కిళ్ళకు ఆజ్ఞా?

మామిళ్ళకు మరణాలు చింతలకు సిరులు (మామిడికాపు ఎక్కువైన సంవత్సరం అరిష్టము, చింతకాపు ఎక్కువైన సంపద అని.)

మామిళ్లు కాస్తే, మసూచికాలు మెండు.

మామిళ్లకు మంచు చెఱుపు, కొబ్బరికి కుడితి చెఱుపు.
మామిళ్లు నరికి మోదుగలు నాటినట్లు. (పువ్వులకు మురిసి)
మాయలాడువాడు మహిమాత్ము సాటియా.
మాయింటాయన కెంత మతిమరపంటే నీళ్ళలోబడి ఈదను మరచి పోయినాడు.
మా యింటాయన వ్రాసింది మా యింటాయనే చదువాలంటే, మా యింటాయన రాసింది మాయింటాయనే చదవ లేడన్నదట! ఇంకొకతె [పోరు.
మాయింటిమగవారు మమ్ము దొబ్బుటగాని, పొరుగింటిపోరుల పొంత
మా యింట్లోతిని, మీ యింట్లో చేయి కడుక్కో మన్నట్లు.
మాయ సంసారం-మంటి దొంతులు
మారకం మెన్నటి మాపరే, తిండి ఎప్పటిమాదిరే.
మారికి వారశూలా?
మారిన తినయింటికి రమ్మనినవానిని ఏమనాల?
మారుచీర లేక మేలుచీర కట్టుకొన్నట్లు.
మారుమనువు చేసుకొని, మొదటిమగని సుద్దులు చెప్పినట్లు.
మారుపెట్టించుకోక (పోసుకోకుండాపోతే) మరల రారు.
[1]మారు లేనితిండి మాలతిండి, దొర లేని తిండి దయ్యపుతిండి.
మారులోకాసికి వెళ్ళినా, మారుతల్లి వద్దు.
మార్గశిరములో మాట్లాడటానికి పొద్దుండదు.
మార్గశిరాన మామిడిపూత.
మార్జాలస్వప్నాలు మాంసం మీదనే.
మాలకు మాంసం, [2]గొడారికి తోలు.

1 మారు - మజ్జిగ లేక మరల పెట్టించుకొనినది. తక్రాంతావి భోజనావి అనిగదా.
2 గొడారి = కసాయి.

మాలకూటికి పోయినా నీళ్ళపప్పే!

మాలకూటికి లోబడ్డా పప్పుబద్ద దొరకలేదు.

మాలజంబం మల్ల(మూకుడు)మీద, వానజంబం ఊసరంమీద.

మాలదాన్ని ఎంగటమ్మా! అంటే, మదురెక్కి [1]నీళ్ళచాయ కూర్చున్నదట.

మాలదాన్ని ఎంకటమ్మా! అంటే, మరికాస్త ముందరింట్లోకి వచ్చిందట.

మాలదాన్ని ఎంకటమ్మా! అంటే, మఱింత బిగుసుకొన్నదట!

మాలపల్లెలో మంగళాష్టకాలు.

మాలపున్నమ ముందర మాదిగవాడైనా చల్లడు.

మాలబంటుకు ఇంకొక మాలిబంటా?

మాలబింకె (కా)లు మందబయలున, వాన బింకాలు బొల్లిచవుళ్ళలోను.

మాలముద్దు వెన్నగాల్చి పెట్టబోయిందట!

మాలలకు మంచాలు, కాపులకు పీటలా?

మాలవాడి కుక్క మతి అన్న మెఱుగునా?

మాలవాడు(ను) కుక్క మరగిన చందంబు

మాలవాడిపెళ్ళి [2]మహానూల్‌తో సరి.

మాలవాడు చేసినట్లు ఉండాల, సంసారి చెడ్డట్లే ఉండాల.

మాలాయగారికి తోలాయగారు గురువు.

[3]మాలీషు చేసినట్లూ ఉండవలె, కాపు చెడ్డట్లూ ఉండవలె.

మాలోడికి నాకెందు కింతపెద్ద [4]వాలగ అన్నాడట.

1 నీళ్ళచాయ = చెంబట్లు; దొడ్డికిపోవుట; నీటివైపుపోవుట-అనుట.

2 మహాసూల్ = కుప్పనుకిపిల్ల.

3 మాలీసు = గుఱ్ఱమును బాగా రుద్దుట.

4 వాలగ = మత్స్యవిశేషము.

మావాడు దెబ్బల కోరుస్తాడు అంటే, విడిపించే దిక్కులేక అన్నట్లు.

మావాళ్లు వద్దన్నందుకు, మంగళగిరి తిరునాళ్ళకు వెళ్ళినందుకు నాపని ఇలాగే కావాలి-అన్నదట నిర్బంధించబడినావిడ.

మావాళ్లు వద్దన్నదానికి, నేను వచ్చినదానికి ఇతణ్ణాపుదానికి యిట్లనే కావాల కొట్టుకో మన్నదట.

మావి మాకిస్తే, మడిమాన్యాలిచ్చినట్లు.

మాస(ష) మెత్తు బంగారు మనిషిని గాడిద చేస్తుంది.

మాసిక లేసిన గుడ్డ, దాసిదాని బిడ్డ.

మాసిక లేసిన బొంత-[1]లిద్ది వేసిన బండికుండ.

మాసికానికి ఎక్కువ, తద్దినానికి తక్కువ.

మాసినతలకు మల్లెపూల అలంకారమా?

[2]మాసేమో పెద్దమాసి, బుద్ధేమో గాడిదబుద్ధి.

---

## మి

మింగను మెతుకు లేకంటే, లంజకు లత్తుకట!

మింగను మెతుకు లేదు, మీసాలకు సంపెగ నూనె అట!

మింగిన పిడసకు రుచి ఏమన్నట్లు.

మించినదానికి మంచి లేదు.

మింటికన్నా పొడుగు, నగరికన్నా ధాష్టీకం లేవు.

మింటికి మంటికి ముడివేసినట్లు.

మిండగాని జూచి గుండములో పడతాను, అన్నదట.

---

1 లిద్ది = పెద్దదైన ఇరుసు రంధ్రానికి, చదరపు కొయ్యబద్ద కొట్టి, మరల ఉలవాయి బిగించుట.

2 మాసి = మనిషి.

మిండగాడు డబ్బివ్వకపోతే, మొగుడితో పోయిన ట్లనుకొంటాను సొమ్మన్నదట.

మిండడి ఈవి ఎంతో, లంజ మక్కువా అంతే!

మిండని నమ్ముకొని జాతరకు పోయినట్లు.

మిండల కొడుకుల సంపద దండుగలకే గాక (అండలకే గాక) దాన ధర్మము లగునా?

మిండలను మరగినమ్మా, మీగడ తిన్నమ్మా ఊరకుండరు.

మిగిలితే మిండడౌతాడు అన్నట్లు.

మిగిలిన సున్నాన్ని, మిగిలిన రాజును ఊరకే వదలరాదు.

మిట్టానువారి సైతాను మిద్దెక్కి అదలించినా పోదు.

మిట్టిపడును నరుడు మీది చేటెరుగక.

మిడి(ణి)కి చచ్చేదాని ముందు కులికి చావాలి.

మిడిమేలపు మిండని ఉంచుకొనేకంటె గట్టుకు మంచం మోయవచ్చు.

మిడుగురులు చీకట్ల నడచునా.

మిడుతంభట్లు జోస్యం వలె. (పిడికిట దొరికిన మిడతను 'దొరికితిని నయ్యా మిడతంభట్లు' అనగానే దొరికిన మిడత సంగతి చెప్పిన జోస్యంగా భావింపబడినదట. కాక తాళీయంగా సరిపడే సంగతి అని భావము.)

మిడుతంభట్లు రైతుల మిత్రి.

మితం తప్పితే, అమృతమైనా విషమే.

మితం తప్పితే, హితం తప్పుతుంది.

[1]మిథునంలో పుట్టిన మొక్క, మీసకట్టులో పుట్టిన కొడుకు అక్కరకు వస్తారు.

మిద్దె ఉన్నవాడు బ్రతికి, గుడిసె ఉన్నవాడు చావడు.

1 మిథునమాసం జ్యేష్ఠ-ఆషాఢములు (ఆనినెల)

మిద్దెమీద పటుగు, మీసాలమీద మెఱుగు.

మినుములు తింటూ, అనుములు చేతిలో పెట్టినట్లు.

మిన్ను [1]కలిగినా, కన్ను కలిగినా కారకమౌనవు.

మిన్నుపై బడినా మెలపుతో నఱచేతులొగ్గ జాలినవాడు.

మిన్ను విఱిగి మీదపడితే అరచేతితో అడ్డగలమా?

మిన్ను విఱిగి మీద పడ్డట్లు.

మిరపకాయ చిన్నదని మేలమాడ రాదు.



## మీ

మీ ఇంటి గేదె, మా ఇంటి దూడ, తీసుకురా తిమ్మక్కా పిసెడు నెయ్యి.

మీ ఇంట్లో తినివచ్చి మా యింట్లో చేయి కడుక్కోమన్నట్లు.

మీ ఊరు మా ఊరి కెంతదూర మో, మా ఊరూ మీ ఊరికి అంత దూరం. (మీరెట్లో మేము అట్లే అనుట)

మీకు మాట, మాకు మూట.

మీగడ మింగేవానికి వెన్న ఎట్లా వస్తుంది!

మీ గాలిమీద పడిన మెతుకు మిట్టిమిట్టి పడ్డట్లు.

మీగాళ్లు వాచినమ్మా! మీ ఇంట్లో పెండ్లి ఎప్పుడు? అంటే, మోకాళ్లు వాచినమ్మా! మొన్ననే అయిపోయింది అన్నదట!

మీగొడ్డు కింత నున్న అంటే, మీబిడ్డ కింత వెన్న అన్నట్లు.

మీద మిలమిల, లోన లొటలొట.

మీద మెరుగులు, లోన పురుగులు,

1 కలుగు = ఎఱుపగు: పటలమనే వ్యాధి సోకు.

[1]మీన మేషాలు లెక్కబెట్టినట్లు.

మీను మ్రింగిన గ్రుక్కెడుతో మున్నీటికి కొరత ఏర్పడుతుందా?

మీబిడ్డ కింత తప్పుడంటే, మీబిడ్డ కిన్ని పాలు అన్నట్లు.

మీరలేని చుట్టం వస్తే, మిడకక తెల్లారదు.

మీసం పస మగ మూతికి.

మీసాల పసేగాని, కోస నాబట్ట.

మీసాలు వడదిరిగి వుంటే, బుగ్గలు బటువుగా వుంటవని నమ్మక మేమి?

మీసా లెందుకు రాలేదురా? అంటే, మేనత్త (చాలు) పోలిక అని, గడ్డం వచ్చిందేమిరా? అంటే, అది మేనమామ పోలిక అన్నాడట!

---

## ము

ముంజ ముదిరినా, లంజ ముదిరినా కొరగావు.

ముంజలు తిన్నవాని కంటే, మోరులు తిన్నవానికే తంటా.

ముంజేతి కంకణానికి అద్ద మెందుకు?

ముంజేతిలో సత్తువ ఉంటే, మణికట్టులతో వడ్లు మెరుగుతాయి.

ముంజేయి ఆడితే, మోచేయి ఆడుతుంది.

ముంజేయి మళ్ళితేనే మోచేయి మళ్లేది.

ముండకు దొరికేది మొరటు (మోటు) మొగుడే.

ముండకొడుకే కొడుకు, రాజు కొడుకే కొడుకు.

ముండ చావనూ చావదు, ముట్టు తప్పనూ తప్పదు.

ముండ పెంచిన కొడుకు – ముకుదారం (తాడు) లేని కోడె.

---

1 మీనమేషాలు – మేషాది మీనంవరకు పన్నెండు రాసుల లెక్కించినట్లు: అపసవ్యంగా లెక్కించిన మీనం నుండి మేషమగును.

ముండ ముప్పావుకు చెడ్డది, [1]నరకుడు పావుకు చెడ్డాడు.
ముండమొయ్య వచ్చునుగాని, నింద మొయ్యరాదు. ×
ముండమోపి కాళ్లకు మ్రొక్కితే, నీవూ నావలెనే వర్ధిల్ల మని దీవించిందట!
ముండమోపి కేల ముత్యాల పాపట?
ముండ మోపి బలుపు – పాండు రోగి తెలుపు.
ముండకొడుకు మూటికి జెడితే, ముండ నూటికి జెడుతుంది.
ముండపై వలపుతో మోవి ఆనగానే జొల్లు జుంటితేన గాదు.
ముండ్లమీద పడ్డ బట్ట మెల్లిగా తీసుకోవలె.
ముండా కాదు, ముత్తైదువా కాదు.
ముంత మూతికట్టు, సంచి సభ కట్టు.
ముంతెడు నీళ్లకు ఉలిక్కి పడితే, బానెడు నీళ్లు నీ బావ పోసుకుంటాడా?
ముంతెడు పాలకు ముత్యమంత చేమిరి. (మజ్జిగ)
ముందటివానికి ముంతం బలి, వెనుకటి వానికి తెడ్డం బలి.
ముందర కాళ్లకు బంధాలు వేసి, ముండల తాళ్లు తెంపినట్లు.
ముందరికి వచ్చి కాలు విరుగపడ్డట్లు.
ముందరేరు పోతే, [2]ఆరేరే ముందరే రాతుంది.
ముందు అరకకు మొనగాళ్ళను కట్టవలె.
ముందు ఆకు (విస్తర) వేయించుకుంటే, తరువాత ఎప్పుడైనా తిన వచ్చు.
ముందు(కు పోతే) గొయ్యి, వెనుకకు పోతే నుయ్యి.
ముందుకుపోతే ముదికిముండ, వెనుకకుపోతే వెట్టిముండ.

1 నరకుడు = వరు డమట.
2 ఆరేరు – నాగేళ్ళబారులో రెండవది. (ఏరు = దుక్కికి పన్నిన వాగలి)

ముందుకువచ్చే చండ్లను వెనుకకునెట్టితే పోతవా?
ముందు చచ్చింది ముత్తైదువ? వెనుక చచ్చింది విధవ. (భర్తకు)
ముందుచూస్తే అయ్యవారి గుఱ్ఱంగా ఉంది. వెనుకచూస్తే సాహెబు గుఱ్ఱంగా ఉంది. (కోమటిసాక్ష్యం)
ముందుచేసిన తప్పు మూలనుఉంటే, వెనుకచేసిన తప్పు మంచం కాడికి వచ్చినట్లు.
ముందునడచే [1]ముతరాచు (ముత్తరాచ) వాణ్ణి, వెనుకవచ్చే ఏనాది వాణ్ణి నమ్మరాదు. [నమ్మరాదు.
ముందు నడచే ముతరాచువాణ్ణి, ప్రక్కన వచ్చే పట్రాతివాణ్ణి
ముందు నడిపించి, కొంకులు కొట్టినట్లు.
ముందున్నది ముసళ్ళ పండుగ.
ముందున్నది [2]ముసార్ల పండుగ
ముందు పెళ్ళాం బిడ్డలు ముంత ఎత్తుక తిరుగుతూ ఉంటే, లంజకు బిడ్డలు లేరని రామేశ్వరం పోయినాడట.
ముందు పోటు, వెనుక తన్ను. (ఎద్దు చేసేపని)
ముందుపోయేది ముండ్లకంప, వెనుకపోయేది వెన్నముక్క.
ముందు ముచ్చట్లు, వెనుక తప్పట్లు (చప్పటు)
ముందు మునగ, వెనుక వెలగ (ఇంటికి కూడదు).
ముందు మురిసినమ్మ పండుగ గుర్తెరుగదు.
ముందు ముల్లు త్రొక్కి, వెనుక భద్రం అన్నట్లు.
ముందు వచ్చినందుకు మున్నూరు వరహాలు దండుగ, మళ్ళీ ఏల వస్తివే? మాయదారి తొత్తా?

1 ముత్తరాచవాడు కావలెననే తప్పుదారి తీస్తాడు. యానాది కనుమరిగి తప్పించుకొని పోతాడు.

2 ముసారు; ముసర; మునురు = విడువని జడివాన దినాలు.

ముందు వచ్చిన చెవులకంటె, వెనుకవచ్చిన కొమ్ములు (వాడి) ఎక్కువ.

ముందు వచ్చినదానికి మూాగుళ్లు, వెనుక వచ్చిన దానికి వేగుళ్లు.

ముందువారికి ముందోపులు, వెనుకవారికి దొప్పదోపులు.

ముందు వాళ్ళకు మూాకి(కు)ళ్లు వెనుక వాళ్లకు నాకి(కు)ళ్లు.

ముందు సంతకి అరవు ఏడ్చింది.

ముందే ముక్కిడి పైన పడిశం.

ముక్కిడికి తోడు పడిశము.

ముక్కిడి కిచ్చిన నత్తు, విత్తిన మొలువని విత్తు.

ముక్కిడితొత్తుకు ముత్యపు నత్తేల?

ముక్కిడిదాని పాటకు ముండోడి మెచ్చుకోలు.

ముక్కు ఉండేవఱకు పడిశ ముంటుంది.

ముక్కు ఏదిరా? అంటే, తలతిప్పి చూపినాడట!

ముక్కు కోసినా, ముందటి మొగుడే మేలు.

ముక్కు కోస్తే మూాడ్నాళ్లకొస్తుంది, కొప్పకొయ్యరా కుమ్మరిమగడా.

ముక్కు చిన్నది, ముత్యం పెద్దది. (ముక్కుర పెద్దది)

ముక్కుచొచ్చి కంట్లో ప్రవేశించినట్లు.

ముక్కు డుస్సిన పసరం లాగు.

ముక్కు దాటితే ముక్తి. నాలుక దాటితే నరకం.

ముక్కు నలిపి దీపం పెట్టమంటే, మొగుడి (మామ) ముక్కు నలిపిందట.

ముక్కు పట్టని ముత్యం, చెవు పట్టని కమ్మ.

ముక్కు పట్టిన వానిచేత చీదించినట్లు.

ముక్కు పట్టుకుంటే ప్రాణం పోతుంది. (దుర్బలు డనుట)

ముక్కు మూారెడు, సిగ జాారెడు.

ముక్కు మూాసుకుంటే, మూాడు గడియలు.

ముక్కు మొగం లేనిబిడ్డ, మొదలుతుద లేనిపాట.

ముక్కులో ఏవేలు పెట్టినా సరిపోతుంది.

ముక్కులో చీమిడోయ్! అంటే, నీ చేతితోనే కాస్త తీసివేయమన్నాడట.

ముక్కులోని వెంట్రుక కొప్పులోనికి వచ్చి, మూగవాడు అమ్మా! అన్ననాటికి చూతాంలే.

ముక్కోడి ముక్కుకు తక్కెడు బంగారుమంట.

ముఖం అందం, ముడ్డికి చేటు.

ముఖము చూస్తే కనబడదా మీగాళ్ళ వాపు?

ముఖము తేట, ముడ్డి తీట

ముఖము బాగులేదని అద్దం పగులగొట్టినట్లు.

ముఖము మాడుపు దీప మింటికి కొరగాదు, అంకుబోతు పెండ్లాం మొగుడికి కొరగాదు, ఏడ్పుగొట్టుబిడ్డ చంకకు కొరగాదు.

ముఖములో సుఖంలేదు. మోకాళ్ళలో బిగువు లేదు.

ముఖస్తుతి, చేసిన వానిని చేయించుకొనిన వానిని ఇద్దరినీ చెరచును.

ముఖానికి ముక్కుసర. దండకు కొలికాసర.

ముఖాలు చూచి బొట్లు పెడతారు, పిల్లలు చూచి పీటవేస్తారు.

ముగ్గిరి మధ్య ముంత దాగిందా.

ముగ్గుపిండి అట్లకు పనికి వచ్చునా?

ముగ్గురికి తెలిస్తే మూడులోకాలకు ప్రాకుతుంది.

ముగ్గురిని కూల్చెరా ముండదైవం.

ముగ్గురు ఆడవాళ్లు కూడితే, పట్టపగలే చుక్కలు పొడుస్తాయి.

ముగ్గురు బిడ్డలను కంటే, ముసలివానికైనా కొరగాదు.

ముగ్గురు మూడులోకాలయితే, ముసలిది యమలోకం.

ముగ్గురెక్కిన బండి పొలిమేర దాటదు.

ముచ్చు ముండ కేల ముంజేతి కడియాలు.

ముట్టుకుంటే ముత్యం, పట్టుకుంటే బంగారం.

ముట్టుకొన్న మూడు దండుగలు.

ముట్లుడిగిన తర్వాత సమర్తసారె పెట్టినట్లు.

ముట్లుడిగిన దానికి (సతికి) మగబిడ్డ పుట్టినా డన్నట్లు.

ముడిబియ్యం తింటే, ముప్పు గడుస్తుందా?

ముడి మూరెడు సాగదు.

ముడివాటు సవాలుకు బ్రహ్మవాటు జవాబు.

ముడివేశాక ముండయినా ముతకయినా తప్పదు.

ముడుపులు వెంకటేశ్వరునికి, కేకలు గోవిందుడికి.

ముడ్డి కాల్చి మూతికి వెన్న రాచినట్లు.

ముడ్డికిందికి నీళ్లు వస్తే లేవక మానరు.

ముడ్డికి పేడ ఉన్నదెల్ల, బండి యెద్దేనా!

ముడ్డిగిల్లి జోల పాడినట్లు.

ముడ్డిమీద తన్నితే, మూతి (నోటి) పండ్లు రాలినట్లు.

ముడ్డిలో కారం చల్లి, విసనకఱ్ఱతో విసరినట్లు.

ముడ్డిలో జబ్బు, ముక్కులో జబ్బు తేలితేనే మందు.

ముడ్డిలో పుండుకు మేనమామ వైద్యం.

ముతకో సతకో మూడుబట్టలు, కుంటో గుడ్డో ముగ్గురు పిల్లలు.

ముత్తెమంటి ముతరాచకులం చేపలు దిని చెడిపోయినట్లు.

ముత్తిని విడిచి. సత్తిని తగిలించుకొన్నట్లు.

ముత్యమంత పసుపుంటే. మూల కార్తెలో చల్లినా ఉలవచేను కాయును.

ముత్యాలు పగడాలు, ముట్టుకున్న జగడాలు.

ముత్యపుచిప్ప లన్నిటికి ఒక రేవు, నల్లగుత్త లన్నిటికి ఇంకొక రేవు.

ము(మొ)దలియారి జంభం ఆముదానికి చేటు.

ము(మొ)దలియారుకు ఏమున్నదంటే, ఒక గుఱ్ఱపు బండి, ఇద్దఱు ముండలు, ఇంత బుడ్డ అన్నాడు.

ముదికొమ్మ, ముదిమాను చేవ.

ముదికొమ్మ వంగదు, ముది[1]కొమ్మ కనదు.

ముదికొమ్మ వంగదు, ముదిగొడ్డు ఈనదు.

ముదిత చను మెత్తనైనా అధికారం మెత్తనైనా రోతురు.

ముదిముప్పున (ముసలి ముప్పుందాన) అంగిటి ముల్లు.

ముది మదితప్పిన మూడు గుణాలు

ముదిముండ పాతివ్రత్యమునకు జొచ్చినట్లు. (వృద్ధనారి పతివ్రత)

ముదిమికి ముచ్చట్లు లావు.

ముదియగా ముదియగా మోహము లావు.

ముదిరి చచ్చినా, ఎండి ఇడిసినా వగపు లేదు.

ముదురున వేసిన పైరు, ముదిమిని పుట్టిన కొడుకు.

ముద్ద తల తిరిగి నోటికి వచ్చినట్లు (ద్రావిడ ప్రాణాయామంవలె)

ముద్ద ముద్దకీ బిస్మిల్లానా ?

ముద్దరాలి మగడు ముసుసలి(వి) మెచ్చునా.

ముద్ద వేసిన తట్టు, మూతి నాకుడు మాటలు.

ముద్దు చేసిన కుక్క మూతి నాకును, చనువు చేసిన భార్య చంక కెక్కును.

ముద్దున పేరు చెడె, ముఠిపాన నడక చెడె

ముద్దులయ్య పోయి, మొద్దులయ్య అయినాడు.

ముద్దులాడితే ముక్కు నొక్కినట్లు

ముద్దు మురిపెం మావంతు, ముడ్డి దొడ్డి మీవంతు.

ముద్ర ముద్రగానే ఉండగా, ముగ్గురు బిడ్డల తల్లి అయినట్లు.

1 కొమ్మ = స్త్రీ.

ముద్రలందు లేదు మూలమందేగాని. (వైష్ణవాది చక్రాంకితాదులు)
మునగ చెట్టుకు మున్నూరు రోగాలు.
మునిగింది ముర్దారు, తేలింది [1]హలాలు.
మునిగితే గుండు, తేలితే బెండు.
మునిగే వానికి తెలుసు నీటి లోతు.
మునిమాపటి మాటలు ముంగుకు రావు.
మునుపు చెడ్డ ముత్తెమ్మా, [2]గరిగబుడ్డి సమంగా బెట్టు.
మున్నీరు చేయీత నీదినట్లు.
మున్నూట అరవైనాలుగు శిగనములున్నా ఒకటే, ముప్పైఆరు
గుల్లికొప్పులున్నా ఒకటే.
మున్నూటరువది రోగాలకు మూడు గుప్పిళ్లు కరక్కాయ పొడి.
[3]మున్నూటికులానికి ముప్పు లేదు, మొండి కాలికి చెప్పు లేదు.
మున్నూరు కాపత్తకు ముష్టికోడలు.
మున్నూరు రూపాయ లిచ్చినా, ముసలివానిని కోనాల.
[4]మున్నూరు వరహాలు పోయె, మూతి మీసాలు పోయె, నంబి సోమ
యాజులు అన్నమాట తప్పదాయె.
మున్నూరు శిఖలైనా కూడినచ్చును గాని. మూడు కొప్పులు కూడ
రాదు.

---

1 హలాలు = పవిత్రము. ముర్దారు = అపవిత్రము.

2 గరిగబుడ్డి - చిన్న అరివేణికుండ; శుభములలో వాడునది.

3 మున్నూటికాపులు = తెలంగాణాలో ఒక సంసారుల (రెడ్ల) తెగ. (మున్నూటి కూటి కాపులు)

4 శివార్చకుడు నంబి. జంగందేవరవలె మూసం ఉంచుకొనేవారు. మూతిమీసం గొరిగించుకొని, మున్నూరు రూపాయలు వెచ్చించి యజ్ఞం చేసినా, తాను వదిలించు కోవాలనుకొని, యెంత పాటుపడినా నంబి అనేమాట ఆయనను వదలదాయె.

ముప్పదిమూడుకోట్ల దేవతలు ముక్కు పట్టించగలరుగాని, నారాయణా అనిపించగలరా?

ముప్పదిమూడు దున్నపోతులు కడిగేవాడికి, మూడు సాలగ్రామాలు ఒక లెక్కా?

ముప్పదియారు (ముప్పైఆరు) జుట్లు కూడుతాయి గాని, మూడు (కొప్పులు) జుట్లు కూడవు.

ముప్పొద్దు తిన్నమ్మ మొగుడికి ఆకలి ఎఱుగదు.

ముప్పై తట్టలపేడ మోసే పోలికి, మూడు పుంజాల దండ బరువా?

[1]మురుగన్న సందేహం, నిస్సందేహం.

మురికి భాండమునకు ముసరు ఈగలరీతి.

మురికిముండ ముచ్చట పేలపిండి చేటు.

మురికి మురికి ముత్తైదువుకంటె, వెల్లడియైన విధవమేలు.

మురిపెం తిరిపెం చేటు, ముసలి మొగుడు దీపం చేటు.

మురిపెం తిరిపెము చేటు, ముసలి మొగుడు ప్రాణం చేటు.

మురిపెమునకు మూడు నల్లపూసలు, కొలికికి ఒక తిరగలిరాయి.

ములగకాయకు ముండ్లెన్ని? అంటే, కాకరకాయకు గండ్లెన్ని అన్నట్లు.

ముల(లు)గ కాయకు తగిన ముండ్లు, కాకర కాయకు తగిన కరకులు.

ములగచెట్టుమీద కాకి గూటివలె.

ముల్లాలు తిండికి లేక మొత్తుకుంటూంటే, పీర్లకు పంచదార!

ముల్లు తీయను ముల్లే కావాల-దొంగను పట్టను దొంగే కావాల.

ముల్లుగట్టె (కట్టె; కోల) పడుగాండ్ల ఎద్దులను నిలిపివేసినట్లు.

ముల్లుతీసి (పుచ్చి) కొఱ్ఱుడచిన చందము.

ముల్లుతీసి గూటం కొట్టుకొన్నట్లు.

---

1 మురుగడు (మురుగన్) = బాలసుబ్రహ్మణ్యం.

ముల్లును ముల్లుతోఁగాక రోకట దీయుదురా?
ముల్లు ముంటనేగాని పోదు.
ముల్లు వచ్చి అరటాకు మీాద పడ్డా, అరటాకు వచ్చి ముల్లుమీాద పడ్డా ఆకుకే మోసం (అపాయం)
[1]ముషిణిచెట్టు అయినా, పచ్చనిచెట్టు కొట్టరాదు.
ముష్టికి నష్టి ఏమి?
ముష్టికి పోయి, తుష్టి లేదని ఏడ్చినట్లు.
ముష్టికి మూాడు సంచులా?
ముష్టి మూాడువిధాల (అందాల) సేద్యం.
ముష్టిలో ముష్టి, ధర్మ ముష్టి.
ముసలమ్మా బుఱ్ఱ వణికిస్తా వేమి? అంటే, ఊరకుండి నేనేమి చేస్తా నన్నదట!
ముసలాతడికి వగలాడి ఆలైనా, ఆత్రపు విటకానికి అతిభాషిలంజైనా వెతలే.
ముసలావె (ముసలిఆవె)తో వసంతా లాడినట్లు.
ముసలి ఆవు (పసరం) పేడ ముడ్డిలో ఉన్నా ఒకటే, దొడ్లో(చేటలో) ఉన్నా ఒకటే. (పారుడే అనుట)
ముసలి కాలానికి ముప్పతిప్పలు.
ముసలికి [2]ముఱ్ఱాట, బేపికి తొంగురాట.
ముసలికుక్కలు ఊరకే మొరగవు.
ముసలి ముండకేల ముసిముసి నగవులు.
ముసలిదానికి పెట్టినది, ముండకు పెట్టినది ఒకటే.
ముసలివానికి ముండ ముద్దు.

---

1 ముషిణి = ముష్టి: విషవృక్షం.

2 ముఱ్ఱాట = మూర్గుట.

ముసలి ముప్పందాన కుసుమరోగం వచ్చినట్లు.
ముసలి ముప్పున తొలిసమర్త.
ముసలివాడయినా బసిరెడ్డే మేలు.
ముసలివాని మాట, ముళ్లు లేని బాట.
ముసుగు మూడువేలు, ముసుగులో బొమ్మ మూడు [1]దుగ్గాళ్ళు.
ముసుగులో గుద్దులాట.
ముహూర్తం మంచిదయితే, ఎట్లా ముండ మోసెరా? అన్నట్లు.
ముళ్లుండగానే పన్నీరు పువ్వు పనికి రాకుండా పోయిందా (పువ్వుకు పరువు తగ్గిందా)

## మూ

మూగవాని ముందర ముక్కు గోకుకొన్నట్లు. (గీరుకొన్నట్లు)
మూటికీ ముడివేస్తే ఏమీ లేదు. (పెండ్లి అయిన తర్వాత)
మూడు కాసుల దానికి ముప్పావలా కాడుక.
[2]మూడు కొప్పులు ఒకటైతే ముల్లోకాలు ఏకమౌతవి.
మూడు జన్మాల సంగతి చెప్పగలను, పూర్వజన్మలో ఇచ్చి పెట్టకో లేదు, కనుక ఈ జన్మలో దేవుడు నాకీయలేదు, కనుక ముందు జన్మలో నాకేమీ ఉండదు.
మూడు తరాల దరిద్రుడు ముష్టికి వచ్చినట్లు.
మూడు దినాలుంటే మురికిచుట్టం.
మూడు దుగ్గానులకు మూతి మీసం గొరిగించుకొన్నట్లు.
మూడు దుగ్గానుల కోతి, ఆరు దుగ్గానుల బెల్లం తిన్నట్లు.

1 దుగ్గాని = రెండు దమ్మిడీలు (రువ్వలు)
2 మూడుకొప్పులు = ముగ్గురు ఆడువారు.

మూడు నాకి, ఆరు అతికినట్లు.

మూడునాళ్ళ ముచ్చటకు ఆరుజోళ్ళ చెప్పులా?

మూడునాళ్ళ ముచ్చటకు మురిసేవు ముందుగతి కానవు.

మూడునాళ్ళ భాగవతానికి మూతిమీసాలు గొరిగించుకొన్నట్లు.

మూడునాళ్ళ ముత్తైదువతానికి ఆరుజోళ్ళ లక్కాకులు.

మూడు నెలలు సాముచేసి, మూలనున్న ముసలిదాన్ని కొట్టినట్లు.

మూడు పావలాల గుడ్డ ముప్పైఖ రూపాయల కుట్టు.

మూడుపుట్ల చెవిటివానికి ఆరుపుట్ల చెవిటివాడు ఆలోచన చెప్పినట్లు.

మూడు బోనాలు సిద్ధమయినవి, దివ్వెకట్టె ముడికి వచ్చినది, దొరగారు [1]సువారునకు రావచ్చును.

మూడు మనువులు వెళ్ళినా, పొయ్యి ఊదమన్నారు.

మూడు మాటలలో ఆరు తప్పులు.

మూడు మారులు తప్పిన, ఏడు దూరాలు.

మూడు మూరా ఒకచుట్టే, ముప్పైఖమూరా ఒకచుట్టే

మూడు మూసి. ఆరు అతకినట్లు. (చాల దుస్థితిలో ఉన్నాడనుట)

మూడువందలు పెట్టి గేదెను కొని, మూడణాలు పెట్టి తాడు కొనలేనట్లు.

మూడో తరగతిలో ఎందుకు ప్రయాణం చేశావంటే, నాల్గోతరగతి లేదు కాబట్టి అన్నాడట.

మూడో పెండ్లివాడికి ముహూర్తం కావాలనా?

మూతి పెట్టినవాడు మేత పెట్టడా?

మూతి ముద్దుల కేడిస్తే, వీపు గుద్దుల కేడ్చిందట!

మూతులు నాకేవాడికి మీసాలెత్తే వాడొకడా!

మూరెడు ఇంట్లో బారెడుకఱ్ఱ, ఎట్లా కొడతావో కొట్టర మొగుడా!

1 సువారము - కోటలో కొలువు.

మూరెడు పొంగటం ఎందుకు? బారెడు కుంగటం ఎందుకు?
మూరె డెక్క దెందుకు? బారెడు కుంగే(దిగే) దెందుకు?
మూరెడు ముందుకు పోనేల? బారెడు వెనక్కు రానేల?
మూర్ఖచిత్తుడు కోపమునకు పెద్ద.
మూర్ఖు డెపుడు గోరు ముదితలతో పొందు.
మూర్ఖునకును బుద్ధి ముందుగానే పుట్టు.
మూర్తి కొంచమైనా, కీర్తి దొడ్డది. (పెద్దది)
మూల ఉండే వాళ్లను ముంగిట్లోకి లాగినట్లు.
మూలకార్తెకు వరి మూల చేరుతుంది.
మూలకార్తెలో కురిస్తే. ముంగారు పాడు.
మూల ముంచును, జ్యేష్ఠ చెరచును. (కురిసి)
మూలలో చల్లిన ఉలవలు మూడు పువ్వులు, ఆరు కాయలు.
మూలవాన ముంచక తీరదు.
మూలవిగ్రహాలు ముష్టి ఎత్తుకుంటూ ఉంటే, ఉత్సవ విగ్రహాలకు దధ్యోదనమట.
మూలవిరాట్టు తిరిప మెత్తు కొంటూంటే, (మొత్తుకొంటుంటే) ఉత్సవ విగ్రహాలకు తెప్పతిరునాళ్ళట!
మూలిగిన మూతికేసి రాస్తారు.
మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్లు.
మూలుగులు మునపటిలాగే, భోజనాలు మాత్రం ఎప్పటిలాగే.
మూసిచూడను కాసులేదు, ముండను చూస్తే ముద్దొస్తుంది.
మూసిన ముత్యం. మూయని పగడం.
మూసిన ముత్యము. పాసిన పగడము.
మూసిన వాయనం ముత్తైదువలె.
మూసిపెట్టితే పాచిపోయింనట!

## మృ

మృగశిర కార్తెలో ముంగిళ్లు చల్లబడును.

మృగశిర కురిస్తే ముసలిఎద్దు ఱంకె వేయును.

మృగశిరతో కూడ ముల్లోకాలు చల్లబడును.

మృగశిర బిందిస్తే ఇరుకార్తెలు ఎలుగిస్తవి.

మృగశిరలో బెట్టిన పైరు, మీసకట్టున బుట్టిన కొడుకు మేలు.

మృగశిర వర్షిస్తే, మఖ(ఘ) గర్జిస్తుంది.

మృగశిర కురిస్తే, ముంగాలి(రు) పండును.

మృతి దగ్గరకు వచ్చినా, సతి దగ్గరకు వచ్చినా మతి ఉండదు.

మృత్యువు పంచాంగం చూచి పని చేయదు.

మృదుశబ్దానికి మధుశబ్దానికి భేదమేమిరా? అంటే, వట్లల్లో సుడి (వట్రుసుడి) అన్నాడట శిష్యుడు.

---

## మెం

మెచ్చి మేకతోలు, కోరి గొఱ్ఱెతోలు కప్పుతారు.

మెట్ట దున్నినవాడు, లొట్టె[1] త్రాగినవాడు ఒకటే.

మెట్టనున్నా ఏనుగే, పల్లాన ఉన్నా ఏనుగే.

మెట్టను మాత, పల్లాన భార్య.

మెట్టరైతు లొట్టెపిట్ట.

మెట్టినింట్లనుండి కాన్పుకు పుట్టినింట్లు చేరునట్లు.

మెట్ల చప్పుడే గాని, దోవ జరుగదు.

---

1 లొట్టె = కల్లు ఉట్టుటకు చెట్టుకు కట్టిన కుండ.

మెడ తడవడం పూసల కొఱకే.

మెడనూతు(కు)ల వారింట్లో పిడిగుద్దుల సమారాధన.

మెడపూసలకు సమ్మసరిపోయిన బొమ్మలాట ఆడినట్లు.

మెడబట్టి నెట్టితే మారుబట్టుకొని వ్రేలాడినట్లు.

మెడలో రుద్రాక్షలు, మదిలో మదిరాక్షులు.

మెతుకుపోతే బ్రతుకు పోతుంది.

మెతుకులు చల్లితే కాకులకు కొదువా?

మెత్తగా ఉంటే మొత్త బుద్ధి వేస్తుంది.

మెత్తటి పులి, సాదు పలవ.

మెత్తటి పులి ధర్మ సూతి.

మెత్తనాళ్లు పోయినవి, చెత్తనాళ్లు వచ్చినవి.

మెత్తని చోటనే గుద్దలి వాడి.

మెత్తని మట్టిని మోచేతితో త్రవ్వినట్లు.

మెత్తనిమాటలాడరా అంటే, మాది వెన్నపూస అన్నాడట.

మెత్తని వాడినిచూస్తే మొత్తబుద్ధి వేసినట్లు.

మెత్తలు ఎండకువేస్తే, మెడల నొప్పులు పోతాయా?

[1] మెఱుగు వేయనిదే మృదువు కాదు.

మెఱుగు వేయనిదే మెఱుగురాదు.

మెఱుపుకొద్దీ వర్షము.

మెఱుపు దీపంగాదు, మబ్బు గొడుగు కాదు.



1 మెఱుగు = చమురు; నెయ్యి.

## మే

మేక ఆకులు మేయగానే ఉపవాస మగునా?

మేకకు జ్ఞాపకముండేది మేత ప్రసంగమే. (సంగతే)

మేకకు తెలిసినదంతా మేత సంగతే.

మేకకు మెడచన్నులు, తాళ్ళకు (తాటిచెట్లకు) తలచన్నులు.

మేకపిల్లను చంకలో పెట్టుకొని ఊరంతా వెదకినట్లు.

మేక పెంటికె ఎక్కడున్నా ఒకటే.

మేక(పో)బోతు గాంభీర్యం - మాచకొమ్మ సౌందర్యం.

మేక మెడచన్ను కుడిస్తే ఆకలి తీరునా?

మేక మెడచన్నులకు పాలు, మేడికి పూలు లేవు.

మేక మెడచన్నులు పిసుకను పిండను పనికిరావు,

మేక మెడచన్నులు (నిష్ప్రయోజనాలు అనుట-అజాగళ స్తనాలు).

మేక మేయని ఆకు ఏదంటే - బండిరకు, రాట్నపు ఆకు.

మేకలు తప్పించుకొంటే తుమ్మలు, మాలలు తప్పించుకొంటే [1]ఈదులు.

మేకలే మడకలు దున్నితే, ఎద్దులు ఎవరికి కావాల?

మేకవన్నె పులి.

మేకశిరం మెత్తగా ఉన్నదని మఱికాస్త లాగాడట!

మేఘాలు నలుపైతే వాననీళ్లు నలుపగునా?

మేడలు గుడిసెలు కావడం కన్నా, గుడిసెలు మేడలు కావడం మేలు.

మేడిపండు జూడ మేలిమై యుండును పొట్టవిచ్చి చూడ పురుగులుండు.

[2]వేడిపిరి కీడు చేయును.

---

1 ఈదులు = ఈతచెట్ల తోపులు.

2 వెడిపిరి = అత్తి బాగా పేలి కాయుట.

మేతకన్న మసలితేనే బలం. (కాలార తిరుగుట అనుట)

మేతికరణమే గాని కూతకరణం గాదు.

మేతకేగాని చేతకు (కూతకు) కొఱగాదు.

మేదరసాల దర్గంమీద మేకకాలంత మొయిలు వేస్తే, తుల్లూరు దొండపాడు కాయ దూడకట్లు అయినా కాదు.

మేనత్తపోలిక, మేనమామ చీ(వా)లిక.

మేనత్త మూతికి, మీసాలు ఉంటే చిన్నాయన అవుతాడు.

మేనమామకైతే ఇవ్వడు, పోలుబొందలలో పెడతాడు.

మేపే రూపు.

మే మే అంటే, మెడలెక్కి కూర్చున్నాడట.

మేయబోతే ఎద్దులలోకి, దున్నబోతే దూడలలోకి.

మేయబోయి మెడకు తగిలించుకొన్నట్లు.

మేలు మేలంటే, మెడ విరగబడ్డట్లు.

మేలోర్చలేని అబ్బకూతురోడు మూగతల్లి దొరకినట్లు.

మేసేగాడిదను కూసేగాడిద (వచ్చి) చెఱచిందట.

మేసేజన్మలు మేకలు మానినవి, పలుకులు మానండట్రా పంజరాల చిలుకల్లార అన్నట్లు.

మేస్త్రీలు మేడకట్టితే, కుక్కకాలు తగిలి కూలిపోయిందట!

మేహజాడ్యం, తోటసేద్యం (ఏనాటికీ వగదెగవు.)

## మై

మైనపుగోడలను గురించి కంచుగోడలు కాలిపోయినవట!

మైనపుముక్కువాడు (ఏవైపుకంటే ఆవైపుకు తిరుగువాడు)

# మొ

మొండి ఈతకు (యీనితే) మోపుడు జాళ లన్నట్లు.

మొండికి తగ్గ మిండడు.

మొండికి సిగ్గు లేదు, మొరడకు (మొరటుకు) గాలిలేదు.

మొండికీ బండకూ నూరేండ్లాయుస్సు.

మొండి కెక్కినదాన్ని మొగుడేమి చేయు? రచ్చ కెక్కినదాన్ని రాజేమిచేయు?

మొండికెత్తితే మొగుడేమి చేస్తాడు? బండ కెత్తితే బావేమి చేస్తాడు?

మొండి గురువు, బండ శిష్యుడు.

మొండిచెట్టు గాలికి మిండడు, మొలకులేనివాడు దొంగలకు మిండడు.

మొండిచేతితో మొత్తు కున్నట్లు.

మొండిచేతితో మూర వేసినట్లు,

మొండిచేతి వానికి నువ్వులు తిననేర్పినట్లు.

మొండిచేతుల పెండ్లానికి మోదకాళ్ళ మొగుడు.

మొండితోక గొడ్డు రాగోరును, గుడ్డిగొడ్డు పోగోరును.

మొండిదానా! నీ మొగుడేమి చేసినాడంటే, అటుకొట్టి ఇటుకొట్టి వాడే పోయాడు అన్నదట!

మొండిమొగుడి పెళ్లికెళ్లి, అర్ధరాత్రివేళ అడ్డగోడ చాటునుండి అర్ధరూపాయి కట్నం చదివించిందట!

మొండిముక్కున ముక్కర ఉంటే, మూతి తిప్పడమే ముచ్చట అనుకొన్నదట!

మొండివాడు రాజుకంటె బలవంతుడు.

మొండివాని హితుడు బండవాడు.

మొక్కఅయి వంగనిది, మ్రానై వంగునా!

మొక్కజొన్న కండె (కంకి) ముక్కలై మీదపడ్డట్లు.
మొక్కబోయిన దేవర ఎదురు వచ్చినట్లు.
మొక్కబడే లేదంటే, ఒక్క దాసరికైనా పెట్టమన్నట్లు.
మొక్కేవారికి వెఱవనా? మొట్టేవారికి వెఱవనా?
మొగం వాచిన మొగుడికి పాచిన కూడు పెట్టితే, పాయసమని బట్టు
బట్టున జుట్టుకొన్నాడట!
మొగ (మగ) పిల్ల బంగారు పుల్ల.
మొగపిల్ల లున్నయిల్లు, మోదుగు లున్న అడవి అందము.
మొగబుద్ధి మోటుబుద్ధి, ఆడుబుద్ధి అపరబుద్ధి.
మొగమాటమునకు, మోక్షమునకు దూరము.
మొగమాటానికి పోతే, ముండకు కడుపైనట్లు.
మొగము మాడ్పది మొగుడికి చేటు, ఈడ్పు కాళ్ళది ఇంటికి చేటు.
మొగవాని మూతిపై ఉంటే, నాకు ముంజేతిపై ఉన్నవి-వెంట్రుకలు
అన్నదట ఒక మగరాయుడు.
మొగవారి కాలుసోకి తాకితే, ఆడువారు పికల్లుతారట.
మొగ్గ చూచి మోట చాలించినట్లు.
మొగడంటే ముద్దులుబెట్టె మిండడంటే ముద్దులు పెట్టును.
మొగుడికి మోగుతాకా, అల్లుడికి అరిటాకు.
మొగుడికే (మగడికే) మొగతనం ఉంటే, అగసాలాయనతో అవ
సరమేమి? (అగోచరించడ మెందుకు!)
మొగుడికే మొగతనం ఉంటే, తంబళ్ళవారి తగులాట మేమి?
మొగుడిచకోట్ల మొగసాల కెక్కినట్లు.
మొగుడిని చూస్తే పైసా లేదు, ముండను చూస్తే ముచ్చటౌతుంది.
మొగుడి మీద కోపం పొన్ను మునిగే వఱకే.
మొగుడు అంటే ఘోష, డబ్బు అంటే ఆశ.

మొగుడు ఈయని గౌరవము, తల్లి చేయని గారాబము.

మొగుడు ఒగ్గినా మామ ఒగ్గడు.

మొగుడు కొట్టినందుకు కాదు కాని, తోడికోడలు నవ్వినందుకు.

మొగుడు కొట్టిన కొట్లు ఊరెల్ల రట్లు, మిండడు కొట్టిన కొట్లు ముత్యాలకట్లు.

మొగుడు కొట్టితే కొట్టినాడుగాని, ముక్కు చీమిడి బాగా వదలింది.

మొగుడు కొట్టినాడని మొల్లవాని దగ్గఱకుపోతే, మొల్లవాడు తెల్లవాళ్లా కొట్టినాడట!

మొగుడు కొద్దీ వన్నెలు, సిగకొద్దీ చిన్నెలు.

మొగుడు చచ్చిన వెనుక ముండకు బుద్ధి వచ్చిందట!

మొగుడు చచ్చి మొత్తుకొంటూంటే, మిండమగడు వచ్చి రాళ్లు రువ్వాడట! (వేశాడట).

మొగుడని చూచిన దండుగ, మిండని చూచిన పండుగ.

మొగుడు పెళ్లాం పోట్లాడి, సూర్యవారం బ్రాహ్మణ్ణి చావకొట్టినట్లు.

మొగుడు లేకపోతే అప్ప మొగుడు, కూర లేకపోతే పప్పుకూర.

మొగుడు లేనినాటికి కూడా మంత్రసాని తప్పదు.

మొగుడు విడిచినా మామ విడువడు, మామ విడిచినా దేవతార్చన బ్రాహ్మడు విడువడు.

మొగుడే ముండా అంటే ముష్టికి వచ్చినవాడు గూడ ముండా అంటాడు.

మొగుడొల్లక ముప్పైయేండ్లు. అల్లొల్లక అరవై ఏండ్లు, బాల ప్రాయం పదేండ్లు (నూరేండ్లు పూర్తి అయినట్లు)

మొగునితో పెళ్లికి, పిల్లలతో తీర్థానికి వెళ్లరాదు.

మొగుని పెత్తనం మొండి మేనత్త.

మొగునిమీది కోపంచేత మాదిగవాని వెంట పోయినట్లు.

మొగళ్ల పొద్దు మోసపుచ్చె, కోడలిప్రాణం కొలుకులోకి వచ్చె.

మొట్టేవాడికి వరమిస్తాడు గాని మొక్కేవారికి వరమీయడు.

మొత్తుకోళ్ళోయీ [1]ముత్తయ్య సెట్టీ.

మొదట మానెడు, దూడ చత్తే దుత్తెడు.

మొదటికే మోసమైతే లాభానికి గుద్దులాలట!

మొదటికే మోసమైతే, వడ్డీ మాట్లేదన్నాడట!

మొదటిమాపుకే కలిగిన వలుపుకు కాలయాపన లేదు.

మొదటిదానికి మొగుడు లేడు, కడదానికి కల్యాణమట.

మొదటిపెండ్లి అవసరము, రెండోపెండ్లి అవివేకము, మూడోపెండ్లి అపస్మారము.

మొదటి ముద్దుకే మూతిపండ్లు రాలినట్లు.

మొదలుంటే పిందెలు పెడుతుంది.

మొదలు మునిగితే నడ్డి మునుగదా?

మొదలు చేవలేక తుద నెల్లికలుగురా.

మొదలు మోదుగ పూస్తే, కొస సంపెంగ పూస్తుందా?

మొదలు లేదు శ్రీరామ! అంటే, మొలతాడు లేని గోచిపాత అన్నాడట! [అందట!

మొదలు లేదు సుబ్బక్కా! అంటే, ఒక్క దేవరకైనా మొక్కక్కా

మొదలు లేదు సుబ్బక్కా అంటే, ముంతెడే పెద్దక్కా అన్నదట.

మొగ్గు మీసం, మోసులు మాను.

మొదలు విడిచి కొనలకు నీరుబోసినట్లు.

మొదలే కుంటికాలు, దానికి తోడు పక్షవాతం.

మొదలే కోతి, పైగా కల్లు తాగినట్లు.

మొదలే మన్ను, కలుపు వస్తే గడ్డలు.

మొద్దు (మోటు) ముండకు దొరకేటంతా మోటు శిశినాలు.

1 ముత్తయ్య = ముత్యాలయ్య.

మొద్దు మొగానికి తోడు, గరుడసేవా!
మొప్పెకు మూరెడు నోరు.
మొప్పెకు మొగిలిపువ్విస్తే, మడిచి (ముడ్డి) గుద్దలో పెట్టుకొన్నదట!
మొయిలునీరు నమ్మి చెఱువు కట్ట తెగగొట్టుకొన్నట్లు.
మొయిలువిడిచిన ఎండ, మొగుడువిడిచిన ముండ, పట్టివిడిచిన మండ, ఎత్తివిడిచిన కుండ.
మొఱకుకు సివమెత్తిన మ్రొక్కక తప్పదు.
మొఱిగే కుక్క కఱవదు. (అరచే కుక్క)
మొఱ్ఱలో మొఱ్ఱ మొండిచెయ్యి చూపించెయ్యి. [తేగలరా!
మొఱ్ఱో! మొఱ్ఱో! వద్దనగా లింగం కట్టేరుగాని మొక్క చేతులు
మొలది విప్పి తలకు చుట్టినట్టు.
మొలబంటి దుఃఖంలో, మోకాలిబంటి సంతోషం.
మొలిచే చెట్టు మొలకలోనే తెలుస్తుంది.
మొసలిబావా! కడిమిచెట్టు వేరామొగాని, కాలైనా ఇంతేకదా?



## మో

మోకాటిలో మెడనరం పట్టిందంటే, మీాద పట్టి వేయమన్నట్లు.
మోకాలు మునిగింది అని ముక్కు కుంటారా?
మోకాలెత్తు విగ్రహముంటే, మొలలోతు కూడు.
మోకాలెత్తు ముందుకు, మోచేతులు వెనుక్కు.
మోచిన మోపును ఇందరు మోయవలెనా?
మోచేతిదెబ్బ చూడక, తాచిప్పకు అతుకు పెట్టబోయినట్లు.
మోచేతిదెబ్బ-మొగుడింటి కాపురం.
మోచేయిపోయి [1]మొకరానికి తగిలినట్లు.

1 మొకరాము = స్తంభము.

మోటుకు కోపం ముక్కుమీద.

మోటుకు పొమ్మంటే, ఆటకు పెట్టినాడు.

మోటువాడికి మొదటిచోట కంపు, వన్నెగాడికి మూడుచోట్ల కంపు, (చేతికి, వాసన చూచినందున ముక్కుకు)

మోటువాడికేమి తెలుసు మొగలిపూవు వాసన?

మోట్లుకొట్టగా మగనితోకూడ తేస్తే, గుడ్డబట్టలు దులిపేవటకే కూటివేళాయె.

మోతచేటుగాన మోక్షంబు లేదయా.

మోతనీటిలో యీత యీదినట్లు.

మోదుగపువ్వు అందము-పసియోగము మిసిమి.

మోపూరువాళ్ళు మొగళ్లు చస్తే, తలమంచివాళ్లు తాళ్లు తెంచుకొన్నట్లు.

మోసేవానికి తెలుసు (కావడి) బరువు.

మోక్షానికిపోతే మొసలి యీడ్చుక (ఎత్తుకొని) పోయిందట!

మోహాగ్రమను జిక్కి మొనగాడు నీల్గడా.

## మౌ

మౌనంబు దాల్చుట మనసిచ్చగింపమి.

మౌనం అర్ధాంగీకారం.

మౌల్వీలు మసీదు మేస్తూంటే, పీర్లకు పిండివంటలా?

## మ్రా

మ్రానిపండ్లు మ్రానుక్రిందనే రాలును.

## ప్రొ

ముగ్గు వేయరానివారిని యముడు, జాంబవంతుని వెంట్రుకలు పెరక పెడతాడట!

## ప్రొ

ప్రొక్కబోయిన గుడి ముక్కలై మీదపడ్డట్లు.
ప్రొక్కబోయిన దేవు డెదురైనట్లు.
ప్రొక్కిన ప్రొక్కు చక్కనై, మగనికండ్లు రెండూ పోతే, [1]ఆరుగాళ్ళ జీవాన్ని దేవునకు అర్పితం జేతు అన్నదట!

## య

యజమాని చూడనిచేను ఎంత పెరిగినా నష్టమే.
యజమాని చూడనిచేను [2]ఏడుగాడు.
[3]యజ్ఞంచేసి రంకు తెలుపుకొన్నట్లు.
యజ్ఞానికి ఏమి యత్నమంటే, కత్తెలూ, కటార్లు అన్నట్లు.

1 ఆరుగాళ్ళ జీవం = ఈగ. 2 ఏడుగాడు = చెడిపోవుట.

3 ఆలిరంకుచెల్ల ఎల్లయజ్ఞంబుల
తల్లిరంకుచెల్ల తద్దినంబు — అని వేమన.

యజ్ఞంలో సోమిదేవి రావాల్సియుండగా, తనకున్న రంకుమగనిగూర్చి వెల్లడించగా, ఋత్విక్కులు వాయుపాశమంత్రాలచే ఆమె విటులకు మలమూత్రాల బంధించి చంపివేస్తారు. సోమిదేవి అయినతర్వాత ఆమె అంటి తురాయి రాకూడదు.

అట్లే తద్దినాలలో, కొడుకు తండ్రికి పిండము పెడుతూ, ఒకవేళ తల్లి తప్పుకనక వరిస్తే తాను అన్యబీజానికి పుట్టిఉండినా, యీ పిండం పెద్దకన్న యీ పితురునికే చెందవలెనని మంత్రంలో చెప్పుకొంటున్నాడు.

యజ్ఞానికి ముందేమిటంటే, తలక్షవరం అన్నట్లు.
యతి అంటే, ప్రతి అన్నట్లు.
యతికోటరు పోతే, మతి పోయింది.
[1]యతిమతం మగనికి ఎత్తుబారపు పెండ్లాము.
యత్రజంగం, తత్ర భిక్షమన్నట్లు.
యథార్థవాది లోకవిరోధి.
యథార్థానికి ఏడుచుట్లు తెరలు అక్కఱలేదు.
యముడికి శివుడికి వెరవనివాడు.
యముడు ఒక్కణ్ణి చంపితే, ఏతాము ముగ్గురిని చంపుతుంది.

## యా

యాదవకులంలో ముసలం పుట్టినట్లు.
యాచమనాయని త్యాగము గోచులకేగాక కట్టుకోకల కగునా.
యానాదివాడు గుద్దకడిగినట్లు. (ప్రక్కన కాలువ ఉన్నా పూర్వాకడిగేవాడు కాడు; సక్రమంగా జరిగేపని అనుట.)
[2]యానాది లగ్నానికి ఏనాడైతే ఏమి?

## యు

యుగయుగాలనాటి యుధిష్ఠిరుని వలె.
యుగ్మలి కనుచూపు రంజకము కాదొకో పల్లవకోటి కెప్పుడున్.

---

1 యతిమతము = వెట్టిపాటకం, యతికెనముండుట. (ఏతామతం)

2 యానాదిలగ్నం = అర్ధరాత్రి. యానాదులు పుట్టనప్పుడు బయట రోకలి నిలిపి నీద అటు ఇటు పడకుండా ఉన్నప్పుడు పెండ్లిలో తాళిబొట్టు కట్టుదురు.

## యె

[1]యెట్టు (వెట్టు) గొట్టినమూక, గుట్టువిడిచిన లంజ.

## యో

యోగమందు కలదె భోగమందున్నట్లు.
యోగికీ, రోగికీ, భోగికీ నిద్ర లేదు.

## ర

రంగడా విభీషణునికి పంగనామ మిడిన రీతి.[2]
రంగడికి లింగడికి స్నేహం, రొట్టె కాడ గిజగిజలు.
[3]రంగము సొమ్ము, అంగడి సొమ్ము నిలువదు.
రంగుల దుప్పట్లు సింగొంగడికి సరిపోలవన్న గున్నాం చెన్నా.
రండ కొడుకైనా కావాలె, రాజు కొడుకైనా కావాలె.
రండ తుపాకి కాలిస్తే, గుండు గాలికిపోయిందట.
రండరాతకు [4]పెండ సిరా.
రండరాజునకు గొండడు దళవాయి.
[5]రందిగాడికి రేయింబవలు తెలియదు.
రంభ చెక్కిలి నొక్కి రాట్నం తిప్పినట్లు.
రంభయైన తన కుచసంధముల్ తనచేత తాబట్టుకొనిన సుఖము లేదు.
రక్కసి ఆలుకు అనదమగడు.
రతిచాలని మృగేంద్రుని నక్కయు గోలుపుచ్చు.

---

1 యెట్టుగొట్టు = దొంగనాటకము పోతదోయు, జాలి, యెట్టు = టంకము.

2 విభీషణునితోగూడ రాముడు తిరిగి లంకకు పోకుండా కావేరిగట్టున శ్రీరంగంలో నిలిచిపోయినాడని కథ. "వెస విభీషణ రాజ్యవిముఖుడై సహ్యభూపుత్రియందు చేరి నిలువడేసి" అని వసుచరిత్ర. 3 రంగము = రంగూను.

4 పెండ = పేడ. 5 రంది = మైథునేచ్ఛ; రిరంస.

రచ్చ కెక్కిన సభలో రాయబార మేల?

రజని గానము, రండా ప్రభుత్వము.

రట్టూ రవ్వా రావిపాటి వారిది, పుస్తె పూసా పూసపాటి వారిది.

రతి లేని నాతి, (పరుగు) గతిలేని గుఱ్ఱము రాణించవు.

రతిలో సిగ్గు రణములో భీతి కొరగావు.

రత్నం బొకనిచే నన్వేషింపబడునుగాని, యొరు నన్వేషించునే.

రత్నాన్ని బంగారంలో పొదిగితేనే రాణింపు.

రత్నాన్ని రుస్కి గాజును కొన్నట్లు

రత్నాలన్ని ఒకచోటికి, రాళ్ళన్ని ఒకచోటికి.

రత్నాలు తినే పక్షికి రత్నాలు, రాళ్లు తినే పక్షికి రాళ్లు.

రత్నాలున్న గనిలోనే రాళ్లుండేది.

రథసప్తమి కోడళ్ళను పెట్టినత్తను కొంచబోతుంది.

రమాపతే, సీతాపతే, పొద్దున లేస్తే పొట్టేగతి.

రమ్మన్నారు తిమ్మన్నబంతికి–అన్నట్లు.

రవిక, పగలు బిడ్డకడ్డాము, రాత్రి మగని కడ్డాము.

రవికలోనే చీర మిగిలించాలంటే ఎలాగు?

రవి గాననిచో కవిగాంచనేర్చు నయ్యోడక.

రవ్వ రవ్వతో తెగుతుంది గాని, రాతితో తెగుతుందా?

రసం ముదిరితే రాగం, పాకం ముదిరితే పాట.

రహస్య మేమిటంటే, (విశేష మేమిటంటే) వడ్లగింజలోది బియ్యపుగింజ అన్నట్లు.

[1]రక్షలు పోతే మచ్చలు పోతాయా.

రక్షించినవాణ్ణే భక్షించినట్లు.

---

1 రక్షలు = రక్షరేకులు; తాయెత్తులు.

# రా

రా అమ్మగాని, పో అమ్మ లేదు.

రాకుండా చూచి పోకుండా కొట్టినట్లు.

రాకు, పోకు బంగారు చిలక.

రాగం లేని భోగం, త్యాగం లేని ఈవి.

రాగం తీయనివాడు, రోగం రానివాడు లేడు.

రాగల శని రామేశ్వరం వెళ్ళినా తప్పదు.

రాగి చెట్టుకు ప్రదక్షిణాలు చేస్తే బిడ్డలు పుట్టుతారంటే, చుట్టుచుట్టుకు పొట్ట చూచుకొన్నదట.

రాగిపైనా చల్లగుంటే, రాచబిడ్డ కూడ దిగివస్తుంది.

రాగిపోగులు తగిలించుకున్నావేమిరా? అంటే, నీకు అవైనా లేవు కదా అన్నాడట!

[1]రాగిరైరుల చెంత రమ్యమౌ వరిమొలక రాజిల్ల నేర్చునా.

రాగి రాగోరును.

రాగులరాయి తిరుగుతూ ఉంటే, రాజ్యమంతా చుట్టాలే.

రాఘవా! స్వస్తి. రావణా స్వస్తి. (అందరికి మంచిగా ఉండుట)

రాచతనానికి జందెపు పోచా గుర్తు?

రాచపగ-త్రాచు (పాము) పగ.

రాచపీనుగు తోడు లేకుండా పోదు.

రాచబిడ్డ స్మరాలయము కాగానే పూజకు దాసాని పువ్వగునా?

రాచవారి పసులకు బందిలేదు.

రాచవారి భోగం రైతుల త్యాగం.

రాజముకుటం శిరోవేదనను పోగొట్టలేదు, ఐశ్వర్యం ఆనందమును కొనితెట్టలేదు.

---

1 రాగి - తమిద

రాజరాజులకు రాజదండం, కాపుకు [1]కరుకోల.

రాజు ఎంతో, ప్రజలూ అంతే.

రాజు ఎవరైనా రాగులు విసరేది తప్పదు.

రాజుకంటె మొండివాడు బలవంతుడు.

రాజుకత్తికి రెండువైపులా పదునే. (వాదరే)

రాజుకన్నా చిన్న, మంత్రికన్నా పెద్ద.

రాజుకు కంటను, పాముకు పంటను విషము.

రాజుకూతురైనా ఒకని ఆలే.

రాజు కొడుకైనా కావాలి, సానిదాని తమ్ముడైనా కావాలి.

రాజుగారి గుఱ్ఱమైతే మాత్రం తొక్కితే కాలు నొవ్వదా?

రాజుగారి పెద్దభార్య పతివ్రత-అన్నట్లు.

రాజుగారి పెళ్లాం మేడ ఎక్కితే, కుమ్మరివాడి పెళ్లాం ఆవ మెక్కిందట!

రాజుచేసిన కార్యాలకు, రాముడు జేసిన కార్యాలకు ఎన్నిక లేదు.

రాజు తలిస్తే గాజుకంబాల కేమి కొదవ?

రాజు తలిస్తే, దెబ్బలకు కొదువా?, బ్రహ్మ తలిస్తే ఆయుస్సుకు కొరవా?

రాజు దృష్టికి రాయి పగులును.

రాజు నీతి తప్పితే, నేల సారం తప్పుతుంది.

రాజును చూచిన కంటితో మొగుణ్ణి చూస్తే మొట్ట బుద్ధవుతుంది.

రాజుపాపం పురోహితుని కొట్టుకపోవును.

రాజు పెద్దకూతురును పెండ్లి చేసికోను నాకేమి అభ్యంతరం లేదన్నట్లు.

రాజు పోతులాగే ఉన్నాడు, రాజు పెళ్లాం రంభలాగే ఉంది.

1 కరుకోల = కఱ్ఱ.

రాజు మెచ్చింది మాట, మొగుడు మెచ్చింది రంభ.

రాజు మెచ్చింది రంభ, తాను మునిగింది గంగ.

రాజు రాకడ లేదు! [1]మూకుడు లేదు.

రాజులకు పిల్లనిస్తే రాళ్ళకిచ్చినట్లే.

రాజుల చనవు ఎన్నాళ్లు.

రాజుల చెలిమి పాముల చెలిమి వంటిది.

రాజుల సొమ్ము తాళ్ళ పాలు.

రాజుల సొమ్ము లంజల పాలు.

రాజులు పోతే రాజ్యాలు పోతవా?

రాజులేని ఊళ్లు, పూజలేని గుళ్లు.

రాజులేని రాజ్యం, కాపులేని గ్రామం.

రాజు వలచిన రంభ, రాజు విడిచిన తుంబ.

రాజ్యము వీరభోజ్యము.

రాజ్యాలు ఉడిగినా లక్షణాలు ఉడగలేదు.

రాజ్యాలు పోయినా, రాచరికాలు (రాజసాలు) పోలేదు.

రాట్నం వచ్చింది, బండి అడ్డం తీయరా అన్నాడట.

రాట్నానికి రెండు చెవులు, నాకూ రెండు చెవులు.

[2]రాణివాసం వచ్చి [3]మూలవాసం పీకిందట.

[4]రాతకు (వ్రాతకు) మించిన లోతు లేదు.

రాత బొడిచినా చావు లేదు.

రాతికట్ల పంటచెరువుకు గాక గండి గుంటకేల!

---

1 మూకుడు = కొట్టుట-చిమ్ముట.

2 రాణివాసం = రాజభోగం.

3 మూలవాసం = ప్రధానమైన ఇంటివాసం.

4 రాత = నొసటివ్రాత.

రాతి కుండకు ఇనుప తెడ్డు.

రాతి పశువును పూజిస్తారు, చేతి పశువును బాదుతారు.

రాతిబొమ్మకు చంకిలిగింతలు పెట్టినట్లు.

రాతిలో కప్ప, రాతిలోనే బ్రతికినట్లు.

రాత్రిఅంతా రభస అయితే, రక్తి ఎప్పుడు ?

రాత్రికి వెన్నెల, పైరుకు వెన్నులు పస.

రాత్రి చీకటిపోతే, పగులు వెలుగు వస్తుంది.

రాత్రి పడ్డ గోతిలో పగలు పడుతారా ?

రావన్నపని రాజుపని, వస్తుందన్నపని తొత్తు పని.

రానిఅప్పు (సొమ్ము) రాతితో సమాన మన్నాడట.

రానిపాట పాడ వేడుక, బోడితల అంట వేడుక.

రానివాడి మీద రాయి.

రాని వానిని పిలువ వేడుక.

రానురాను గుఱ్ఱం గాడి దయిందట !

రానూవచ్చె, పోనూపోయె, రాగులువిసరి సంకటి చేయమన్నాడట !

రాబందుకు, రాజుకు తేడా లేదు.

రామక్క దేమిపోయె? రామన్న దేమిపోయె? రాసిలోనిదే దోసెడు పోయె.

రామనామధారి రాక్షసుండు.

రామాండ కతల్లెల్ల మే మెఱుంగని పనే? రాటమురాజుకు కర్ణుడోడె - అన్నట్లు.

రామాయపట్నం మధ్యస్థం (న్యాయం చెప్పమంటే, చెరిసగం చేసుకోమన్నట్లు).

రామాయణం అంటే ఏమో అనుకున్నాను గాని, మాశిబరువుంది అన్నాడట !

రామాయణం అంటే సామాన్యంగాదు, గాడిద మోతంత ఉంది.
అన్నాడట!

రామాయణం అంకు, భారతం బొంకు.

[1]రామాయణంలో పిడకల (పిటకల) వేట్లాట. (కాట్లాట, కొట్లాట)

[2]రామాయణమంతా విని, రాముడికి సీత ఏంకావాలని అడిగాడట!

రాముడినాడు లేదు, భరతుడినాడూ లేదు, శత్రుఘ్నునినాడు
చెవ్వల వాదులు అన్నట్లు.

రాముడు లేని రాజ్యం లాగ.

రాముని పాదాలు తగిలితే, రాళ్ళు రమణులౌతవి.

రాముని వంటి రాజుంటే, హనుమంతునివంటి బంటూ ఉంటాడు.

రాముని వంటి రాజు, రావణుని వంటి వైరి లేరు.

రామేశ్వరం పోయినా, శనేశ్వరం తప్పలేదు (వదలలేదు).

రామేశ్వరం వెళ్లినా అంకమగడు తప్పలేదట!

రాయలవారి ఏనుగు పిత్తుతుంది పిత్తుతుంది అని మూటకూళ్లు కట్టు
కొని పోతే అది తుస్సున పోయిందట!

రాయంగ రాయంగ కరణం - దగ్గంగ దగ్గంగ మరణం.

రాయుడిది తలది, చాకలిది మొలది.

రాల రువ్వదగినవాని పూల రువ్వకు.

రాలిన పూవు రెమ్మకు అతుకుకొంటుందా?

రాళ్లకోపని గుద్దలిని వాడిచేసే వాళ్లుందురా?

---

1 రామాయణంలో జాబాలి బౌద్ధధర్మములను గూర్చి ప్రస్తావిస్తాడు. బౌద్ధ ధర్మము లుండే గ్రంథాలను పిటకములు (బుట్టలు) అంటారు. ఇవి మూడు (త్రిపిటకములు).

2 ఇది వట్టి చొప్పదంటు ప్రశ్నకాదు. వివిధభాషలలో, ద్వీపాంతర (ఇండో నేషియా, కాంబోడియా) దేశభాషా రామాయణాలలో రాముడు - సీత వరుస తారుమారుగా వున్నది. కొన్నిట సీత రామునికి చెల్లెలు; ఇంకొక కథలో, యీమె రావణుని కూతురు. ఇట్లా నానాసంకరంగా ఉన్నది. కాబట్టి దీనిని "రామాయణమంతా" అని గాక "రామాయణాలన్నీ విని" అంటే సరిపోతుంది.

రాళ్ల [1]చెలుక-రండబిడ్డ, కాపువారికి కలిసివస్తాయట!
రాళ్ల చేను రత్నాలు పండుతుంది.
రాళ్ళ చేలో [2]గుంటక తోలినట్టు.
రాళ్లు తినేపక్షి రాళ్లు తింటుంది, రత్నాలుతినేపక్షి రత్నాలుతింటుంది.
రావణాసురుడి కాష్టంవలె. (ఎడతెగనిది)
రావేమయ్యా తిండి వేమయ్యా! అంటే వెనక్కే పోయానన్నాడట!
రాష్ట్రం దాగినా (దాటినా) రంకు దాగదు.

## రి

రిక్తమనసు కోర్కెలకు పెద్ద.

## రీ

రీతికి వస్తే కదా రంగానికి వచ్చేది?

## రు

రుచిమరిగిన పిల్లి ఉట్టిమీద కెగిరినట్లు.
రుచీపచీలేని కూర కంచానికి చేటు, అందం చందం లేని పెళ్ళాం మంచానికి చేటు.
రుద్రాక్షపిల్లి (వంటివాడు, కపటసన్యాసి).

1 చెలుక - (చెలక) ఏడుమార్చి ఏడు పైరుబెట్టే మెట్టపొలము.
2 గుంటక - చదునుచేయు సాధనం. (గొర్రు ఆకారంతో దోకుడుపట్టా ఉండును)

## రూ

రూక యివ్వని విటకాని పోటు మొండు.

రూకలు పదివేలున్నా చారెడు నూకలె గతి.

రూక లేనివాడు పోక చేయలేడు.

రూపంచేత స్త్రీలు, పరాక్రమంచేత పురుషులు రాణింతురు.

రూపాన పాపిష్ఠి, గుణాన పాపిష్ఠి.

## రె

రెంటికి చెడ్డ [1]రేవడు వలె.

రెండావుల పాలు తాగిన దూడ.

రెండావుల పాలు దాగేవాడు. (కుడిచేవాడు) (ఉభయపక్షాలకు చెందినవాడు—అనుట.)

రెండు ఊళ్ళ వ్యవసాయం, ఇద్దరు భార్యల సంసారం.

రెండు ఏండ్ల వరపు, మూడేండ్ల ముసురు ఉండదు.

రెండుచేతులు కలిస్తేనే చప్పుడు అయ్యేది.

రెండు తప్పు లెప్పుడూ ఒక ఒప్పు కాలేవు.

రెండు నలుపులు కలిసి ఒక తెలుపు కానేరదు.

రెండు నాలుకలవాడు. (మాట నిలుకడ లేనివాడు)

రెండు పడవలలో కాళ్లు బెట్టినట్లు (పెట్టినవాడు) (ఉభయపక్షాలకు ప్రీతిపాత్రుడు కాదలచువాడు).

---

1 రేవడు = చాకలి. నీటబడిన గుడ్డను తీసుకొని రాబోతే గట్టున గుడ్డలు దొంగ లెత్తుకొనిపోయినారు: కొట్టుకొని పోయినది అట్లే పోయినవి. ఇట్లు చాకలి రెంటికీ చెడినాడు.

రెండు వేదాంతయుక్తులు వాగగానే రాజయోగి కాడు.

రెండు వ్రేళ్ళతో నాటవచ్చును కాని, అయిదువ్రేళ్ళతో పెరకరాదు.

రెండూ రెండే, కొండప్పా!

రెడ్డి కరణం లేని ఊళ్ళో, చాకలివాడే పిన్నా పెద్ద.

రెడ్డి మడ్డి రోమాల ముడ్డి.

రెడ్డి మడ్డి బంగారు కడ్డి.

[1]రెడ్డి వచ్చాడు మొదలెత్తుకో. (పురాణం)

రెడ్డివారి ఆబోతు (రెడ్డోళ్ళ)తా ఎక్కదు, ఇంకొకదానిని ఎక్కనియ్యదు.

రెడ్డేమి చేస్తున్నాడురా, అంటే-పైన పండుకొని ఉన్నాడు; అమ్మో-క్రింద పండుకొని ఉన్నది; ఎప్పుడూ ఇంతేనా? అప్పుడప్పుడు అమ్మగూడ పైన పండుకొంటుంది, అన్నాడట.

[2]రెళ్లకు-వడ్లకు పేర్లు చెప్పలేము.

రెళ్లలో తెగలకు, వడ్లలో తెగలకు లెక్క లేదు.

రెళ్లున్న ఊరిలో, రేములున్న కొండలో ఏమీ బతకవు.

రెప్పలార్పేవాళ్లు కొంపలారుస్తారు.



---

1 ఒకపల్లె చావడిలో పురాణం చెప్పుమంటినారు. పనులు తీర్చుకొని ఒక్కొక్క రెడ్డి వస్తుండగానే పురాణ కథను మరలా మొదటినుండి ప్రారంభించేవాడు ఆ పౌరాణికుడు. ఇట్లా మొదలెత్తుకొనగా కొనగా, తెల్లవారినా కథ ప్రారంభించిన చోటనే ఉండినవి.

2 రెళ్లలో-వంట, పాకనాడు, పెలనాడు, దేసూరు, మోటాటి, కొణిదె మొదలైన అంతర్భేదాలు ఎన్నో గలవు.

# రే

రేగడి భూమినీ, రెడ్డినీ చేవిడువరాదు

రేగుకంపపై గుడ్డవేసి తీసుకొన్నట్లు.

[1]రేగుచెట్టు కింద గుడ్డివాని సామ్యము.

రేగుచెట్టు కింద ముసలామెవలె.

రేగుబండ్లకు ముత్యాలమ్ముకొన్నట్లు.

రేజీకటి మొగుడికి గుడ్డి పెండ్లాము.

రేపటికి కూటికి లేదని రేయిబవలు వ్యసనమందనేల.

రేపటి నెమిలి కంటె, యీనాటి కాకి మేలు.

రేపల్లెవాడలో పాలమ్మినట్లు.

రేపు అనే మాటకు రూపులేదు.

రేవతి వర్షం రమణీయం.

రేవులోని తాడి అడ్డుచేటు.

# రై

రైతు పాడు, చేను బీడు.

రైతు బీదగాని, చేను బీదగాదు.

రైతులెక్క చూస్తే, నాగలికూడా మిగులదు.

రైతు క్షేమం రాజు భాగ్యం.

---

1. ఒక ఊరిలో పురాణం చెప్పుచుండగా, ఒక గుడ్డివాడు ఒక రేగుచెట్టుక్రిందచేరి, అక్కడ వారు నవ్వగా, ఇక్కడ ఏదు గాలికి చెట్టుకొమ్మలు కదలగా తామూ నవ్వుచుండి వాడట.

## రొ

రొండూ రెండే, [1]తొంటికి పుండ్లే!

రొంపికఱువు రోతబుట్టించి, వరపుకఱవు [2]ఒరగబెట్టుతుందా?

రొక్క మిచ్చినవాడే రేవెలదికి మన్మథుడు.

[3]రొట్ట కట్టె దేశంలో పుట్టగోచివాడే భాగ్యవంతుడు.

రొట్టెకు ఏరేవైతేనేమి? (కొరకను)

రొట్టె తిని, రోసినావుకాని, నానివంకచూడు నా తమాషా.

రొట్టెలవాడి పనికంటె, ముక్కలవాడి పనిమేలు.

రొట్టె లేదు గాని, నెయ్యుంటే అద్దుకు తిందును-అన్నాడట.

రొట్టె విఱిగి నేతిలో పడ్డట్లు.

రొయ్యకు లేదా బారెడు మీసం?

## రో

రోకట చిగుళ్లు కోసినట్లు.

రోకలి చిగురు పెట్టినట్లు.

రోకలి తూలితే చుట్టాలు వస్తారు.

రోకలి పోటు-దాసరి పాట.

రోగ మంటే వచ్చిందిగాని, పాలు ఎక్కడినుండి వస్తవి?

రోగము ఒకటి, మందు ఇంకొకటి.

---

1 తొంటికి - వడుముకు.

2 ఒరగబెట్టు = కారునట్లు పాత్రయు ఏటవాలుగా పెట్టుట; లాభం కలుగజేయుట.

3 రొట్ట = పచ్చిఆకు ఎరువు.

రోగానికి మందుగాని, ఆయుర్దాయానికి మందులా?
రోగాలలో [1]గురక ప్రమాదం.
రోగాలు మనుషులకు గాక మాకులకు వస్తవా?
రోగికి కోప మెక్కువ.
రోగి కోరిందీ పాలే, వైద్యుడు చెప్పిందీ పాలే.
రోగిష్టికి పాపిష్టి కావాలి.
రోజులు మంచివని పగలే దొంగతనానికి బయలుదేరినట్లు.
రోజులు మంచివని పొద్దస్తమానం దొంగిలించినట్లు.
రోటిని చూచి పాట పాడాలి.
రోటి పాట, రోకటి పాట (మార్పులేని వనుట).
రోటిలో తలదూర్చి, రోకటి పోటుకు వెఱచినట్లు.
రోతలకు రోత ముదిమి.
రోలు కఱ వెఱుగదు.
రోలుకు ఒకవైపు, మద్దెల కిరువైపులా దెబ్బలు!
రోలు పగిలినా లొద్దె బాగా బిగిసినది అన్నట్లు.
రోలు పోయి మద్దెలతో మొర పెట్టుకున్నట్లు.
రోళ్లు పాడినట్లా? రోకళ్లు పాడినట్లా?
రోసం లేని బంటుకు మోసం లేదు.
రోసం లేని మాశికి మీసమెందుకు.
రోసాన సాయబు రొట్టెన్నర తిన్నాడట!
రోసి వేసినది రాశికి వచ్చింది.
రోషానికి పోయిన రొండ్లెగుసవు.
రోషానికి రోలు మెడను కట్టుకున్నట్లు.
రోహిణి ఎండకు రోళ్ళు పగులును.

1 గురక = పశువ్యాధి.

రోహిణికార్తెలో విత్తుట రోటిలో విత్తుట.
రోహిణికార్తెలో విత్తులు రోయక వేస్తారు, మృగశిరలో ముంచి పోస్తారు.
రోహిణిలో జొన్నలు - సాహిణిలో గుర్రాలు.
రోహిణిలో రోకళ్లు చిగిర్చునన్నా చిగిరిస్తవి, రోళ్లు పగులనన్నా పగులుతవి - (అటు ఎక్కువ వానలో లేకుంటే ఇటు ఎక్కువ ఎండలో).
రోహిణిలో విత్తనం, రోళ్లు నిండని పంట.



# రౌ

రౌతు కొద్దీ గుఱ్ఱము.
రౌతు దిగాలంటున్నాడు, గుఱ్ఱం ఎగరవేయా (పడదోయ్యాల) లంటున్నది.
రౌతు మెత్తనయితే గుఱ్ఱం మూడుకాళ్ళతో నడుస్తుంది.



# అ

అంకాడ నేర్చినమ్మ బొంకాడ నేర్వదా!
అంకు చదువు చదివి అంకున జెకుదురు.
అంకుటాలికి క్రొత్తడి సుద్దులు హెచ్చు.
అంకటాలి చన్నుకు, సంత సొరకాయకు వచ్చే పొయ్యే వాళ్ళ గోటిగాట్లు తప్పవు.
అంకుతనం యిల్లెక్కి కూత వేస్తుంది.
అంకుమగడు కడుపునొప్పి ఎఱుగడు.
అంకుముండ బజారు రచ్చకు వెరచునా, వీరపతివ్రత వెరచుగాని.

అంకుమగడు వీపుమన్ను దులిపి పోవునా?
అంకులసాని రాగం తీస్తే, రల్లిబండ తాతలింగం కడకు నడుస్తుంది.
అంకు సాగితే పెళ్లెందుకు?
అంపాన కోసి రాచినకొలది గంధపుచెక్కకు వాసన ఎక్కువ.

---

## ఔ

ఔతిలో నార తీసినట్లు.
ఔతికంపు గట్టి రాయలసీమ కోడి.
ఔతి టెంకాయవలె.
ఔతిబొమ్మకు చక్కలిగింతలా? (గిలిగింతలా?)
ఔయి గుద్దనేల? చేయి నొవ్వ నేల?
ఔయివోలె ఉంటే రాసికొందుము, పూవువోలె ఉంటే పూసికొందుము.
ఔల (కొట్టిన) రువ్విన వానిని పూల రువ్వుతారా?
ఔళ్ళు తిని, ఔళ్ళు అరిగించుకొంటాడు.

---

## ఔె

ఔెక్క ఆడితే గాని, డొక్క ఆడదు.
ఔెక్కల కష్టం, బొక్కల పులుసు.
ఔెక్కలు పెరికిన పిట్ట (కోడి) వలె. (ఈకలు పెరికిన కోడివలె)
ఔెక్కలు విరిగిన పక్షివలె.
ఔెప్పలతో దీపాలు ఆర్పినట్లు.

# ల

లంక కాల్చినవాడు రాముడి లెంక.

లంక(ఘ)నాలలో మనుగుడుపులు తలచుకొన్నట్లు.

లంక మేతకు, ఏటి ఈతకు సరి. (ఏరుదాటి మేసి, తిరిగి యీది దాటే లోపల తిన్నగడ్డి జీర్ణమై పోయినట్లు).

లంక మేత, గోదావరి ఈత.

లంకలో పుట్టిన వాళ్ళంతా రాక్షసులే!

లంఖ(ఘ)నానికి పెడితే పథ్యానికి దిగుతుంది.

లంఘనాలకు పెడితేగాని, పైత్యం వదలదు.

లంచం పెట్టినది మాట, [1]పుంజం పెట్టినది జట్టు.

లంచం లేనిదే మంచ మెక్కడు.

లంచమనే చెట్టుకొమ్మలు నలుప్రక్కలా ప్రాకియుండును.

లంజకు ఒకడే మొగుడా?

లంజకు నిగ్గు, సంసారికి సిగ్గు ఉండాలి.

లంజకు బిడ్డ తగలాటము.

లంజకు పిల్ల తెగులు, దూదేకుల వాడికి దూది తెగులు.

లంజకు పెట్టినపెట్టు, గోడకు పూసిన సున్నం తిరిగిరావు.

లంజకు మొగమోటం లేదు, పంజకు ధైర్యం లేదు.

లంజకు సిగ్గున్నా ఇల్లాలుకు సిగ్గు లేకపోయినా చెడుతారు.

లంజ కొండెక్కి చూస్తే, మిండగాడు మిణుగురుబూచి మాదిరి కనబడ్డాడట.

లంజకొడుకు తండ్రికి తద్దినం పెట్టినట్లు.

లంజ చెడి ఇల్లాలయినట్లు.

---

1 పుంజం=కొన్ని నూలుపోగుల మొత్తము.

లంజదాని కొడుకు లంజల కిచ్చును.

లంజదాని మాటలు పట్టుకుని ముందలి వాగులో పండితే, వాగొచ్చి వాడు కొట్టుకపోయినాడట!

లంజను లంజాఅంటే, రచ్చకెక్కుతుంది, ఇల్లాలిని లంజ అంటే, ఇంట్లోకి దూరుతుంది.

లంజ పిత్తాళ్ళకు పెట్టి, ఆకాశం చూసిందట!

లంజ పుంజాయె, మిండడు లుప్తాయె.

లంజ బిడ్డకు తండ్రెవరు?

లంజ మంచానికి తలతట్టేమి? (తలదాపేమి) కాళ్ళ తట్టేమి?

లంజ ముదిరినా, ముంజ ముదిరినా, బీర ముదిరినా పనికిరావు.

లంజ మెత్తనైతే, పోతూ పినతండ్రిని లేవగొట్టి పోయినాడట.

లంజల కలువాయి, రంకుల కల్లూరు మధ్య. తయిదిపాటి రెడ్లొచ్చి తగువులు తీర్చినారట.

లంజ లగ్గం (లగ్నం) చెరిస్తే, మాలెత (మాలది) మగ్గం చెరిచిందట.

లంజ లజ్జుండి (లజ్జకుండి) చెడితే, ఆలు లజ్జలేక చెడుతుంది.

[1]లంజ లేకపోతే గుడి రంజిల్లదు, ప్రజల మనసు రంజిల్లదు.

[2]లంజా! అంటే, లక్ష్మీదేవి అన్నట్లగునా?

లంబకుచాలింగనంకంటె లికుచాపాదతాడనం మేలు.

లక్క జొచ్చిన నగ - కుక్క జొచ్చిన యిల్లు.

లక్కలేని నగ, [3]బొక్కలేని మాంసం.

లక్కవంటి తల్లి, తౌడువంటి బిడ్డ.

లగ్గ పగ్గం పెట్టు చిక్కింది.

1 లంజ = దేవదాసి, గుడిచేటి.

2 లంజ = లం = పీటయందు, జ = పుట్టినది_లక్ష్మిఅని.

3 బొక్క = మూలగెముక.

లగ్గమంటే పగ్గ మన్నట్లు.
లగ్నంలో తుమ్మినట్లు.
లచ్చ ఉంటే కోటి లక్షణాలు.
లచ్చి గాజులకు సంతకు చీటి వ్రాసినట్లు.
లడాయి వచ్చినప్పుడా కత్తులు చేసుకోవడం?
లద్దిలో మాణిక్యం (దొరికినట్లు).
లక్షణం చెడితే అవలక్షణం.
లక్షణం పలుకరా పెళ్ళికొడుకా! అంటే, [1]అయిరేని కుండ పడవేరు వక్కలు అన్నట్లు.
లక్షణాలు గల బావగారికి రాగి మీసాలు, అవలక్షణాలు గల బావ గారికి అవి లేవు.
లక్ష నక్షత్రాలైనా ఒక చంద్రుడు గాడు.
లక్షబుద్ధులు చెప్పినా, లంజబుద్ధి మానదు. (మారదు)
లక్షభక్ష్యాలు భక్షించే కుక్కకి ఒక్కభక్ష్యం లక్షమా?

## లా

లాకు ఏత్వము, దాకు కొమ్ము—అననివాడు. (లేదు అనుట)
లాడం దొరకగానే గుఱ్ఱం దొరికినట్లా?
లాభం గూబలలోకి వచ్చింది.
లాభంలేని శెట్టి వరదకు పోడు.
లావుమీద వంపు తెలియదు.
లావులేని చేను – సేగ లేని ఆవు.

1 అయిరేని = అరివేణి.

## లి

లింగధారికన్న దొంగలు లేరయా.

లింగధారులతో సంబంధం గంగలో దూకినట్లే.

లింగం కట్టగానే పిడుగు అన్నట్లు.

లింగిపెళ్ళి మంగిచావుకు వచ్చినట్లు.

---

## లె

లెక్కలు చూచిననాడు తిక్కలు తిరుగుతాయి.

లెక్కలు చూచిననాడు బొక్క పగులును.

---

## లే

లేక లేక ఒక కూతురుపుడితే అది [1]బసివి అయినదట.

లేక లేక ఒక లోకాయపుడితే, లోకాయ కన్ను లొట్టపోయింది.

లేకుండా చూచి, పోకుండా పట్టు.

లేచినాడోయ్ మగధీరుడు అంటే, అందుకుకాదులే అల్పాచమనానికన్నాడట! (ఒకసభలో)

లేచిపోతూ, అత్తా! నీకొడుకు ఆకలితో ఉన్నాడు అన్నదట!

---

1 బసివి = రాయలసీమలో కొన్నిసంసారి కుటుంబాలలో మొదటబుట్టిన కూతురును పెండ్లిపేరంటంలేకుండా, బసవేశ్వరునిపేర వదలివేయుదురు. ఈమెకు గొప్ప గౌరవం. రానురాను దేవదాసీలవలె ఉంపుడుకత్తె అయిపోవొచ్చినవి. కాబట్టే బసివి అంటే వ్యభిచారిణియై గౌరవమర్యాదలను పోగొట్టుకొనినవి. బసివిబిడ్డలకు తండ్రిసొత్తులో భాగంగూడ ఉండేది. దేవదాసి విధానంవలె యీ ఆచారముగూడ అంతరించిపోయినది.

లేడి కడుపున పులి పుట్టునా.
లేడికి లేచిందే ప్రయాణము.
లేడికి లేచిందే పొద్దు.
లేడి దారికేది కాళ్లులేకగాదు, కాలంగాక.
లేడిని చూచినవాళ్ళంతా వేటగాళ్ళే.
లేదంటే పోతుందా పేదల మునుక ?
లేనమ్మకు ఊపిరి పోతుంటే, ఉన్నమ్మ సీట్లు వెళ్ళబోసిందట!
లేని దాతకంటె, ఉన్నలోభి నయము.
లేని త్యాగికన్నా ఉన్నలోభి మేలు.
లేనిదానికి పోగా, ఉన్నది ఊడి (ఊడ్చుక) పోయిందట.
లేనిపోని పీకులాట, చావడిదాకా గుంజులాట.
లేని బావకంటె, గుడ్డిబావే మేలు.
లేనివాడు లేక ఏడిస్తే, ఉన్నవాడు తినలేక ఏడ్చాడట!
లేనివానికి తెంపు, ఉన్నవానికి మొండి. (పిసినారితనం)
లేబరముకాదె బిడ్డలులేనిబ్రతుకు!
లేవదీయరా తంతాను అన్నాడట!
లేవలేని అత్తకు వంగలేని కోడలు.
లేవలేని గొడ్డు బోరగలకు (రాబంధులు) అలుసు.
లేస్తే మనిషినిగాను మూటబెట్టి పొమ్మన్నాడట. (గుంటలో కూర్చుండిన కుంటిదొంగ)

## లొ

లొట్టిపిట్ట కూల రోకళ్ళతోగాని పోదు.
లొల్లిలో మల్లిగాని పెండ్లి.

## లో

లోకము మాయను మాకుదున్నదే.

లోకాన్ని (లోకపునోరు) మూయను మూకుదున్నదా.

లోకులు కాకులు.

లోకులు [1]పలు(ల)గాకులు.

లోకులెల్ల వెఱ్ఱిపోకిళ్లు బోదురు.

లోకువదానికి నూకల జావ.

లోగుట్టు పెరుమాళ్ళ కెరుక.

లోన వికారం. బయట శృంగారం.

లోపల [2]ఊబి, పైన పూరికమ్మిన పాదునూయి. (దుర్జనుదు)

లోపల కంపు, వెలుపల సొంపు.

లోపల లొటలొట, మీద (బయట) మిటమిట.

లోభికి ధర్మచింత, వెఱ్ఱివానికి వివేకము దూరము.

లోభికి నాలుగందాల నష్టం.

లోభికి మాట నష్టి.

లోభి గడన సుంకరులకు వర్ణసంకరులకు.

లోభి బీదకంటె బీదు.

లోభి సొమ్ము లోకులపాలు.

లోలోపల లొట్టి, నా మొగుడు విన్న కొట్టి.

[3]లోవి మూయవచ్చును గాని, లోకమునోరు మూయలేదు.



1 పలుగాకి - పోకిరి.

2 ఊబి = ఉబ్బురి. (Quick Sands)

3 లోవి = అన్నమువండు. వెడల్పు మూతిగల మట్టికుండ.

# వ

వంకర కట్టె కింగలమే మందు.
వంకరటింకర కాయలేమిటి ? అంటే, చిన్ననాడు అమ్మిన చింత కాయలు అన్నట్టు.
వంకరో టింకరో వయసే చక్కన.
వంకాయ తమ్ముడు వాకుడు కాయ.
వంకాయ దొంగిలించిన వాడు ఓంకాయకు రాడా !
వంకాయరుచి తోటవా డెఱుగును, అరటికాయ రుచి రాజెఱుగును.
వంకాయ లేనమ్మ డొంకపట్టుక వేళ్ళాడిందట.
వంకాయవంటి కూర లేదు, శంకరుని వంటి దైవమూ లేడు. (లంకాధిపువైరివంటి రాజు)
వంగకు ముదురు నాటు, అరటికి లేత నాటు.
వంగతోటకాడ మాత్రం వదినా (బావా) అనవద్దు అన్నట్లు.
వంగతోటలో గ్రుడ్డివాని భాగవతం వలె.
వంగతోట వానికి కను గ్రుడ్డి, ఆకుతోట వానికి చెవుడు.
వంగ ముదురు - వరి లేత.
వంగ లేనమ్మ [1]టొంక పట్టుకొని ఏడ్చిందట.
[2]వంగసములో పుట్టినది, పొంగలి పెట్టితే పోతుందా ?
వంగితే తెలుస్తుందమ్మా ! వరిమడి కలుపు, నిలబడినవానికి నీళ్లు కారుతాయా ?
వంగినవాని కింద మఱి వంగినవానికి వట్టలే తగులును.
వంగుని వంకాయ, తొంగుని దోసకాయ తిన్నాడు అన్నట్లు.

---

1 టొంక = టంకం.
2 వంగసము = వంశము. (వంగడము)

వంచని కాలి ధర్మం నా ఒడిలో ఉన్నదత్తా! కావక నా కాళ్లు తగిలి సీ కళ్లు పోయినవి.

వంటంతా అయినది కాని, వడ్లు ఒక (వాటు) పొలుపు ఎండవలె.

వంటఇంటి కుందేలు ఎక్కడికి పోతుంది!

వంట ఇంటిలో చిలుకకొయ్య మినహాయింపు.

వంటఇల్లు కుందేలు పొచ్చినట్లు.

వంట చేయ కెట్లు వంటక మమరురా.

వంట ముగిసిన తర్వాత పొయ్యి మండుతుంది.

వంటలక్కను వయలుబండిమీద తెచ్చి, తోటకూరకు ఎసరెంత? అంటే, చంక చేతెడు పెట్టమన్నదట!

వంటాపె అని తెచ్చుకుంటే ఇంటాపై కూర్చున్నదట.

వండ నింటికి అగ్నిబాధ.

వండని కూడు, వడకని బట్ట. (చాకలిది)

వండమని అక్కకాళ్ళకు మొక్కవలె, వినుమని (తినమని) బావ కాళ్ళకు మొక్కవలె.

వండ లేనక్కకు వగపులు మెండు, తేలేనన్నకు తిండి మెండు.

వండవే పెండ్లికూతురా! అంటే, కుండ తీసుకొని నీళ్ళకు వెళ్లుతాను అన్నదట!

వండవే పేరక్కా! అంటే, మందిని చూస్తూ మంచినీళ్లు తెస్తా నన్నదట!

వండా లేదు, వార్చా లేదు, ముక్కున మసెక్కడిదే అన్నట్లు.

వండిందే తినెనో, గంజితోనే పోయెనో?

వండినంతలోనే కుండకు దొరయుగు.

వండినంతవరకుండి, వార్చేలోపల పోయినట్లు.

వండిన కుండలో ఒక్క మెతుకే పట్టిచూచేది.

వండినమ్మ కంటె, దండుకున్నమ్మ మేలు.
వండుకున్నమ్మకు ఒకటే కూర, అడుక్కుతినే అమ్మకు అరవై ఆరు కూరలు.
వండుతూ ఉండగా వాంతి వస్తున్నది అంటే, ఉండి భోజనం చేసి పొమ్మన్నదట!
వండేది అడ్డెడు, ఓగెంగా తిను అల్లుడా! అంటే, అన్నంపై ద్వేష మెందుకు? ఉన్నదంతా ఊడ్చిపెట్టత్తా అన్నాడట.
వంతుకు మా వక్కివాడు, పాలికి మా బక్కవాడు.
[1]వంతుకు గంతేస్తే, ఒరు(రి)బీజం దిగిందట.
వంతు పెట్టుకున్నా, వాత వేసుకొనేదాని కిచ్చి పెట్టుకోవాల.
వంద మాటలు మాటలాడవచ్చు, వక్కనికి పెట్టేది కష్టం.
వంపున్న చోటికే వాగులు పోతాయి.
వంశం బొట్లంతమ్మా! కడివెడు కల్లెట్లమ్మా! వడబోసి అక్కడ పెట్టమ్మా! వడవకున్న బొట్టుబెట్టమ్మా! అందిట.
వంశ మెఱిగి వనితను, వన్నె నెఱిగి పశువును కొనవలె.
వక్క కొఱకి ఒక్కప్రొద్దు చెడుపుకొన్నట్లు.
వక్క పేడిత్తునా, వనము దాటింతునా, చెక్క పేడిత్తునా, చేను దాటింతునా?
[2]వక్కలింత తప్పిన వగిరింత, వగిరింత తప్పిన వగిరింత.
వక్రమా వక్రమా! ఎందుకు పుట్టినా వంటే, సక్రమైన వాళ్ళను వెక్కిరించను - అన్నదట!
వగచినట్టే ఉండాల, వాడి ఆలితాడు తెగినట్టే ఉండాల.
వగచినట్లూ ఉండవలె, వాత పెట్టినట్లూ ఉండవలె.

---

1 వంతు = వందెము బెట్టుకొనుట.
2 వక్కలింత = వేవిళ్ళు.

వగలమారి వంకాయ సెగలేక ఉడికినదట!

వగలాడికి ముసలాతడు మగడైతే దాని వంత యింతింతా!

వగలాడీ; నీకు మగ లెందరే? అంటే, తొలి మగనితో తొంభై మంది అందిట!

వగలాడి, నీకు మొగుళ్లెందరే? అంటే, తోలాడిగాడితో తొంబయి మంది అన్నదట!

వగలు ఎందు కంటే, పొగాకు కోసం అన్నట్లు.

వగలేని మొగుడా పగ లెందుకు వచ్చినా వంటే, అందుకు కాదులే అగ్గికి వచ్చినా నన్నాడట.

వగలేనివాడు లంజరిక మాడితే, ఇంటికి దుగ్గాని పంపకం.

వగ్గు కోతికి సివమెత్తినట్లు.

వచ్చింది క్రొత్త, వదిగి ఉండు పత్త.

వచ్చిన కర్మం వద్దంటే పోతుందా?

వచ్చిన కోడలు నచ్చితే, ఆడబిడ్డ అదిరిపడిందట.

వచ్చినవాడు వరాచుట్టము, మరునాడు మాడచుట్టము, మూడవనాడు ముటికి చుట్టము.

వచ్చిన పేరు చచ్చినా పోదు.

వచ్చినమ్మకు ఒయ్యారము, రానమ్మకు రాగాలు.

వచ్చిన వాదు చచ్చినా పోదు.

వచ్చినవారికి వరమిస్తాను, రానివారికి రాయి వేస్తాను.

వచ్చిపోతూ ఉంటే బాంధవ్యము, ఇచ్చి పుచ్చుకుంటూంటే వ్యవహారము.

వచ్చీపొయ్యేవాళ్లు సత్రం గోడకు సున్నం కొడుతారా!

వచ్చీరాని చన్ను - పేరీ పేరని పెరుగు.

వచ్చీరాని మాటలు, ఊరీ ఊరని ఊరగాయ రుచి.

వచ్చీరాని మాట వరహాల మూట.

వచ్చు కీడు వాక్కే చెప్పును.

వచ్చేటప్పుడు ఉలవ, పొయ్యేటప్పుడు నువ్వు.

వచ్చేటప్పుడు తీసుకు రారు, పొయ్యేటప్పుడు తీసుక పోరు.

వచ్చేవారికి తట్ట దింపి, పొయ్యేవారికి తట్ట ఎత్తుట మంచి పని.

వచ్చేవారికి స్వాగతం, వెళ్ళేవారికి ఆసీమాంతం.

వజ్రానికి సాన - బుద్ధికి చదువు.

వట్టల నొప్పి చీమ కేమి తెలుసు ?

వట్టలు గీరుకొన్నంత సుఖం, వైకుంఠంలో కూడ ఉండదు.

వట్టలు వాసిన వీరారెడ్డి వడ్ల ధర ఎంతంటే, అవి ఉంటే ఇవి ఎందుకు వాస్తవి - అన్నాడట.

వట్టింటికి [1]పోచిళ్లు చల్లినట్లు.

వట్టి అమ్మి కెందుకురా నిట్టూర్పులు ?

వట్టిగొడ్డుకు (గేదెకు) అరుపు లెక్కువ, వానలేని మబ్బుకు ఉరుము లెక్కువ.

వట్టి గొడ్డుకు అఱ్ఱు లావు.

వట్టి చేతులతో మూరవేసి ఏమి లాభం !

వట్టి నిందలు చెప్పితే గట్టి నిందలు వచ్చును.

వట్టి నేలలో కప్ప అఱచినా, నల్లచీమ గుడ్డు మోసినా వాన తప్పదు.

వట్టి మాటలవల్ల పొట్టలు నిండునా ?

వట్టి ముట్టి అయితే మాత్రం ఉట్టినే (ఊరక) వస్తుందా ?

వట్టి విశ్వాసంతోనే ఏ పని కాకపోయినా, అది లేకపోతే మాత్రం ఏ పనీ కాదు.

---

1 పోచిళ్ళు = శకునము చూచుటకై ఇరుగు పొరుగువారిండ్ల మీద అక్షతలు వీచ్చు చల్లి, వారాడుకొను మాట ఉపశ్రుతిగా గ్రహింతురు.

వడగండ్లు పడితే వఱపు.

వడికిం దంతా ప త్తి అయినట్లు.

వడ్డించి సద్ది తీసుకో.

వడ్డించేవాడు (వారు) మనవారైతే కడపటి బంతిన కూర్చున్నా ఒకటే. (మేలు)

వడ్డీ ఆశ మొదలు చెఱచును.

వడ్డీ ఉప్పర సభామధ్యే, వైదికః పండితోత్తమః. (సాలి జాంద్ర సభా మధ్యే సాతనిః పండితోత్తమః.)

వడ్డీకి చేటు, అసలుకు వట్టము.

వడ్డీ ముందఱ వడిగుఱ్ఱాలుగూడ పాఱవు. [మేలు.

వడ్డవానికి బిడ్డఅయి పుట్టేదానికంటె ధరణీపతికి దాసి అయి పుట్టేది

వడ్లోడికి పెండ్లాము పెద్దది కావాల (కొట్టవత్తి పనిచేయును), కాపోడికి గొడ్డు పెద్దది కావాల.

వడ్లగాదిలో పందికొక్కు వలె.

వడ్లగింజలోది బియ్యపుగింజ (అనుకొన్నంత రహస్యం కాదనుట).

వడ్లతోకూడ [1]దాగర (తట్ట) ఎండినట్లు.

వడ్లరాసి వరదకు పోతుంటే, పాలోణ్ణి కనిపెట్టి ఉండమన్నాడట.

వడ్లరాసి వరదకు పోయినా, వానకు కఱవు రాదు.

వడ్లవాండ్ల పిల్లేమి జేస్తున్నదంటే, వలకబోసి ఎత్తుకుంటుందన్నాడట.

వడ్లు ఏడుం, పిచ్చుకలు పందుం.

వడ్లు, గొడ్లు ఉన్నవానిదే వ్యవసాయం.

[2]వత్తు పోయిలో పెట్టి, [3]తీన పోయిలో తీసినట్లు.

---

1 దాగర = పెద్ద చేట.

2 వత్తు = పొంతకుండ పొయ్యి.

3 తీనెపోయి = తిన్నెపొయ్యి - ప్రక్కన గట్టుతో వేసినది.

వత్తులు చేయాలంటే ప్రత్తి కావాలి.

వదినాలు పాడకుంటే, వరిబువ్వ (కూడు) ఎవరు పెడతారు.

వదినెకు ఒకసరి, గుంజకు బిగుసరి.

వదనె చందాన వచ్చి పావడ వదలించిపోయినట్లు.

వద్దన్న పని వాలాయించి చేస్తారు.

వనం విడిచిన పక్షి, జనం విడిచిన మనిషి.

వనవాసం చేయాలేరు, వంగి వంగి తిరుగాలేరు.

వని(లి)కెల పట్టు విత్తితే వజ్రాల పంట కంట చూస్తాము.

వనితగాని. కవితగాని వలచి రావాలి.

వనిత లేనప్పుడు విరక్తి మంచి దనినట్లు.

వన్నె కాని గంజి ఈగలపాలు.

వన్నెకు సున్నం పెడితే, [1]వమ్మెక పుండయిందట,

వన్నె చీర కట్టుకొన్న సంబరమే కాని, వెత్తికుక్క కఱచిన దెఱుగదు.

వన్నెబట్టలమ్మ వలపుడు కన్న, గుడ్డబట్టలమ్మ కులుకుడే లావు.

వన్నె మాదిరే వన్నె పుడుతుంది, ఒళ్లు వాచేది ఎఱుగదు.

వన్నెలమ్మను వండబెట్టిన, ఇంటిరాజులను పండబెట్టిందట!

వయసు కలిగిననాడె వనిత వలపు.

వయసు కురకుర, బాతు కురకుర.

వయసు తప్పినా ఒయ్యారం తప్పలేదు.

వయస్సు ముసలెద్దు, మనస్సు కోడెదూడ.

వరదలు వస్తాయని వర్షా లాగవు.

వరమైన పేరు గలిగిన గంగరావికి వందన మొనర్చగానే వర
మొసగునా?

వరపుకు వారిధు లింకునా?

---

1 వమ్మెక = పరిహాసం.

[1] వరవుడి ఇల్లాలౌనా, వాపు బలుపగునా.

వరహాకన్నా వడ్డీ ముద్దు, కొడుకుకన్న మనుమడు ముద్దు.

వరహాను ముప్పావు చేసుక వచ్చినా, మా యింటాయన ఎద్దుల బేర
గాడైనా డంతేచాలు! అన్నదట.

వరికి ఒక వాన, [2]ఊవరకు ఒక వాన కురుస్తుందా!

వరికి [3]వాక, దొరకు మూక.

వరి చెడి ఊదర బలిసినట్లు.

వరి పండని ఊరు – దొర యుండని ఊరు ఒకటి.

వరిపట్టు కడితే వర్షం (వాన) గొప్ప.

వరిపొట్టకి పుట్టెడు నీరు (కావలె).

వరి మొలకా, మగ మొలకా ఒకటి.

వరి వడ్డు కేసి, తుంగ నాటుపెట్టినట్లు.

[4]వరుగుతో దాగరగూడ ఎండవలసినట్లు.

వరుసను దున్నితే వజ్రాలిస్తా నంటుంది భూమి.

వరుసలెల్ల వల్లకాటిలో పెట్టి, వదిన పిన్నమ్మా! గంపెత్తు.

[5]వర్లి వర్లి వాడు పోయె, వండుకతిని వీడుపోయె.

వలపుకు మెలపులు, వట్టిగొడ్డుకు అలపులు మెండు.

[6]వర్షెట ఓడ ఉండగా, వరద రూదినట్లు.

వలకంటె ముందు రాళ్లు విసరినట్లు.

వలచి వస్తే, మేనమామ కూతురు పావికా దన్నట్లు.

---

1 వరవుడి = దాపి.

2 ఊదర = వరిపైరులో మొలచేకలుపు. దీని గట్టిగింజలు ధాన్యంలోగలపి, ఎంత చెరిగినా పోవు.

3 వాక = వాగు-వంక.

4 వరుగు = పండిన వంకాయ మొదలగువాటిని బద్దలుగకోసి ఎండబెట్టినది. (వంగవరుగు)

5 వరలు = వదరు. 6 వర్లి = వెల్లువ; వరద.

వలపుకు పలుపు దెబ్బలు, వ(ఒ)య్యారికి చెప్పు దెబ్బలు.

వలలో జిక్కిన మెకము చూడుదని వేటకాడు వదలునా.

వల్లకాటి వైరాగ్యం, పురిటాలి వైరాగ్యం. (శ్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం)

వసుక వేయబోయిన, వాతప్పులవాడు తగిలినాడు.

వసుదేవుడు వెళ్ళి గాడిదకాళ్లు పట్టుకొన్నాడట. (చాలని కాలానికి)

వస్తా ఏమి తెస్తావు, పోతా ఏమి ఇచ్చిపోతావు.

వస్తా నన్నదాన్ని, ఇస్తా నన్నవాణ్ణి నమ్మరాదు.

వస్తానయ్యా, బాపనయ్యా! అంటే, వద్దే! ముండా! వర్జముంది అన్నాడట!

[1]వస్తావు పోతావు నాకొఱకు, వచ్చి కూర్చున్నాడు నీకొఱకు.

వస్తుగుణం తెలియనివాడు వైద్యంలో మొనగాడే.

వస్తూ ఇల్లు నింపుతుంది. పోతూ పెరళ్లు నింపుతుంది. (ఆరికె)

వస్త్రహీనము విస్తరహీనము పనికిరావు.

వశిష్ఠుని వాక్కున విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అనిపించుకోవలె.

---

1 గాలపు చేపలవేటగాని, గాలంముల్లుకు కుట్టియున్న ఎఱ్ఱ (భూమిలో దొరికే ఎఱ్ఱటి వన్నటి పామువంటి కీటకము) నీటిలోపల తిరుగాడే చేపతో అన్నమాట ఇది.

ఆ పాటంతా ఇది :

వస్తావు పోతావు నాకొరకు
వచ్చి కూర్చున్నాడు నీకొరకు
వగము చచ్చున్నాను నీకొరకు
వచ్చిన చచ్చేవు నాకొరకు.

ఇది భ్రాంతిలో చిక్కినవారి మాటగా తీసికోవచ్చు.

# వా

వాంతి వస్తే పెదవు లడ్డమా ?

వాకిలి దాటగానే వారణాసి ఎంత దూరమన్నట్లు.

వాక్చాతుర్యములేని వేశ్య, గుణకారములేని లెక్క.

[1]వాగర్త చేలకు వానలే వరవలు.

వాగు నీళ్లు, వనం పత్రి.

వాగులో పోతున్నావే సెట్టీ? అంటే, లాభం లేందే పోతానా అన్నట్టు.

వాగ్దానం ఎందరు అవివేకులనో తృప్తి పరుస్తుంది.

వాగ్దానం చేసేవాడు వాటిని మరచిపోవడం కూడ నేర్చుకొని ఉంటాడు.

వాచినమ్మకు పాచి(సి)నకూడు పెడితే, మాఅత్త పరమాన్నం పెట్టిందని ఇరుగింట పొరుగింట చెప్పుకొన్నదట.

వాడవదినె కేల వావివరుసలు ?

వాడికి [2]నలభై జరిగింది.

వాడికి వీడికి నిప్పుకు ఉప్పుకు (వలెఉన్నది).

వాడి కేడట్లాలే గ్రంథమయింది గాని, మనకి పైఅట్లాలు కూడా [వచ్చు.

వాడి తండ్రి, మా తండ్రి సయాం మగవాళ్లు-అన్నట్టు.

వాడిపోయిన పూవుల ముడుచువారుందురా ?

వాడు చెడ్డోడు, తాగుబోతు నాకొక ముంతెడు కల్లు పోయించు అన్నట్లు.

వాడు వట్టి [3]ఇరవైఐదు ఇరవైఆరు.

1 వాగర్త = సముద్రతీరము.

2 నలభై = 40 వ సంవత్సరం నరాళన. అంటే అవమానం జరిగింది.

3 ఇరవైఐదు = 25 వ సంవత్సరం జర, 26 వది వందన, గాడిదకొడుకని.

వాటికి వెరతునా, వీటికి వెరతునా అన్నట్లు.

[1]వాతాపి జీర్ణం-వజ్ర శరీరం.

[2]వాద భ్రష్టుడు, వైద్య శ్రేష్ఠుడు,

వాది నాశం, ప్రతివాది మృతనష్టం, ప్లీడర్ల అదృష్టం, కోర్టువారి ఇష్టం.

వాడు తెచ్చుకోవాలంటే, అప్పు యివ్వమన్నారు.

వాడు లేక ప్రాణం, దాది లేక రాణి పోరు.

వాడు లేక వల్లూరికి పోతున్నాను, ఇరుగుపొరుగు నాసవతుల్లారా! ఇల్లు భద్రం అన్నదట. (గంప ఎత్తండి)

వాడుసుమీ! అప్పిచ్చుట.

వానఉంటే కఱవు, పెనిమిటిఉంటే పేదఱికం లేదు.

వాన ఎక్కువైతే కొంపికరువు, వాన తక్కువైతే వరపు కరువు.

వానకన్న ముందే వరదనా?

వానకు ఎచ్చయిన తేజీ వెరచుగాని ఎనుబోతు వెరచునా.

---

1 ఇల్వలుడు, వాతాపి ఇద్దరు రాక్షసులు, అన్నదమ్ములు. వీ రిద్దరు దుర్గమారణ్య ప్రాంతంలో దారితలన ఇల్లుకట్టుకొని, వచ్చిపొయ్యేవారికి మర్యాదచేసి, వాతాపిని పొట్టేలుగామార్చి, దానిని చంపి ఆ మాంసంతో ఆతిథ్యమిచ్చేవాడు — అన్న అయిన ఇల్వలుడు: తిన్నతర్వాత వాతాపీ అని పిలువగానే, పొట్టలోపలి మాంసం మరలా మానవాకృతినొంది, ప్రాణంపోసుకోని, కడుపుచీల్చుకొని బయటకువచ్చి చచ్చిన అతిథిని వండుకొని ఆరగించేవారు. ఇట్లా జరుగుచుండగా ఒకనాడు అగస్త్యమహాముని ఆ దారిన వచ్చినారు. ఆ రక్కసి అన్నదమ్ములు ఇదే కపటనాటకం ఆడినారు. (భారతం వనపర్వంలో వాతాపిని సంస్కరించి అశనంగా సమర్పించినట్లు, రామాయణ అరణ్యకాండములో మేషముగామార్చి చంపినట్లు ఉన్నది) ఋషి యోగదృష్టితో నిజం తెలుసుకొన్నారు — వాతాపి అని పిలువగానే ఋషి వాతాపి జీర్ణమనగా లోపల జీర్ణించిపోయినాడు. తల్లులు పాలో, మందో పిల్లలకు త్రాగించి యీ మాట అనడం వాలాయం.

2 వాద=రవవాదం చేసినవాడు.

వానకు ముందు ఉఱిమినా, మాటకు ముందు ఏడ్చినా తుదముట్టదు.

వాన కురుస్తున్నది నాయనా అంటే, కురవనీలే అనగా, అట్లనే కురవనిస్తాలే అన్నాడట.

వానతోడ వచ్చు వడగండ్లు నిలుచునా.

వాననాటి వరద, పెళ్ళినాటి పప్పుకూడు.

వానపాటుకు కంటె బ్రామానుపాటుకు ఎక్కువ. (పాటుకు అనే శబ్దంతో చినుకు పడుట)

వాన బడాయి చవిటిమీద, మాల బడాయి పాటిమీద, మొగిడి బడాయి ఆలిమీద.

వాన రాకడ, ప్రాణం పోకడ ఎవరెఱుగుదురు!

వానలకు మఖ(కార్తె) కుక్కలకు చిత్త(కార్తె).

వానలుంటే పంటలు, లేకుంటే మంటలు.

వానలు కురిస్తేనే వసుంధర.

వానలు కురిస్తే వాతలు మాసిపోవు, బిడ్డలు పుడితే ఱంకులు మఱచిపోరు.

వానలు ముంచతవోయ్! ముంచతవోయ్! అన్నాడట జ్యోతిష్కుడు (ఎగగొట్టినా ముంచుటే, ఎక్కువైనా ముంచుటే).

వాన లెక్కడా? అంటే, దానధర్మాలున్న ధరణిలో అన్నట్లు.

వానలేని వట్టి పిడుగువలె.

వాన వచ్చినందుకు వంకపారిందే గుర్తు.

వాని యిల్లాలు దొమ్మరివాని డోలు (ఆడేవాళ్ళందఱు మారి మారి వాయించుచుందురు).

వాపును జూచి, బలుపను కొన్నట్లు.

వాపు బలుపుగాదు-వాత అందము గాదు.

వాపు మానునుగాని, వాతలు మానునా.

వాములువింగే స్వాములవారికి పచ్చిగడ్డిమోపులు ఫలహారము (బరోబరు).

వామ్మ తింటావా? మామా! అంటే, వామ్మపోసను సందుంటే ఒక వడతునకే తిననా అన్నాడట.

వాయిపట్టే సందే ఉన్న, ఒక భక్ష్యమైనా తినేవాడిని.

వారకాంత జనంబులకు వావి గలదె!

వారకాంతలేల వలచెవరూరక.

వారవనిత ధనికు చేరదీయగగోరు.

వారాశిదాటినను శని మారకుడై పట్టి చంపు.

వాలుపై (వాదరపై) నడచినట్లు. (సాము)

వాళ్లు పిల్లనివ్వనన్నారు, నేను చేసుకోనన్నాను.

వావివరుసదప్పి వర్తించి చెడుదురు.

వాసానికి తగ్గ కూసం!

వాసి తరిగితే, వన్నె తరుగుతుంది.

వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తులాభారం తూగితే, కరెడ్ల కామక్క వంకాయలభారం తూగిందట!

వాస్తుగలవారి కోడలు వరహా ఇచ్చి క్షవరం చేయించుకుందట!

వి

వింటే బేగడ (రాగం) వినాల, తింటే మీగడ తినాల.

వింటే భారతం వినాల, తింటే వడలు (గారెలు) తినాల.

వింతలమారికి చండ్లు వస్తే మేనమామకు కండ్లు పోయినవట!

వింత లేనిదే ఆవులింత పుట్టదు.

విందు అయినా మున్నాళ్లు, మందు అయినా మున్నాళ్లు, (మూడ్నాళ్లు).

విందు భోజనం చేస్తే, మిట్టచేనుకు ఒడ్డు (మడవ) వేసినట్లుండాల.
(బిట్టుగా ఉబ్బిపారును).

విందు మర్నాడు మందు (కుందు).

వికారంవాడు దుకాణం పెడితే, వచ్చేగిరాకీ అట్టే మరలిపోయిందట!

[1]వికిరాలలో లేదు, పిండాలలో లేదు.

విక్రమార్కుని వంటి రాజు ఉంటే, భట్టి వంటి మంత్రి అప్పుడే ఉంటాడు.

విగ్రహ పుష్టి, నైవేద్య నష్టి.

విఘ్నేశ్వరుని పెండ్లికి వేయి విఘ్నాలు.

విచిత్రపు పచ్చిపులుసు ఈగలగొట్టి, తాలింపుపెట్టి ఇద్దరని రమ్మంటే, ముగ్గురు వచ్చారట!

విచిత్రం, విన బూటకం! ఆలుగొట్టా మగడేడువ.

విచిత్రపు పులుసుకూర విస్తరను మింగిందట.

విజయుం డనువుదప్పి విరటుని గొలువడా.

విజరానికి తగవు లేదు.

విటుని [2]పచ్చ జూచి తాళలేక తానిటు నిలను దిరుగుట.

విడిచిన ఎద్దు కొట్టందారి చూచును.

విడిచిన గుడ్డ వీదికి పెద్ద.

వడిచినది వీదికిపెద్ద, బరి తెగించినది (విడిచినది) బజారుకు పెద్ద.

విడిచిన ముండకు వీరేశలింగం, తెగించినవాడికి తెడ్డే లింగం.

విడిచిన ముండలకు [3]విడవలూరు.

విడిచిన ముండ వీదికిపెద్ద, బడివిడిచినముండ బజారుకు పెద్ద.

---

1 వికిర = పక్షి.

2 పచ్చ = బంగారు.

3 విడవలూరు = నెల్లూరు, కోవూరు తాలూకాలో ఒక సంపన్నగ్రామము.

విడిచిన లంజ పీదికెక్కితే చావిట్లో వాళ్లు చాటుకు పోయినారట.
విడిచిపెట్టిన ఇంటిలో మఱచిన [1]మంగలు.
విడిపించబోయిన పాముకు పగ, విడిపించకున్న కప్పకు పగ (వగ).
విడివడితే గుఱ్ఱం గాడిదతో సమానం.
విత్తంకొద్దీ విభవము, విద్యకొద్దీ వినయము.
విత్తకుండానే కోస్తా మన్నట్లు.
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత ?
విత్తనం మళ్ళితే, విడవకుండా ఏడేండ్లు సేద్యం చేయమన్నారు.
విత్తనము కొద్దీ మొక్క.
విత్తనములో లేనిది, విశ్వంలో లేదు.
విత్తనము వేసి, పాత్తు కలిపినట్లు.
విత్తనానికి దాపరికం (గుట్టు), విద్యకు వెల్లడి (రట్టు) అవసరం.
విత్తనాలకు పోయిన రెడ్డి, [2]ఓదె లెత్తగా వచ్చినాడట !
విత్తనాలసంచులు మంచివయితే, విత్తపుసంచులు నిండును.
విత్తనా లుంటేనే పెత్తనాలు.
విత్తహీనుడు ధర్మవృత్తి దలచు.
విత్తినకొలది పైరు.
విత్తు ఒకటి వేస్తే, చెట్టు ఇంకొకటి మొలుచునా !
విత్తుకన్న క్షేత్రం మెరుగు.
విత్తుకు వేయి విత్తులు.
విత్తుటకు శుక్రవారం, కోతకు గురువారం.
విత్తు మంచిదయితే కాయా మంచిదగును.

---

1 మంగ = దేవి (అలమేలుమంగ-పూవుపై దేవి).

2 ఓదె = పైరుకోసి ఎండుటకు కయ్యలో వారులు వారులుగా వేసినవి. అవల పీటిని మోపులుగట్టి కుప్ప వేయుదురు. ఈ మోపులు కట్టుటను వనగట్టు టందురు. వనకట్టిన తర్వాత క్రింద రాలిన కంకులను పీదసాదలు ఏరుకొనుటను వరిగ ఏరు టందురు.

విత్తు మంచిదయితే రైతుకు మంచిదగును.

విత్తు ముందా? చెట్టు ముందా?

విత్తులు దీసిన కోడె - యీాకలు పెరికిన కోడి.

వి త్తే చెట్టయ్యేది.

విదియనాడు కనబడని చంద్రుడు తదియనాడు తనకు తానే కన బడుతాడు.

విద్యాప్రసంగముల్వేన రసజ్ఞత లేని రసికుల సభ, సభగాదు గ్రామ రచ్చగాని.

విధవకు తలసుల్లు వెదకినట్లు.

విధవకు మ్రొక్కితే, 'నావలెనే నెయ్యేళ్లు వర్ధిల్ల' మన్నది, రెండో పారి దండం బెట్టితే, 'నా మొగుడు మాదిరే బ్రతుక'మన్నదట.

విధవకు విరజాజి పూదండ కావలెనా? (లేల)

విధవైన మేలు, మగనికి తిథిబెట్టును కథలు వినును తీర్థము లాడును.

విధి వస్తే పోద లడ్డమా?

వినకు అనకు కనకు (చెడ్డవి).

వినయోక్తులు లేని యీావి వ్యర్థము.

వినరాదు, కనరాదు, అనరాదు (చెడ్డ).

వినని బంటుకు వెన్నపూస కూడానా?

వినను కనను రెండేసి యిచ్చి, అనను ఒకటే యిచ్చినాడు - దేవుడు. (చెవులు, కన్నులు, నాలుక; అంటే ఎక్కువగావిని తక్కువగా మాట్లాడాలఅనుట.)

వినయం లోకవశీకరం, విద్య రాజవశీకరం.

వినాయకుడిమీాది భక్తా? ఉండ్రాళ్ళమీాది భక్తా?

వినాయకుని చేసియిస్తావా కుమ్మరీ, అంటే వాడి అబ్బను చేసిస్తాని లింగంచేసి యిచ్చినాడట. (లింగం వినాయుని అబ్బే! కుమ్మరి

'వాడి అబ్బ' అనుటలో వినాయకుని మించినవానిని అని భావం)

విని రమ్మంటే, తిని వచ్చినట్టు.

వినేవాటికి (చెవులకు) కనేవాటికి (కండ్లకు) జెత్తెడే దూరం.

విన్న మాటకంటె చెప్పాకు మాటలు చెడ్డవి.

విన్నమాట కన్నంత నమ్మదగింది కాదు.

విన్నమ్మ వీపు కాలింది, కన్నమ్మ కడుపు కాలింది.

విన్నవన్నీ విశ్వసించవద్దు, విశ్వసించినవన్నీ వెలిబుచ్చవద్దు.

విప్రహస్తము వేదండ హస్తము ఊరుకోవు.

విభూతి పట్టెలు పెట్టుకుంటే, విష్ణుమూర్తి వనుకున్నానే, ఆంజనేయుడి వటోయ్! వెంకటేశ్వర్లూ?

వియ్యంకునికి వీపుదెబ్బలు, వియ్యపురాలికి వీపుదెబ్బలు (నామకరణం).

వియ్యపురాలికి వీపుదెబ్బ, నాకు తోపుదెబ్బ.

వియ్యపురాలి పేరు విసరమ్మ. నాపేరు దంచమ్మ. (విసరు+అమ్మ; దంచు+అమ్మ)

వియ్యపువారింట జాడ్యాలు ఇకిలించినా పోవు.

వియ్యానికి కయ్యం తోబుట్టువు.

వియ్యానికయినా, కయ్యానికయినా సాటి ఉండాల

వియ్యానికి కయ్యానికి సమతవలయు.

వియ్యాలందితే కయ్యాలందుతవి.

వియ్యాలవారింటికిపోతే వీపులమీదనే వస్తుంది (స్ఫోటకం)

విరచుకొని విరచుకొని వియ్యపురాలింటికి పోతే, పలుగురాళ్ళతో నలుగు పెట్టిందట!

విరామం లేని పశువుకు ఊరట లావు.

విరాలికి ఆమనివంటి చుట్టము లేదు.

విరిగిన వ్రేలిమీద ఉచ్చపోయని వాడు, వినాయకుడికి టెంకాయ కొట్టబోతాడా.

విరిగేదానికంటె వంగేదే మేలు.

విరిజాజి పూదండ విధవకేల?

విరిదాస్తే తావి దాగుతుందా?

విరుగుబాటు పైని నూనెబొట్టు, విరచికట్లపైని పెరుగుబొట్టు.

విరోధికి అపశకునం కలిగించను, తన ముక్కు గోసుకొని ఎదురుపడినాడట.

విలుచుటకు ముందే విక్రయించే సులువు చూడాలి.

విల్లమ్ములు కలవారికి చల్లకడవలవారు తోడా?

విశాఖ(కార్తె) కురిసిన విషము పెట్టినట్లు.

విశాఖ చూచి విడువర కొంప. (ఉత్తరజూచి ఎత్తరగంప)

విశాఖ పట్టితే పిశాచి పట్టినట్లు.

విశాఖతో మబ్బులు, మజ్జిగతో భోజనము సరి.

విశాఖతో మేఘాలు, ప్రసూతితో యవ్వనము సరి.

విశాఖ వరదలు-సంక్రాంతి మబ్బులు.

విశేషము లేనిది వింతేలా పుడుతుంది?

విశ్వాసం తప్పిన పీనుగు మోసినవాడిని పట్టిందట!

విషపాళపు విత్తు, నేపాళపు గింజ.

విషములో పుట్టిన పురుగుకు విషమే ఆహారం.

విషములో పుట్టిన పురుగు విషములోనే జీవిస్తుంది.

విషయంలేని వక్తకు వాగాడంబరం ఎక్కువ.

విషానికి విషమే విరుగుడు.

విసరగా విసరగా ఒకరాయి, తిట్టగా తిట్టగా ఒక తిట్టు తగులును.

విసిరినరాయి గాలికి పోయినట్లు.

విసరురాయి గాలికి కొట్టుకపోతే, విస్తరాకు సంగతి చెప్పాలనా?
విస్తరి(ర) కొదవా, సంసారపు కొదవా తీర్చేవా రెవరు?
విస్తరి చిన్నది, వీరమ్మ చెయ్యి పెద్దది.
విస్తళ్లు ఎత్తమంటే, భోంచేసిన వారెందరని లెక్కపెట్టినాడట.
[1]విప్పన్న చెప్పినదే వేదం.



## వీ

వీధిలో చెప్పుతో కొట్టి, ఇంట్లో కాళ్లు పట్టుకున్నట్లు.
వీధిలోన దిరుగ వెలది పురుషుడౌనె!
వీపు గుద్దరా శిష్యా అంటే, నీకంటె తక్కువ తిన్నదెవరు అన్నాడట.
వీపు తోమరా! అంటే, ఇక్కడ డొక బొక్క ఉన్నదే అన్నాడట.
వీపున తన్నుతుంటే, యింటి వెనుక చప్పుడన్నట్లు.
వీపుమీద కొట్టవచ్చును గాని, కడుపుమీద కొట్టరాదు.
వీరక్క పెండ్లిలో పేరక్క శోభనం.
వీరన్న ముందు బసవన్న, గౌరి ముందు గణేసుడు.
వీరభద్రపళ్ళెమునకు హనుమ త్పళ్ళెము.
వీరభోగ్యా వసుంధర.
వీరోచిత కార్యాల సుగంధమే కీర్తి.
వీ లెఱిగి మాట, కీ లెఱిగి వాత.
వీసం ఇచ్చి, వాసానికి ఒడ్డినట్లు.
వీసం ఖర్చు కాకుండా నోము నోముతాను, ఆశపడకండి అడవ నా బిడ్డల్లారా!

1 ఇంద్రగంటి విప్పన్నశాస్త్రి గొప్ప వేదాంతపండితుడు. ఇతను అప్పయ్యశాస్త్రి తమ్ముడు.

వీసం గల అమ్మి విడువా ముడువా, కాసుగల అమ్మి కట్టాపెట్టా.
వీసం గల రెడ్డికి విడువా ముడువా సరిపోయింది.
వీసానికి వాసిన్నర అయితే, దూలన్నర ఎంత!
వీసెడు చింతపండు [1]పాసంగానికే సరిపోయింది.

---

## వృ

వృథా బోడ (సన్యాసి) వైతివి, పొందవైతివి.
వృద్ధనారి పతివ్రత.
వృద్ధ వైద్యం - బాల జోస్యం.
వృష్టికి ప్రమాణం ఉత్తరహస్తలు. (కార్తెలు)

---

## వె

వెంకటరెడ్డే కంకి కొరికితే, వెంటవచ్చినవాం డ్లూరకుంటారా?
వెంకన్న తిండి జూచిన అంకాళమ్మకును సైత మరగుండె పడున్.
వెంకయ్య వేమవరము వెళ్ళనూ వెళ్ళాడు, రానూ వచ్చాడు.
వెంకి పెండ్లి సుబ్బి చావు కొచ్చింది.
వెంట పోయినా వెనుక పోరాదు.
వెంట పోయైనా చూడాలి, యింట ఉండైనా చూడాలి.
వెంట రావద్దంటే, ఎత్తుకొమ్మని ఏడ్చాడట! (బిడ్డ)
వెంట్రుకకన్న ఏడుపాళ్లు సన్నం, రోకలికన్న ఏడుపాళ్లు లావు.
వెంట్రుక పట్టుకొని ప్రాకులాడినట్లు.
వెంట్రుకలు పెరికివేయగానే పీనుగు తేలిక అవుతుందా?

1 పాసంగం=దాగా. పడికట్టు. (తక్కెడతూకం మొదట సరిచేయుట.)

వెంట్రుక లున్నమ్మ ఏకొప్పయినా పెట్టుతుంది.

వెండి బేరమాడుతూ బంగారు కొసరినట్లు.

వెంపలి పూస్తేనేమి, కాస్తే నేమి?

వెంపలి చెట్టుకు నిచ్చెన వేసినట్లు.

వెంపలి చెట్లకు దోట్లు వేసినట్లు.

వెక్కిరించబోయి బోర్లపడినట్లు.

వెచ్చంగా వుంటే ఏరుక తింటారు, పచ్చంగా వుంటే పారిపోతారు.

వెట్టికి కని, వెలుగలో పాఱవేసినట్లు.

వెట్టికి గదరా పోలా! అంటే, ఏడవక తప్పదే అయ్యా! అన్నట్లు.

వెట్టికి చెపితే వేగుదాక చెప్పుమన్నట్లు.

వెట్టికి పుట్టినబిడ్డ నెత్తికి లేక ఏడ్చిందట!

వెట్టి గుఱ్ఱం, తంగెడు బఱ్ఱె!

వెట్టి గొలువరాదు విభుడెంత ఘనుడైన.

వెట్టి మూటకీ, పంక్తి భోజనానికీ ముందుగా వెళ్లాలి.

వెట్టికి వెల ఏది?

వెతికి వెతికి వెయ్యి బళ్లమీద వంటలక్కను తెస్తే, తగిలేని మిగిలేని
తోటకూరకి తోడలోతు ఎసరు పెట్టమందట!

వెదకి వెదకి యతడు వెఱ్ఱియై చెడిపోయె.

[1]వెదకు అదను అయితే, వెలుగులో చల్లినా మంచిదే.

వెదుక బోయిన తీగ కాలికి తగిలినట్లు.

వెదుక బోయిన తీర్థ మెదురైనట్లు.

వెధవ ముండకైనా వేవిళ్లు తప్పవు.

వెధవముండా! వేరుండ మన్నట్లు.

వెనుక గుద్దరా శిష్యా అంటె, వెనుక గుద్దగాక మొగం ఉంటుందా
స్వామీ – అన్నాడట. ×

---

1 వెద = విత్తనము చల్లుట (ఎదబెట్టుట=ఒకే పైరుబెట్టుట × అక్కెడబెట్టుట)

వెనుక తుమ్ము ముందుకు మంచిది.
వెన్నకు పండిచ్చి, దూలాలు కంకినవాడు,
వెన్నకు కళ్లు వచ్చి, ఏకులు కమికిన నాటికి గద!
వెన్న కత్తిదెబ్బ కోర్చునా ?
వెన్నకొద్ది నెయ్యి.
వెన్న చేత బట్టుకొని నేతికి వెదకినట్లు.
వెన్న తిన్నవాడు వెళ్లిపోతే, చల్లదాగినవానిని చావ మోదినట్లు.
వెన్నతో కొట్టిన వానిని రాయితో కొట్టినట్లు.
వెన్న దగ్గఱ ఉంచుకొని, నేతికి తడుముకొన్నట్లు.
వెన్నను సన్నగా నూరినట్లు.
వెన్న పెట్టితే మింగలేడు, వేలు పెడితే కఱవలేడు. (కొఱకలేడు)
వెన్నబడే సమయానికి [1]బాన పగిలినట్లు.
వెన్నముద్ద కేల వేసినిరవు పొందు.
వెన్నముద్ద పారవేసి వ్రేళ్లు నాకినట్లు.
వెన్నయుండ నేతికెవరైన వ్యసనపడుదురా?
వెన్నలా దున్నితే వెన్నులకేమి కొదువ? (వెన్నులు కొండలాది)
వెన్నలో వెంట్రుక తీసినట్లు.
[2]వెన్నుమీద గువ్వ. (గూబ; అదృష్టము)
వెన్ను ముదిరి పోర్లిన గొడ్డు ఎక్కువ పాలిస్తుంది.
వెన్ను మూరెడు, దంటు బారెడు.
వెన్నెల దినాలలోనే అల్లో(ల్ల) నేరేడి పళ్లు.
వెయ్యి ఆవులు కలవానికి ఒకటి (పాలుఇవ్వక) తన్నితేనేమి?
వెయ్యి ఆవు లున్నవానికి ఒకటి ఎగజేపితే నేమి ?
వెయ్యి ఇండ్ల పూజారి వెతికినా దొరకడు.

1 బాన = తరితుండ. 2 వెన్ను = ఇంటివెన్నుగాడి.

వెయ్యి కన్నులు రేయికంటే. పగటికేమో ఒకటే. (చుక్కలు, సూర్యుడు)
వెయ్యి కాకుల కొక్కే రాయి.
వెయ్యిపట్ల వడ్లకు ఒక చిలుకపురుగు చాలును.
వెయ్యిమోపులు వేకువజాము కట్టకు లోకువే.
వెయ్యి మోపులు [1]మంచుమేపుకు లోకువే.
వెయ్యిరూపాయలు కావలెనా? వెదవ తోడబుట్టువు కావలెనా?
వెయ్యిరూపాయలు పెట్టి ఎద్దునుకొన్నా, ముల్లుకట్ట ఉండాల.
వెయ్యిరూపాయలు పెట్టి ఏనుగును కొని, అరవీసం అంకుశానికి పాలుమాలినట్లు.

వెరపింపగాబోయి వెరచినట్లు.
వెట్టికుక్కను బట్టి వేటాడవచ్చునా?
వెట్టి కుదిరింది, రోకలి తలకు చుట్టమన్నాడట!
వెట్టిగుద్దకు వేపాకు కడితే, దూడా బర్రె దూసుక తిన్నవట.
వెట్టిగుద్దకు వేపాకు కడితే ఊరి బర్రెగొడ్లన్ని వెంట బడినవట.
వెట్టిని వెంకటమ్మ మనువుపోయి మళ్ళీ వచ్చింది.
వెట్టిదైన కుక్క వేసారి దిరుగురా.
వెట్టిపెయ్యకు తోట్టిపెయ్య తోడు.
వెట్టిముండ వేడుక చూడబోతే, వెతక నిద్దరు, ఏడువ నిద్దరు.
వెట్టిముద్దుకేల వేదశాస్త్రాలు?
వెట్టివాడి పెళ్ళాం వాడకల్లా వదినే.
వెట్టివాడు ఏతం తొక్కినట్లు,
వెట్టివాడు వెట్టివాడు అంటే, వెక్కివెక్కి ఏడ్చినాడట!
వెట్టివాని చేతిరాయి తగిలెనా తగులును, తప్పెనా తప్పును.

1 మంచుమేపు = మంచుగప్పిన లేటి పచ్చి గడ్డి మేత.

వెట్టి వేయివిధాలు, పైత్యం పదివేల విధాలు.

వెలమ సీల్గు, బరపట గంజి, తెడ్డు తేరా దేవుకతిందాం.

వెలమ మెచ్చిన ముచ్చట చెప్పు - అలిగిన ప్రాణహాని దెచ్చు.

వెలమ చెలిమి కలలోకన్న కలిమి వంటిది.

వెలమ పొందు వెయ్యేండ్లు చేసినా కాసు వీసమైన కానరాదు.

వెలమల వితరణ, [1]సాతాని శాస్త్రవాదము.

వెలమలున్న ఊరు - కొంగ లున్న మట్టి - ఒకటి.

వెలమవారి పెండ్లికొడుకు మారడుగ నేరడు, ఉన్నదంతా ఊడ్చిపెట్టు.

వెలయాలి మాట - కలలోని మూట.

వెల సులభం, ఫల మధికం.

[2]వెలిగొండవంటి తండ్రికంటె, ఏకులబుట్టవంటి తల్లి మేలు.

వెలిచవుల్ గొనుకాంత వెరువదు నిందకు.

[3]వెలిపొలమును, వెధవపిల్లను వదలకూడదు.

వెలుగుకన్న దిక్కు వే రెవరున్నారు?

వెలివాడలో వేదఘోష ఉంటుందా?

వెలుగు నీడ, గ్రామం తోడు.

వెలుగు లేకున్న చీకటి లేదు, చీకటి లేకున్న వెలుగు లేదు.

[4]వెలుగే చేనుమేస్తే, కాచేవా రెవరు?

---

1 పాణిజాంద్ర సభామధ్యే సాతానిః పండితోత్తమః అన్న సామెత వంటిది.

2 తూర్పుకనుమలకు నెల్లూరుజిల్లాలో వెలి (తెల్ల) కొండలనిపేరు. వీటికే ఎఱ్ఱమల, నల్లమల అని కర్నూలుజిల్లా పేర్లు.

3 వెలిపొలము = తెల్లనేలచేను (పాటిచవుడు.) వెలిపొలము = కడకంతల ఉండే పొలము అనికూడ. దీనిని రక్షణలేకుండా వదలరాదని కూడ.)

4 వెలుగు = కంచె, కర.

[1] వెలుతురు కట్టెల (పుల్లల) వెలుగని వెలిగించుకొంటారా?
వెలుపల వేడుక, లోపల కసవు.
వెల్లకిత్తలా పడుకుని ఉమ్మివేస్తే (ముఖం) మీద పడుతుంది.
వెల్లకిలావేసి పొడిస్తే ఒకదెబ్బకే చస్తున్నదని సన్యాసులమయిన
మేమెందుకు చెప్పడం?
వెల్లటూరిలో ఎద్దును, పరుచూరిలో పడుచును ఇవ్వకూడదు.
వెల్లుల్లి వనానికి జోరీగ, పాడూరికి [2]దరిబేసి రాజులు.
వెళ్ళిపొమ్మంటే, వెళ్ళికి వెళ్ళుదామన్నట్లు.
వెళ్లిపొమ్మంటే చూరుపట్టుకొని వ్రేలాడినట్లు.

---

# వే

వేగివేగనమ్మ వేకువజామున ముట్టయితే, తెలివిగలమ్మ తెల్లవారు
జామున ముట్టయిందట.
వేగివేగని పెసరపప్పు, వెనుకవచ్చిన పెండ్లాము రుచి.
వేగుకు ముందు చీకట్లు దట్టమైనట్లు.
వేటకాని ఇల్లు వెలువక కుందేలు పొచ్చినట్లు.
వేచని కందిపప్పు, అవివేకుని మెప్పు.
వేటుకు వేటు, మాటకు మాట.
వేశ్య కోర్వలేనమ్మ సహగమనం చేస్తానన్నదట!
వేడినీళ్ళకు ఇల్లు కాలునా?
వేడినీళ్ళకు చన్నీళ్లు, చన్నీళ్ళకు వేడినీళ్లు తోడయినట్లు.

---

1 వెలుతురుకట్టె = ఒక అడవిచెట్టు పుల్లలు, బెరడుదీసి వెలిగించిన, దమురుపోసిన దివిటీవలె వెలుగుచుండును.

2 దరిబేసి = దర్వేష్ అను ముస్లిం సన్యాసి గణము; నలుచదరపు రంగురంగుల పేలికలతో బొంత కుట్టుకొందురు; భిక్షగాడు లేక దరిద్రుడని భావము.

వేడిసీళ్ళకు ముందు, వెట్టిమాటకు వెనుక పోకూడదు.
వేడుకకు వెలలేదు.
వేడుక వేంకటేశ్వరుడిది, గోల గోవిందుడిది. (వెంకటేశ్వరునిగుడిలో గోవిందా అనే కేకలు. గోవిందుడు దిగువ తిరుపతిలో ఉండే స్వామి)
వేదజడుడైన ఈడుకుకాని చేతలు చేయడు.
వేపకాయంత తీపి, వేసంగంత చలువ.
వేపచేదు వండగానే బెల్లమగునా?
వేమనమాట వెట్టిమాట కాదు.
వేమనూరు వేమన్న వలె.
వేములవగ్గఱ సమారాధనట! ఏడుమూళ్ళ విస్తరి, మూడుమూళ్ళ దొప్ప కట్టుకొని విన్నెత్తుకుని నన్ను రమ్మన్నారట!
వేములు కాస్తే భూములు పండును.
వేయి ఉన్నమ్మకైనా వేపుడు మంగలం అరువే.
వేయి ఉన్నమ్మకన్నా వేయించే మంగలంలో పనిబడుతుంది.
వేరుతవ్వి నీళ్లు పోసినట్లు. [అన్నదట.
వేరుమీద గోరు మొలిచింది, వేరుపోదాం రారా వెట్టిమొగుడా!
వేలంత చోటిస్తే రోలంత నష్టం.
వేంవెర్రి-గొర్రెగాటు.
వేలుకు వేలు ఎకము.
వేలుచూపి అవలక్షణ మనిపించుకొన్నట్లు. [తారు.
వేలుచూపితే మండ మింగుతారు, మండ చూపితే మనిషినే మింగు
వేలుచూపితే మురిగేది గుమ్మడికాయ, తంతే పెరిగేది పుచ్చకాయ (దోహదచేష్టలు)
వేలు తెగినా సున్నం బెట్టదు.

వేలు పెట్టేందుకు చోటిస్తే కాలు దూర్చినట్లు.

వేలు వంకర పెడితేనేగాని, వెన్న రాదు.

వేలు వాచి రోలంతయితే, రోలు వాస్తే మరెంత కావాలి?

వేలు విఱిగింది, ఉచ్చపోయమంటే, ఇలాయి కట్టుకొని ఆరునెల లయింది అన్నాడట!

వేళంగి రైతులు-వేల్పూరి రైతులు.

వేళ్ళతో వెంపలి, కాయలతో కానుగ (ఎరువుకు మంచివి)

వేశ్యాతనయుడు తండ్రికి బెట్టు తద్దినము.

వేషం వేయుమందిని కొడుతుంది.

వేషగాని అడుగులు వేటలో పనికివచ్చునా?

వేషాలకోసం దేశాల పాలు.

వేషాలన్నీ గ్రాసాలకే!

వేషాలమారికి వేవిళ్లు వస్తే, ఉన్నచోటు కదలను అందట!

వేసంగి పంట ఒకనాటి వంట.

వేసమరసి చూడ గ్రాసంబు కొరకయా.

వేసరపుజాతిగాని, దాసికొడుకైనగాని కాసులుగలవాడె రాజు.

వేసరితే లేనిది విచారిస్తే వచ్చునా?

వేసారి వెలుగుమీద వేడినీళ్లు చల్లినట్లు.

వేసినట్టు వేస్తే, వెట్టివాడైనా గెలుచును.

వేసినదే ఒక గంతు, దిగినదే ఒక బుఱ్ఱ.

వేసినదే ఒక గంతు, విరిగినదే ఒక కాలు.

వేసిన వత్తికి, పోసిన చమురుకు సరిపోయింది.

వేసిన వెదుళ్ళారా! కాలిన ఇండ్లకు పొండి.

వేసేది ఒకడైతే, మేసేది ఇంకొకడు.

వేసేనాడు లేనిది కోసేనాడు వస్తుందా?

వేసేవి పులిగురకలు, మేసేది గడ్డిపరకలు.
వేస్తివిరా కన్నం అంటే, చేస్తివిలే కాపురం అన్నట్లు.
వేస్తే మునగకొయ్య, తీస్తే [1]చంద్రకొయ్య.
వేళ్ళపై నీళ్లు పోసినా కొవలకే (చెట్లకు).

# వై

వైదికపు పిల్లీ! ప్రత్తిపలుకవే అంటే, మ్యావ్, మ్యావ్ అన్నదట!
వైదికునిచేతి విడిమాయె వనిత బ్రతుకు.
వైదీకి వైద్యంలో చచ్చినా ఒకటే, బ్రతికినా ఒకటే!
వైద్యం నేర్వనివాడు, వానకు తడియనివాడు లేడు.
వైద్యుడా! నీ సంచీలో వేడినీళ్లు ఉన్నవా అన్నట్లు.
వైద్యుడి పెండ్లాముగూడా ముండమోసేదే అన్నాడట.
వైద్యుడు మొదట తన వ్యాధిని పోగొట్టుకోవాల.
వైద్యుడు రోగాలు కోరు, వైశ్యుడు కరువుకోరు.
వైద్యుని పేరుచెపితే వ్యాధి పోవునా?
వైద్యుని భార్యకే భగంధరరోగము.
వైరాగ్యం ముదిరితే, వారవనితకూడా తల్లితో సమానం.
వైరికిగాని వద్దు మెదగవు.
వైష్ణవుని మెడలో రుద్రాక్షలు కట్టినట్లు.
వైశ్యుల పెండ్లిలో వితరణ లేదు.
వైష్ణవులలో రామభద్రయ్య, శైవులలో వీరభద్రయ్య స్మార్తులలో వట్టి భద్రయ్య.
వైష్ణవులలో లింగయ్య ఉండడుగాని శైవులలో రామలింగయ్య ఉంటాడు (పేర్లు)

1 చంద్ర = చాల గట్టికొయ్య.

## వ్య

వ్యర్థమైన సొమ్ము వ్యర్థుల చేరురా.
వ్యవసాయం వెట్టివాని (గుడ్డివాని) చేతి రాయి.
వ్యవసాయం [1]ఏలిననాటి శని, భార్య జన్మశని.

## వ్యా

వ్యాధి దెలియలేని వైద్యుడేరికి నేల.
వ్యాధి పీడితుడు దైవచింతన చేయు.
వ్యాధి రట్టు సంసారం గుట్టు.
వ్యాధి వచ్చినవాడు వెట్టిబట్టినవాడు ఒకటి.
వ్యాపారం చమురువంటిది, కాబట్టే దాంట్లో మరేదీ ఇమడదు.
వ్యాధికి మందుగాని, విధికి మందా ?
వ్యాధిహీనునికి వరవైద్యుని చెలిమేల ?
వ్యాపారం జోరుగా సాగిపోతున్నది, రెండో బట్టెను అమ్మి డబ్బు పంపమన్నట్లు,
వ్యాపారివిత్తంబు వారకాంతలపాలు, కల్లువిత్తము [2]రుంజకానిపాలు.
వ్యాస ప్రోక్తమా ? పరాశర ప్రోక్తమా ? అన్నట్లు.

1 ఏలిననాటి శని = $7\frac{1}{2}$ సంవత్సరములు; జన్మశని $2\frac{1}{2}$ సంవత్సరములు. శని గోచారంలో-జన్మ, అష్టమ, వ్యయస్థానములలో నుండుటను ఏలిననాటి శని అందురు.
2 రుంజ = చర్మవ్యాపారి.

# వ్ర

వ్రతం చెడ్డా సుఖం దక్కవలె.

# వ్రా

వ్రాత కరణమా! మేత కరణమా!
వ్రాతగదే కూతురా! అంటే, కోతి మొగుడే అమ్మా! అన్నట్లు.
వ్రాత దైవమంత్రుడు, చేత పౌరుషమంత్రుడు. (వ్రాత కజుడుకర్త, చేతకు తాకర్త విశ్వదాభిరామ...)
వ్రాత బలి గోరును.
వ్రాత రాజ్యమేలమని ఉంటే, గ్రహచారం (కర్మం) గాడిదల నేల మన్నదట! (మేపమన్నదట)
వ్రాత రానివాడు కోత(స)కరణం, వ్రాతా కోతా రానివాడు మేత కరణం.
వ్రాత వెంటగాని వరమీడు దైవంబు.
వ్రాసే వాణ్ణి, కోసే వాణ్ణి, గీసే వాణ్ణి నమ్మరాదు.

# శ

శంకులో పోస్తే తీర్థం, పెంకులో పోస్తే నీళ్ళు.
శంఖంలో(తో) పోస్తేగాని తీర్థం కాదు.
శకునం వేళ ఎక్కడికని అడగకూడదు గాని, ఎక్కడికో చెప్పిపో అన్నట్లు.
శక్తి ఎవరిసొమ్ము యుక్తిచే సాధింప.
శక్తిచాలనివాడు సాధుత్వము వహించు.

శఠగోపం లేకుంటే నా శంఖంపోయె గాని, ఇంటికిపోయి గంట బోర్లించుకుంటాను.

శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు.

శతాపరాధములకు సహస్రదండనములు లేవు.

శనగలు తిని చేయి కడుగుకొన్నట్లు.

శని పట్టితే ఏడేళ్ళు, నేను పట్టితే పద్నాలుగేళ్లు.

శనిపీనుగ [1]తనీగా పోదు.

శనివారం వాన శనివారమే విడుచును.

శని విఱుగడ, పని ఒబ్బిడి.

శనేశ్వరానికి నిద్ర ఎక్కువ, దరిద్రానికి ఆకలెక్కువ.

[2]శయనైకాదశి తెలిసినవాడే శాస్త్రకారుడు.

శరణార్థిని లింగప్పా! అంటే, కందులు మూడుమాడలు అన్నాడట; చిన్నా పెద్దా బాగున్నారా? అంటే, పప్పు లక్కవలె ఉడుకుతుం దన్నాడట!

శరత్కాలవర్షం కృపణుని ఔదార్యము వంటిది.

[3]శరము చాలెడు, చెప్పులు మూలెడు.

శరము తప్పిన చెవులు వినరావు, గుణము తప్పిన కళ్లు కానరావు.

శల్య సారథ్యం.

శవం బరువని, శప్పాలు బెరికి వేసినట్లు.

శవానికి చేసిన అలంకారం వలె.

---

1 తనీగా = ఒంటరిగా.

2 శయనైకాదశి-ఆషాఢ శుద్ధ ఏకాదశి; ఇట్లే కార్తిక శుద్ధ ఏకాదశి - ఉత్థాన ఏకాదశి. ఈ(నాలుగు) చాతుర్మాస్యం నెలలో ధర్మకార్యములు దైవకార్యములు స్తంభింపోవును.

3 శరము (షెరం) = సిగ్గు.

## శా

శాంతము లేక సౌఖ్యము లేదు దాంతునకైన వేదాంతునకైన
శాఁగరోఁకలి యిగురు పెట్టినట్లు.
శాపాలకు చచ్చినవాడు, దీవనలకు బ్రతికినవాడు లేరు.
శాపాలు ఉత్సవాలవంటివి, అవి ఊరేగి ఊరేగి బయలు దేరిన చోటుకే వచ్చి చేరును.
శాస్త్రం తప్పు, చచ్చేది నిజం!
శాస్త్రప్రకారం వియిస్తే కుక్కమూతి బిడ్డలు పుట్టినట్లు.
శాస్త్రుల వారింట పుట్టి, సోమయాజుల వారింట మెట్టి, లవణమంటే దూడరేణమని (పేడని) ఎఱుఁగనా?-అన్నదట.
శాస్త్రులవారి కొడుకు బ్రతికీ నిర్వాహకుడే, చచ్చీ [1]నిర్వాహకుడే.

-o-

## శి

[2]శింగిడి లేస్తే పదిహేను దినాల వర్షం.
శిఖ శిఖల మీఁద మిడతలు చెనసి(గి)నట్లు.
శిరసుండఁగ మోఁకాటికి సేసలు బోసినట్లు.
శిలాభోఁగం, స్థలాభోఁగం, నరా(ర)భోఁగం అన్నారు.
శివరాత్రికి చలి శివశివా! అని పోతుంది.
శివరాత్రికి చంక లెత్తనీయదు. (చలి)
శివరాత్రికి చింతగింజలంత చలి.
శివరాత్రికి చింతాకంత పొట్ట.
శివరాత్రికి జీడిపిందె, ఉగాదికి ఊరుగాయ.

---

1 నిర్వాహకుడు = మోసేవారులేరని. బాగా నిర్వహించుకొనేవాడని అర్థాంతరము.
2 శింగిడి = ఇంద్రధనుస్సు.

శివరాత్రికి జీడికాయ, ఉగాదికి ఊరగాయ.

శివరాత్రికి శివలింగా లంత - మామిడికాయలు.

శివరాత్రివా డింటికి, ఏకాదశివా డొచ్చినట్లు.

శివు డియ్యకున్న సిద్ధలింగ మిచ్చునా?

శివుడు పురుషుడైన స్త్రీలకు జిక్కునా!

శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు.

శిశువుకు దక్కని స్తన్యం వలె.

శిష్యా! శిష్యా! నా కాళ్ళకు చెప్పు లున్నవా! అంటే, నక్షత్ర మండలం మధ్య ఎక్కడా కనపడలేదు అన్నాడట! (బిఱ్ఱుగా తిని తల వంచలేక.)

శిష్యా, నా చెప్పులు వెదకరా అంటే, నీకంటె తక్కువ తిన్న దెవరు స్వామి అన్నాడట.

శిష్యా వెనుక గుద్దరా అంటే, గుద్దగాక మొగ ముంటుందా! స్వామి! అన్నాడట శిష్యుడు.

శిష్యున కెక్కడ సందేహమో, గురువు కక్కడే అనుమానం.

---

# శీ

శీలము లేని సౌందర్యము తావిలేని పువ్వు వంటిది.

---

## శు

శుద్ధ మనసు లేక పూజ సేయుటే సూకరవృత్తి.
శుభం పలకరా, పెండ్లికొడుకా! అంటే, పెళ్లికూతురుముండ ఎక్కడున్న దన్నాడట!
శుభం పలకరా, పెండ్లికొడకా అంటే – పెండ్లికి వచ్చిన ముత్తయిదువులంతా నా పెద్దపెండ్లాలు అన్నాడట.
శుభం పలకరా, మంకెన్నా! అంటే, ఎవడాలితాడు తెగితే నా కేమి? నా కేసే పిండాకూడు నా కేస్తే, అయిరేని కుండల కాడ చచ్చినట్టే తొంగుంటా నన్నాడట!
శుభం పలకరా, మంకెన్నా! అంటే, చెల్లిముండకు పెళ్లెప్పుడు అన్నాడట?
శుభాలు ముంచి, దీపాలు ఆర్పినట్లు.
శుష్క ప్రియాలు, శూన్య హస్తాలు.



## శూ

శూద్రపొట్టా తమలపాకుకట్టా పొగాకుపట్టా ఎప్పుడూ తడుపుతూ ఉండాలి.
శూద్ర సంతర్పణ, బ్రాహ్మణ సేవ్యము.



## శె

శెట్టిగారు సింగారించుకునే లోపల ఊరంతా కొల్లబోయిందట!

శెట్టిగారూ, తుమ్మితే ఏమనుకొంటారు? అని త్రిమూర్తులు మారు వేషంలో వచ్చి అడిగితే, జలుబు చేసిందని అనుకొంటాను - అన్నాడట (రామ - కృష్ణ అని ఇష్టదేవతను అనుకొనుట పరిపాటి.)

శెట్టిగారూ, మాలో ఎవరు బాగుంటారు? అని లక్ష్మీదేవి, దరిద్ర దేవి వచ్చి అడిగితే, చిన్నక్క లోపలికి వస్తే బాగుంటుంది, పెద్దక్క బయటికి పోతే బాగుంటుంది - అన్నాడట.

## శే

శేరుకొరకు మణవుబంటు.

శేషాయులెస్స అంటే గరుడాయులెస్స అన్నట్లు, (పరస్పరం ప్రీతిని కూర్చుకొనుట.)

## శొ

శొంఠిలేని కషాయమా!

## శో

శోధనం నాటి ముచ్చటు లంఖణంనాడు తలచినట్లు.

## శ్మ

శ్మశానానికి పోయిన శవం తిరిగిరాదు.

## శ్యా

శ్యామలాకారుడమ్మా! ఈ బిడ్డ శాన్నాళ్ళు బతకడమ్మా!
శ్యామలకోరల పున్నానికి కోటొక్క పుత్తి బెట్టి నోముతుందట!

## శ్రా

శ్రార్ధానికి అంటులేదు, యజ్ఞానికి [1]ఎంగిలి లేదు.
శ్రావణంలో సెనగలజోరు, భాద్రపదములో బాధలపోరు.

## శ్రీ

శ్రీవైష్ణవుడు ముడ్డి చెరువులో కడగగానే అది సదాచారమగునా?
శ్రీయుతులు [2](420) నమ్మాట యిరవై.
శ్రీరంగం రోకలి చేతులమీద నిలువదు.
శ్రీరంగంలో పుట్టిన బిడ్డకు [3]తిరువాయిమొళి నేర్పాలా?

---

1 యజ్ఞంలో ఎంగిలి తినుట ఒక తంతు.

2 420 = భారతశిక్షాస్మృతిలో 420-వ నిబంధన మోసమునకు శిక్ష విధించునది; అంటే మోసగాడు.

3 తిరువాయిమొళి = నాలాయిరం (నాలుగువేలు) అను ద్రావిడ ప్రబంధములోని పాచురములు (పద్యములు). ముక్కోటి ఏకాదశి మొదలు పదినాళ్ళు దీనిని పారాయణము చేయుదురు. ఈ నాలాయిరము, పన్నిద్దరాళ్వారులు (ఆళ్వారు = సహజజ్ఞానశోభితుడు) పాడిన భక్తిగీతముల సంపుటి. నమ్మాళ్వారువారు ఆదేశించగా, నాదముని యీ నాలుగువేల పాచురములను సంకలనము జేసిరి. ఇది తెంగళ [తెం = దక్షిణ, కళ = సంస్కృతి; వడగళ = ఉత్తర సంస్కృతి] వైష్ణవులకు వేదము వంటిది. వడగళులు సంస్కృత వేదమును పఠింతురు. తిరువాయిమొళి సామవేదసారము. నమ్మాళ్వారు శూద్రుడు. తిరుమంగ ఆళ్వారు దొంగగా ఉండినాడు; తిరుప్పాణి ఆళ్వారు మాల.

శ్రీరంగనీతులు చెప్పేవారేగాని, చేసేవారు లేరు.

శ్రీరామరక్ష నూరేండ్లాయుస్సు!

శ్రీరామ లంకలో బోడిక్రోతి.

శ్రీరాముడు మనవాడైతే, చీడపురుగు లేమిచేస్తవి!

శ్రీవైష్ణవుడు ముడ్డి కడిగితే, రెండు చేతులకూ పని. (కుడిచేతితో నీళ్లు ఎడమచేతిలో బోసికొని కడుగుకొందురు. పురచేయి నీళ్లనుతాకి మయిల చేయరాదని).

## శ్రు

శ్రుతి మించి రాగాన పడినట్లు.

శ్రుతి లేని పాట – సమ్మతి లేని మాట.

## శ్వా

శ్వాస ఉండేవఱకు ఆశ ఉంటుంది.

## ష

షండున కబ్బిన చానవలె.

షండునికి రంభ దొరికినట్లు (నపుంసకునికి).

# స

సంకటాల విత్తు-సానిదాని పొత్తు.

సంకటాలు తగిలించుకొని మీసాలు పీక్కుంటే ఏమవుతుంది?

సంక నాకేవాణ్ణి సంభావన అడిగితే, పొర్లించి పొర్లించి ముడ్డి నాకినాడంట.

సంకురాత్రి మబ్బులు, మాలవాళ్ళ ఉబ్బులు.

సంక్రాంతికి చంక లెత్తకుండా చలి.

సంక్రాంతి పండుగకు సంకెళ్ళలోని వాళ్ళూ వస్తారు.

[1]సంగాం కొమ్మ చక్కగా ఎత్తినట్లు.

సంగీతం, పురుషుని హృదయంలో అగ్ని రగుల్కొల్పాల-స్త్రీ నేత్రంలో బాష్పముల నింపాల.

సంగీతము చేత సెట్టి బేరసారము లుడిగెనే. (బంగారువంటి కోమటి సంగీతముచేత బేరసారము లుడిగెనే)

సంగీత విద్యకు చాకలెల్లి.

సంచిలాభం చిల్లి కూడ తీసినది.

సంచి విప్పేవఱకు చల్లబడితే, మూట విప్పేవఱకు మాటలు పోతవి.

సంజకు లంజకు రాగము నిలుకడగా నిల్చునా. (రాగము=ఎరుపు; ప్రేమ)

సంతకు దొంగయితే చీర లమ్మే దెక్కడ?

సంతకు దొంగలయితే, చోళ్లెక్కడ అమ్ముకోను?

సంతకు పోయి వచ్చిన ముఖం మాదిరి. (వాడిపోయి వస్తువు - తిరునాళ్ళకు పోయి వచ్చినట్లు.

సంతన లేని ఇల్లు చావడి కొట్టం.

సంత పాతతొత్తు సన్యాసి నెఱుగునా?

---

1 సంగాంకొమ్మ=సంగములో పెద్ద రాతి స్తంభమును ఎత్తి తిరునాళ్ళ ప్రారంభింతురు. పెన్నలో బొగ్గేరు, బీరాపుదేరు కలిసే సంగమం-ఇది.

సంత మెఱుగు సాని ఎఱుగును.

సంతలో కొడితే సాక్షులెవరు?

సంతలో బేరము లచ్చికి గాజులకు సరి.

సంతానానికని సప్తసాగరయాత్ర వెడితే, ఉప్పునీరు తగిలి ఉన్నది కాస్త ఊడ్చుక పోయిందట!

సంతోషం సగం సత్తువ.

సంతోషానికి సాకు లేదు, ఆలోచన కంతు లేదు.

సందడిలో సడేమియా, నీకు నాకు లడేమియా!

సందడిలో సమారాధన! (చేసినట్లు).

సందాయ సందాయ అంటే, చిచ్చాయ చిచ్చాయ అన్నదట!

సందుజూచి పెట్టెలు దించినట్లు. (పీర్ల పెట్టెలు)

సందు దొరికితే, చావడికొట్టం చంక బెట్టినట్లు.

సంధ్య వార్చినావురా? అంటే, ఊరి వెలుపల గుంటలో వార్చినా నన్నాడట-అయితే, ఆ గుంటలో నీళ్లు లేవే! అంటే, చాకలి సుబ్బడు ఉన్నవని చెప్పినాడు నాయనా! అన్నాడట.

సంపద గలదేని సన్నిపాతము పూను.

సంపదగలవాని సన్నిపాతం వలె.

సంపదగలిగిన తల్లికి వేకటిగాను తీరదు.

సంపద లున్ననాడె బంధువుల రాక, చెరువు నిండిననాడే కప్పల చేరిక.

సంపదలో మరపులు, ఆపదలలో అఱపులు.

సంపద స్నేహితులను కల్పించును, దరిద్రము వారిని ఒకటిగా బంధించును.

సంపాదన ఒకరిది, అనుభవం ఇంకొకరిది.

సంబరపు చలిగాలికి ఎదురువాకిలి వలె.

సంబూరాని పోకి పోసికుంటె, కుక్క [1]జమిడీకే ఏసుకపోయిందట.

సంభావనలో వచ్చిన పావలా లోటు, నేతిలో తీస్తా నన్నట్టు.

సంసారం గట్టి, మెడ ఒట్టి.

సంసారం గుట్టు, వ్యాధి రట్టు.

సంసారం జేనెడు, ఖర్చు బారెడు.

సంసారం బాగా లేదని సన్యాసం పుచ్చుకుంటే, బూడిద బుట్టకాయ గాడిద బరువైనాయట!

సంసారం లేనివారికి సరసా లెక్కువ.

సంసారం సాగనిది ఆడదాని వ్రాత, పిల్లలు బ్రతకనిది మొగవాడి వ్రాత.

సంసారికి సాగు పాటు, సన్యాసికి జోగు పాటు.

సంసారి తిరిగి చెడును, సన్యాసి (జోగి) తిరుగక చెడను.

సంసారి దుఃఖ, సన్యాసి సుఖ.

సంసారి బీదగాని చేను బీదగాదు.

సంసారి నైయ్-సన్నాసి నైయ్-అన్నాడట చలికిచచ్చే సన్యాసి.

సంస్కారం లేని చదువు కాయగాయని చెట్టువంటిది.

సకల శాస్త్రాలూ, నిలబడి మూత్రాలు.

సకలసుబ్బందు గోత్రానాం. పుల్లమ్మ పుత్రానాం.

సక్కిలు పలికేవానికి సేలు (కు), మొద్దు గొట్టేవానికి దుడ్డు.

సగం ఈడుకు సమర్తకట్నాలు.

సగం చచ్చి పురాణం, అంతా చచ్చి సంగీతం.

సగం పెట్టి మేనత్త అన్నట్లు.

సగం సాలె నేత, సగం మాల నేత.

సజ్జనుండు తిట్ట శాపంబ దేను.

సద్దంత ఊరగాయ; ఇల్లంత పందిలి, తల్లంత పిల్ల.

సతాకోటి (శతకోటి) జంగాలలో, నా బోడిలింగ మెక్కడన్నాడట.

---

1 జమిడీకె – జంటయాకె.

సతిపతులు చక్కగా ఉంటే, సంతలో పిల్లచింత లేదు.

సత్కార్యాలకు కార్యరంగం అంతరాత్మ. [దూకుతాను.

సత్యము నావద్ద చాలా ఉన్నది, చెప్పులు తేరా మగడా! నిప్పులో

సత్యములు పొత్తు కుదుచునా? బాసలు కలసివచ్చునా?

సత్యహరిశ్చంద్రుడు పుట్టిన మరుసటినాడు పుట్టినా డన్నట్లు.

సత్కార్యాలకు కార్యరంగం అంతరాత్మ

సత్రం కూటికి అయ్యగారి ఆజ్ఞా?

సత్రం కూటికి సర్కారు సెలవెందుకు?

సత్రంలో ఉచ్చబోస్తున్నా వేమిరా? అంటే-దేవాలయం అనుకొన్నానులే అన్నాడట.

సత్రా భోజనం-మఠా నిద్ర.

సత్యాథ్యులమీదబోవు జడమూర్తులు గెల్వువారెంతురే.

సదా కపటమూర్తి దొరంగు మహికాంతులకేడ పరోపకారముల్.

సద్దలు (సజ్జలు) పండితే సుద్దు లెక్కువ.

సద్దిబువ్వపై వెన్నపూస బెట్టినట్లు

సన్నపని చేయబోతే సున్నం సున్నం అయిందట.

సన్నబియ్యం, చాయపప్పు.

సన్నబువ్వ చిన్నచేపలు, కొఱ్ఱబువ్వ కోడిచారు.

సన్నమో, ముతకో, సంతలో తేలిపోతుంది.

సన్నసన్నంగా కాపుతనం వచ్చింది, సన్నబియ్యం వండవే అన్నాడట!

సన్నెక(లు)ల్లు కడుగరా సయ్యావాలీ! అంటే, కడిగినట్టే నాకినా, ఖుదాతోడు! అన్నాడట!

[1]సన్నెకల్లు దాచితే, పెండ్లి కాదా?

1 ఆర్యసాంప్రదాయిక (బ్రాహ్మణ) పెండ్లిండ్లలో సప్తపది తర్వాత, సన్నెకల్లుమీద పెండ్లికూతురుచేత కాలుపెట్టించి, వధువుకిల్లి కొన్ని హితవాక్యములు పలుకును. వాటి భావమిది :- మంచిచెడ్డలలో నీ హృదయాన్ని దీనివలె గట్టిచేసుకో. దుర్మార్గు డెవడైనా వచ్చి నీ శీలభంగముచేయ ప్రయత్నించినచో వాడిపదకు యీ రాయి తాకినట్లు తాకు.

సన్యాసం చివఱ కష్టం, సంసారం మధ్య కష్టం.

సన్యాసం పుచ్చుకొన్నా, కావడిబరువు తప్పలేదు.

సన్యాసికి దొంగల భయమేమి ?

సన్యాసి పెళ్ళాం అటు విధవా కాదు, ఇటు పునిస్త్రీ కాదు.

సన్యాసిపెళ్ళికి జుట్టు దగ్గఱనుంచి ఎరవే. (అరవే)

సన్యాసీ సన్యాసీ రాసుకుంటే, బూడిద రాలిందట!

సన్యాసులమధ్య కల్లుకుండలు మాయమైనట్లు.

సభమధ్య సాలె చాకలి, పండితుల మధ్య పాగదాసరి.

సభాపిరికిదానా! యింటిలో లేడని చెప్పవే.

సమయం తప్పితే కాళ్లు, సమయం వస్తే రాళ్లు.

సమయము కాదనుట జరుపునేర్పు.

సమయమెఱుగ(ని)నతడు సరసుండుకాడయా.

సమయానికి లేనిది చంక నాకనా ?

సమయానికి లేని పాక చచ్చినాకా ?

సమర్తయినాడు చాకలిదాన్ని కొట్టింది.

సముద్రం నడుమ ఉన్నా, త్రాగు నీటికి కరవే!

సముద్రంపై ఉఱిమితే, వాన, తప్పదు. (గాలివాన)

సముద్రమయినా ఈదవచ్చు గాని, సంసార మీదలేము.

సముద్రము చంకలో పెట్టుకొని, చెలమకు చేయి చాచినట్లు.

సముద్రములో ఇంగువ కలిపినట్లు.

సముద్రంలో పిట్ట రెట్టవేసినట్లు.

సముద్రములో కెరటాలు అణిగినతరువాత స్నానం చేదా మను కున్నాడట!

సముద్రములో కొఱవి అద్దినట్లు.

సముద్రములో వాన పడినట్లు.

సముద్రములో వేసిన కాకిరెట్ట వలె.
సముద్రానికి ఏతాము వేసినట్లు.
సముద్రానికి లవణదర్శన మన్నట్లు.
సముద్రాన్ని బయటనిలబడే పొగుడుతాము.
సమ్ముఖానికి రాయబార మేల?
సరదాకి సమర్తాడితే, చాకలిది కోక దొబ్బింది.
సరసమాడుటెల్ల చావుకు మూలంబు.
సరసము విరసము కొఱకే, పెరుగుట విరుగుట కొరకే, పరిపూర్ణ సుఖంబు లధిక బాధల కొరకే.
సరసానికైనా సమయ ముండాలి.
సరిపడనివారు చచ్చినవారితో సమానం.
సరిపి, పిల్లలూ లేస్తే సహస్రమంది లేచినట్లు.
సరువ తప్పెల పోయె, బరువు అలకనాయె.
సరసమునందు సమరమునందు సర్వమూ న్యాయసమ్మతమే.
సర్వరోగాలకు సారాయి మందు.
సర్కారుకు చాటుగా ఉండాలి, షావుకారి కెదురుగా ఉండాలి.
సర్రాజు పెళ్ళిలో గుర్రాజు కోపోచ.
సర్వజనీనమైన భాష సంగీతము.
సర్వవిషయాలలో మానవుడుగా మనుము.
సర్వేజనా సుఖినోభవంతు అంటే, సర్వేవాళ్ళేనా? మాసంగతేమి? అన్నారట-రెవెన్యూవాళ్లు.
సలిలం కమ్మలంజలం-(సలిలం-కం-లం-జలం) అని, అమరం చదివితే, కమ్మలంజ లేం? కాపులంజ లెందుకు కాకూడదు? అన్నాడట.
సవతాలి కుండనైనా ఉరుకుతానన్నది గాని, తోడికోడలి కుండను ఉరుకనన్నదట!

సవతితల్లికి బిడ్డలు పోతేనేమి! సొమ్ముల కాపువానికి బక్కలు (బక్క గొడ్లు) పోతేనేమి?

సవతికి సంకెళ్ళు, నాకు [1]పిల్లెండ్లు.

సవతి సాగనీయదు, వరా లెచ్చనీయదు.

సవరణ సంతకుపోతే, ఏకులబుట్ట ఎదురుగా పోయిందట!

సవరతీసిన కొద్దీ నిక్కినట్లు.

సవాసేరులో బోడి పరాచకమా!

సస్యాధిపతివా? సామ్రాజ్యాధిపతివా?

సహనముంటే పశ్చాత్తాపానికి చోటు లేదు.

## సా

సాకు (సాకులు) మేకవుతుంది.

సాకులు చెప్పినవానికి కాసు, ఇల్లు కప్పినవానికి దుగ్గాని.

సాగింది నిజము, సాగనిది దబ్బఱ. (కల్ల)

సాగితే చాపకిందికి ఆరు కుంపట్లు, తొమ్మిది నగళ్ళు.

సాగితే నియోగం, సాగకపోతే చచ్చే యోగం.

సాగితే [2]పాకనాటివారు, సాగకున్న [3]మోటాటివారు.

సాగితే బంతి. సాగకపోతే మొండి.

సాగితే బొంకు, సాగకపోతే రంకు.

సాగితే సాగించుకోమన్నారు. జారితే పడమన్నారు.

---

1 పిల్లెండు = ఆభరణాలు. (కాలి వేళ్ళను పెట్టుకొనేవి)

2 పాకనాడు, మోటాడు రెడ్లలో తెగలు. పాకనాడు = నెల్లూరులో కనిగిరి, దర్శి, పొదలి సమీపప్రాంతము.

3 మోటాడు = మోట = కపిలతో వ్యవసాయం చేసినవారు-అని అందురు.

సాలెవాడి భార్య [1]సరిమీద పడ్డది.

సాలెవాని ఎంగిలి ముప్పదిమూడు కోట్ల దేవతలు మెచ్చారట! (నాకితేగాని పడుగు అతకలేదు).

సాలెవానికి కోడిపిల్ల తగులాట మైనట్లు.

సాలోడికి కోడిపుంజు తగలాటం.

సావడి (చావడి) కాలెరా సన్న్యాసీ అంటే, సా(చా)పసింపు నా సంకలోనే ఉన్న దన్నాడట.

సావుకారు చతికిల బడితే, పీట వెల్లికిల బడిందట.

సాహసంలేని వాడికి కత్తి సరిగా తెగదు.

సాహెబు ఎన్ని సుభాలేలినా బేగమునకు [2]కుట్టుపోగులే.

---

స్థాపించే దినాలవి. అందు ఆంధ్ర అధ్యాపక పదవికి పోటీలు ముమ్మరంగా జరుగుచుండినవి. నాటి విద్యాశాఖాధికారి - ఆర్బత్‌నాట్ దొర సూరిని చాలా అభిమానించినాడు; సూరి నీతిచంద్రికను అంకితంగూడ అందినాడు. అప్పుడు మదరాసు తండియార్‌పేట, చాకలిపేటలలో దేవాంగులు (సర్. పిట్టి త్యాగరాయశెట్టి పూర్వులు), సాలీలు అన్ని రంగాలలోను మాట చెల్లి ప్రాభవము ప్రతిష్ఠలతో నుండినారు. సుమారు ద్రావిడులకు (పురాణం హయగ్రీవశాస్త్రి, వావిళ్ళ రామస్వామిశాస్త్రి, వాదాలివారు చదలవాడ వారు) దేవాంగులకు ముద్రణ వ్యాపారమునందు మంచి పోటీ పడి ఉండినది. ఇప్పటికీ ఉత్తర మద్రాసులో వీళ్ళవే పెద్ద ప్రెస్సులు. అప్పుడు సాలె కులజులు - గాజుల లక్ష్మీనరసింహులు శెట్టి చాలా పలుకుబడి కలిగియుండినారు. ఈయన చిన్నయసూరిని ఎక్కువగా అభిమానించి గౌరవించేవారు. వీరి యింటనే విద్యాగోష్ఠులు జరుగుచుండేవి. ప్రెసిడెన్సీ కాలేజీ తెనుగు అయ్యవారి పనికి పురాణం హయగ్రీవశాస్త్రి, చిన్నయసూరి ప్రయత్నించు చుండగా, గాజులవారి పలుకుబడితో సూరికే ఆ పదవి దక్కినది.

ఈ యాసుతో ఆ బ్రాహ్మణ పండితులు, అతి వ్యాప్తినొందిన యీ సామెతను సృష్టించి గాలిలో వదలినారు. అది అంతటా అలముకొని యున్నది.

1 సరి=గంజి.

2 పూర్వం - నిన్న మొన్నటివరకూ గూడ మహమ్మదీయస్త్రీ చెవినిండా గూడు చుట్టూ రాగిపోగులనే కుట్టించుకొని ఉంచుకొనేవాళ్లు.

సాహెబులా! సెదాములు, సలాము లేవయ్యా! అంటే, దొరలు దాతలు పట్టంచు ధోవతు లిచ్చిన ఇనాము లేవయ్యా! అన్నాడట!

సాహెబ్‌కు సాడే తీన్, నాకు మూడున్నర.

సాతికాళ్లు పట్టుకోవడం కన్న, వాదికాళ్లు పట్టుకోవడం మేలు.

## సి

[1]సింగడి కేల పత్తిబేరము.

సింగన్నా! అద్దంకి పోయినావా? అంటే, పోనూపోయా, రానూ వచ్చా అన్నాడట!

సింగారం జూడరా బంగారు మొగుడా?

సింగి కంటే (నీళ్లాడితే)-సింగడు పథ్యం చేసినట్లు. (ఇంగువతిన్నట్లు)

సింగినాదం, జీలకఱ్ఱ.

సింగి నీళ్లాడితే సింగడు ఇంగువదిన్నట్లు.

సింహంగూడ చీమకు భయపడే (తలకే) అదును వస్తుంది.

[2]సింహంలో చీరి ఊడ్చడమున్నూ, కన్యలో కంగాపింగా ఊడ్చడమున్నూ.

సింహాసనంపై దున్నపోతు, లంజలలో పతివ్రత, ముత్తైదువులలో ముండమోపి.

[3]సిగిసం కొడితే చిక్కదు, లంజను కొడితే దక్కదు.

1 సింగడు = దినమొలవాడు; బిత్తలి.

2 సింహం - సింహమాసం-(ఆవణి) భాద్రపదము. కన్యామాసం - (పెరటాశి) ఆశ్వయుజము.

3 సిగిసం = శిరం.

సిగ్గంత పోయె చిన్న పెండ్లామా! పెండ్లికన్న పోదాం పెద్ద పెండ్లామా! అన్నాడట!

సిగ్గు చాలెదు, చెప్పులు మూలెదు.

సిగ్గు చిన్ననాడే పోయె, పరువు పందిట్లో పోయె, కొరవా సరవా వుంటే గదిలో పోయె.

సిగ్గు చెడ్డా బొజ్జ పెడితే చాలును.

సిగ్గు తోటకూరవంటిది (చాల సుకుమారము)

సిగ్గు దప్పిన చుట్టం వస్నెచీర కేక్సినదట!

సిగ్గుపడితే సిద్దె కట్టువడుతుంది.

సిగ్గుబోవువేళ చీర లబ్బినట్లు.

సిగ్గుమాలినదాన్ని చిటికేస్తే, ఆరామడనుంచి ఆలకించిందట!

సిగ్గులేని అత్తకు మోరతోపు అల్లుడు.

సిగ్గులేని చిన్నాయనా, విడిచిన చిన్నమ్మను ఇంకా కొడుతావా?

సిగ్గులేని ముఖానికి నవ్వే అలంకారం.

సిగ్గులేని రాత్రికి ఏటా జాగరణమే!

సిగ్గులేని శివరాత్రికి ఏటా జాగారమే.

సిగ్గు విడిస్తే రాయలకూడు, తిరుపతికిపోతే బోడితల.

సిగ్గు విడిస్తే శ్రీరంగము, అంతకూ విడిస్తే బోడితల.

సిగ్గు [1]సిబ్బిన కొడితే, [2]శరము చేటన కొడుతుంది.

సిగ్గూ, శరమూ లేనమ్మ మొగుడి పెళ్ళికి పేరంటానికి వెళ్ళి, అడ్డగోడ చాటునుండి అర్ధరూపాయి కట్నం ఇచ్చిందట! (చదివించిందట.)

---

1 సిబ్బి - బియ్యము మొదలగునవి వడియబోసు కొనుటకు ఉపయోగించు వెదురు మూతిగల అలుకవి చిన్నబుట్ట.

2 శరము = సిగ్గు. (షెరం)

సిగ్గెందుకు లేదురా జగ్గా? అంటే, నల్లనివానికి నాకేమి సిగ్గన్నాడట!

సిగ్గేమే సిగదారమా అంటే, నాకేమి సిగ్గే తలదారమా అన్నదట.

సిగ్గే స్త్రీకి సింగారం.

[1] సిడి పడితే మూన్నెల్ల (మూడేండ్ల) వలపు.

సిద్దప్పవంటి శిష్యుడూ లేడు, బ్రహ్మంగారి వంటి గురువూ లేడు,
　　వేమనవంటి యోగీ లేడు.

సిద్దారెడ్డోరి చద్దన్నం తిని, శివారెడ్డోరి ఆవులు మేపినట్లు.

సిరికొద్ది చిన్నెలు, మగనికొద్ది వన్నెలు.

సిరిపంచికుడువ మేలు.

సిరిపోయినా చిన్నెలు పోలేదు.

సిరి రా మోకా లొడ్డినట్లు.

సిలార్! పిల్లలు, నేను తయార్.

---

1 సిడి = కొన్నేండ్లవరకు పల్లెలలో గ్రామదేవతలకు జాతర (జంతుబలి ఉండేవి) కొలుపు (బలి లేక పొంగళ్లుమాత్రం పెట్టేవి) జరిగేవి. ఒక్కొక్క దేవతకు సిడిమాను అని తంతు జరిపేవాళ్లు. తలుము (ఏతము) వంట ఆకారంలో ఒక పెద్ద దూలమును ఏటవాలుగా ఎత్తి. దానికొనకు. మేకను. వెన్నెముకకు గాలంగుచ్చి త్రాట వ్రేలాడగట్టి మూడు చుట్లు త్రిప్పుదురు. ఆవల దించి ఆ సిడిని గ్రామదేవతకు బలి ఇచ్చేవాళ్లు. పూర్వ మెప్పుడో మనిషినే తిప్పి ఆహూతి ఇచ్చేవాళ్ళంట. ఇట్లా కట్టిన జంతువును "సిడి" (సిడిమానుకు కట్టినది) అంటారు. సిడి అంటే వేతన, చీకాకు అనిగూడ వాడుకలోనికి వచ్చింది. ఇంట్లో పిల్లకాయలంది బలే సిడి అయినది అని ప్రయోగం. సిడిపడుట అనగా—చుట్టుత్రిప్పి దించేలోపల త్రాడుతెగి మేక క్రిందపడుట.

## సీ

సీతకు వ్రాసింది సీమకు వ్రాయవలెనా?
సీత పుట్టుక లంక చేటుకే.
సీతా పతే, [1]సిరిచాపే గతి.
సీతారామాభ్యాం నమః అంటే, మా ఇంటాయన ఎదురుకాలేదా అన్నదట! (భిక్షానికి వచ్చిన వానితో).
సీదుకు రేగితే చిచ్చుబుడ్డి, కోపము స్తే కొరివికట్టె.
సీలమండలంవరకు చీర కడితేగాని, సాలెమిండని కెక్కడ తెచ్చి యిచ్చేది?



## సు

సుంకర మోటుకు మాట నిలుకడ లేదు.
సుంకరివద్ద సుఖదుఃఖాలు చెప్పుకొన్నట్లు.
సుండు సూడనీయదు, [2]మండి మానసీయదు.
సుకవితిట్లకు దొరబిడ్డ వెరచుగాని మోటుగాడు వెరచునా.
సుఖం మరిగినమ్మ మొగుణ్ణి అమ్ముకొని తినిందట.
సుఖం మరిగిన దాసరి పదం మరచినాడట.
సుఖమెరుగని బ్రతుకు సున్నం వేయని విడెము.
సుఖవాసి దేవానికి మెత్తని చెప్పు.
సుఖాలు పూవులవంటివి, అనుభవించగానే అంతరించిపోతవి.
సుతారం, సూదిలోని దారం.

1 సిరిచాప = సన్నటి మెత్తటి తుంగకు చాయలెక్కించి అందముగా అల్లిన చాప.
2 మండి = పెద్దపుండు; సుండు = చిన్నకురుపు. (సుర్లసుండు)

సుతులు లేనివారికి గతులు లేవు.
సుధను గోరువాడు సుడిబడి చచ్చునా.
సున్నకు సున్న, [1]హాళ్ళికి హాళ్ళి.
సున్నము పుట్టని ఊళ్ళో అన్నము పుట్టునా?
సున్నలో ఉన్నది సూక్ష్మం, సూక్ష్మంలో ఉన్నది మోక్షం.
సుపుత్రా! కొంప తీయకు (పీకకు)రా అన్నట్లు.
సుబ్బడిది చుట్టాల రంది, రాముడిది తామర రంది.
సుబ్బి పెళ్ళిలో సూరి సమర్త.
సుబ్బి పెళ్ళి వెంకి చావుకు వచ్చింది.
సురకు నిచ్చినట్లు సుధకును నీయరే.
సురియ బట్టవచ్చు శూరుండు కాలేదు.
సువాసిని కొప్పు కేగాక బొండుమల్లెలు బోడిముండకేల.
సువ్వి అంటే తెలియదా? రోకలి పోటు.
సుళ్లు చూడమంటే గుద్దలో వేలుబెట్టినాడంట.

---

## సూ

సూటిగల జంట రోటివద్ద మాటు పెట్టెనట!
సూడిద బూడిద పాలు, యిల్లాలు యితరుల పాలు.
సూత్ర మెఱుగని మైథునశూరులు.
సూదికి రెండు మొనలు గలవా?
సూది కుతికె, దయ్యా పాకలి.
సూదికోసం దూలం మోసినట్లు (పరమానందయ్య శిష్యులు).

---

1 హాళ్ళి - తెమగు అంకెల ఇరుసులు (కూడిక లెక్కలు) వేసేటప్పుడు సున్నకు పెట్టే గుర్తు. (6)

సూదికోసం [1]సోదెకు పోతే, పాతఱంకులు బయట పడ్డాయి.

సూదికోసం సోదెకు వెడితే, కుంచెడు బియ్యం కుక్క ముట్టుకుందట!

సూది గొంతు, బాన కడుపు.

సూది తప్పితే దారం సూటిగ బెజ్జంలో పడుతుందా!

సూది బెజ్జంలో ఒంటె దూరవచ్చును గాని భాగ్యవంతుడు స్వర్గం చేరలేడు. (ఇది బైబిల్ సూక్తి)

సూది బెజ్జం జూచి, జల్లెడ వెక్కిరించినట్లు.

సూదిని మూట కట్టినట్లు.

సూదిలా వచ్చి, గడ్డపారలా తేలినట్లు.

సూదివలె వచ్చి, దబ్బనం మాదిరి తేలినట్లు.

సూదేటువాణ్ణి, సుత్తేటువాణ్ణి, కండేటువాణ్ణి నమ్మరాదు. (కుట్టే జంగం, కంసాలి, సాలి).

సూరన్న చిన్నవాడు, పేరన్న పెద్దవాడు, అయ్యకెత్తరా కోళ్ల గంప.

సూర్యుడు తనోడైతే, చుక్కలన్నీ తన కుక్కలంట.

సూర్యుని మొగాన దుమ్ము చల్లితే, ఎవరి కంట బడుతుంది?

సూర్యుని మొగాన ఉమ్మేస్తే తన మీదనే పడుతుంది.

సూర్యోదయానికి మాంగల్యధారణ, శుక్రోదయానికి మాంగల్య విసర్జన.

సూక్ష్మములో మోక్షం.

---

1 సోదె = యానాదులుచెప్పు సుద్దులు; ఎఱుకలసాని చెప్పునది గద్దె.

## సె

సెంటుభూమి లేని వాని కెందుకు సెంటువాసన లన్నట్లు
సెగ లేనిదే కూడుడుకదు.
సెగ లేనిదే పొగరాదు.
సెట్టి బ్రతుకు గిట్టినగాని తెలియదు.
సెట్టి సేరు, బుడ్డ సవాసేరు.
సెట్టి సింగారించుకొనేలోపల ఊరు కొల్లబోయిందట.
సెనగల గాదె మీద కుక్క పండుకొన్నట్లు, (గాటిలో కుక్క)
సెనగలు తిని, చెయ్యి కడుగుకొన్నట్లు.
సెభాష్ మద్దెలగాడా! అంటే, ఐదు వ్రేళ్లు పగులగొట్టుకున్నాడట!

## సే

సేరుకాయ సీటాయె, ఉల్లెం గడ్డ మోటాయె.
సేరుకు సవాసేరు (వడ్డించినాడన్నట్లు) అన్నట్లు.
సేరు దొరకు మణుగు బంటు.
సేవకునిలాగ చెయ్యాలి, రాజులాగ అనుభవించాలి.

## సై

సైంధవుడు అడ్డు పడినట్లు.
సై అనే కలువాయి, అవిశలగల యిల్లు జూపే కలువాయి, బిళ్ళ కుడుము మాదిరి రూపాయి తట్టేసి బిగుసుకొనే కలువాయి. (కలువాయి గ్రామంలో అంకుటాలు చేసిన మోసమును గురించి).

సైదాపురం [1]రాచ్చిప్ప (రాతిచిప్పవలె మొద్దు అనుట).

సైపలేని వాడు చెయ్యి నాకినట్లు.

[2]సైరా మాలోడా అంటే, [3]పరమెత్తి పైన వేసుకొన్నాడట.

---

## సొ

సొంతానికి ఏనుగు ఉమ్మడికి పీనుగు.

సొంతానికి పిడుగు, ఉమ్మడికి బడుగు.

సొగసుగానికి (షోకుగానికి) మూడుచోట్ల అంటు. (ఏదైనా మైల కాలికి అయిన వేలుతో తాకి ముక్కుతో మూచూచును)

సొగసు సోమవారం పోతే, మొగుడు ఆయవారం పోయాడట!

సొగసైన బూరుగను పెంచితే సురస ఫలముల నిచ్చునా?

సొగసైన లేమకు సెగరోగ మున్నట్లు.

సొమ్ము ఒకచోట, అపనమ్మిక ఇంకొక చోట.

సొమ్ము పోగా దిమ్ము పట్టినట్లు.

సొమ్ము పోయేటప్పుడు, తట్టు తగిలేటప్పుడు మతి ఉండదు.

సొమ్ము సొమ్ములోనే ఉండె, సోమయ్య మందిలోనే ఉండె.

---

1 మైకా గనులలో దంపుడనే భాగంలో గట్టిపారుగడ్డను తీసి చిప్పలు చేయుదురు. దీనిని రాతిచిప్ప అందురు. వీటిని బ్రాహ్మణులు మడివంటలో ఉపయోగింతురు. ఈ మాటను మొద్దు అనుటకు ఉపయోగింతురు. సైదాపురం, నెల్లూరుజిల్లా పెదగూడూరుకు పడమట 12 కిలోమీటర్లలో నున్నది.

2 సై అను = ఉబ్బించు.

3 పరము = బండి పైచట్టములో ఇరుప్రక్కలా ఉండే పొడవు నిలువుకొయ్యలు.

## సో

సోదించడ మెందుకు, సొదు పెట్టడ మెందుకు ?

సోమరితనం, చిగిర్చని పూయని కాయని చెట్టువంటిది.

సోమార్లకు స్వయంపాకం చేసిపెట్టి, పందులకు పక్క వేసినట్లు.

సోమారికి షోకు లెక్కువ.

సోమిదమ్మ సొగసుగాండ్ర కోరితే, సోమయాజి స్వర్గార్హు డగునా ?

సోయిదప్పిన వాడా? సొంగ ఎక్కడ పెట్టినావురా? అంటే, త్రాగి తమ్మళ్ళ బాలమ్మ గుడిసెకు చెక్కినా నన్నాడట!

## సౌ

సౌందర్యమే శాశ్వతానందము.

## స్త

స్తంభం చాటున ఏంది? అంటే, కుంభ మన్నారట ! అయితే, నాకేనా మూడు మెతుకులు ?

స్తంభం చాటుగాడు ఒకడు, అదే పోతగాడు ఇంకొకడు, పోతే రాని వాడు మరియొకడు.

స్తనశల్య పరీక్ష చేసినట్లు.

## స్త్రీ

స్త్రీల నేర్పు మగల చీకాకు పరచురా.

## స్థా

స్థాన బలిమి కాని, తనబలిమి కాదు.



## స్థి

స్థిరాస్తి ఆయన, చరాస్తి ఆయన గుడ్డలు.



## స్థూ

స్థూలం కనుగుడ్డు, సూక్ష్మం, కనుపాప.



## స్నా

స్నానానికి ముందు, సంభావనకు వెనుక కూడదు.

స్నానాలు లేని బ్రాహ్మలకు శాపాలు లేవు.



## స్నే

స్నేహితునికి అప్పు యిస్తే రెండూ పోతవి.



## స్వ

స్వకుచమర్దనం (తన్ను తాను పొగడుకొనుట).
స్వకుచమర్దనంవల్ల రంభకైనా సుఖంలేదు.
స్వధనంబులకై [1]బండపంచాంగమేల.
స్వయం రాజా, స్వయం మంత్రీ, స్వయం చాకలి, స్వయం మంగలి.
స్వర్గానికి పోతూ, చంకన ఏకులరాట్నమెందుకు?
స్వర్గానికి పోయినా విడాకులు తప్పలేదట.
స్వర్గానికి పోయినా సవతిపోరు తప్పిందికాదు అన్నట్లు.

---

## స్వా

స్వాతంత్ర్యం స్వర్గం, పారతంత్ర్యం ప్రాణసంకటం.
స్వాతి కురిస్తే చట్రాయిగూడా పండును.
స్వాతి కురిస్తే చల్ల పిడతలోకిరావు-జొన్నలు.
స్వాతి కురిస్తే భీతి కలుగుతుంది.
స్వాతి కురిస్తే మూడుకార్తెలు కురుస్తాయి.
స్వాతికొంగ, పంటకాపు (రెడ్డి) నీళ్లున్నచోటే ఉంటారు.
[2]స్వాతికొంగల మీదికి సాధనం పోయినట్లు.
స్వాతివర్షం చేమకు హర్షం.
స్వాతివానకు సముద్రాలు నిండును.
స్వాతివాన ముత్యపు చిప్పకుగాని, నత్తగుల్లకేల?
స్వాతివిత్తనం, స్వాతి [3]కోపులు.

1 బండపంచాంగం = రచ్చబండ దగ్గరచెప్పే పంచాంగము.

2 స్వాతికొంగలు = ఈ తెల్లకొంగలు స్వాతికార్తెకు వచ్చి. జనవరిలో ఎక్కడికో పోవును. ఇవి ఆరేటిబాతు మొదలగు పక్షులవలె ఋతుభ్రమణ పక్షులు.

3 కోపు = సరియైన అదను. దానివల్ల ఏర్పడే ఏపు.

స్వాతి సముద్రాన్ని చంకన బెట్టుకొస్తుంది.
స్వాతీ! నేను జమురు కొస్తాను, విశాఖా! నీవు విసురుకురా.
స్వామి కార్యం, స్వకార్యం కలిసి వచ్చినట్లు.

---

## హ

హంస నడకలు రాకపోయె, కాకి నడకలు మఱచిపోయె.
హక్కు హనుమంతరాయనిది, అనుభవం చెన్నారాయనిది.
హద్దులో ఉంటే ఆడుది, హద్దుదాటితే గాడిది.
హనుమంతుడు సువేలాద్రిం [1]కనిదానిపై నెక్కె, అని సాతాని పురాణం చదివితే, సాతాని దానిపై ఎందుకు ఎక్కకూడదు? అన్నాడట సభలోవున్న కనివాడు.
హనుమంతుని ముందు కుప్పిగంతులా?
హనుమంతుని మోరవుంటే అష్టవంతుడు.
హరిదాసుకు అమరావతి అడ్డమా? (పూర్వం బౌద్ధాలయము లుండిన వని కాబోలు)
హరిదాసున కందరూ తనవారే.
హరిశ్చంద్రుని నోట అబద్ధంరాదు, నా నోట నిజంరాదు.
హరుని ఎరుకలేక ఆకులల్లాడునా.
హర్షుణ్ణి నమ్ముకొని, పురుషుణ్ణి పోగొట్టుకొన్నట్లు.
హాసేను హుసేను సేద్యంచేస్తే, ముచ్చెలతో పంచుకొన్నారట— పంటను.
హస్త ఆదివారం వచ్చింది. చచ్చితిమయ్యా గొల్లల్లారా! చల్లపిడతల గాసులు తీసి, సాలలు వేయించండి.

1 కనివాడు = భట్రాజు. సువేలాద్రింకని-చూచి అని.

హ_స్త ఆదివారం వచ్చింది, చ_స్తిమోయి గొల్లల్లారా! కాసుకోక దాన్ని కాలుపట్టి ఈడ్వండి. (అన్నవట గొత్తెలు).
హ_స్త ఆదివారం వ_స్తే, చచ్చేటంత వాన.
హ_స్తకా_ర్తెలో చల్లితే అత్తింతలకైనా కావు.
హ_స్తకు అనకు (అణుగు)పొట్ట, చి_త్తకు చిఱుపొట్ట.
హ_స్తకు ఆది పంటా, చి_త్తకు చివఱి పంటా!
హ_స్తకు ఆరుపాళ్లు, చి_త్తకు మూడుపాళ్లు.
హ_స్త చి_త్తలు వఱపయితే అందఱి సేద్యం ఒకటే.
హ_స్త పోయిన ఆరుదినాలకు అడక్కుండా విత్తు.
హ_స్తలో అడ్డెడు చల్లేకంటే, చి_త్తలో చిట్టెడు చల్లేది మేలు.
హ_స్తలో ఆకు అల్లాడితే, చి_త్తలో చినుకు పడదు.
హ_స్తలో చల్లితే, హ_స్తంలోకి రావు.

---

## హా

హాస్యగాడు బావిలో పడిన తంతు.
హాస్యగానికి తేలు కుట్టినట్లు. (హాస్యమను కొని నమ్మరు) కోతికి దయ్యం పట్టినట్లు.

---

## హీ

హీనజాతి ఇల్లు చొచ్చినా, ఈగ కడుపు చొచ్చినా నిలువవు.
హీనస్వరం పెళ్ళాం ఇంటికి చేటు.

---

## హె

హెచ్చుగా పేలున్నవాళ్ళకు, హెచ్చుగా అప్పు ఉన్నవాళ్ళకు దురద లేదు.

## హే

హేమాహేమీలు ఏటివెంట కొట్టుక పోతూంటే, నక్క పాటిరేవు అడిగిందట!

## హో

హోరుగాలిలో దీపం పెట్టి, ఓరి దేవుడా! నీ మాహాత్మ్య మన్నట్లు.
(మహిమ అన్నట్లు)

## క్ష

క్షణం చిత్తం–క్షణం మాయ!

## క్షే

క్షేత్ర మెఱిగి విత్తనము, పాత్ర మెఱిగి దానము.
క్షేమంగా పోయి, లాభంగా రమ్మనట్లు.

సమాప్తం

